*VADDARADHANA*: Telugu Translation of the Kannada Classic 'Vaddaradhane', Sahitya Akademi, New Delhi, 2001, Rs. 100

సాహిత్య అకాదెమీ
రవీంద్ర భవన్, 35, ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001
స్వాతిమందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

ప్రాంతీయ కార్యాలయాలు
సెంట్రల్ కాలేజ్ క్యాంపస్, డా. బి. ఆర్. అంబేద్కర్ వీధి, బెంగుళూరు - 560 001
జీవన్‌తారా భవన్, 23ఎ, 44 ఎక్స్, డైమండ్ హార్బర్ రోడ్, కోల్కటు - 700 053
172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, ముంబయి - 400 014

చెన్నై కార్యాలయం
సిఐటి క్యాంపస్, టిటిటిఐ పోస్ట్, తరమణి, చెన్నై - 600 113



ప్రథమ ముద్రణ : 2001

ISBN : 81-260-0885-7

వెల : 100

ఈ గ్రంథ ప్రచురణ : సాహిత్య అకాదెమీ, అనువాద కేంద్రం, బెంగుళూరు

కూర్పు : వర్షిణి గ్రాఫిక్స్, బెంగుళూరు.

ముద్రణ : నాగార్జున ప్రింటర్స్, చెన్నై

# ప్రచురణ కర్తల మాట

సాహిత్య అకాదెమీ - భారతీయ జాతీయ సాహిత్య అకాదెమీ. అది పుట్టినప్పటినుంచీ, దేశంలో అనువాద కార్యకలాపంలో నిమగ్నమైంది. ఇప్పటివరకు అకాదెమీ మూడువేల పుస్తకాలను ప్రచురించింది. అందులో అత్యధిక శాతం అకాదెమీ గుర్తించిన ఇంగ్లీషుతో సహా, ఇరవైరెండు భారతీయ భాషల్లోని సమకాలీన అత్యుత్తమ రచనల అనువాదాలే. 1996లో బెంగుళూరు, అహ్మదాబాద్, శాంతి నికేతన్ మరియు ఢిల్లీలో అకాదెమీ యొక్క అనువాద కేంద్రాల్ని స్థాపించడం, సాహిత్య అనువాదాల పట్ల ప్రగాఢమైన, కట్టుబడి వుండే మా నిబద్ధతకు తాజా నిదర్శనం. ఈ అనువాద కేంద్రాలు అనువాదంలో అత్యుత్తమ కేంద్రాలుగా వుండేందుకూ, అనువాదం మీద జాతీయ, అంతర్జాతీయ చర్చా వేదికలుగా వుండేందుకూ, దేశ, విదేశ భాషల్లోని ప్రాచీన, మధ్యయుగ, పూర్వ ఆధునిక, ఆధునిక ప్రామాణిక గ్రంథాలను, భారతీయ సంస్కృతి, సాహిత్యం మీద లక్ష్యపూరితమైన విదేశీ పుస్తకాలను అనువదించి ప్రచురించడం కోసం ఉద్దేశింపబడినవి.

భారతీయ సాహిత్యానికి మొదటినుంచి కూడా అనువాదం కేంద్రంగా వుంటూనే వచ్చింది. మహాకావ్యాలు ముఖ్యంగా రామాయణం మరియు మహాభారతాల రూపాంతరాలతో మనదేశంలోని అనేక భాషలు వునికిలోనికి వచ్చాయి. భారతదేశపు వలస పూర్వ సంకథనం (discourses)లో మూలరచనకూ అనువాదానికీ మధ్య విభజన రేఖ చాలా అస్పష్టంగా వుంది. ఉదాహరణకు వివిధ భాషల్లోని రామాయణాలు మూలరచనలుగానే భావించబడ్డాయి. ఆయా భాషల్లోని ప్రతిభల అద్భుత వ్యక్తీకరణలుగా భావించబడ్డాయి. 19వ శతాబ్దం వరకు భారతీయ సాహిత్యపు చరిత్ర పురాణగ్రంథాల సృజనాత్మక అనువాదాల, రూపాంతరాలు, పునఃసృష్టి, వ్యాఖ్యానాల, సార సంక్షిప్తాల చరిత్రే. ఇవి ప్రజా సమూహాల్ని, భాషల్ని, మతాల్ని, సంస్కృతుల్ని కలిపి వుంచాయి. బ్రిటీషు పాలనా కాలంలోని అనువాదాలు ఎంపిక చేయబడ్డ చట్టాలు, సూత్రాలతో కూడిన వలసవాద భావజాలంచేత నియంత్రించబడినప్పటికీ, ఆ ప్రక్రియ సజీవంగా వున్నది. వలస పూర్వ కార్యకలాపాల బహిరంగ తత్వాన్ని పునరుద్ధరిస్తూ, అదే సమయంలో ప్రాతినిధ్యం, అధికారం, చారిత్రకతలకు సంబంధించిన ప్రశ్నలను రేపే క్షేత్రంగా

అనువాద క్షేత్రాన్ని చేసిన మన వలసానంతర సందర్భానికి దాన్ని అనుసంధానం చేసేందుకు సాహిత్య అకాదెమీ ప్రయత్నిస్తూ వుంది. సాంకేతిక జ్ఞానం, అధికారం/జ్ఞాన ఆచరణల ద్వారా స్వీయతత్వానికి వలస రూపాన్ని యివ్వడానికి ప్రయత్నించిన వలసవాదపు లోపాలు మాకు బాగానే తెలుసు. వలసయుగంలో కొనసాగిన అష్టావక్ర అధికార సంబంధాల్ని అధిగమించి, చరిత్రలేని వస్తువులుగా వలసప్రజల ఆధిపత్య కథనాలను బలోపేతం చేయడానికి పూర్వసిద్ధాంతల వ్యూహంగా అనువాదాన్ని మార్చాలని మా ప్రయత్నం. ప్రజల చరిత్రలను తిరిగి పొందడం, వాళ్ళ గతాన్నీ, వర్తమానాన్నీ రికార్డు చేసే మార్గమే మాకు అనువాదమంటే.

వలసానంతర సందర్భాలలో అనువాద ఆచరణలు ఆధిపత్య సంకథనాలకు (discourses) రూపాన్నివ్వటమే కాక, ప్రతిఘటనలకు కూడా రూపాన్నిచ్చిందని మాకు తెలుసు. ఇప్పటివరకు వెల్లడికాని ప్రాచ్య, సాంస్కృతిక సందర్భాలలో అనువాద ఆచరణమూ, సిద్ధాంతాన్నీ తిరిగి నెలకొల్పాల్సిన అవసరం వుందని మేము నమ్ముతున్నాం. విభిన్న సంస్కృతీ సంబంధాలు ఆమూర్త. ఏకశిలా సదృశ సాంస్కృతిక, సార్వజనీన సౌందర్యం మీద నిర్మితం కాదు. అది యితర సాంస్కృతిక వ్యవస్థలతో సంఘర్షణల పునాదిమీద నిర్మించబడుతుంది కనుక, వలసానంతర సందర్భాలలో అనువాద కార్యకలాపాన్ని ఒక విధానంగా, ప్రాధాన్యాతీకరణగా, బలోపేతం చేసేదిగా, సాంస్కృతిక అధ్యయనంగా, పరిశీలాంచాల్సిన అవసరం వుంది.

అనువాదమంటే విభిన్నతలను గూర్చి ఉత్సవం జరుపుకోవడం, సాంస్కృతిక గుర్తింపులని తిరిగి కనుక్కోవడం కూడా. చెబుతున్న విషయపు సరిహద్దుల్ని అది తిరిగి ఏర్పరుస్తుంది. అనుబంధపు నియమాల్ని మారుస్తుంది. అయినప్పటికీ అన్ని అనువాదాల మూలం మనిషిపోగొట్టుకొన్న వుమ్మడి భాషపట్ల మక్కువ (nostalgia) లేదా మొత్తం మానవజాతి పంచుకోగల ఆదర్శభాషకు సంబంధించిన స్వప్నంగా కన్పిస్తుంది. ఒక జీవిగా మనిషియొక్క అంతిమ ఐక్యతను గూర్చి ఉత్సవం జరుపుకోవడంగా కూడా అనువాదాన్ని చూడవచ్చు. ఈ గతితర్కం దన్నుగా మా గుడారాన్ని నిర్మించాం.

**కె. సచ్చిదానందన్**
కార్యదర్శి, సాహిత్య అకాదెమీ

# అనువాదకేంద్రం నిర్దేశకుడి రెండుమాటలు

భారతదేశంలోని విభిన్న సాహిత్య, సాంస్కృతిక అంశాల ద్వారా వెలుగు చూచిన వాస్తవికత సమాజంలో అంతర్గతంగా వున్న అహేతుకత్వం స్థానంలో హేతుకత్వాన్నీ, అరాజకత్వం స్థానంలో శాంతిని నెలకొల్పడానికి వుపయోగపడింది. విభిన్న ఘటనల ద్వారా అర్థాన్ని అన్వేషించే కార్యం మూలంగా, సాహిత్యానికీ, సంస్కృతికీ ఒక విధమైన పునరావృతమయ్యే నమూనాలు ఏర్పడ్డాయి. నూతన భాషలు పుట్టుకొచ్చినపుడు, అప్పటివరకు లేని నూతన మత ధోరణులు, కొత్త ప్రాంతాలకు విస్తరించినపుడు, తలెత్తిన అదుపుచేయలేని శక్తుల్ని సక్రమమార్గానికి మళ్ళించడానికి, పశ్చిమదేశాల సాహిత్య దృక్పథానికి భిన్నంగా, భారతీయ సాహిత్య అవగాహన పునరావృతమయ్యే లయల్ని, రూపాల్ని, కథనాలను, ఇతివృత్తాలను ఆశ్రయించింది. ప్రాకృతానికీ - కన్నడభాషకూ లేదా సంస్కృతానికీ - ప్రాకృతానికీ మధ్య నెలకొల్పబడిన భాషా సంబంధం లయలో హెచ్చు తగ్గుల ద్వారా ఒకే విధమైన కథనాన్ని మళ్ళీ మళ్ళీ చెప్పడం ద్వారా జీవితానికీ, సాహిత్యానికీ ఒక నియంత్రిత లయ (rhythm)ను యిచ్చింది.

కొన్ని జైనగాథలు ప్రాకృతంలో 'మూలారాధన' పేరుతో వచ్చాయి. అవే విభిన్న శైలిలో, రూపంలో, హరిసేనుని 'బృహత్కథ'గా, దాని అపభ్రంశ రూపంలో శ్రీచంద్రుని 'కథాకోశ'గా వచ్చి, మళ్ళీ ఇవే గాథలు కన్నడంలో 'వడ్డారాధన' రూపంలో వచ్చాయి. ఈ విధంగా పునరావృతం కావడానికి పైన యిచ్చిన వివరణ తప్ప యింకేమీ చెప్పలేము. 9వ శతాబ్దంలో వచ్చిన ఈ కన్నడ గద్య గాథలకు ప్రాకృత వ్యాఖ్యానాలు వుండినాయని కొంతమంది పండితులు చెబుతున్నారు. చిన్న చిన్న సవరణలతో ఈ కథలు ఒక ప్రాంతంలోని వివిధ భాషల్లో వెలువడటం వల్ల, ఈ ఆలంకారిక, సాంస్కృతిక దిగుమతిని గూర్చి నూతనంగా విశ్లేషించుకోవాల్సిన అవసరం వుందని తెలుస్తున్నది. వివిధ భాషల్లో, విభిన్న రూపాల్లో ఈ గాథలు పునరావృతమవడాన్ని, ఇప్పుడున్న భారతీయ, విదేశీ వుపకరణాల ద్వారా అర్థం చేసుకోలేము.

మరొక విషయం ఏమిటంటే, ఒక భాషనుంచి మరొక భాషలోకి జరిగే అనువాదం విభిన్న ప్రాంతాల, భాషల, పాఠకుల మధ్య సమాచార సంబంధం

నెలకొల్పే అనుసంధాన కర్తగానే కాకుండా, అది నూతన భాషా వాస్తవాలకు రూపాన్నిస్తుంది. ఆ విధంగా అది నూతన గొంతుకలకు, ఇతివృత్తాలకు, సంప్రదాయాలకు ప్రాతినిధ్యం వహించేందుకు భాషల్ని సమాయత్తం చేసే ఉత్ప్రేరకంగా పనిచేసింది.

సాహిత్య అకాదెమీయొక్క అనువాద కేంద్రపు ప్రధాన లక్ష్యమైన యిరుగు పొరుగు భాషలనుంచి వివిధ ప్రక్రియల అనువాదాలు సాహిత్యానికి కొత్త అర్థాన్ని యిస్తాయనడంలో సందేహం లేదు.

కన్నడం నుంచి సోదర భాష అయిన తెలుగులోకి వెలువడుతున్న ఈ 'వడ్డారాధన' అనువాదం చర్చను రేపుతుందనీ, ఫలితంగా వుభయభాషలూ లబ్ధి పొందుతాయని నేను ఆశిస్తున్నాను. వెయ్యి సంవత్సరాల వయస్సున్న ఈ గద్య కథనాలు తమదైన పద్ధతిని కల్గివున్నాయి. ప్రముఖ కన్నడ విమర్శకుడు కీర్తినాథ కుర్తకోటి ప్రకారం 'ధర్మం' కు అవసరమైన తార్కిక నమూనాలో ఆలోచనను రేకెత్తించే పద్ధతిలో ప్రధాన కథనభాగం రూపొందించబడి వుంటుంది. ఈ ముఖ్య కథనభాగం ఒక్కోసారి అహేతుకంగా వున్నప్పటికీ, అది మానవ ఆలోచనలోని స్వాభావిక ప్రవృత్తిని ప్రతిబింబిస్తుందని ఆయన అంటారు.

తెలుగులో ఈ అనువాదాన్ని తీసుకొస్తున్నందుకు మా అనువాద కేంద్రం గర్వపడుతున్నది. అనువాదకులందరికీ ధన్యవాదాలు. ప్రత్యేకమైన శ్రద్ధ, శ్రమ వహించి ఈ గ్రంథం వెలుగు చూడడానికి సహకరించిన నా సహోద్యోగి డా. జి.ఎస్. మోహన్‌గారికి కృతజ్ఞుణ్ణి.

బెంగుళూరు.
29-10-1999

ఎస్. కార్లోస్
డైరెక్టర్, సెంటర్ ఫార్ ట్రాన్స్‌లేషన్
సాహిత్య అకాదెమీ

# వడ్డారాధన - ప్రస్తావన

'వడ్డారాధన' అనే జనప్రియ శీర్షికను కలిగివున్న మతపూర్వ యుగపు ఈ కృతి చతుర్విధ ఉపసర్గలను విని ముక్తిని పొందిన పంతొమ్మిది మంది జైన మహా పురుషుల కథలను కల్గివున్న సంకలనం. అందువల్లనే ఈ కృతిని 'ఉపసర్గ కేవలుల' కథలు అని కూడా పిలుస్తారు. ఇటీవల వరకూ ఈ కృతి పేరును వడ్డారాధన అనీ, కృతికర్త శివకోట్యాచార్యుడనీ, కృతికాలం క్రీ.శ. 920అనీ అనుకొన్నారు. అయితే, డా॥ హం.ప. నాగరాజయ్యగారు వడ్డారాధన యొక్క ఒక వ్రాతప్రతిలో దొరికిన సమాచారం ఆధారంగా పరిశోధనను చేపట్టి, వడ్డారాధన యొక్క కాలం, కర్తృత్వాలనూ సోదాహరణంగా నిరూపించారు. అతని పరిశోధనను మనముందు వుంచి, కన్నడంలోని ఈ కృతి నిజనామం, 'ఆరాధనా కర్నాట టీక' అనీ, కర్త భ్రాజిష్ణు అనీ, అతని కాలం సుమారు క్రీ.శ. 800 అనీ నిరూపించారు. భ్రాజిష్ణుని ఈ కృతి, ప్రాకృత కృతియైన 'మూలారాధన' కు కన్నడం వ్యాఖ్యానం. శివకోట్యాచార్యుని మూలకృతి ప్రాకృత కృతి 'ఆరాధన' లేదా 'మూలారాధన' తప్ప అతడు కన్నడ కృతిని రచింపలేదు. హం.ప. నాగరాజయ్యగారు భ్రాజిష్ణుని స్థలాన్ని రాష్ట్రకూటుల రాజధానిగా వుండిన మలఖేడ (మాన్యకటకం) అని గుర్తించారు. 'వడ్డారాధన' అను శీర్షిక ప్రాకృతపదమైన 'బృహదారాధన' యొక్క రూపాంతరం మాత్రమే.

భ్రాజిష్ణు తన వ్యాఖ్యాన కృతిని ఆరాధనా కర్నాటటీక అని పిలచినప్పటికీ వడ్డారాధన అనే పేరు జనప్రియమై రూఢిలోకి వచ్చింది. అందువల్ల ఈ కృతిని అదే పేరుతో పిలిస్తే అభ్యంతరం లేదు.

వడ్డారాధన కృతికి మూలమైన కృతి 'ఆరాధన' లేదా 'మూలారాధన' లేదా 'భగవతీ ఆరాధన' క్రీస్తుశకపు ఆరంభ దశకాలలో (సుమారు క్రీ.శ. 1వ శతాబ్దం) రచింపబడిన ఈ కృతియొక్క భాష జైన సూరసేన ప్రాకృతం. ఈ కృతిలో **40** అధికరణాలూ, **40** శీర్షికలూ వుండి, జైనముని ఆచారాన్ని ఇది నిరూపిస్తుంది. ముని ఆచారపు సిద్ధాంత, తత్వాలను నిరూపించడానికి యిక్కడ దృష్టాంతాలను ఆశ్రయించడం జరిగింది. అయితే కథలు రెండు వరుసల్లో అమరివుంటాయి. ఈ గ్రంథపు 35వ అధికరణమే 'కవచాధికారం'. చతుర్గతుల్లో సంచరిస్తూ ఎదురైన

కష్టాలకోటల్ని గెలిచే సామర్థ్యాన్ని పొంది వున్నది కవచ. ఈ కవచాధికార బాగానికే కన్నడంలో భ్రాజిష్ణు వ్యాఖ్యానాన్ని రచించింది. దీనినే అతడు ఆరాధనా కర్నాట టీక అన్నది. (భ్రాజిష్ణు రచించిన కృతి సంపూర్ణంగా లభించలేదు. కేవలం ఏడవదాన్లో ఒక భాగం మాత్రమే దొరికింది అనే అభిప్రాయముంది).

మూలారాధనను అనుసరించి వ్యాఖ్యానాలు మరియు కథాకోశాలు రచింపబడి వున్నాయి. శ్రీ చంద్ర (కథాకోశ - అపభ్రంశ), ప్రభాచంద్ర (కథాకోశ-సంస్కృత), నేమిదత్త (కథాకోశ-సంస్కృత), నయనంది (ఆరాధనా - అపభ్రంశ) ప్రముఖ కథాకోశాలు. కన్నడ వడ్డారాధన కృతికూడా యిలాంటి ఒక్క కథాకోశమే అయినప్పటికీ, యిక్కడ వున్నవి కేవలం పందొమ్మిది కథలు మాత్రమే. శ్రీ చంద్రుని కథాకోశమూ మరియు వడ్డారాధన అనేక విషయాలలో సరిపోలుతాయి. అందువల్ల ఈ రెండు కృతులూ ఒక సంప్రదాయపు ఆరాధనా వ్యాఖ్యానాన్ని ఆశ్రయించివుండేందుకు అవకాశం వుంది. మరొక ప్రముఖ కృతి అయిన హరిసేనుని కథాకోశం (సంస్కృతం - 157కథలు)తోనూ కొన్ని విషయాలలో (ఉదా. కథనం, భావం) వడ్డారాధన సరిపోలుతుంది.

ధార్మిక ఉద్దేశం కోసం కథలను వుపయోగించుకోవడాన్ని మనం సాహిత్య చరిత్ర నిండా చూడవచ్చు. ఉదాహరణకు జాతక కథలు, శివ శరణుల (పురాతనులు) కథలు. జైన కథలు కూడా ఇదే కోవలోకి వస్తాయి. కన్నడ సాహిత్యంలో మునుపు నయసేన (ధర్మామృత, క్రీ శ. 1112), వృత్త విలాస (ధర్మ పరీక్ష క్రీ.శ. 1360) మరియు బ్రహ్మశివ (సమయ పరీక్ష క్రీ.శ. 1175) వీటినే చేశారు. అయితే ఆరాధనా కర్నాటటీక లేదా వడ్డారాధన కన్నడ సాహిత్య క్షేత్రంలో కృతియొక్క స్వరూపమూ మరియు సత్వపు నేపథ్యంలో విశిష్ట స్థానాన్ని కలిగి వుంది.

కృతియొక్క వుద్దేశం ధార్మికమైనది కావడం వల్ల, యిక్కడ కథల నిరూపణలో వైవిధ్యం లేదు. కర్త గమనమేమైనప్పటికీ, వుద్దేశం సాధనయుక్తం. ఏ కథకూ తనదే అయిన ఆరంభం లేదేమో అన్నట్టు ప్రతి ఒక కథ కూడా సూత్రీకరించిన రీతిలో ''ఈ జంబూద్వీపపు భరత క్షేత్రంలో....''- ఈ విధంగా ప్రారంభమవుతుంది. ''.....స్వర్గంలో సుఖాలను పడయుదురుగాక'' అని ముగుస్తుంది. ఈ సూత్రీకరణ వల్ల జానపద అంశాలకు ఈ కథలు దగ్గరగా

వున్నాయని సూచించడానికి సాధ్యపడుతున్నది. అంతేకాకుండా విస్తరణ, వర్ణనలలో కూడా, కృతి కర్త ధార్మిక వుద్దేశం పనిచేయడాన్ని గమనించవచ్చు.

వడ్డారాధన కృతిలో వుపయోగించబడిన భాష కూడా విశేషంగా చర్చింపబడింది. పూర్వ ప్రాచీన కన్నడం నుంచి, ప్రాచీన కన్నడానికీ, ప్రాచీన కన్నడం నుంచి కొత్త కన్నడ రూపానికీ భాష పరివర్తనం చెందే సూచనలున్న వుదాహరణాలు కృతిలో వున్నాయి. ఒక కాలం నుంచి మరోకాలానికి ప్రతిని తయారు చేసే హస్త ప్రతికర్తలు సమకాలీన వుద్దేశానికి తగినట్టు భాషను లేదా భాషారూపాలను మార్చడానికి అవకాశం వుంది. దీని వెనుక కూడా ధార్మిక వుద్దేశం వుండడం స్పష్టం.

'వడ్డారాధన' తాను జన్మించిన సమాజపు వివరాలను అక్కడక్కడా ప్రస్తావించింది. సమకాలీన జీవితంలోని రీతి నీతుల్ని పట్టి చూపిస్తుంది. అంతే కాకుండా, చరిత్ర అనదగిన ఉల్లేఖనాలు, ఉదాహరణకు చాణక్య, అశోక, చంద్రగుప్త మౌర్య, భద్రభాహు, వర్ధమానుడు మరియు స్థలాలైన ఉజ్జయిని, మగధ, సౌరాష్ట్ర కృతిలో కన్పిస్తాయి. ఈ విధంగా వడ్డారాధన కేవలం ధార్మిక వుద్దేశపు కృతిమాత్రమే కాక, ఒక సంస్కృతియొక్క అనేక ముఖాలను కలిగి నిలచిన కృతి అవుతుంది.

కవిరాజ మార్గకారుడు పూర్వపు ప్రాచీన కన్నడంలో గద్యకృతులు వున్నవని చెప్పినప్పటికీ అని ఏవీ యిప్పుడు లభించడం లేదు. అయితే పూర్తిగా గద్యంలోనే రచింపబడివున్న కన్నడంలోని కొన్ని గ్రంథాలలో (ఉదా. చాముండరాయ పురాణం, ముద్రామంజూష, నోంపియ కథలు, రాజావళి కథాసార మొదలైనవి) ఒకటి అయిన వడ్డారాధన కన్నడ గద్య సాహిత్యంలో మాత్రమే కాక మొత్తం కన్నడ సాహిత్యంలోనే విశిష్ట కృతియై తనదైన ముద్రను వేసింది. ధార్మిక దృష్టితో చూచేవారికి మనస్సును నింపడమే కాక, కథాసాహిత్యం నెలకొల్పే కుతూహలం, రోమాంచకాలకు ఆకరమై వడ్డారాధన మనముందు నిలుస్తుంది.

ఎన్. చంద్రమోహన్

# వడ్డారాధన గురించి

కన్నడ సాహిత్యంలో మొట్టమొదటి సాహిత్య గ్రంథం 'వడ్డారాధన'. లభించినంతలో కన్నడ భాషలో మొదటి గద్యకావ్యం ఇదే. శివకోట్యాచార్యుడనే జైనుడు వ్రాసిన గ్రంథమిది. రచనాకాలము క్రీ.శ. 925.

'వడ్డారాధన' కన్నడ వాఙ్మయానికి అపూర్వాలంకారము. ఇది జైన మతానికి సంబంధించిన కథల సంగ్రహం. ఇందులో సుకుమార స్వామి మొదలుకొని వృషభసేనుని వరకు 19మంది జైనుల కథలున్నాయి. ఇందులో ప్రతి కథముందూ ఒక ప్రాకృత 'గాథ' ఉంటుంది. ఈ గాథలు 'ఆరాధనా' అనే గ్రంథంలోవి. ఆరాధనకు సంబంధించిన గ్రంథాలు సంస్కృతంలో, ప్రాకృతంలో ఉన్నాయి. ఆత్మశుద్ధి కోసం చేసే ప్రయత్నమే ఆరాధన. ఆరాధనా గ్రంథాలలో శివాచార్యుని గ్రంథం బృహత్ప్రమాణం గలది. దీనిలో రెండువేలకు పైగా ప్రాకృత గాథలున్నాయి. దీన్ని 'ఆరాధనా' అనీ, 'భగవతీఆరాధనా' అనీ, 'బృహత్ఆరాధనా' అనీ పిలుస్తారు. 'వడ్డ' అన్నది 'బృహత్' అన్న శబ్దానికి దేశ్యరూపం. 'వడ్డారాధన' అన్నపేరు ఈ విధంగా వచ్చింది.

'వడ్డారాధన' ప్రాచీన కన్నడంలో వ్రాయబడిన గ్రంథం. సంస్కృత కన్నడాల మిశ్రశైలి ఇందులో మనోహరంగా అమిరింది. ఈ రచయిత దేశ్యపదాలను విరివిగా ఉపయోగించి శైలిని ఆకర్షవంతం చేశారు.

ఆంధ్ర కర్నాటరాజ్యాలు చాలమంది రాజుల పరిపాలనా కాలంలో కలిసే ఉన్నాయి. వడ్డారాధన రచనాకాలం నాటికి తెలుగు కన్నడ భాషలకు లిపి వొకటే. సాహిత్య స్వరూపాన్ని నిర్దిష్టం చేయగల వ్యాకరణ ఛందో పద్ధతులు రెండు భాషలలో ఒకే రీతిగా పెంపొందాయి. సాంఘిక మత విషయాలలో ఆంధ్రులు, కన్నడిగుల సంబంధం దృఢతరమైనది.

కన్నడ భాషలో తెలుగుకంటె ముందే కావ్యరచన ప్రారంభమైంది. రాష్ట్రకూటులకు సామంతుడైన వేములవాడ చాళుక్య వంశానికి చెందిన ఆంధ్ర మహారాజు అరికేసరి కన్నడిగుల ఆదికవి పంపమహాకవిని పోషించాడు.

మౌర్య చంద్రగుప్తుని కాలంలో భద్రబాహుముని దక్షిణ భారతదేశంలో జైనమతాన్ని వ్యాపింపజేశాడు. చాళుక్యులు, రాష్ట్రకూటులు జైనమతాన్ని ఆదరించారు.

కమ్మనాటిలో రాష్ట్రకూట చక్రవర్తికి సామంతునిగ పుంగనూరు ప్రాంతాన్ని పరిపాలించిన మల్లపయ్య అనే రాజు కన్నడ కవి 'పొన్న'ను ఆదరించాడు.

చాళుక్యరాజులు జిన భవనాలు కట్టించినట్లు, జైనులకు దానము లిచ్చినట్లు అనేక శాసనాల వల్ల తెలుస్తున్నది.

రాజరాజ నరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు జైన మతావలంబకుడు; త్రికాల యోగిశిష్యుడు. విశాఖ పట్టణము జిల్లాలో రామతీర్థములో విమలాదిత్యుని కాలం నాటి శాసనం - కన్నడ భాషలో ఉన్నది లభించినది. రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగ చోళదేవుని కాలములో జైనమతమును ఆదరించినట్లు తెలిపే శాసనాలు గుంటూరు జిల్లాలో లభించాయి.

పంప, పొన్న కవులు తెలుగు భాషలో కూడ రచనలు చేసి వుంటారని కొందరు పండితులు ఊహించారు కాని ఆధారాలేవీ లేవు.

(పంప) పద్మకవి 'జినేంద్ర పురాణము' (పొన్న) సర్వదేవుని 'ఆది పురాణము' తెలుగులో వెలువడిన జైనమత గ్రంథాలని కన్నడ వాఙ్మయం ఆధారంగా కొందరు తెలుగు పండితులు తలచారు. వైదిక మత పునరుద్ధరణ కాలంలో చాళుక్య రాజులు తెలుగులో ఉన్న జైనమత గ్రంథాలు తగుల బెట్టించారని కూడ కొందరూహించారు. కాని వీరి ఊహలు యథార్థమనటానికి తగిన ఋజువులు ఏవీలేవు.

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన చాళుక్యరాజులు జైనవసతులకు, జైనాచార్యులకు దానములిచ్చినట్లు తెలిపే శాసనాలు లభించాయిగాని జైన మతాలను నాశనం చేసినట్లు, జైన గ్రంథాలను తగుల బెట్టించినట్లు తెలిపే శాసనం, ఇతర ఆధారం వొక్కటీ లభించలేదు.

కవిరాజమార్గం ( క్రీ.శ. 9వ శతాబ్ది) అనే ఛందోగ్రంథం వడ్డారాధన కంటె ప్రాచీనమైనది. వాంచియార్ అనే శాస్త్రవేత్త తెలుగులో ఛందో గ్రంథాన్ని వ్రాశాడని కవిరాజమార్గం వల్ల తెలుస్తుంది. కాని ఆ తెలుగు ఛందోగ్రంథం దొరకలేదు.

అసగకవి (క్రీ.శ. 853) కన్నడంలో కుమార సంభవ కావ్యం రచించినట్లు అనంతర కాలంలో కవులు చెప్పటంవల్ల తెలుస్తున్నది. కన్నడ కుమారసంభవ కావ్యం దొరకలేదు. దొరికితే తెలుగులో నన్నెచోడుడు వ్రాసిన 'కుమార సంభవము' తో పోల్చి చూడటానికి వీలయ్యేది.

''వడ్డారాధనలోని జైనమునులు దేవ, మానవ, తిర్యక్, అచేతనములనే నాలుగు ఉపసర్గలను జయించి ధ్యాననిరతులై ముక్తిపొంది 'ఉపసర్గకేవలులు' అనిపించు కున్నవారు. వీటిలో అనేక జన్మలవరకు కథలెన్నో వడ్డారాధనలో ఉన్నాయి. ఎప్పుడో జన్మాంతరంలో బంధువైన ఆడనక్క మూడు దినాలు పీక్కుని తింటున్నా ఆ బాధను సహించి జైనుల సమ్యక్ జ్ఞానం, సమ్యక్ దర్శనం, సమ్యక్ చరిత్రలను పొందినవాడు సుకుమారస్వామి. సుకౌశలస్వామిని ఒక పెద్దపులి జన్మాంతర ద్వేషంతో తింటున్నా దాన్ని సహించిన కథ మరొకటి. వాతపిత్తశ్లేష్మాది ఏడువందల వ్యాధులను ఓర్చుకొని సమాధి పొందిన సనత్కుమారుని కథ ఇందులో ఉంది.

ఎర్రగా కాలిన రాతిబండ మీద కూర్చుని, వడగాలుల్ని ఓర్చుకొని సద్గతిని సాధించినవాడు వృషభసేన భటారుడు, బాణాలు దేహానికి గుచ్చుకొంటూ దుర్భర వేదనను కలిగించినా ఓర్చుకొని ధర్మధ్యానంతో రత్నత్రయాన్ని పొందినవాడు 'దండకరిసి', గానుగలో వేసి పిండుతున్నా ఆ బాధను ఓర్చుకొని మహేంద్ర దత్తాచార్యుడు మొదలైన ఐదువందలమంది ఋషులు సద్గతిని సాధించారు''. (శ్రీ ఆర్.వి.యస్. సుందరం - కన్నడ సాహిత్య చరిత్ర - 1977)

తెలుగులో వచన రచన ఆలస్యంగా ప్రారంభమైంది. 'సింహగిరి నరహరి వచనములు (క్రీ.శ. 14వ శతాబ్ది) మొదలైన వాటిని వడ్డారాధనతో పోల్చటం కుదరదు. క్రీ.శ. 19వ శతాబ్దంలో మధిర సుబ్బన్న దీక్షితులు రచించిన కాశీ మజిలీ కథలతో వీటిని పోల్చవచ్చు - కథాకథన వైచిత్రిలో మాత్రమే వడ్డారాధనకూ కాశీ మజిలీ కథలకూ పోలిక, మతవిషయంలో కాదు.

బుద్ధుని జాతకకథలను శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామి తెనిగించారు. జైనమత కథలు తెలుగులో లేవు.

వడ్డారాధనలో మునుల కథలు తెలుగువారికి జైనమత విశేషాలను తెలియజేస్తాయి. క్రీ.శ. 10వ శతాబ్దం నాటి కన్నడ ప్రజల సామాన్య జన జీవనం,

ఆచార వ్యవహారాలు, ఆటపాటలు మొదలైన విషయాలు యీ గ్రంథం వల్ల తెలుస్తాయి.

కథలలో శివకోట్యాచార్యుడు మధ్యమధ్య జైనధర్మాలను బోధించాడు.

వడ్డారాధన తెలుగు అనువాదం సరళసుందరమైన భాషలో సాగింది. అనువాదకులు తెలుగు నుడికారానికి భంగం కలుగని రీతిలో చక్కని శైలిలో రచన చేశారు.

కన్నడ ఆంధ్ర సంస్కృతుల అవగాహనకు 'వడ్డారాధన' తోడ్పడగలదు.

**రామమోహనరాయ్**

# విషయ సూచిక

# 1. సుకుమార స్వామి కథ

(వెనుకటి జన్మలో వదినగా ఉన్న ఆడనక్క మూడురోజులు రాత్రి పగలనక నిలకడలేక కొరికి తింటుండగా అపారమైన బాధ ఉన్నప్పటికీ, అవంతి సుకుమారస్వామి సమ్యగ్ దర్శన శీలాలతో ప్రకాశించాడు.)

జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో వత్స అనే దేశం ఉండేది. అందులో కౌశాంబి ఒక పట్టణం. ఈ పట్టణాన్ని అతిబలుడు అనేరాజు పరిపాలిస్తుండేవాడు. ఆయన రాణి పేరు మనోహరి. పేరుకు తగ్గట్టు చూసేవాళ్ళ కళ్ళు మిరుమిట్లు గొలిపే రూపంతో పాటు, సదాచారాలను సంపదలుగా కలిగి ఉండేది. అత్యంత రూపం, లావణ్యం, సౌభాగ్యం, తేజస్సు, హావభావాలు, విలాస విభ్రమాల్ని కలిగి ఉండేది. ఆ రాజుగారి మంత్రి సోమశర్మ, అతని భార్య కాశ్యపి, వారిద్దరి పిల్లలు అగ్నిభూతి, వాయుభూతి. ఈ పిల్లలిద్దరు తండ్రిమాటలు వినక, వేదం మొదలైన శాస్త్రాల్ని అభ్యసించక, తండ్రి సంపాదించిన డబ్బును ఖర్చు పెడుతూ సప్తవ్యసనాలకు బానిసలయ్యారు. ఇలా ఉండగా కొద్దికాలం తర్వాత సోమశర్మ మరణించాడు. సోమశర్మకు పిల్లలున్నారని తెలిసిన రాజు అగ్నిభూతి, వాయుభూతిని అంతఃపురానికి పిలిపించి వాళ్ళకు స్నానం చేయించి, కట్టడానికి కావలసినన్ని బట్టలిచ్చి, భోజనం చేయించి, తాంబూలమిచ్చి దుఃఖపడకండని ఓదార్చి పంపించాడు. కొన్ని రోజులు గడచిన పిమ్మట మళ్ళీ వాళ్ళను పిలిపించి 'మీరు ఏమేమి అభ్యసించారు' అని అడగ్గా, వాళ్ళు తలవంచి, మారుమాట్లాడక, కన్నీళ్ళు కారుస్తూ, కాలివ్రేళ్ళతో నేలను గీరుతూ నిలబడ్డారు. సభలో ఉన్నవాళ్ళందరూ ''వీళ్ళు మూర్ఖులు. వీళ్ళకు చదువు సంధ్యలు తెలియవు. సప్త వ్యసనాలకు బలైనటువంటివారని'' రాజుతో చెప్పారు. ఈ మాటలు విన్న రాజు వాళ్ళిద్దరిని బయటకు తరిమి, వాళ్ళకు వంశపారంపర్యంగా వచ్చిన మంత్రి పదవిని, సంపదను, వైభవాన్ని శాస్త్రకోవిదులైన వాళ్ళ దాయాది ఒకనికి ఇచ్చి వేశాడు.

అగ్నిభూతి, వాయుభూతి ఇంటికి తిరిగి వచ్చారు. అమితమైన ఉద్వేగంతో, ''చిరిగిన బట్టల్ని కట్టి, భిక్షాటన చేసైనా మేము విద్యాభ్యాసం చేస్తామని'' తల్లితో చెప్పారు. అప్పుడు వారి తల్లి కాశ్యపి ఇలా అంటుంది. ''నాయనలారా! మగధదేశం రాజగృహానికి సుబలుడు అనే రాజు ఉన్నాడు. సుప్రభ అతని భార్య. అతని మంత్రి సూర్యమిత్రుడు నాకు అన్న. అన్ని విద్యలను తెలిసిన

వాడు. ఆయన మీకు అన్ని విద్యల్ని నేర్పించి, మిమ్మల్ని యోగ్యులుగా చేస్తాడు. ఆయనకు ఒక ఉత్తరం వ్రాసి ఇస్తాను. మీరు మీ మామ దగ్గరకెళ్ళి అన్ని విద్యలు నేర్చుకోండని' చెప్పి ఉత్తరం వ్రాసి ఇచ్చింది. వాళ్ళు కొన్ని రోజులు ప్రయాణం చేసి రాజగృహానికి వచ్చారు. సూర్యమిత్రుని ఇంటిని తెలుసుకొని ఆయనకు తమ తల్లి వ్రాసిచ్చిన ఉత్తరం ఇచ్చారు. అతడు ''ఎక్కడనుండి మీరొచ్చారు? ఈ ఉత్తరాన్ని ఎవరిచ్చారు?'' అని అడగ్గా, ''మేము కౌశాంబినుండి వచ్చాము, మీ చెల్లెలు కాశ్యపి పంపించిన ఉత్తరమిదని'' వాళ్ళు తెలిపారు. సూర్యమిత్రుడు ఉత్తరం చదివాడు. సోమశర్మ మరణించడం, మంత్రిపదవి వ్యసనపరులైన ఈ పిల్లలకు దక్కక వారి దాయాదిపాలు కావడం తెలుసుకొని దుఃఖించాడు. వీళ్ళిద్దర్ని బుద్ధిమంతులుగా చేయడం తన కర్తవ్యమని భావించాడు. తాను వాళ్ళ నిజమైన మేమమామనని వాళ్ళు తెలుసుకొంటే, వీళ్ళు కష్టపడి విద్యాభ్యాసం చేయక చెడిపోతారని భావించి, అగ్నిభూతి వాయుభూతులతో ఇలా అన్నాడు. ''నాయనలారా! నాపేరు సూర్య మిత్రుడు అనేది నిజం. అయితే నాకు కాశ్యపి అనే చెల్లెలు కానీ, సోమశర్మనే బావ మరిది కానీ లేరు. నేను మీ మేనమామైన సూర్యమిత్రుణ్ణి కాను. అయితే మీరు ఎవరయినా సరే. విద్యార్థులుగా విద్యనేర్చుకోవాలనే కోరిక మీలో ఉన్నట్టయితే భిక్షాటనచేసి, చిరిగిన బట్టలు కట్టి, రాత్రి పగలనక అలసట లేక చదివేటట్లయితే నేను మీకు విద్య నేర్పిస్తాను.'' అగ్నిభూతి, వాయుభూతి ఈ మాటలు విని సంతోషపడ్డారు. 'అలాగే, అంతా మీ దయ' అంటూ నమస్కరించారు.

మంచివారం, విద్యానక్షత్రం ఉన్న రోజు అగ్నిభూతి, వాయుభూతుల విద్యాభ్యాసం మొదలుపెట్టారు. సూర్యమిత్రుడు పగలనక రేయనక నిర్బంధంగా వాళ్ళతో విద్యాభ్యాసం చేయించాడు. ఏడెనిమిది సంవత్సరాల్లో వేద వేదాంగాలు, పద్దెనిమిది ధర్మశాస్త్రాలు, మీమాంస, న్యాయం, వ్యాకరణం, ప్రమాణం, ఛందస్సు, అలంకారం, నిఘంటువు, కావ్యం, నాటకం, అర్థశాస్త్రం, సాముద్రికం, శాలివ్రతం, గజకావ్యం, అశ్వనీమతం, బోహలం, సుశ్రుతం, క్షారపానీయం మొదలైన నరవైద్యాల్లో, జ్యోతిష్యం, మంత్రవాదం మొదలైన సమస్తశాస్త్రాల్లో విద్వాంసులై, బుద్ధివంతులయ్యారు. ఇలా వారు అన్ని విద్యల్లో ఆరితేరిన పిమ్మట సంతోషపడి, గురువు పాదాలకు సాష్టాంగ నమస్కారంచేసి ''మీ అనుగ్రహం వల్ల మేము అన్ని శాస్త్రాలను అభ్యసించి పండితులయ్యాము. ఇక మా పట్టణానికి వెళ్ళుతామని'' అన్నారు.

అప్పుడు సూర్యమిత్రుడు తాను నిజంగా వాళ్ళ మేనమామనననే విషయాన్ని చెప్పి, ఈ విషయాన్ని ఇంతకు మునుపే చెప్పి ఉన్నట్లయితే వారు భయంలేక సక్రమంగా విద్యాభ్యాసం చేసి ఉండేవారు కారని అంటాడు. వాళ్ళను యోగ్యులుగా చేయడానికి తానీ విషయాన్ని ఇన్ని రోజులు రహస్యంగా ఉంచినందుకు కోపపడక, తనను క్షమించవలసిందిగా వాళ్ళను కోరాడు. వాళ్ళకు కట్టడానికి బట్టలు, కావలసినన్ని బహుమతులు, డబ్బులు ఇచ్చి పంపాడు.

పెద్దవాడైన అగ్నిభూతి తన మామ చేసిన పనికి చాలా సంతోషించాడు. అయితే చిన్నవాడైన వాయుభూతి, సూర్యమిత్రుడు తమకు చేసినదంతా అపకారమని భావించాడు. మా మామఅని అనిపించుకొన్న సూర్యమిత్రుడు మేము భిక్షాటన చేసి తెచ్చిన అన్నం జతకు రాగిముద్ద కానీ, ఒక్కరోజైనా ఒకింత నూనెకానీ, ఉప్పుకానీ వేయలేదు. వేయించనూ లేదు. చెరువుకెళ్ళి మునిగి వస్తున్నప్పటికీ తలకు రాసుకోవడానికి ఒకింత నూనె పోయలేదు. పోయించనూ లేదు. అయితే తాను మాత్రం అనేకమంది మిత్రులతో, బంధువులతో, సేవకులతో పంచభక్ష పరమాన్నాలను భుజించేవాడు. పోనీ, పండుగలరోజుల్లో కూడా వీళ్ళకు భోజనం వేయమని చెప్పలేదు. పంచమహాపాతకుడు! ఏడెనిమిది సంవత్సరాలు మమ్మల్ని విరోధుల్లాగా దండించాడు కదా! - అని-మనసులోనే భావించాడు.

ఇద్దరూ కౌశాంబి పట్టణానికి వచ్చారు. వచ్చిన తోడనే తల్లికి నమస్కరించి విద్యాభ్యాసం ముగించి వచ్చిన విషయాన్ని తెలియజేశారు. పిమ్మట ఒక మంచిరోజు చూసి ఇద్దరూ అంతఃపురానికి వెళ్ళారు. అక్కడ మహారాజు ముందు శ్లోకాలను పఠించి, పాండిత్య ప్రతిభ ఉట్టిపడేలా వాటిని వ్యాఖ్యానించగా, సభలోని పండితులు వీరి అసాధారణ ప్రతిభను ముక్తకంఠంతో పొగడారు. వీరి ప్రతిభను గుర్తించిన రాజు సంతోషపడి వీరికి రావలసిన అధికారం, పదవికాక మిగిలిన అన్నిటిని మళ్ళీ ఇప్పించాడు. చేజారిన అధికారాన్ని మళ్ళీపొందిన అగ్నిభూతి, వాయుభూతి సుఖంగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ఈ మధ్యకాలంలో వీళ్ళకు కావలసినంతమంది శిష్యులయ్యారు. అంతఃపురంలో, అంతఃపురం బయటా వీళ్ళ కీర్తి నలుమూలలా వ్యాపించింది. ఇలా సుఖ సంతోష వినోదాలతో కాలాన్ని గడుపుతుండగా -

ఇక్కడ రాజగృహంలో ఒకరోజు సాయంత్రం సూర్యమిత్రుడు, సుబల మహారాజు ఇచ్చిన మాణిక్యపుటుంగరాన్ని వేసుకొని అలా తిరిగి రావడానికి

వెళ్ళారు. సూర్యమిత్రుడు అలా తిరుగుతుండగా సూర్యునికి అర్ఘ్యాన్ని ఇచ్చే సమయం సమీపించింది. అప్పుడు ఆయన అక్కడే ఉన్న ఒక కొలనులో దోసెడు నిండుగా నీటిని తీసుకొని, అర్ఘ్యాన్ని ఇచ్చే సమయంలో నీటితోపాటు ఉంగరం కూడా జారి ఒక తామరపుష్పంలోకి పడిపోయింది. సూర్యమిత్రునికి అప్పట్లో అది తెలియలేదు. కొద్దిదూరం వెళ్ళిన పిమ్మట చేతివేలును చూసుకొని, ఉంగరం లేకపోవడంతో అలజడి చెందాడు. అది ఎక్కడ పడిపోయిందనే సంగతి గుర్తుకు రాకపోవడంతో అనవసరంగా మనసులో బాధపడుతూ, వ్యధపడుతూ చుట్టూ చూస్తుండగా కొద్దిదూరంలో సుధర్ముడనే ఆచార్యులు కూర్చొని ఉండడం చూసి, ఆయనకేమైనా తెలిసి ఉంటే అడుగుదామనుకొని ఆయన దగ్గరకు వెళ్ళాడు. సూర్యమిత్రుడు దగ్గరికి వెళ్ళగానే దివ్యజ్ఞానులయిన ఆచార్యులు అతని మనసులోని విషయాన్ని తెలుసుకొని ''ఏమయ్యా, రాజు ఇచ్చిన మాణిక్యపుటుంగరాన్ని పోగొట్టుకొని వచ్చావా?'' అని అడిగారు. ఈ మాటలు విన్న సూర్యమిత్రుడు, ఇలాంటి దివ్యపురుషులు కూడా ఉన్నారా! అని ఆశ్చర్యపడుతూ ''స్వామి చెప్పండి మళ్ళీ నాకు ఆ ఉంగరం దొరకుతుందా?'' అని అడిగాడు.

''దొరకుతుంది. నువ్వు సూర్యునికి అర్ఘ్యాన్ని ఇచ్చే సమయంలో ఉంగరం జారి తామరపుష్పంలో పడింది. రేపు సూర్యుడు ఉదయించేటప్పుడు నీటిపై భాగంలో పుష్పం కనిపించి, వికసిస్తుంది. అప్పుడు నువ్వు ఉంగరాన్ని చూడవచ్చును.'' ఈ మాటలు విన్న సూర్యమిత్రుడు చాలా సంతోషించాడు. పిమ్మట ఆచార్యులకు నమస్కరించి, కొలన్నుకు కావలివాళ్ళను నియమించి ఇంటికి తిరిగి వచ్చాడు. మరుసటిరోజు ఉదయం కొలను దగ్గరికి వెళ్ళి చూడగానే ఆచార్యులు చెప్పిన ప్రకారం తామరపుష్పంలో ఉంగరం కనిపించింది. దాన్ని తీసుకొచ్చి రాజుకు అప్పగించాడు. తరువాత అతఃపురం నుండి బయటపడిన అతడు, లోకంలో అత్యంత సూక్ష్మమైన, దూరంగా ఉన్న పదార్థాలన్నింటిని కూర్చున్న చోట్నుండే తెలుసుకోగల ఆ ఆచార్యుల శక్తిని తలచుకొని ఆశ్చర్యపడ్డాడు. ఏలాగైనా సరే కపట వినయాన్ని ప్రదర్శించి, ఆయన దగ్గరనుండి ఆ విద్యను నేర్చుకోవాలని సంకల్పించాడు. తన భార్యతో ఈ విషయాన్నంతటిని చెప్పి సుధర్మాచార్యుల దగ్గరకు మళ్ళీ వచ్చి, ఇలా అన్నాడు:

'భట్టారా' మీ దగ్గర జ్యోతిష్యం నేర్చుకోవాలనే ఆశతో వచ్చాను. నాకు మీరు నేర్పించాలి.

సుధర్మాచార్యులు అందుకు ఇలా అన్నారు: 'తమ్ముడూ, మా జ్యోతిష్యాన్ని మాలాగే అన్నీ త్యజించినవారికి కాక ఇతరులకు చెప్పకూడదు. ఇతరులు దాన్ని నేర్చుకోకూడదు'. అలా అయితే మాకు మీ దీక్షను ఇవ్వండి.

ఒక మంచి ముహూర్తంలో సుధర్మాచార్యులు సూర్యమిత్రునికి దీక్ష నిచ్చారు. పంచమహావ్రతాల్ని ఉపదేశించి, దోషనిర్మూలనా దీక్షను ఇచ్చారు.

''ఇప్పుడైనా జ్యోతిష్యాన్ని నేర్పండి' అన్న శిష్యునితో గురువులు అన్నారు: ''ఎక్కడైనా ఉందా! నమస్కారాల్ని ఆలోచనల్ని, నియమాల్ని మొదట నేర్చుకోవాలి'. వాటినన్నింటిని సూర్యమిత్రుడు త్వరత్వరగా నేర్చుకొన్నాడు. త్రిషష్ఠి శలాకా పురుషుల చరిత్రలు, ఆచారాలు, ఆరాధనలు మొదలైన చరణ గ్రంథాలను లోగాణి, సుగాణి మొదలైన కరణగ్రంథాలను నేర్చుకోవాలని గురువులు అన్నారు. సూర్యమిత్రుడు శిష్యపండితుడై ఉండడం వల్ల కొద్దికాలంలోనే నేర్చుకొన్నాడు . 'భట్టారా, మీరు చెప్పిన గ్రంథాలనన్నింటినీ నేర్చుకోవడం జరిగింది. ఇంకైనా నాకు జ్యోతిషం నేర్పండి' అని వేడుకొన్నాడు. 'చివరగా ఒకే ఒక విషయముంది. అది ద్రవ్యానుయోగం - దాన్ని నేర్చుకొన్న వేంటనే జ్యోతిష్యాన్ని నేర్పిస్తాను' అని ఆచార్యులు అన్నారు. ఇక ఒకే ఒక శాస్త్రం నేర్చుకోవడం నాకేపాటిది! ఇప్పుడే నేర్చుకొనేస్తాననుకొని, మంచిరోజు, వారం, నక్షత్రం, ముహూర్తంలో సిద్ధాంతాన్ని కంఠపాఠం చేయడానికి ప్రారంభించాడు. ద్రవ్యానుయోగాన్ని వింటూ వింటూ మిథ్యాత్వ ఇంగి, బంధం - బంధకారణం, మోక్షం - మోక్షకారణం ఈ రెండింటి ఫలము, జీవ అజీవ విషయాలు, పుణ్యాపాపాలు, ఆస్రవసంవరాలు, నిర్జరం, బంధం, మోక్షం అనే నవపదార్థాలు, పంచఅస్తికాయాలు, షడ్ద్రవ్యాలు మొదలైన జైనతత్వాల విషయాలపై పరిపూర్ణమైన నమ్మకం, జ్ఞానం ఆయనకు కలిగాయి. అష్టమదాలు, అష్టమలాలు, మూడుమూఢాలు, ఆరు అనాయతన సేవలు ఇలా 25 దోషాలకు దూరమైన సమ్యక్తాన్ని సంపాదించాడు. కపట తపస్సుతో అనంతమైన సుఖానికి కారణమైన సన్మార్గాన్ని సంపాదించానని ఒకవైపు సంతోషపడుతూ, మరోవైపు గురువును వంచించి నందుకు ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. ఇలా సూర్యమిత్రుడు అత్యున్నతమైన యతివర్యునిగా 12 సంవత్సరాలు గురువులతో ఉండి, తపస్సుచేసి ఆచార్యుడయ్యాడు. అటు తరువాత గురువుల అనుమతి తీసుకొని ఒంటరిగా గ్రామంలో ఒకరాత్రి, నగరంలో ఐదురాత్రులు, అడవిలో

పదిరాత్రుల ప్రకారం గ్రామం, నగరం, పట్టణం, నదులు, కొండలు సంచారం చేస్తూ ఒకసారి కౌశాంబి నగరానికి వచ్చారు.

అక్కడ ఉదయావత పర్వతంలో ఉన్న సిద్ధక్షేత్రాల్లో నమస్కరించి, తీర్థోపవాసం చేసి తరువాత భిక్షాటనకని నగరంలో ప్రవేశించిన సూర్యమిత్రాచార్యులు చిన్నిల్లు పెద్దిల్లు అనక తినడానికి అర్హంగా ఉన్న అన్ని ఇళ్ళలో భిక్షాటన చేస్తూ అగ్నిభూతి ఇంటిని చేరారు. ఆయన్ని చూడగానే అగ్నిభూతికి చాలా సంతోషమయింది. భక్తిగౌరవాలతో ఆయనకు స్వాగతమిచ్చి కాళ్ళు కడిగి ఉపచరించి భోజనం వడ్డించారు. 'దానము అక్షయం కానీ' అని ఆశీర్వదించి ఆచార్యులు వెళ్ళడానికి సంసిద్ధులు కాగా, 'భట్టారా, మీ చిన్న శిష్యుడైన వాయుభూతిని కూడా ఆశీర్వదించి వెళ్ళాలి' అని వేడుకొని ఆయన్ని వాయుభూతి ఇంటికి తీసుకొచ్చాడు. ఆ సమయంలో వాయుభూతి ఉన్నతమైన ఒక లోహాసనం పై కూర్చొని, అనేకమంది శిష్యులు బ్రాహ్మణులు కూర్చొని ఉండగా వారితో వ్యాఖ్యానం చేస్తున్నవాడు ఈయన్ను చూసి గౌరవించడం అటుంచి, పైకి కూడా లేవలేదు. అగ్నిభూతి తమ్ముని దగ్గరకెళ్ళి వాని చేయి పట్టుకొని, 'ఇదేమిటి, వచ్చినటువంటి భట్టారకులు మనకు పూజ్యులు. ఈయన అనుగ్రహం వల్ల మనకు గొప్ప సంపద, శ్రేయస్సు లభించాయి. లేచివెళ్ళి భట్టారకులకు నమస్కరించు' అన్నాడు. ఇలా తన అన్న అనగానే వాయుభూతి కోపించి, 'మంచివాళ్ళకు నాచేత నమస్కారం చేయించడానికి వచ్చావా నీవు! ఎప్పుడూ అశుచిగా ఉంటూ మలగ్రస్తులయినటువంటివారు! ఎప్పుడూ స్నానం చేసి ఎరుగనివారు అయిన ఈయన కాలికి నేను నమస్కరించాలా!' అంటూ నిష్ఠురంగా చెడ్డమాటలు అన్నాడు. అగ్నిభూతికి తీవ్రమైన కోపం వచ్చింది. 'తల తెగేస్తా అధముడా! నీచుడా! స్వామివారిని ఇలా అంటావా!' అని అతడు వాయుభూతిని తిట్టుతుండగా ఆచార్యులు ఇలా అన్నారు.

''మాటల్తో తిడుతుంటే కొట్టలేదంటూ, కొడుతుంటే తల తీయలేదంటూ, ప్రాణం పోయినా నా ధ్యానస్థితికి లోపం కాలేదని నిరంతర ఆత్మధ్యానం చేస్తూ సహనం చూపించాలి. వీడిని తిట్టవద్దు''.

అగ్నిభూతి కూడా సూర్యమిత్రాచార్యులతో ఉదయావతానికి వచ్చేశాడు. ''భట్టారా, మిమ్మల్ని పంచమహాపాతకుడైన ఆ వాయుభూతి ఇంటికి

తీసుకెళ్ళి తిట్టించాను. వాడు తిట్టినప్పటికీ నిజంగా నేను తిట్టినట్లయింది. ఆ పాపం ఏమి చేసినా పోదు. దయచేసి నాకు దీక్ష ఇచ్చి అనుగ్రహించండి'' అని దీనంగా వేడుకొన్నాడు. మంచి ముహూర్తంలో దీక్షపొంది తపస్సులను ఆచరించి, క్రియల్ని నేర్చుకొని, ఆగమాల్ని చదువుతూ గురువులతో సంచరిస్తూ ఉండిపోయాడు.

ఇక్కడ అగ్నిభూతి భార్య సోమదత్త, మరిది మీదున్న దయవల్ల, తనకు వచ్చిన దుఃఖంవల్ల వాయుభూతి దగ్గరకు వచ్చి ''సూర్యమిత్రా! భట్టారకులు మొదట బ్రాహ్మణులుగా ఉండినవారు. మీ మేనమామ పరమ తపోధనులు, గుణవంతులు. అటువంటివారు మీ ఇంటికి వస్తే మీరు ఆసనం నుండి పైకి లేచి, ఎదురెళ్ళి స్వాగతం పలికి నమస్కరించలేదు. ఇంతటి సంపద, వైభవం మీకు ఆయన అనుగ్రహం వల్ల వచ్చాయి. అలాంటి వారిని తిట్టి తిరస్కరించ వచ్చా? అధములు, దుర్జనులు అయోగ్యుల్లా ప్రవర్తించారు మీరు'' అని సభ మధ్యలో కఠినంగా పలికింది. వాయుభూతికి విపరీతంగా కోపమొచ్చి ఆమెను నోటికొచ్చినట్లు తిట్టి, కొట్టి కాలితో ఆమె తలను తన్ని ఆమె ఇంట్లో ఉన్నదంతా దోచుకొని ''సన్యాసిగా ఉన్న మీ భర్త దగ్గరకెళ్ళండి!'' అని తోశేసాడు. సోమదత్తకూ కోపమెక్కువై మండిపడుతూ ''దుర్మార్గుడా, నన్ను తన్నిన నీ కాళ్ళను జన్మజన్మలకైనా కుక్కనక్కగా పుట్టి నా పిల్లలతో పీకి తినకపోను'' అని శపథం చేసి పిల్లలతో వెళ్ళిపోయింది. కొద్దికాలం తర్వాత మరణించి వేర్వేరు జన్మల్లో పుట్టి దుఃఖ పడుతుండేది.

వాయుభూతి మితిమీరిన గర్వంతో ఋషిని అవమానించి తిట్టడం వల్ల, జినధర్మాన్ని కించపరచడం వల్ల, ఏడురోజుల్లో కుష్ఠురోగ పీడితుడై శరీరమంతా పురుగులు పడి, కృశించి చచ్చాడు. చచ్చి కౌశాంబి నగరంలోని ఒక దొమ్మరవాళ్ళ ఇంట్లో ఆడగాడిదలా పుట్టాడు. ఎక్కువ బరువులు మోసి మోసి వీపుగాయమై, అది పుండై పురుగులు పడి ఆ గాడిద చచ్చింది. పిమ్మట అశుద్ధాన్ని తినే పందిగా పుట్టి, చచ్చి మగధరాజ్యం చంపానగరమనే పట్టణంలోని హరిజనుల ఇంట్లో ఆడకుక్కగా పుట్టింది వాయుభూతి ప్రాణం. ఆ జన్మలో చచ్చిన పిమ్మట హరిజనుల నాయకుడైన నీళ, వాడి భార్య కేశి గర్భంలో ఆడపిల్లగా పుట్టింది. ఆ ఆడపిల్ల అసహ్యమైన రూపంతో, దుర్గంధమైన శరీరంతో, పుట్టుగ్రుడ్డితనంతో, అనేక వ్యాధులతో బాధపడుతూ ఆకలి బాధ భరించలేక ఒకరోజు ఊరిబయట

ఉద్యానవనంలోని నేరేడు చెట్టు క్రింద రాలిన పండ్లను తడబడుతూ ఏరుకొని తింటుండగా -

అదే వేళకు సూర్యమిత్రాచార్యులు, అగ్నిభూతిముని సంచారం చేస్తూ చంపానగరానికి వచ్చారు. అక్కడ వాసుపూజ్య భట్టారకులు సిద్ధిపొందిన తీర్థక్షేత్రాన్ని నిర్మల మనస్సుతో ధ్యానించిన పిమ్మట, ఆ నగరం బయట ఉన్న ఒక నాగదేవత దేవస్థానంలో బసచేశారు. ఆ రోజు సూర్యమిత్రాచార్యులు ఉపవాసం ఉండటం వల్ల,అగ్నిభూతిముని గ్రామంలో భిక్షాటన చేస్తూ, ఉద్యానవనంలో తడబడతూ నేరేడు పళ్ళను ఏరుకొని తింటున్న పుట్టుగ్రుడ్డిదైన హరిజన అమ్మాయిని చూసి, మనసు కరిగి, ఆమెపై స్నేహవాత్సల్యం పొంగి, కళ్ళల్లో నీళ్ళు రాగా నేరేడు పళ్ళను కోసి ఆమెకు ఇచ్చాడు. ఏ పాపఫలం వల్ల ఈ బిడ్డ ఇలా యాతన అనుభవిస్తున్నదనే నిర్వేదన కలుగగా, ఆ రోజు అలా సహాయం చేసి నాగదేవత గుడివైపు వెళ్ళారు. దుఃఖవదనంతో ఉన్న అగ్నిభూతిమునిని చూసిన సూర్యమిత్రాచార్యులు ఏమయిందని ప్రశ్నించగా తాను చూసిన విషయాన్ని వివరించారు. ''ఉద్యానవనంలో ఒక నేరేడు చెట్టుక్రింద పడిన పళ్ళను తడబడతూ ఏరుకొని తింటున్న పుట్టిగ్రుడ్డిదైన ఒక అంటరాని అమ్మాయిని చూసి అపారమైన వాత్సల్యంతో కరుణపొంగగా దుఃఖంతో కన్నీళ్ళురాగా అహో దుర్విధీ! ఇదేమి సంసారమని పరితపించి సహాయం చేసి వచ్చాను'' అని జరిగిన విషయాన్ని వివరించాడు. ''ఆ అమ్మాయి ఎవరని అనుకున్నారు? వెనుకటి జన్మలో మీ తమ్ముడు'' అని సూర్యమిత్రుడు అన్నాడు. ''భట్టారా, అదెలా?'' కుతూహలంతో అగ్నిభూతి ముని ప్రశ్నించాడు. అందుకు భట్టారకుడు ఇలా అన్నాడు. ''మీ తమ్ముడు వాయుభూతి అతిగర్వంతో మనల్ని తిట్టిన ఫలితంగా ఏడురోజుల్లో కుష్ఠురోగగ్రస్థుడై, పురుగులు పడి మరణించి, ఆడగాడిదగా, పందిగా, ఆడకుక్కగా వేర్వేరు జన్మల్లో పుట్టి మరణించాడు. ప్రస్తుతం ఈ హరిజనుల ఇంట్లో పుట్టు గుడ్డిపిల్లగా జన్మను ధరించింది అతని జీవం. అందువల్లే ఆ పసిపిల్లను చూసి మీ మనసు కరిగింది''

''భట్టారా ఆ పసిపాప జీవం ఉత్తమమైందా? ఉత్తమం కానిదా?'' అని అగ్నిభూతి అడగ్గా సూర్యమిత్రుడు ''ఆ పసిపాప జీవం ఉత్తమమయినది. నువ్వు ఉపదేశిస్తే ఆ పసిపాప ధర్మమార్గంలో వెళ్ళుతుంది'' అన్నారు. ఈ మాటలువిన్న అగ్నిభూతి ఋషి సంతోషించాడు. తక్షణమే పుట్టుగ్రుడ్డిదైన ఆ పసిపాప దగ్గరికెళ్ళి,

తమ ముందిన జన్మవృత్తాంతాల్ని, ఋషిని తిరస్కరించడం వల్ల జన్మజన్మల్లో అనుభవించిన దుఃఖాన్ని వివరించి ధర్మఫలాన్ని, పాపఫలాన్ని తెలియజేశాడు. మనిషి జన్మనెత్తి జీవహింస చేసి మాంసాన్ని తినేవాడు కురూపియై, దౌర్భాగ్యం, చెడ్డబుద్ధి, కుటిలస్వభావం, నీచత్వం, నీచజాతి, ఆకలిదప్పులు, మనోదుఃఖం, రోగం, శక్తి హీనత్వం, హీనత్వం, దాస్యం, నీచమైన చావు, దుఃఖం, దురాశ, - వీటన్నిటిని ఎక్కువకాలం అనుభవిస్తాడు. పాపకర్మ ఫలంగా పొట్టి చేతులు, కాళ్ళులేక, గ్రుడ్డివాడుగా, మరుగుజ్జుగా పుట్టుతాడు. కుంటివాడుగా, బుద్ధిమాంద్యం కలవాడవుతాడు. చెవిటివాడు మూగవాడు అవుతాడు. ఎత్తైన పండ్లు, మొండిచేయి, ఒంటికన్ను, కృశించి పగుళ్ళు పడ్డ దేహం, కుష్ఠురోగం, చర్మరోగం వాడికి వస్తాయి. అహింస మొదలైన వ్రతాల్ని ఆచరించనివాడు నీచకులంలో పుట్టి, దీనుడై, అందరిచే తిరస్కరింపబడినవాడై, చెడ్డవాడై, దుర్గంధ శరీరంతో మందబుద్ధితో, మూగవాడై, నీచుడై, జారత్వం చేస్తూ, సిగ్గులేనివాడై జన్మిస్తాడు. మోసగాడై ఎల్లప్పుడూ రోగపీడితుడై ఉంటాడు.

మద్యం, మాంసం సేవించనివాడు సుందరమైన రూపం, మంచికులం, బలం, వినయం, కీర్తి, దీర్ఘాయుస్సు, ఇంద్రాది దేవతలనుండి ప్రశంస, దేవతాస్త్రీల ప్రేమ, అష్టభోగాలు, బుద్ధిసామర్థ్యం, ఐశ్వర్యం, గౌరవప్రదమైన మాటల్ని పొందుతాడు. అతడు చేసిన పుణ్యఫలితంగా అధికారం, కీర్తి, స్థిరమైన బుద్ధి, ఐశ్వర్యం సిద్ధిస్తాయి. చేసిన ధర్మఫలంగా శ్రేష్ఠమైన భార్య, వాహనం, ఇల్లు మొదలైనవే కాక ఏనుగులు, సేవకులు కూడా లభిస్తారు. ఎక్కడ దయ ఉంటుందో అదే ధర్మం; ఎక్కడ ఇంద్రియ నిగ్రహం ఉంటుందో అక్కడ ధర్మముంటుంది. పద్దెనిమిది దోషాలు లేనివాడే దేవుడు; అతడే ఆరాధింపదగినవాడు; ఇందులో ఎలాంటి సందేహం లేదు - అని బోధించి ఆగమం అంటే ఏమిటి, పన్నెండు రకాల తపస్సు ఆచరించడం ఎలా, ధర్మమంటే ఏమిటి అనే విషయాల్ని ఆ బాలికకు తెలియచేశాడు. ఆ ధర్మ సంబంధమైన మాటల్ని విన్న బాలిక మనస్సు కరిగి సంసార శరీరాలమీద వైరాగ్యం ఏర్పడింది. తనను తానే విమర్శించుకొంది. పాపభీతి ఏర్పడింది. అణువ్రతం మొదలైన శ్రావకవ్రతాల్ని ఆ బాలిక త్వరగా చేపట్టింది. అగ్నిభూతి భట్టారకుడు 'స్థిరమైన మనస్సుతో వ్రతాన్ని ఆచరించు, కర్మక్షయం కానీ' అని ఆశీర్వదించి, తమ నివాసానికి తిరిగి వెళ్ళారు. అహింసలాంటి వ్రతాల్ని చేపట్టి, పుట్టుగ్రుడ్డిదయిన ఆ అంటరాని బాలిక ఇంటికి వస్తుండగా -

దార్లో రాజుగారి పురోహితుడు సోమశర్మ వైభవోపేతంగా తన పరివారంతో పూజాసామగ్రిని తీసుకొని, మొక్కుబడి చెల్లించడానికి సంబరనాగ దేవాలయానికి వెళ్ళుతున్నాడు. ఈ దృశ్యాన్ని తోడుగా ఉన్న స్నేహితరాండ్రు వర్ణించగా, ఆ బాలిక తాను మరణించిన పిమ్మట సోమశర్మ ఇంట్లో జన్మించాలని సంకల్పం చేసుకొంది. అనుకొన్న విధంగానే ఆ రోజు రాత్రి పాముకాటుకు గురై ఆ బాలిక మరణించింది. రాజుగారి పురోహితుడు సోమశర్మ, అతని భార్య త్రివేది కూతురుగా ఆమె జన్మించింది. నాగదేవత వరప్రసాదంతో పుట్టడం వల్ల నాగశ్రీ అనే పేరు పెట్టారు. నాగశ్రీ అత్యంత రూపలావణ్యంతో, హావభావాలతో, సౌభాగ్యంతో, కాంతివంతమైన దేహంతో పెరిగింది.

ఏడెనిమిది సంవత్సరాలు గడిచాయి. సూర్యమిత్రాచార్యులు, అగ్నిభూతి ముని అనేక గ్రామ నగరాల్ని సంచరించి మళ్ళీ చంపానగరానికి వచ్చి కంబళనాగ, శంబరనాగ, పాండకనాగ అనే పేరుకల నాగాలయంలో బస చేశారు. ఆ రోజు పంచమి. నాగశ్రీ తన స్నేహితురాండ్రైన మంత్రిగారి కుమార్తె మొదలైన వాళ్ళతో ఆ నాగాలయానికి వచ్చి, పూజ చేసిన పిమ్మట అక్కడే ఉన్న ఆచార్యులను చూసింది. వెంటనే ఆమెకు తన వెనుకటి జన్మల జ్ఞాపకాలు వచ్చాయి. వెనుకటి జన్మలో అంటరాని పిల్లగా జన్మించిన విషయం జ్ఞాపకం వచ్చి, భట్టారకుని కాళ్ళమీద పడి, ఆయన దగ్గర కూర్చుంది. ఆపాపను చూసిన అగ్నిభూతి మునిలో వాత్సల్యం పుట్టుకురాగ, ఆయన తన గురువైన సూర్యమిత్రుని అందుకు కారణం ఏమిటని అడిగారు. భూత భవిష్యత్తు వర్తమానాలు వెలిసిన సూర్యమిత్రాచార్యులు 'వాయుభూతి జీవం మనల్ని తిరస్కరించిన ఫలితంగా కుష్ఠుతో మరణించి గాడిదగా, పందిగా, ఆడకుక్కగా, పిమ్మట అంటరాని పిల్లగా పుట్టి, మీరు చేసిన ఉపదేశఫలితంగా ఉత్తమ గతుల్ని పొంది, ప్రస్తుతం సోమశర్మ కూతురు నాగశ్రీగా జన్మించింది. అందువల్ల ఆమెను చూడగానే మీలో వాత్సల్యం పుట్టుకొచ్చింది' అని అన్నారు. దీన్ని విన్న నాగశ్రీకి తన వెనుకటి జన్మల వృత్తాంతాలు తనముందు జరిగినట్లు అనిపించింది. వెంటనే భట్టారకుని కాళ్ళమీద పడి నమస్కరించి, ధర్మ దీక్షను పొంది, అణువ్రతం మొదలైన వ్రతాల్ని స్వీకరించింది. ఆమె ఇంటికి వెళ్ళేముందు సూర్యమిత్రుడు ఆమెకు ఒక హెచ్చరిక చేశాడు. 'అమ్మా, మా నుండి స్వీకరించిన వ్రతాల్ని త్యజించమని మీ తండ్రిచెబితే వాటిని మరెక్కడా త్యజించవద్దు. ఇక్కడ కొచ్చి వాటిని మాకు అప్పగించు అన్నారు. 'అలాగేకానీ' అని ప్రయాణం చేసి, నాగశ్రీ ఇంటికి తిరిగి వెళ్ళింది.

భట్టారకుడు చెప్పిన విధంగానే జరిగింది. నాగశ్రీ స్నేహితురాండ్ర వల్ల ఆమె జైనమునులనుండి వ్రతాల్ని స్వీకరించిన విషయం సోమశర్మకు తెలిసి కూతురుతో ఇలా అన్నారు. ''అమ్మాయ్ నాగశ్రీ! మనం బ్రాహ్మణులం. లోకంలో ఉన్నతులం. లోకమే మనల్ని పూజిస్తుంది. మనకంటే శ్రేష్ఠులు ఎవరూ లేరు. అందువల్ల జైనమునుల వ్రతాల్ని స్వీకరించడం తగనిపని. అందువల్ల వాటిని త్యజించు''.

అందుకు నాగశ్రీ ఇలా అంది. 'నాన్నా! అలా అయితే వ్రతాల్ని ఉపదేశించిన ఋషుల దగ్గరకెళ్ళి వాటిని వదలివస్తాను'. 'అలాగే కానీ' అని అన్న సోమశర్మ, కూతురు చేయిపట్టుకొని నాగాలయం వైపు బయల్దేరాడు. దార్లో ఒకని చేతుల్ని వెనక్కి విరచి కట్టి, ఒంటి డప్పు వాయిస్తూ, ప్రజలు గుమిగూడి చూస్తు ఉండగా వాణ్ణి చంపడానికి ఈడ్చుకెళ్ళుతున్నారు. యువకుడై తేజస్సు నిండిన వాణ్ణి అలా ఎందుకుతీసుకెళ్ళుతున్నారనే విషయం నాగశ్రీకి బోధపడక 'నాన్నా వీణ్ణి ఇలా ఎందుకు ఈడ్చుకెళ్ళుతున్నారని' అడిగింది. సోమశర్మ తలారిని విచారించి వచ్చి కూతురితో ఇలా అన్నాడు.

వరసేనుడు - అక్షధూర్తుని కథ: 'ఈ పురం ప్రధానవర్తకుడు ఇంద్రదత్తుడు. పదహారుకోట్ల బంగారు నాణేల యజమాని. వీడు ఇంద్రదత్తుని కుమారుడైన వరసేనుడు. వీడు అక్షధూర్తుడు అనే వ్యక్తితో జూదమాడి వెయ్యి దీనారాలను ఓడిపోయాడు. ఓడిన ధనాన్ని అతనికివ్వకపోగా, రాజుమీద ఒట్టు పెట్టినప్పటికీ లెక్కచేయక వెళ్ళిపోతుండగా అక్షధూర్తుడు అడ్డుపడ్డాడు. నిరపరాధియైన అతణ్ణి వరసేనుడు హత్య చేశాడు. రాజాజ్ఞ ప్రకారం వరసేనునికి మరణశిక్ష విధించడానికి తీసుకెళ్ళుతున్నారు.

ఈ కథను విన్న నాగశ్రీ ఇలా అంది: ''నాన్నా! నేను ఋషులనుండి 'చావుకు భయపడి ప్రాణుల్ని చంపను' అనే వ్రతాన్ని స్వీకరించాను. ఈ వ్రతాన్ని త్యజిస్తే నేను ప్రాణుల్ని చంపాల్సి వస్తుంది కదా! అప్పుడు నన్ను కూడా వీనిలాగే చేతులు వెనక్కి విరచి కట్టి చంపడానికి తీసుకుపోతారు కదా! మీరు, బంధువులందరూ చూస్తుండగా, ఒంటి డప్పు వాయిస్తూ శ్మశానంలో శూలం మీద పడద్రోసి చంపుతారు కదా!''

'సరే, అలా అయితే ఆ చంపని వ్రతాన్ని అలానే ఉంచుకొని మిగిలిన వాటిని ఆ మునులకు అప్పగించేద్దాం పద' అని సోమశర్మ అన్నాడు. వాళ్ళు కొద్ది దూరం ముందుకు వెళ్ళారు. మునుపటి లాగే మరొకణ్ణి చంపడానికి తీసుకెళ్ళుతున్న దృశ్యం వాళ్ళ కంట పడింది. నాగశ్రీ అదేమిటని అడగ్గా, సోమశర్మ వెళ్ళి విషయాన్ని తెలుసుకొని వచ్చి ఇలా అన్నారు.

వైనయికుడి కథ: ''అమ్మా! వీడు వైనయికుడనే మోసగాడు. వీడు కన్య, బంటు, ముసలమ్మకు సంబంధించిన బొమ్మల్ని చూపిస్తూ, ప్రజల్ని ఆకర్షిస్తూ ధాన్యాన్ని అమ్మేటప్పుడు మోసం చేసి దొంగలించేవాడు. వీడు క్రింది కథల్ని చెప్పేవాడు.

''కౌశాంబి అనే పట్టణంలో సుమిత్రుడు అనే వైశ్యుడు ఉండేవాడు. కోటి వరహాల యజమాని అతడు. అతని కుమారుడు వసుమిత్రుడు. ఆ బాలుణ్ణి ఒక పాము కరవగా మరణించాడని స్మశానానికి తీసుకెళ్ళారు. అక్కడికి గరుడనాభి అనే మాంత్రికుడు వచ్చి మంత్రబలంతో ఈ బాలుణ్ణి రేపు బ్రతికిస్తాను, ఈ రాత్రి ఈ బాలునికి కాపలా ఉండడని చెప్పి వెళ్ళారు. అలాగే అంటూ నలుగురిని అక్కడ కాపలా ఉంచి సుమిత్రశెట్టి ఇంటికెళ్ళారు. ఆ రాత్రి ఆ నలుగురిలో ఒకడు గొర్రెను దొంగిలించి తీసుకురావడానికి వెళ్ళాడు. ఒకడు కట్టెలు, మరొకడు నిప్పులు తీసుకురావడానికి వెళ్ళారు. నాల్గవవాడు కావలి కూర్చున్నాడు. నలుగురు గొర్రెను కాల్చి తిన్నారు. తెల్లవారింది. గరుడనాభి మాంత్రికుడొచ్చాడు. మంత్రం చెప్పి బాలుణ్ణి బ్రతికించాడు. సుమిత్రశెట్టి చాలా సంతోషించాడు. జనసమూహం మధ్యలో ఉన్న ఆ నలుగురికి మేడమీదినుండి వెయ్యి దీనారాలున్న ఒక్కొక్క మూటను క్రిందకు వేశాడు. ఆ నలుగురిలో ఒక్కడు మూడు తీసుకొని ఉన్నప్పటికి లేదని అబద్ధం చెప్పాడు. అప్పుడు శెట్టి రాజుగారి దగ్గరికెళ్ళి ''రాజా! నా వెయ్యి దీనారాల మూట పోయింది. వెదికించి నాకు ఇవ్వండి'' అన్నాడు. రాజు తలారిని పిలిపించి,' త్వరగా దొంగను పట్టుకో, లేకుంటే ఆ శిక్షను నీకు విధిస్తానని' ఆజ్ఞాపించాడు. తలారి ఎంత ప్రయత్నించినా దొంగ దొరక్కపోగా ఆ భటుల్ని నలుగుర్ని తన ఇంటికి తీసుకొచ్చి రాజాజ్ఞకు భయపడి చింతిస్తూ కూర్చున్నాడు. అతని కూతురు సుమతి చాలా నేర్పుకలది. తన తండ్రి ఎందుకు చింతిస్తున్నాడనే విషయాన్ని అడిగి తెలుసుకుంది. ''నాన్నా! మీరు భయపడకండి. రేపటిలోగా దొంగను, వాడు దొంగిలించిన వెయ్యి దీనారాల్ని మీకు అప్పగిస్తాను'' అని

ఏకాంతంగా అతనితో చెప్పి సమాధానపరిచింది. ఆ రాత్రి నలుగుర్ని పరీక్షించాలనే ఉద్దేశంతోవారి దగ్గర కూర్చుని మాట్లాడుతూ వాళ్ళకు ఒక కథ చెప్పింది.

సుదామె కథ: పాటలీపుత్రంలో సుదత్తుడు అనే శెట్టి ఉండేవాడు. అతని కుమార్తె సుదామె. ఒకరోజు సుదామె నదిలో స్నానం చేస్తుండగా ఒకమొసలి ఆమెను పట్టుకుంది. ఆమె భయంతో వణకుతూ నది ఒడ్డున ఉన్న తన అన్న బావమరది ధనదత్తుడు అనేవాణ్ణి రక్షించమని వేడుకొంది. నేను అడిగింది తీర్చేటట్లయితే రక్షిస్తానని వాడు షరత్తు విధించాడు. సుదామె అందుకు ఒప్పుకుంది. ధనదత్తుడు నీటిలోకి దిగి మొసలి నుండి ఆమెను రక్షించాడు. ''నీకు ఏం కావాలి? ఏమడిగినా ఇస్తాను' అన్న సుదామెతో ధనత్తుడు ఇలా అన్నాడు. ''నీ పెళ్ళిలో మొదటిరోజు అలంకారాన్ని నాకు చూపించాలి, అంతే.'' అందుకు ఆమె ఒప్పుకొని ఇంటికి వెళ్ళిపోయింది.

కాలం గడచింది. యుక్తవయస్సు వచ్చిన సుదామెకు పెళ్ళి అయింది. తాను అన్న మాటలు జ్ఞాపకం రాగా, నడిరాత్రిలో అన్ని నగల్ని ధరించి, బాగా అలంకరించుకొని తన మరది ఉన్న అంగడివైపు బయలుదేరింది. దార్లో ఒక దొంగ సుదామెను అడ్డగించి ధరించిన నగల్ని ఇచ్చి వెళ్ళు, లేకుంటే నిన్ను వదలనని అన్నాడు. సుదామె తాను ఎక్కడికి వెళ్ళుతున్నదీ ఆ దొంగతో చెప్పి ''వెనుదిరిగి వచ్చేటప్పుడు అన్ని నగల్ని ఇస్తాను. అంతవరకు ఇక్కడే ఉండు'' అని వాడికి నచ్చచెప్పి ముందుకు వెళ్ళింది. కొద్ది దూరం వెళ్ళేసరికి తలారి అడ్డువచ్చాడు. ''ఇంత పొద్దులో ఎక్కడికి వెళ్ళుతున్నావే చెడిన ఆడదానా'' అని గర్జించాడు. ''చాలా ముఖ్యమైన పనిమీద వెళుతున్నాను. మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి'' అని తలారిని ఒప్పించి ముందుకు వెళ్ళింది. కొద్దిదూరం వెళ్ళేసరికి ఒక బ్రహ్మరాక్షసుడు ఎదురై ఆమెను తినడానికి ప్రయత్నించాడు. సుదామె 'అయ్యా! నాకో ముఖ్యమైన పని ఉంది. ఆ పని ముగించుకొని వచ్చేటపుడు నీ ఇష్ట ప్రకారం చేసుకొందువుగానీ'' అని బ్రహ్మరాక్షసుని ఒప్పించి ముందుకు వెళ్ళింది. నడిరాత్రిలో ఆమె ఎక్కడికి వెళ్ళుతుందనే కుతూహలంతో ఆ ముగ్గురు ఆమెకు తెలియకుండా వెంబడించారు.

సుదామె తన మరది పడుకొని ఉన్న అంగడికి వెళ్ళి తలుపుతట్టి అతన్ని నిద్రలేపింది. తలుపు తెరచి బయటకొచ్చిన ధనదత్తునికి ఆశ్చర్యమయింది. 'ఈ

పొద్దులో ఎందుకు ఇలా వచ్చావు!' అని అడిగాడు. సుదామె అతడు వెనక చెప్పిన విషయాన్ని జ్ఞాపకం చేసి, తన పెళ్ళిరోజు అలంకారాన్ని చూపించడానికి వచ్చానని చెప్పింది. ధనదత్తుడు ఆమె రూపాన్ని చూసి చాలా సంతోషించాడు. విద్యాధరిలా అప్సరసలా ఉన్నావని ప్రశంసించాడు. ''నువ్వు చేసిన ప్రతిజ్ఞ ప్రకారం నడచుకొన్నావు. మంచిది. ఇప్పుడు నడిరాత్రయింది. చాలా చెడ్డ సమయం. దొంగలు, తలారుల కంటపడితే పీడిస్తారు. త్వరగా ఇంటికెళ్ళు'' అని ఆమెకు చెప్పి పంపించాడు. ఈ మాటల్ని బయట నిలబడి వింటున్న బ్రహ్మరాక్షసుడు, తలారి, దొంగ గబగబా వెనక్కి తిరిగి వారివారి స్థానాల్లో నిలుచున్నారు. సుదామె మొదట బ్రహ్మరాక్షసుడున్న చోటుకి వచ్చి, ''అన్నమాట ప్రకారం నేనొచ్చాను. నీ యిష్టప్రకారం చేసుకో'' అంది. బ్రహ్మరాక్షసుడు ''నువ్వు ఆడిన మాటను తప్పనిదానివి. రూపం, లావణ్యం, సౌభాగ్యం, కాంతి, హావభావాలు, విలాసం, విభ్రమాల్ని కలిగి ఉన్న నిన్ను తిని, నేను ఏ పాపం కట్టుకోవాలి? నీ రూపాన్ని చెరచడానికి నాకు మనసు రావడం లేదు. భయపడకు. వెళ్ళు'' అంటూ ఆమెను పంపించాడు. తలారికూడా ''నువ్వు చెడిన ఆడదానివని భావించాను. నీలాంటి మంచివాళ్ళు ఎవ్వరూ లేరు. ఆడిన మాటప్రకారం తప్పక వచ్చావు. నువ్వు సత్యవాదివి. వెళ్ళమ్మా వెళ్ళు'' అంటూ పంపించాడు. తరువాత దొంగ దగ్గరకు సుదామె వచ్చింది. తన ఆభరణాల్ని తీసి దొంగకు ఇవ్వబోగా వాడు ఇలా అన్నాడు. ''ఇదేమిటి? నాదికూడ ఒక జన్మేనా? నీ నగల్ని దోచుకొని సూర్యచంద్రులు ఉన్నంతవరకు బతగ్గలనా? నీ నుండి లాక్కొన్న ఈ బంగారం తరిగిపోక ఉంటుందా? వెళ్ళమ్మా, ఇంటికెళ్ళు''.

ఇలా ఆ ముగ్గురు సుదామెను గౌరవించి పంపించారని సుమతి ఆ భటులతో చెప్పి ''ఆ ముగ్గురిలో ఎవరు మంచివారు చెప్పుకోండి చూద్దాం అన్నలారా'' అని అడిగింది. అందులో గొర్రెను చంపిన భటుడు, సుదామెను తినక వదలిపెట్టిన రాక్షసుడు మంచివాడని చెప్పాడు; కాపలా కూర్చొన్న భటుడు, సుదామెను శిక్షించక వదలిపెట్టిన తలారి మంచివాడని చెప్పాడు; నిప్పులు తేవడానికి వెళ్ళిన భటుడు, ఏకాంత సమయంలో తనదగ్గరకొచ్చిన మామ కూతురు, అత్యంత సుందరమైన సుదామెకు ఆశపడక వదలి పెట్టిన ధనదత్తుడు అందరికంటే మంచి వాడని చెప్పాడు. కట్టెలు తేవడానికెళ్ళిన నాల్గవ భటుడు దీనారాల మూటను నిజంగాదొంగలించినవాడు, పెళ్ళికూతురు ధరించిన ఆభరణాల్ని దోచుకోక

పంపించిన దొంగ మంచివాడని అన్నాడు. వాడే నిజమైన దొంగనే విషయం సుదామెకు తెలిసిపోయింది. తరువాత అందరూ నిద్రపోయారు. సుదామె ఆ దొంగను లేపింది. ఏకాంతంగా వానితో ''నువ్వంటే నాకు చాలా ఇష్టం. నాకు చాలా ఆభరణాల్ని చేయించేటట్టయితే నీ భార్యగా ఉండిపోతానని'' వాడు నమ్మే విధంగా కపటమాడింది. వాడు దాచుకొని ఉన్న వెయ్యి దీనారాల పొట్లాన్ని బయటకు తీసి, ''నేను వీటితో నీకు కావల్సిన నగల్ని చేయిస్తాను, రా, వెళ్దాం'' అన్నాడు. సుమతి 'అలానే కానీ' అని పొట్లాన్ని తీసుకొని వెళ్ళి నిద్రిస్తూ వున్న తండ్రికి దీనారాల పొట్లాన్ని దొంగను అప్పజెప్పింది.''

వైనయికుడు చెబుతున్న బొమ్మల కథల్లో మొదటి కథను చెప్పిన సోమశర్మ, నాగశ్రీకి మిగిలిన కథల్ని ఇలా చెప్పాడు:

వైనాకుని కథ: ధర్మపురం అనే పట్టణంలో నాగదత్తుడు అనే శెట్టి ఉండేవాడు. వాడి బంటు వైనాకుడు. ఒకరోజు వైనాకుడు చెరకు పొలాన్ని దున్నుతుండగా ఎక్కువగా సంపద దొరికింది. ఈ విషయంఎవరికి చెప్పకూడదని వాడు ఆలోచించి, పెళ్ళాన్ని పరీక్షించేందుకు గర్భం ధరించిన వాడిలా నటించాడు. వాడి పెళ్ళాం, ''ఇదేమిటి మీ పొట్ట ఇలా ఉంది?'' అని అడగ్గా ''నీ కెందుకా విషయం ఊరకుండు'' అని అన్నాడు. ఆమె మళ్ళీ మళ్ళీ అడగడానికి ప్రారంభించడంతో, ''ఎవరకీ చెప్పకపోతే నీకు చెబుతాను. మగవాళ్ళకి కానిది నాకు అయిపోయింది'' అని అన్నాడు. ఈ విషయాన్ని విన్న వాడి భార్య తనలో దాచుకోలేక ఊరికంతా ఆ మాటని తెలియజేసింది.

మూడవ కథ: గంభీర అనే ముసలమ్మ కథను సోమశర్మ చెప్పాడు:

గంభీరకథ: ''హరిపురి అనే పట్టణంలోగంభీర అనే ముసలమ్మ ఉండేది. ఆమె కూతురు పేరు హరిణి. ఆమెను జయంత పట్టణంలోని వసుదత్తుడు అనే వర్తకునికిచ్చి వివాహం చేసింది. హరిణి గర్భం దాల్చింది. కుడుములు తినాలని ఆమెకు ఆశ కలిగింది. గంభీర కూతురు కోసం కుడుములు, లడ్లు మొదలైన తినుభండారాల్ని చేసుకొని కూతురు ఇంటికి బయలుదేరింది. ముసలమ్మకు దార్లో ఎనిమిదిమంది దొంగలు కనిపించారు. వాళ్ళకు సరిగ్గా గుణపాఠం నేర్పించాలని ముసలమ్మ అనుకొని, దొంగల్లో ఒకణ్ణి చూసి జోరుగా ఏడ్వడం మొదలుపెట్టింది.

''నా కొడుకు నీలాగే ఉండేవాడు. పన్నెండేళ్ళ క్రితం ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. ఎక్కడికెళ్ళాడో తెలియడం లేదు. వాడికోసం రాత్రి-పగలు ఏడ్చి ఏడ్చి కళ్ళు ఉబ్బుకున్నాయి. బాబూ! నిన్నుచూసి వాడిని చూసినంత సంతోషమయింది. మీరందరూ నాతో రండి. ఇక్కడే కొద్దిదూరంలో ఉన్న మా ఇంట్లో స్నానం చేసి, భోంచేసి, కొద్దిగా విశ్రాంతి తీసుకు వెళ్ళరుగానీ'' అని ఆ ముసలమ్మ వాళ్ళను తీసుకొని కూతురు ఇంటికెళ్ళింది. వాళ్ళందరికి నీళ్ళుపోసి, తలకు నూనె పూసి, తుండుబట్టలు కట్టించి, తలపై సలసల కాగుతున్న గంజిని వాళ్ళ మీద పోసింది. ఇంటి మీదకు ఎక్కి ''దొంగలు, దొంగలు'' అని కేకలు పెట్టింది. ఆ ఎనిమిది దొంగలు భయంతో వణుకుతూ పడుతూ లేస్తూ వెనక్కు చూడక పరిగెత్తారు. ''ముసలిది మనకు మోసం చేసింది. భరతం పట్టాలని'' అనుకొన్నారు.

''ఆ రోజు రాత్రి దొంగలు తప్పక వస్తారని ముసలమ్మ ఊహించింది. పదునైన ఒక కత్తిని సిద్ధం చేసుకొని ఉంచుకొంది. ఆ రోజు రాత్రి ఆమె అనుకొన్న విధంగానే వచ్చారు. ఆమె పడుకొన్న గదికి కన్నం వేశారు. ఒక దొంగ గదిలో దూకడానికి కన్నంలో తల పెట్టగానే గంభీర వాడి ముక్కును చరచరా కోసి వేసింది. వాడు తలను వెనక్కి తీసుకొని ఇంకొకడితో ''నా తల పట్టడం లేదు నువ్వు దూరు'' అని అన్నాడు. వాడు దూరడానికి ప్రయత్నించగానే వాడి ముక్కుకు కూడా అదే గతి పట్టింది. ఇలా అందరు ముక్కులు కోయించుకొని, విఫలులై వెనక్కి తిరిగారు. తరువాత ఒక మంత్రవాది ఇంటికి కన్నం వేసి, పెట్టెను దొంగలించి శ్మశానంలో పెట్టి, ఒక గొర్రెను దొంగలించి తీసుకొచ్చి విశ్రమించారు. అందులో ఒకడు గొర్రెను చంపి మాంసాన్ని ఉడికిస్తున్నాడు. వాడికి పెట్టెను తీసి చూడాలనిపించింది. పెట్టె మూతను తీయగానే అందులో ఇంద్రజాలం బొమ్మలు, వస్త్రాలు, ముఖానికి వేసుకొనే తొడుగులు కనిపించాయి. వాడు కుతూహలంతో పులిచర్మంలాంటి వస్త్రాన్ని ధరించి, ఒక భయంకరమైన తొడుగును ముఖానికి వేసుకొని ధగధగ మండే జ్వాలల పక్కలో నిలుచున్నాడు. అంతలో నిద్రలేచిన ఏడుగురు దొంగలు వాడిని చూసి, 'భేతాళుడొచ్చాడు' అని భయంతో అరుస్తూ పరిగెత్తడం మొదలు పెట్టారు. తాను ఉడికించిన మాంసాన్ని చేత పట్టుకొని వీడు కూడా వాళ్ళను వెంబడించాడు. ఏడుగురూ ప్రాణభయంతో పడుతూ లేస్తూ పరిగెత్తుతుండగా, వీడు ముఖానికి వేసుకొన్న తొడుగును తీసి, పులివేషం బట్టల్ని తీసి వాళ్ళకు ధైర్యం చెప్పాడు. తరువాత అందరూ కూర్చొని మాంసాన్ని తిని అక్కడినుంచి ముందుకు వెళ్ళారు.

ఇక్కడ, ముసలమ్మ ఉదయాన్నే లేచి తన ఊరికి బయల్దేరింది. దారి మధ్యలో రాత్రయింది. చీకటికి భయపడి దార్లో ఉన్న ఒక మర్రిచెట్టు ఎక్కి కూర్చుంది. ఎనిమిదిమంది దొంగలు అక్కడికొచ్చి నిల్చున్నారు. ఎవరైనా ఆ దార్లో వస్తున్నారో లేదో తెలుసుకోవడానికి ఒకడు ఆ చెట్టు చివరకు ఎక్కాడు. అక్కడ కూర్చున్న ముసలమ్మను చూసి, ''నువ్వెవరు''? అని అడిగాడు. ''నేను ఈ చెట్టులో ఉండే వృక్షదేవతను'' అంది ముసలమ్మ. ''నా భార్యగా ఉంటావా?'' అని దొంగ అడగ్గా, ''ఈ మాంసం ముక్కను నీ నాలుక మీద ఉంచుకొని నా నోట్లో పెట్టేటట్లయితే నిన్ను పెండ్లాడుతాను'' అంది. అలాగే అంటూ దొంగ మాంసం ముక్కను నాలుకమీద ఉంచుకొని ముసలమ్మ నోట్లో పెట్టగానే, ఆమె సరుక్కున వాడి నాలుకను కొరికి వేసింది. వాడు గట్టిగా అరుస్తూ చెట్టు చివరినుండి కిందకు పడ్డాడు. వాడు పడడంతో మిగిలిన వాళ్ళు కూడా భయపడి పడుతూ లేస్తూ పరిగెత్తారు. అలా పరిగెడుతున్న వాళ్ళకు ముసలమ్మ అరచి చెప్పింది. ''మీరు దొంగలించిన వాటిలో ఎనిమిదింట ఒక భాగాన్ని ఈ చెట్టు సందులో ఉంచితే బతుకుతారు. లేకుంటే మరుక్షణమే మిమ్మల్ని తినేస్తాను, చూసుకోండి'' అంది. దొంగలు భయపడి ఆ రోజునుండి తాము దొంగిలించిన దాంట్లో ఎనిమిదింట ఒక భాగాన్ని తీసుకొచ్చి, ఆ చెట్టు సందులో ఉంచేవారు. ముసలమ్మ రోజూ తన ఊరినుండి అక్కడకి వచ్చి వాటిని తీసుకెళ్ళి సుఖంగా కాలం గడిపేది. ఇలా ముసలమ్మ ఎనిమిదిమంది దొంగల్ని తన వశంలో పెట్టుకొంది.

ఇలా కన్య, బంటు, ముసలమ్మ కథల్ని చెబుతూ, ఆ కథల బొమ్మల్ని గీచి చూపెడుతూ, ఆ సమయంలో వైనయికుడు అనబడే ఈ దొంగ ధాన్యాన్ని దొంగిలించేవాడు. వైకడు అనబడే వీడి సహాయకుడు మాటల్ని ఆసక్తితో వింటున్న ప్రజల ధాన్యాన్ని అరవై బల్లలకు బదులు ఇరవై బల్లలని కొలిచి మోసం చేసేవాడు. మూడవవాడు వ్యోమకుడు. వీడు భూమిలో రంధ్రం చేసి పైన పెద్దరాశిలా ధాన్యాన్ని పోసి అది ఇతరులకు అమ్మబడిన తరువాత రంధ్రం ద్వారా నేలలోపలి భాగంలోకి కొంతధాన్యం వెళ్ళిపోయేలా చేసేవాడు. ఇలా ముగ్గురు ఒకటై ప్రజలను మోసం చేసేవారు. ఒకరోజు కౌశల అనే గ్రామంగౌడు జగద్భుహ అనే అతను తన ధాన్యాన్ని అమ్మడానికి చంపానగరానికి తీసుకురాగా వీళ్ళ మోసం బట్టబయలయింది. రాజుకు ఫిర్యాదు చేశాడు. దొంగతనం, మోసం అనే అపరాధాల్ని చేశారని వెంటనే వీళ్ళను చంపడానికి రాజు ఆజ్ఞాపించాడు. అందుకోసం వీళ్ళను ఊడ్చుకెళ్ళుతున్నారు''.

నాగశ్రీ ఈ కథల్ని విన్న పిమ్మట ''ఇలాంటి దుఃఖం నాకు రాకుండా ఉండేందుకు దొంగతనం, మోసం అనే అపరాధాల్ని చేయక ఉండేందుకు తోడ్పడే ఈ రెండు వ్రతాల్ని స్వీకరించాను. నాన్న అవి అలానే ఉండనీ'' అని అంది. సోమశర్మ ''అమ్మాయ్ అలానే కానివ్వు'' అని ముందుకు వెళ్ళాడు. కొద్దిదూరం వెళ్ళగానే దార్లో ఆలుమగలు ఇద్దరి చేతుల్ని వెనక్కి విరచికట్టి లాక్కొని వెళ్ళు తుండడాన్ని వాళ్ళు చూశారు. ''ఏ తప్పు చేయడం వల్ల వీళ్ళకు ఈ శిక్ష'' తెలుసుకురా నాన్న'' అని అన్న నాగశ్రీతో, ఆ వృత్తాంతాన్ని విని వచ్చిన సోమశర్మ ఇలా అన్నాడు.

''చంపా నగర సమీపంలో శ్వేతపురం అనే పట్టణం. అక్కడ మత్స్య అనే వర్తకుడు ఉండేవాడు. అతడి భార్య జైస. వారి మగపిల్లల పేర్లు నంద, బోద. ఆ ఊళ్ళోనే ఉంటున్న సూరదత్తుడు అనే వర్తకుని భార్య వసుదత్త. వీరిద్దరి ఏకైక కుమార్తె పేరు మోదాళి. ఆమె గర్భంలో ఉండగానే మేనమామ కొడుకైన నంద అనేవాడితో వివాహం చేయాలని నిశ్చయం చేశారు. కాలం దొర్లింది. నంద పెద్దవాడై ధనార్జనకై సువర్ణదీపానికి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు 'పండ్రెండు సంవత్సరాల లోగా నేను తిరిగి రాకపోతే నా తమ్ముడితో మోదాళి వివాహం జరిపించండి' అని చెప్పి వెళ్ళాడు. పండ్రెండేళ్ళు గడిచాయి. నంద రాలేదు. మోదాళిని బోదడికిచ్చి వివాహం చేయడానికి ఏర్పాట్లు జరిగాయి. కన్యాదాన సమయంలో నంద వచ్చేశాడు. ''ఇప్పుడు ఈమె నా తమ్ముడి భార్య, నాకొద్దు' అని నంద అన్నాడు. ''ఎక్కడైనా ఉందా? ఈమె నా అన్న భార్య, నాకొద్దు అని బోదడు కూడా చెప్పేశాడు. ఇలా ఇద్దరూ తిరస్కరించడం వల్ల మోదాళి పుట్టింట్లోనే ఉండిపోయింది. అదే గ్రామంలో ఉంటున్న నాగదత్తుడు అనే వర్తకుని భార్య గంగ. వీరి కొడుకు నాగసూరుడు. వీడికి ఎనిమిది మంది భార్యలు. అయినప్పటికీ వాళ్ళతో వాడు సంతోషించక మోదాళితో రహస్య ప్రణయం సాగిస్తూ వచ్చాడు. ఒకరోజు వాడు ఆమెతో చంపానగరానికి రాగా, తలారి వాళ్ళను పట్టుకొని రాజుముందు నిలబెట్టాడు. అక్రమ సంబంధం కలిగి ఉన్న వీళ్ళిద్దరు ఎర్రగా కాల్చబడిన ఇనుప ప్రతిమల్ని ఆలింగనం చేసుకోవాలని రాజు ఆజ్ఞాపించాడు. అందుకని వీళ్ళను లాక్కెళ్ళుతున్నారు.''

ఈ వృత్తాంతాన్ని విన్న నాగశ్రీ ''అందుకే నేను పరపురుషులతో మాట్లాడ కూడదనే వ్రతాన్ని స్వీకరించాను నాన్న'' అంది. ''అలా అయితే ఆ వ్రతాన్ని నువ్వు అలానే ఉంచుకో'' అని అన్న సోమశర్మ ముందుకెళ్ళాడు. కొద్ది

దూరంలోనే మరొకణ్ణి చంపడానికి తీసుకొని వెళ్ళుతుండడాన్ని వాళ్ళు చూశారు. సోమశర్మ వాని వృత్తాంతాన్ని తెలుసుకొని వచ్చి నాగశ్రీతో ఇలా అన్నాడు.

''వీడు రాజుగారి పశువుల కాపరి. వీడి పేరు వీరపూర్ణుడు. ఒకరోజు రాజుగారు చాలా సంతోషంతో తన ఆవుల మందలోని అత్యుత్తమైన పది ఆవుల్ని, మూడువేల బల్లల ధాన్యాన్ని వీడికి బహుమానంగా ఇచ్చాడు. దీన్ని ఉపయోగించు కొన్న వీరపూర్ణుడు సామంతులు, నియోగులు మొదలైన వాళ్ళ దగ్గరున్న అత్యుత్తమైన ఆవుల్ని, ఎనుముల్ని లాక్కొని రాజు వీటిని తనకు ఇచ్చాడంటూ అనుభవించ సాగాడు. అంతేగాక పట్టణంలోని ప్రజల గోవుల్ని రాజు గోవులమందలోకి తోలి, తర్వాత వీడు వాటిని తనవిగా చేసుకొని అనుభవించసాగాడు. ఇలా ఉండగా ఒకరోజు వీరపూర్ణుడు మహారాణికి చేరిన అత్యుత్తమైనకామధేనువును తనవశం చేసుకోగా రాణి మహారాజుతో ఫిర్యాదు చేసింది. రాజుగారు విచారణ జరిపారు. సామంతులు, నియోగులు, పట్టణ ప్రజలు అందరు తనకు జరిగిన అన్యాయాన్ని రాజుతో చెప్పుకొన్నారు. రాజుగారికి పట్టరానంత కోపం వచ్చింది. 'వీడు మహాలోభి. నేనిచ్చిన దానితో తృప్తిపడక ప్రజల గోవుల్ని కూడా లాక్కొంటున్నాడు. ఈ క్షణమే వీడిని చంపండి' అని ఆజ్ఞాపించాడు. అందువల్ల వీడిని శూలం మీద తోసి చంపడానికి లాక్కెళ్ళుతున్నారు.''

నాగశ్రీ అంది. ''అందువల్లనే నేను చంపని, తప్పు చెప్పని, దొంగిలించని, ఉన్నదాన్తో తృప్తిపడే, పరిమితంగా పరిగ్రహించే వ్రతాల్ని ఋషుల నుండి స్వీకరించాను నాన్న. ఈ ఐదు అణువ్రతాల్ని త్యజిస్తే నేను ఆ ఐదు పాపాల్ని చేయాల్సి వస్తుంది.

సోమశర్మ అన్నాడు: ''అమ్మాయ్! అలా అయితే నువ్వు ఈ ఐదు వ్రతాల్ని ఉంచుకో. దృఢ సంకల్పంతో ఈ వ్రతాల్ని ఆచరించి సిద్ధిని పొందు. అయినప్పటికి ఆ సిగ్గులేని జైనమునిని కొద్దిగా తిట్టివద్దాంరా.''

నాగశ్రీ, సోమశర్మ నాగాలయానికి వచ్చారు. సూర్యమిత్రుడు, అగ్నిభూతి ఋషుల్ని చూసిన సోమశర్మ, దూరంగా నిలబడి కోపంతో గర్జిస్తూ అన్నాడు: ''అరే తపస్వి, నా కూతురుకి మీ వ్రతాల్ని ఎందుకిచ్చావ్?''

''ఆమె మీ కుమార్తె ఎలా అవుతుంది? మా కూతురికి మా వ్రతాల్ని మేము ఇస్తే మీకెందుకు బాధ? నాగశ్రీ నువ్వు ఇలారా' అన్నారు సూర్యమిత్ర

భట్టారకులు. ఆమె వెళ్ళి ఇద్దరి కాళ్ళకు నమస్కరించి వారి పక్కన కూర్చోగానే, సోమశర్మ నిశ్చేష్టుడయ్యాడు. ''బ్రాహ్మణుడా! వెళ్ళు వెళ్ళు, వెళ్ళి రాజుతో చెప్పుకో'' అని భట్టారకుడు అనగానే, సోమశర్మ ఒక ఆకుల కట్టను చేతపట్టి ''అబ్రహ్మణ్య, అబ్రహ్మణ్య'' అని అరుస్తూ, రాజభవనానికెళ్ళి, చంద్రవాహన రాజుతో మొరపెట్టుకొన్నాడు. ''మహారాజా! జైన మునులు నన్ను మోసం చేశారు. నా కూతురు నాగశ్రీని వాళ్ళు తన కూతురని అంటున్నారు. వారు నా కూతుర్ని లేవతీసుక పోకముందే అక్కడకు వెళ్దాం రండి'' అన్నాడు. రాజు, అతని పరివారం, సోమశర్మ నాగాలయానికి వచ్చారు. ఊళ్ళోని ప్రజలందరూ అక్కడ గుముగూడారు.

అక్కడ చేరిన ప్రజా సమూహం మధ్య చంద్రవాహన రాజు విషయమేమిటని సూర్యమిత్రుడు, అగ్నిభూతి మునుల్ని అడిగాడు. సూర్యమిత్రుడు ''ఈ పాప మా అమ్మాయి'' అని అన్నాడు.

''అసలు కాదు. ఈమె నా కూతురు. నాగదేవత ఆశీర్వాదఫలంగా పుట్టిన బిడ్డ ఈమె'' అని అన్నాడు సోమశర్మ.

''నీ కూతురయితే ఈమెకు నాలుగు వేదాలు, ఆరు అంగాలు, పద్దెనిమిది ధర్మశాస్త్రాలు, మీమాంస, న్యాయశాస్త్రం, వ్యాకరణం, ప్రమాణం, కావ్యం, నాటకం, ఛందస్సు, అలంకారం, అభిదానం, సాముద్రికం, జ్యోతిష్య, మంత్రవాదం మొదలైన అన్ని శాస్త్రాల్ని నేర్పించావా?''

సోమశర్మ తొట్రుపాటు పడుతూ 'లేదు, లేదు' అన్నాడు.

''మేము చదివించాం. అందువల్ల ఈమె మా అమ్మాయి. కావాలంటే అడుగు. నాగశ్రీ మేము నేర్పించిన పాఠాల్ని వీరందరూ వినేలా చెప్పమ్మా'' అని సూర్యమిత్రుడు అన్నాడు.

నాగశ్రీ అలాగే అంటూ ఓంకారాన్ని ఉచ్చరించి, స్వరవర్ణ భేదంతో, పదక్రమ భేదంతో ఋగ్యజుసామాథర్వణ వేదాల్ని శతసూత్రాలు మొదలైన వాటిని యథాక్రమంగా చెప్పింది. పద్దెనిమిది పురాణాలు, పద్దెనిమిది ధర్మశాస్త్రాలు, మీమాంస, న్యాయసూత్రాలు మొదలైన వాటిని క్రియాకారక సంబంధంతో వ్యాఖ్యానించింది. విన్న రాజు, గుమిగూడిన ప్రజలు, పండితులు ఆశ్చర్య చకితులయ్యారు. 'ఈ అమ్మాయి ఇన్ని శాస్త్రాల్ని ఎలా అభ్యసించింది? ఈ

రహస్యాన్ని మాకు తెలియజేయండి భట్టారకా' అని రాజు అడిగాడు. అపుడు సూర్యమిత్రాచార్యులు ఇలా అన్నారు. ''ఇదిగో ఇక్కడున్న ఈ ఋషుల సహోదరుడు వాయుభూతిని మేము చదివించాము. మాపై ఉన్న దురాగ్రహ కారణంగా వాయుభూతి మరణించి గాడిదగా, పందిగా, కుక్కగా హరిజన బాలికగా ఉన్న ఈ జీవం అగ్నిభూతి ఋషుల ధర్మోపదేశం వల్ల వ్రతాల్ని స్వీకరించి నాగశ్రీగా పుట్టాడని' అన్నారు. మిథ్యాత్వ కషాయ సంయమకారణంగా జీవులు సంసార సముద్రంలో ఈదుతుంటాయనే ధర్మోపదేశాన్ని చేశారు. దీన్ని విన్న చంద్రవాహన రాజుకు జీవితం పై విరక్తి కలిగి, తన కుమారునికి రాజ్యాన్ని అప్పజెప్పి, అనేక రాజుపుత్రులతో ఋషుల దగ్గర దీక్ష తీసుకొని తపస్సు చేయడం మొదలు పెట్టాడు. కొద్దిమంది శ్రావక వ్రతాల్ని కొద్దిమంది సన్యాసాన్ని స్వీకరించారు. సోమశర్మకు జ్ఞానోదయం అయింది. ఆయన కూడ తపస్సు చేయడం మొదలుపెట్టాడు. నాగశ్రీ, ఆమె తల్లి త్రివేది కూడా బ్రహ్మిలె అనే ఋషి దగ్గర దీక్ష తీసుకొని తపస్సు చేయడం ప్రారంభించారు.

కొద్దికాలం తర్వాత సూర్యమిత్ర భట్టారకుడు, అగ్నిభూతి ఋషి అగ్ర మందిరమనే పర్వతంలో మోక్షం పొందారు. సోమశర్మ ఋషి ఉగ్రమైన తపస్సు ఆచరించి, సంన్యసనవిధితో దేహత్యాగం చేసి, అచ్యుత కల్పంలో ఇరవైరెండు సాగరకాలాల ఆయుస్సు పొందిన సామానిక దేవుడుగా పుట్టారు. నాగశ్రీ భుక్త ప్రత్యాఖ్యానిక విధితో రత్నత్రయాన్ని సాధించి అచ్యుతకల్పంలో దేవుడుగా పుట్టింది. త్రివేది, ముందు జన్మలో నాగశ్రీ నాకు కొడుకుగా పుట్టాలని సంకల్పించుకొని మరణించి స్వర్గంలో దేవుడుగా పుట్టింది. వీరిద్దరికి ఇరవైరెండు సాగార కాలాల ఆయుస్సు లభించింది.

పిమ్మట సోమశర్మగా ఉండిన దేవుడు కొద్దికాలం దేవలోకంలోని భోగాల్ని అనుభవించి వచ్చి, జంబూద్వీపం దక్షిణ భరత క్షేత్రం అవంతిదేశం ఉజ్జయిని నగరంలోని ఇంద్రదత్తుడు గుణమతి అనే వర్తక దంపతుల కొడుకు సూర్యదత్తుడుగా జన్మించాడు. అదే నగరంలో ముప్పైరెండు కోట్ల బంగారు నాణేలకు అధిపతి అయిన సుభద్రుడు అతని భార్య సర్వమతి అనే వర్తక దంపతుల కూతురుగా, అచ్యుత కల్పంలో దేవుడుగా ఉండిన త్రివేది యశోభద్ర అనే పేరుతో కూతురుగా జన్మించింది. సూర్యదత్తునికి యశోభద్రకు వివాహమై వారికి నాగశ్రీగా ఉన్న దేవుడు సుకుమార స్వామి అనే పేరుతో కొడుకుగా జన్మించాడు.

సుకుమారస్వామి పెరిగి పెద్దవాడయ్యాక అత్యంత రూపలావణ్యంతో పాటు సౌభాగ్య తేజస్సుతో ప్రకాశిస్తుండేవాడు. సుకుమారస్వామి పుట్టినరోజే అతని తండ్రికి వైరాగ్యం కలిగి, కొడుక్కి శెట్టి పట్టాన్ని కట్టి తపస్సుకి వెళ్ళిపోయాడు. సుకుమార స్వామికి ముప్పైరెండు మేడలు, అత్యంత రూప లావణ్య, సౌభాగ్య కాంతి, హావభావాలు, విలాసం, విభ్రమాలు కలిగిన ముప్పైరెండుమంది భార్యలు, ముప్పై రెండు రకాల నాటకాలు, ముప్పైరెండు కోటి బంగారు - పంచరత్నాలు కలిగి అత్యంత వైభవంగా జీవితాన్ని గడిపేవాడు.

ఇలా ఉండగా ఒకరోజు ఒక జ్యోతిష్కుడు వచ్చి, సుకుమారుడు ఋషి రూపాన్ని ఎప్పుడు చూస్తాడో ఆ రోజే జీవితం మీద విరక్తి పుట్టి తపస్సుకు వెళ్ళిపోతాడని చెప్పాడు.

ఈ విషయం విన్న సుకుమారుని తల్లి ఆందోళన చెంది తన ఇంట్లోకి ఋషులు కాలుపెట్టకుండేలా కాపలావాళ్ళను ఉంచి హెచ్చరిక వహించింది. కాలం గడిచింది. ఒకరోజు రత్నద్వీపం నుండి ఒక వర్తకుడు లక్షదీనారాలు విలువచేసే ఎనిమిది రత్న కంబళ్ళను అమ్మడానికి వచ్చాడు. ఆ ఊరి రాజు వృషభాంకుడు తన భార్య జ్యోతిర్మాలకు వాటిని తీసివ్వడానికి వెల అడిగాడు. రత్నకంబళి వెల లక్ష దీనారాలని వర్తకుడు చెప్పగా విని, రాజు కొనలేక వర్తకుని వెళ్ళిపొమ్మని చెప్పాడు. వర్తకుడు ఊరంతా తిరిగినప్పటికి ఆ రత్నకంబళ్ళను ఎవ్వరూ కొనలేకపోయారు. వర్తకుడు వాటిని యశోభద్రకు చూపించగా, ఆమె లక్షదీనారాల్ని ఇచ్చి కొనుక్కొని, ఒక్కొక్కదాన్ని నాలుగు భాగాలుగా చేసి తన ముప్పైరెండుమంది కోడళ్ళకు ఇచ్చింది. ఆ కోడళ్ళు వాటిని తమ చెప్పులకు కట్టించుకున్నారు. ఈ విషయం రాజుకు తెలిసి చాలా ఆశ్చర్యపడ్డాడు. వారి వైభవాన్ని చూడాలని రాజుకు అనిపించి ఒకరోజు వాళ్ళకు కబురంపాడు. యశోభద్ర రాజు వచ్చే దార్లో పంచరత్నాలతో ముగ్గులు వేయించి, రకరకాల పట్టు వస్త్రాల్ని పరిపించి, బంగారు రత్నాల ముత్యాల తోరణాలు కట్టించింది.

రాజు వచ్చాడు. దేవేంద్రుని రాజభవనంలా ఉన్న సుకుమారుని మేడను ప్రవేశించాడు. రాజుకు దేవలోకంలో ప్రవేశించినట్లయింది. మహావైభవంతో శయ్యాతల్పం మీద కూర్చొని సుకుమారుడెక్కడని విచారించాడు. ''అయ్యా, వాడు చాలా మృదుస్వభావం కలవాడు. తమరు వచ్చిన విషయం వాడికి తెలియదు.

మేడమీదున్నాడు'' అంది యశోభద్ర. పిలిపించండని రాజు అన్నాడు. యశోభద్ర మేడమీదున్న కొడుకు దగ్గరకెళ్ళి 'నాయనా! రాజుగారు వచ్చారు. రా వెళ్దాం' అని పిలిచింది. ముగ్ధ సుకుమారుడు రాజంటే ఎవరని ప్రశ్నించగా, మనల్ని 'పరిపాలించేవారని' యశోభద్ర సమాధానమివ్వగా విన్న సుకుమారుడు ఆశ్చర్యంతో 'మనల్ని పాలించే వారు కూడా ఉన్నారా?' అని ప్రశ్నించి తల్లి మాట కాదనలేక కిందకు దిగివచ్చాడు. వాణ్ణి చూసిన రాజుకు కళ్ళు ఉన్నందుకు ఇప్పుడు సార్థకమయ్యాయని పించింది. ప్రత్యక్ష కామధేనువును ఆలింగనం చేసుకొన్నట్లు సుకుమారుని ఆలింగనం చేసుకొని రాజు తన ప్రక్కన కూర్చోపెట్టుకొన్నాడు. సుకుమారుని పరివారం హారతి పట్టి, సేస పెట్టారు. సేస పెట్టగా ఆసనంపై పడ్డ అక్షితలు కొద్దిగా ఒత్తుతుండగా సుకుమారుడు కూర్చోవడానికి ఇబ్బంది పడ్డాడు. గాజు వెలుగుకు తట్టుకోలేక కన్నీళ్ళు వచ్చాయి. వీటన్నిటిని గమనించిన రాజు సుకుమారునికి ఏదో రోగముందని అనుకున్నాడు. రాజును స్నానానికి తీసుకెళ్ళగా ఆయన రత్నఖచిత స్నానగృహంలో స్నానం చేశాడు. ఇలా స్నానం చేస్తుండగా రాజుగారి మాణిక్యపుటుంగరం చేజారి కిందపడింది. దాని వెదకడానికని రాజుగారు నీళ్ళున్న గండిని తెరవగా ఇంద్రుని భండారాన్ని తెరచినట్లనిపించింది. నానారత్న ఖచిత ఆభరణాల రాశి కనిపించింది. రాజుగారు మహాశ్చర్యాన్నుంచి తేరుకొనేలోపే భోజనానికి రమ్మన్నారు. రాజుగారు, సుకుమారుడు భోజనానికి కూర్చున్నారు. రకరకాల వంటకాలను రాజుగారు సంతోషంతో తింటూ ఉండగా సుకుమారుడు సగం ఆహారాన్ని మింగుతూ, మిగిలిన సగాన్ని ఉమ్మేశేవాడు. దీన్ని గమనించిన రాజుగారు ఇదికూడా ఏదో ఒక వ్యాధి అనుకున్నాడు. భోజనమయిన పిమ్మట గంధ-తాంబూలాలు, పుష్ప-వస్త్రాభరణాల్ని రాజుగారికి సమర్పించారు. రాజు వాటిని స్వీకరించి యశోభద్రతో మాట్లాడుతూ ''అమ్మా ఈ తమ్ముడి నడుం నొప్పికి, కన్నీళ్ళు కారడానికి, అరుచికి ఎందుకు ఔషదం ఇప్పించలేదు?'' అని అడిగాడు. అందుకు యశోభద్ర ''దేవా, వీడికి ఇదేది వ్యాధి కాదు. సేసపెట్టినప్పుడు పడిన అక్షింతలు కింద ఒత్తుకోవడంవల్ల సహించలేకపోయాడు. ఎప్పుడు మాణిక్యాల కాంతుల వెలుతుర్లో ఉండడంవల్ల గాజు వెలుతురుకు తట్టుకోలేక కంట్లో నీళ్ళు వచ్చాయి. అంతేగాక తామరపూవుల పరిమళాన్ని కట్టినటువంటి బియ్యంతో చేసిన అన్నాన్ని ఎప్పుడూ భోంచేసేవాడు. మీరు వచ్చారని వేరే బియ్యాన్ని కలిపి అన్నం చేశారు. అందువల్ల పరిమళం ఉన్న బియ్యం మెతుకుల్ని

తిని మిగిలిన వాటిని ఉమ్మేశాడు. అంతేకానీ వేరేం కాదు'' అంది. దీన్ని విన్న రాజుకు సుకుమారుని క్షణకాలం భోగానికి, సుఖానికి తన జీవితం పూర్తి రాజరిక, భోగ వైభోగాలు సాటికావనిపించింది. ''ఈ లోకంలో ఇతడే పరమసుఖి'' అని చాలా సంతోషించి అతన్ని 'అవంతి సుకుమారుడు' అని పిల్చాడు. యశోభద్ర అనేక వస్తువాహనాల్ని రాజుకు బహుమానంగా ఇచ్చి పంపింది.

కాలం గడిచింది. వెనుక యశోభద్ర సోదరుడైన దయాభద్రుడు అనే ఋషి దగ్గర ధర్మమార్గాన్ని గురించి విన్న సూరదత్తుడు, వైరాగ్యం కలగగా సుకుమారుడు పుట్టగానే తపస్సుకు వెళ్ళిపోయాడు. సుకుమారుడు ఆ ఋషిని చూచిన వెంటనే తపస్సుకు వెళ్ళిపోతాడని జ్యోతిష్యులు సెలవిచ్చారు. ఇప్పుడు అప్పటి ఆ దయాభద్ర ఋషి గ్రామాలు, నగరాలు పర్వతాలు, కొండలు, నదుల, పట్టణాలను సందర్శించి, సుకుమారుని ఆయుస్సు ఇంకా నాల్గు నెలలు, ఐదురోజులు మిగిలి ఉండే సమయానికి, అతనికి ఉపకారం చేయడానికని ఉజ్జయిని నగరానికి వచ్చారు. సుకుమారుని మేడకు సమీపంలోగల నందనవనంలో ఉన్న జైనాలయంలో ఆషాడమాసం, చతుర్దశి రోజు ఉదయాన యోగదీక్షలో కూర్చున్నారు. వనపాలకుల ద్వారా ఈ విషయం తెలుసుకున్న యశోభద్ర అక్కడకి వచ్చి ఋషులకు నమస్కరించి ఇలా అంది. ''భట్టారా, ఇక్కడికెందుకు వచ్చారు? ఈ ఊళ్ళో వేరేచోట్ల జైనాలయాలు లేవా?''.

''అమ్మా, చాలా దూరం నుండి నడచిరావడం వల్ల ఎక్కువ శ్రమ కలగడంతో యోగదీక్షకు సమయం ఆసన్నం కావడంవల్ల ఇక్కడే కూర్చున్నాను. వేరేవైపు వెళ్ళడానికి సాధ్యం కాలేదు'' అని దయాభద్ర ఋషి అన్నారు.

''అలా అయితే మీకు ఓ విన్నపం. నాల్గునెలలు ఏ విషయాన్ని గట్టిగా చెప్పక, మౌనంగా ఉంటూ, ఈ జైన దేవాలయం బయట తిరుగక లోపలే ఉంటూ, మీ యోగదీక్ష ముగిసిన వెంటనే వెళ్ళిపోండని'' యశోభద్ర విన్నవించుకుంది. దయాభద్ర ఋషి అందుకు సరే అన్నారు.

ఆషాడమాసం పోయి కార్తీకమాసం వచ్చింది. ఆ రోజు పౌర్ణమి. సర్వరోభద్ర అనబడే అతిసుందరమైన మేడలోని ఏడవ అంతస్తులో సుకుమారుడు సంతోషంగా నిద్రపోతున్నాడు. ఇటు దయాభద్ర ఋషి యోగదీక్ష కాలం పూర్తికావచ్చింది. యశోభద్రకు ప్రమాణం చేసినట్లుగా మౌనవ్రతం ఒప్పందం

కూడా పూర్తి కావచ్చింది. అప్పుడు ఆయన గంభీర స్వరంతో త్రిలోక ప్రజ్ఞప్తిని ఉచ్చరించారు. లోక విచారం, అచ్యుత కల్పం వర్ణన, ధర్మవిచారాల్ని వివరంగా, గట్టిగా చెప్పారు. సుకుమారునికి ఇవన్నీ వినిపించాయి. వెంటనే అతనికి జ్ఞానోదయమయింది. తాను ఎవరు? ఎక్కడపుట్టి ఎలా బతుకుతున్నాను? అనే విషయాలు క్షణమాత్రంలో స్ఫురించాయి. ''అయ్యో! సురలోక సుఖమనబనెడి నీటినంతటిని త్రాగి తృప్తిపడని తాను ఈ మనుష్య జన్మ సుఖమనబడే గడ్డిపోచ నీటి బిందువుకు తగులుకొని, మోక్షసుఖాన్ని ఇచ్చే ఉదాత్తమైన జీవితం నుండి వంచింపబడినానని'' సుకుమారుడు దుఃఖించాడు. తనను తానే నిందించుకొని, మంచం దిగి అక్కడున్న బట్టలన్నింటిని ఒకదానితో మరొకదానిని కట్టి, దాన్ని గవాక్షం ద్వారా కిందకు వదలి, దాన్ని పట్టుకొని కిందకు దిగి జైనాలయానికి వచ్చాడు. దేవునికి నమస్కరించి, దయాభద్ర ఋషి పాదాలపై పడి ''దీక్షను అనుగ్రహించి, సంసార సాగరం నుండి నన్ను ఉద్ధరించండని'' వేడుకొన్నాడు. దయాభద్రఋషి, ''నీకు ఇక మూడు రోజుల ఆయుస్సు మాత్రమే మిగిలి ఉందని'' అన్నారు. సుకుమారుడు ''ఈ నిస్సారమైన దేహాన్ని భరిస్తూ పవిత్రమైన తపస్సును చేసే భాగ్యాన్ని ఇన్ని రోజులు కోల్పోయాను. భట్టారకా! నిస్సారమైన విలాస జీవితంలో తగులుకొని, అమేధ్యంలో క్రీడించే పురుగులా కాలాన్ని గడుపుతూ వచ్చాను. ఇకనైనా కరుణించండి' అని తనను తాను నిందించుకొని ప్రాధేయపడ్డాడు. దయాభద్ర ఋషి పాదాల దగ్గర తపస్సు దీక్ష తీసుకొని, పంచమహా వ్రతాల్ని ధరించి, పడికమణాన్ని విని పిమ్మట సమ్యక్త్వాన్ని తీసుకొని అక్కడినుండి వెళ్ళిపోయాడు. మహాకాళ అనే ఆ ఊరి శ్మశానానికి వచ్చి, ప్రాణమున్నంతవరకు ఆహారం వద్దనే సంకల్పంతో, ప్రాయోపగమన విధానంతో ఒక చోట శవాసనంలో ఉంటూ ధర్మధ్యానాన్ని, శుక్ల ధ్యానాల్ని చేస్తూ ఉన్నారు.

అటు చాలా జన్మల వెనుక వాయుభూతికి వదిన అయిన సోమదత్త శపథం చేసి తన నలుగురు పిల్లలతో అనేక జన్మలు ఎత్తి ఇప్పుడు ఆడనక్కలా పుట్టింది. ఆ నక్క తన నాల్గు పిల్లలతో ఆహారం కోసం వెతుకుతూ వస్తూ ఉంది. సుకుమారస్వామి రత్నాలతో నిర్మితమైన నేలపై పరచబడిన పట్టువస్త్రంపై నడుస్తున్నవాడు శ్మశానానికి నడచి వచ్చేటప్పుడు అతని మృదువైన పాదాలకు రాళ్ళురప్పలు గుచ్చుకొని దారిపొడవునా రక్తం ధారల్లా కారి ఉండగా దాని వాసన చూస్తూ నక్కలు వెతుక్కుంటూ వచ్చాయి. ధ్యానంలో నిమగ్నుడయిన

సుకుమారస్వామిని చూసిన నక్కలు ఆయన రెండుకాళ్ళను మోకాళ్ళవరకు మొదటిరోజు తినేశాయి. రెండవరోజు మోకాళ్ళనుండి నడుం వరకు తిన్నాయి. మూడవరోజు పొట్టను చీల్చి పేగుల్ని పీకి తిన్నాయి. అయితే శుక్ల ధ్యానంలో నిమగ్నుడైన సుకుమారస్వామి ఉపశాంతగుణ స్థానంలో ఉంటూ రత్నత్రయాన్ని సాధించి సయసత్తమ దేవుడయ్యాడు.

ఇక్కడ సుకుమారుని తల్లి, భార్యలు రెండు పగళ్ళు, రెండు రాత్రులు ఎక్కడెక్కడో వెదికినప్పటికి అతడు కనిపించలేదు. మూడవరోజు సాయంకాలం దేవతలు వచ్చి 'అహో శూరుడా! అహో ధైర్యవంతుడా! అహో సంసారాన్ని త్యజించిన వాడా! నీలాగా ఉపసర్గాన్ని సహించి రత్నత్రయాన్ని సాధించినవారు ఇంతవరకు ఎవ్వరూ లేరు'' అని స్తుతించేటటువంటి శబ్దాన్ని, దేవదుందుభుల మ్రోతను విని దేవతల్ని చూసిన యశోభద్ర తన కుమారుని మరణవార్తను తెలుసుకుంది. ''సుకుమారుడు మీపై కోపగించుకొని ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలుసు. పదండి, మీరందరు బాగా అలంకరించుకొని బయలు దేరండి. మీ స్వామిని పిలుచుకు వస్తాము' అని కోడండ్లకు చెప్పి వారు అలంకరించుకు వచ్చిన పిమ్మట వాళ్ళను తీసుకొని మహాకాళ శ్మశానానికి వచ్చింది. అక్కడ దేవతలు, నమేరు మందారం, సంనానకం, పారిజాత పుష్పాల వర్షాన్ని కురిపించారు. తుమ్మెదలు వాలిన పుష్పాలను పక్కకు తీసి చూడగానే సుకుమారస్వామి మరణించి ఉండడాన్ని చూశారు. సుకుమారస్వామి రూపం, తేజస్సు, యవ్వనం, లావణ్యాం, సౌభాగ్యం, కీర్తి, వాక్ చాతుర్యం, ప్రేమ, ధైర్యం మొదలైన గుణాల్ని తలచి తలచి ఏడ్చారు. కన్నీరు కార్చారు. గర్భిణీలైన ఎనిమిదిమంది భార్యలు తప్ప మిగిలిన ఇరవైనాల్గుమంది భార్యలు, బంధు పరివారం యశోభద్ర దయాభద్ర గురువుగారి వద్ద కమళశ్రీ సన్యాసుల దగ్గర దీక్ష తీసుకొని ఉగ్రతపస్సు చేసి కాలం పరిపక్వం కాగానే వేరే వేరే కల్పాలలో పుట్టారు.

ఇలా ఊహించడానికి, సహించడానికి వీలుకాని తిరికోపసర్గాన్ని అవంతి సుకుమారస్వామి మూడు పగళ్ళు, రాత్రులు సహించి ఎలా రత్నత్రయాన్ని సాధించాడో, అలాగే సన్యాసాన్ని పుచ్చుకొన్న ఆరాధకులైన మహాపురుషులు అవంతి సుకుమారస్వామి ఉపసర్గాన్ని జయించిన తీరును మనస్సులో ఎప్పుడూ స్మరిస్తూ, రత్నత్రయాన్ని పొంది, బాహ్యాభ్యంతర పరిగ్రహాలను త్యజించి మోక్షసుఖాన్ని పొందనీ.

సుకుమారస్వామి మరణించిన స్థలం ఉజ్జయని దక్షిణప్రాంతం. అది ఇప్పటికీ పుణ్యప్రదేశమై, పవిత్ర ప్రదేశమై ఉంది. అతని శరీరాన్ని దేవతగల సమూహం సాంబ్రాణి, నల్లసాంబ్రాణి, గోశీర్షం, చందనం మొదలైన సుగంధ ద్రవ్యాలతో పూజించిన స్థలంలో ఆ వస్తువులు కాలక్రమేణా కరిగి గంధవతి అనే నది అయింది. దేవతలు పొగడిన, అతని భార్యలు రోదించిన కలకలారావం వల్ల అక్కడి ప్రదేశానికి కళకళాయత అనే పేరు వచ్చింది.

* * *

# 2. సుకౌశలస్వామి కథ

సిద్ధార్థుని ప్రియ పుత్రుడైన సుకౌశల స్వామిని మొగ్గళగిరి అనే పర్వతం మీద వెనుకటి జన్మలో తల్లిగా ఉండిన పెద్దపులి పీక్కొని తింటున్నప్పటికి ధర్మధ్యానాన్ని వదలక ఉత్తమగతిని పొందాడు.

జంబూ ద్వీపంలోని దక్షిణ భరతక్షేత్రంలో అంగము అనే గ్రామం. ఈ గ్రామానికి చంపానగరం పట్టణం. ఈ పట్టణాన్ని గంధభాజుడు అనే రాజు పాలిస్తుండేవాడు. ఇంద్రునితో సమానమైన భోగాన్ని ఐశ్వర్యాన్ని కలిగి, ప్రజల్ని తన కన్న బిడ్డలవలే పాలిస్తూ, సమ్యక్ దృష్టిని కలిగి, సమ్యగ్ దర్శనాన్ని పొంది, పరిశుద్ధుడై అత్యుత్తమమైన కర్మల్ని చేస్తూ, మంచి శీలానికి గుణానికి ఆధార భూతుడై, ప్రయత్నంలో ఆసక్తి కలిగి, గురుభక్తి, ప్రవచనంలో నేర్పరితనం, పాండిత్యం మొదలైన ఏడు గుణాల్ని కలిగి సుఖంగా ఉండేవాడు. శరత్కాలంలోని మేఘంలాంటి అతి సుందరమైన సహస్ర కోట జైనాలయాన్ని కట్టించి, అందులో ఎడతెగని మహాపూజల్ని, అభిషేకాల్ని చేయిస్తూ ఉండే వాడు. ఆ పట్టణంలో సాగరదత్తుడు, సుభద్ర అనే వైశ్య దంపతులు ఉండేవారు. వారి కుమార్తె పేరు సురూప. అదే పట్టణంలో నాగదత్తుడు అనే శెట్టి ఉండేవాడు. అతనికి సురూపనిచ్చి పెండ్లి చేశారు. వీరికి సుకేశిని అనే కుమార్తె జన్మించింది. సుకేశిని అత్యంత సుందర రూపలావణ్యాలతో, కాంతి సౌభాగ్యాలతో, హావభావాలతో , విలాస విభ్రమాలతో పాటు పెరిగింది. అనేక శుభ లక్షణాలను కలిగి, అప్సరసను పోలిన ఆమె ఒకరోజు అష్టమివ్రతం చేసి, దేవుణ్ణి పూజించ డానికని సహస్రకోటి జైనాలయానికి వెళ్ళింది. రాజైన గంధ భాజుడు కూడా అదే సమాయానికి దేవుణ్ణి పూజించడానికని అక్కడికి వచ్చాడు. రాజును చూసి సిగ్గు పడిన సుకేశిని గోడదగ్గరకెళ్ళి బంగారు కళశాన్ని చేతపట్టి నిల్చొని ఉండగా, రాజుకు అక్కడున్న కొయ్య శిలావిగ్రహాల్లాగా అత్యంత సుందరమనిపించింది ఆమె నిల్చొని ఉన్న భంగి. ఆమె భంగిమను చూసి అత్యంత సుందరమైన విగ్రహమని భ్రమించి నోరారా పొగడుతుండగా, అది విగ్రహం కాదని నిజమైన కన్య అనే విషయాన్ని అక్కడే ఉన్న దేవదత్తుడనే వాడు వివరించాడు. నిజం తెలుసుకొన్న రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. విచారించి ఆమె నాగదత్తశెట్టి

కూతురని తెలుసు కొని, దేవుణ్ణే పూజించి, ఋషులకు నమస్కరించి రాజభవనానికి తిరిగి వెళ్ళాడు.

సుకేశిని కూడా దేవునికి, ఋషులకు నమస్కరించి, వ్రతాల్ని స్వీకరించి ఇంటికి వెళ్ళింది. తల్లిదండ్రులకు ప్రసాదమిచ్చింది. తమ కూతురు సర్వలక్షణ సంపన్నమైన యవ్వనంతో అత్యంత సుందరంగా ఉండడాన్ని చూసి, ఈమెకు తగిన వరుడు ఎక్కడున్నాడో కదా! అని చింతించారు. అంతలోనే సుకేశిని రూపాన్ని చూశి ఆకర్షితుడైన రాజు ఆమె తల్లి సురూపను పిలిపించి ''మీ కుమార్తెను ఎవ్వరికియ్యాలని అనుకొన్నారు'' అని అడిగాడు. తన తమ్ముడైన వరాంగుని పుత్రుడు, మేనల్లుడు అయిన జితరంగనికి ఇవ్వాలనే ఆలోచన కలిగి ఉన్నట్లు సురూప సమాధానమిచ్చింది. రాజు వెంటనే మధుసేనుడు, మధుసూదనుడు అనే ఇద్దర్ని నాగదత్తశెట్టి ఇంటికి అమ్మాయిని అడగడానికి పంపించాడు. వాళ్ళిద్దరూ వెనుతిరిగి వచ్చేంతవరకు ఓపిక పట్టలేక వారి వెనుకనే తానూ వెళ్ళాడు. నాగదత్తున్ని ఒప్పించి ముహూర్తం నిశ్చయించారు. నాగదత్తశెట్టి దంపతులు అష్టాహ్నిక మహోత్సవాన్ని చేసి, మంచిరోజు, వారం, నక్షత్రం, ముహూర్తంలో పాణిగ్రహణ పూర్వకంగా సుకేశిని రాజుకిచ్చి పెండ్లి చేశారు. రాజు తన ఆశనెరవేరడంతో సంతృప్తుడై, తన భార్యతో ఇష్టార్థ కామభోగాల్ని అనుభవిస్తూ కొంతకాలం సుఖంగా కాలం గడిపాడు.

ఒకసారి కౌశలాధిపతి అతిబలుడు అనే రాజుకు, కళింగదేశాధిపతి కళింగుడు అనే రాజుకు యుద్ధం ప్రాప్తించింది. ఆ సమయంలో గంధ భాజరాజు తన మంత్రి మతిశ్రుతుణ్ణి పంపి వారిద్దరికి సంధి చేశాడు. అప్పుడు కళింగదేశరాజు, మధుసూదనుడు అనేవానితో ఒక మదగజాన్ని గంధభాజ రాజుకు కానుకగా పంపాడు. మదించిన ఆ ఏనుగును చూడగానే రాణి సుకేశినికి తన పూర్వజన్మ వృత్తాంతం జ్ఞాపకం వచ్చి, స్పృహ తప్పి పడిపోయింది. దాదులు, పక్కనున్నవారు చందనం నీరు చల్లి ఉపచరించిన పిమ్మట ఆమెకు స్పృహ వచ్చింది. ఈ విషయం తెలిసిన గంధభాజుడు పరుగున వచ్చి ఇలా ఎందుకయిందని అడిగాడు. మదగజాన్ని చూడగానే సుకేశిని స్పృహ తప్పి పడిపోయిందని అక్కడున్నవారు చెప్పారు. అలా అయితే, మళ్ళీ మళ్ళీ మదగజాన్ని చూసి సుకేశిని స్పృహతప్పక ఉండడానికని అంతఃపురంలోని గోడల

మీద అల్లరి చేస్తున్న ఏనుగుల చిత్రాల్ని గీయించాడు. సుకేశిని తన వెనుకటి జన్మలోని తన అనుభవాలనన్నింటిని చిత్రాలుగా గీసి, ఎవరికి తెలియకుండేలా ఏకాంతంలో చూసుకొంటూ కాలం గడుపుతుండేది.

కొంతకాలం గడిచింది. ఒకరోజు గంధభాజుడు ఆ మదగజంతో ముప్పైరెండురకాల గజక్రీడల్ని ఆడించి, దాన్ని వశం చేసుకొని, దానిపై కూర్చొని అంకుశాన్ని ఝుళిపిస్తూ సుకేశిని దగ్గరకు వచ్చాడు. ''చూశావా, ఎలా దీన్ని వశం చేసుకొన్నానో, ఇప్పుడు సంతోషంగా ఉందా?'' అని అడిగాడు. అప్పుడు సుకేశిని ''ఇదేమి మహాగొప్ప! ఇది కూడా ఒక ఏనుగేనా? పొట్టేలులా ఉంది. చందన మలయ పర్వతంలో ఇంద్ర నీల మాణిక్య కాంతులతో శోభిస్తున్న మలయ సుందరుడు అనే ఏనుగుంది. ఏనుగుల గుంపుకు అదే నాయకుడు. అన్ని కాలాల్లోనూ మదించి ఉంటుంది. ఎర్రటి రంగున్న పద్మావతి అనబడే ఆడఏనుగుతో విహరిస్తూ సుఖంగా ఉంటున్న దాన్ని పట్టి, వశం చేసుకొని దానిమీద ఎక్కివస్తే నీకు ఏనుగులపై ఉన్న వ్యామోహాన్ని, బలాన్ని, సాహసాన్ని, మగసిరిని తెలుసుకోవచ్చు. అలా చేస్తే నీలాంటి వీరులు ఈ భూమండలంలో ఎవ్వరూ లేరని సంతోషంతో పొగడగలను'' అంది. ''అదిసరే! నువ్వు ఏ పట్టణంలో పుట్టావు? ఆ ఏనుగును ఎక్కడ చూశావు?'' అని రాజు అడిగాడు. అందుకు సుకేశిని ఇలా అంది.

''నేను వెనుకటి జన్మలో మనోవేగ అనబడే విద్యాధరిని. నా భర్త మణిచోళుడు అనబడే విద్యాధరుడు. అతనితో చందనమలయ పర్వతంలో విహరిస్తుండగా ఐరావతంతో సమానమైన ఆ ఏనుగును చూశాను''.

ఈ మాటను వినిన వెంటనే వెనుకటి జన్మలో పెంచుకొన్న శత్రుత్వం రాజుకు జ్ఞాపకమొచ్చింది. వెంటనే తన సైన్యంతో సంసిద్ధుడై వెళ్ళి చందనమలయ పర్వతాన్ని చుట్టుముట్టాడు. పర్వతంలోని ఇంద్రనీల కాంతితో శోభిస్తున్న మలయ సుందరుడు అనబడే ఆ ఏనుగు పిడుగులా ఘీంకారం చేస్తూ రాజు సైన్యాన్ని ధ్వంసం చేసింది. మహావీరుడైన రాజు ఎంత ప్రయత్నించినప్పటికీ ఏనుగును చెరపట్టలేక, దాన్ని చంపి పొడవైన రెండు దంతాల్ని దాని కుంభస్థలం లోని ముత్యాల్ని తీసుకొని నగరం చేరుకొన్నాడు. సుకేశిని దగ్గరకెళ్ళి, ''నీకు ఇష్టమైన మలయ సుందరుని దంతాలు, ముత్యాలు తీసుకో'' అంటూ ఆమె

ముందు పెట్టాడు. వెంటనే సుకేశిని పరితపిస్తూ, ''హా! మలయ సుందరా! నా ప్రియంతమస్వామి,'' అంటూ రోదిస్తూ రెండు దంతాల్ని ఆలింగనం చేసుకొని మరణించింది. సుకేశిని ఇలా హఠాత్తుగా మరణించినందుకు రాజు, ఆయన పరివారం అలజడి చెంది దుఃఖపడ్డారు.

కొంతకాలం గడచిన పిమ్మట యశోభద్రులు అనబడే త్రికాలజ్ఞాని చంపా నగరానికి వచ్చి ప్రమదోద్యానంలో బసచేశారు. ఈ విషయం తెలిసిన రాజు పరివారంతో వచ్చి ఆయన్ను అర్చించారు. నాగదత్తశెట్టి, సురూప, వీరి కుమారులు వరాంగుడు, ప్రియంగుడు మొదలైన వారు భట్టారకుని అర్చించి నమస్కరించారు. ఆయన ధర్మాధర్మాల్ని గురించి బోధించగా విన్న పై నలుగురు దీక్షపొంది తపస్సు చేయడానికి సంకల్పించారు. సుకేశిని మలయ సుందరుడని పిలవబడే ఏనుగు దంతాల్ని ఆలింగనం చేసుకొని మరణించిందనే వార్త విన్న వరాంగుడు వెనుకటి జన్మ స్నేహం జ్ఞాపకం రాగానే దుఃఖం సహించలేక ప్రతిజ్ఞ చేసి తపస్సు చేయడం ప్రారంభించాడు. సుకెశిని ఏనుగు దంతాల్ని ఆలింగనం చేసుకొని దుంఖించడానికి గల కారణం ఏమిటని గంధభాజుడు త్రికాల జ్ఞానులైన యశోధర భట్టారకుని ప్రశ్నించగా ఆయన ఆ వృత్తాంతాన్ని ఇలా చెప్పారు.

''దక్షిణపథంలోని దక్షిణ మధురను సుందర పాండ్యుడనే రాజు పాలించేవాడు. ఆయన రాణి అమృత మహాదేవి. వాళ్లు ఇష్ట భోగాలతో సుఖంగా ఉండేవారు. ఆ ఊళ్ళో ఆర్యనంది అనే శెట్టి ఉండేవాడు. ఆయన భార్య అవిధి. వీరి కుమార్తె సుకీర్తి. ఈమె స్నేహితురాలు, పూమాలలు కట్టే ప్రియసేన. అదే ఊళ్ళోని సుదర్శన శెట్టి, వీరశ్రీ దంపతుల కుమారుడు ప్రియదర్శనుడు. ప్రియ దర్శనునికి సుకీర్తికి పెళ్ళి జరిగింది. ఒకరోజు సుకీర్తి తనకు అరణ్య, పర్వత, కొండల తీరాలలో ఆటలాడే ఆశ ఉన్నట్లు భర్తతో చెప్పింది. ప్రియదర్శనుడు, సుకీర్తి ఆమె స్నేహితురాలు ప్రియసేన ఈ ముగ్గురు కలసి అరణ్యానికి వెళ్ళి సరోవర ప్రదేశాల్లో స్వచ్ఛందంగా విహరిస్తుండగా అక్కడకు ఏనుగుల గుంపొకటి వచ్చింది. అందులో బాగా మదించిన ఏనుగును కొన్ని ఆడ ఏనుగులు చుట్టుముట్టి పూవుల గుత్తులతో గొడుగులా పట్టుకొని ఉండగా, లేత చిగుర్లను తింటూ స్వచ్ఛమైన నీరు ఉన్న మడుగులోకి దిగిన ఆ మదగజం ఆడఏనుగులతో క్రీడించడాన్ని ఈ ముగ్గురూ చూశారు. ముగ్గురుకి హస్తిభోగ కాంక్ష కలిగింది. అలాగే మనస్సులో సంకల్పం చేసుకొన్నాను. కొన్ని రోజుల

తర్వాత పిడుగు పడి ప్రియసేన మరణించింది. ఇంకొకరోజు ప్రియదర్శనుడు అరటితోటలో భార్యతో పడుకొని ఉండగా పాముకాటుకు గురై మరణించాడు. తన భర్త మరణాన్ని భరించలేని సుకీర్తి భర్త బాకుతో పొడుచుకొని మరణించింది.

ఇలా దేహత్యాగం చేసిన ముగ్గురు పశ్చిమ సముద్ర తీరంలోని చందన మలయ మనబడే సుందర పర్వతంలో ఏనుగులుగా పుట్టారు. ప్రియదర్శనుడు ఇంద్రనీలరత్న శరీర కాంతి కలిగి సుభద్ర జాతికి చెందిన మలయసుందరుడు అనబడే ఏనుగుగా పుట్టాడు. సుకీర్తి తెల్లటిరంగుగల మలయావతి అనబడే ఆడ ఏనుగుగా పుట్టింది. ఎర్రదామర రంగున్న శరీరకాంతితో పద్మావతి అనబడే ఆడ ఏనుగుగా ప్రియసేన పుట్టింది. వాటి జాతి, రంగు, ఆకారాల్ని చూసి అరణ్యం లోని ప్రజలు వాటికి అలా పేర్లు పెట్టారు. ఈ రెండు ఆడ ఏనుగులు సుందర అనబడే ఏనుగు నాయకత్వంలోని గుంపులో ఉండేవి. ఆ ప్రాంతంలో ఉన్న చారణఋషి పాదాలకు విద్యాధరులు వచ్చి పూజచేసి వెళ్ళుతుండడాన్ని గమనించిన సుందర అనబడే మగ ఏనుగు తనగుంపుతోటి ప్రతిరోజు తామర పూవులతో ఋషి పాదాల్ని అర్చించి పోతుండేది. ఒకరోజు ప్రభంకరి అనబడే సరోవరంలో జలక్రీడలాడుతున్న తన వెనుకటి జన్మలోని ప్రియురాండ్రైన మలయావతి, పద్మావతులను మలయ సుందరుడు చూశాడు. ప్రేమఉప్పొంగి వారిద్దరనీ చేరడానికి మలయ సుందరుడు ప్రయత్నించగా అందుకు సుందరుడు అవకాశమివ్వలేదు. అయితే తన ప్రియతమల విరహంతో పరితపిస్తున్న మలయ సుందరుడు చెట్లను విరచి తన దేహసామర్థ్యాన్ని పరీక్షించు కొని వయస్సు ముదిరిన సుందరుడు పిల్ల ఏనుగులతో ఓటమి పొందడాన్ని గమనించి, దానితో యుద్ధం చేసి చంపివేసింది. తరువాత ఏనుగుల గుంపుకు తానే నాయకుడై మలయావతి, పద్మావతులతో ఇష్టభోగాల్ని అనుభవిస్తూ సుఖంగా ఉండేది. మలయావతి, పద్మావతులు రెండూ స్నేహంగా ఉండేవి. మలయ సుందరుని కుడివైపు నడిచేహక్కు మలయావతికి, ఎడంవైపు నడిచే హక్కు పద్మావతికి ఉండేది. అయితే ప్రభంకరి సరోవరంలో స్వేచ్ఛగా క్రీడించిన పిమ్మట తామర పుష్పాల్ని తుంచి నెత్తిమీద పెట్టించుకొనే విశేషానుగ్రహాన్ని మలయావతి మాత్రం కలిగి ఉండేది. ఇలా మలయ సుందరఏనుగు మిగిలిన ఆడ ఏనుగుల్ని వదలి, ఆ రెండింటి పట్ల ఆసక్తితో ఉండేది.

ఒకరోజు సరోవరంలో క్రీడించిన పిమ్మట మనస్సులేని మనస్సుతో బయటకు వచ్చేటప్పుడు క్రమం తప్పిన పద్మావతి కుడివైపు, మలయావతి ఎడం వైపు వస్తుండగా, వికసించిన తామర పుష్పాన్ని కుడివైపు వస్తున్నది మలయావతని భ్రమించి, పద్మావతి తలపై మలయసుందర ఏనుగు పెట్టింది. తనకు అవమానం జరిగిందనే భావన, తన సవతిపై. ఉన్న మాత్సర్యం రెండూ కలసి కోపంగా పరిణమించి మలయావతి ఏనుగు చందనమలయ పర్వతం చివరినుండి కిందకు దుమికి మరణించింది. తన ప్రియతమ మరణంతో చాలా దుఃఖించిన మలయ సుందర ఏనుగు పద్మావతిని తీసుకెళ్ళింది. ఆ మలయావతి మరణించిన పిమ్మట సురూప కూతురు సుకేశినిగా జన్మించింది. కాలక్రమంలో పద్మావతి ఏనుగు కూడా మరణించి సుకేశిని తమ్ముడు వరాంగుడుగా పుట్టింది. మలయ సుందర ఏనుగుచేత చంపబడిన సుందరుడు అనబడే ఏనుగు చారణఋషుల పాదాల్ని అర్చించిన పుణ్యఫలం వల్ల చంపాపురం అధిపతి గంధభాజుడై పుట్టింది. నువ్వు చంపిన మలయ సుందరుని దంతాల్ని ఆలింగనం చేసుకొని, తన వెనుకటి జన్మలోని భర్తను తలచుకొని సుకేశిని మరణించింది. నువ్వు వెనుకటి జన్మలో సుందరుడు అనబడే ఏనుగై ఉన్నప్పుడు చారణ ఋషుల్ని పూజిస్తుండగా మలయావతి పద్మావతి అనబడే ఆ రెండు ఏనుగులు కూడా చారణ ఋషుల్ని పూజించాయి. ఆ పుణ్యఫలం వల్ల ఆ ఏనుగులు రెండూ సుకేశిని, వరాంగుడై పుట్టాయి''. యశోభద్రులు వినిపించిన వృత్తాంతాన్ని విన్న గంధభాజుడు, ''భట్టారకా మరణించిన సుకేశిని ఇప్పుడు ఎక్కడ పుట్టింది?'' అని అడగ్గా భట్టారకులు ఇలా అన్నారు.

''సురట అనే రాజ్యంలో గిరినగరమనే పట్టణాన్ని పాలించేవాడు నీ మహాసామంతుడైన అతిరథుడు. అతని రాణిపేరు గౌరి. వాళ్ళ కూతురు మనోహరి అనే పేరుతో సుకేశిని జన్మించింది. రాజుగారి మంత్రి విజయుడు. అతని భార్య వీరశ్రీ. మలయ సుందర ఏనుగు నీ చేత చంపబడిన పిమ్మట కుబేరుకాంతుడనే పేరుతో మంత్రి దంపతుల కొడుకుగా జన్మించింది. ఐశ్వర్య వైభవాల్లో కుబేరకాంతుడు కుబేరునికి సరిసమానుడు. అదేఊళ్ళోని రాజ పురోహితుడైన ధనదనుడికి, అతని భార్య ధనశ్రీకి శ్రీధరుడనే పేరుతో వరాంగుడు కొడుకై పుట్టాడు. అతని భార్య కుబేరశ్రీ. శ్రీధరుడు కుబేర కాంతుని ఇంట్లో నిద్రించి, తరువాత అతని రత్నకంబళిని కప్పుకొని తన ఇంటికి

వచ్చాడు. దాన్ని చూసిన అతని భార్య కుబేరశ్రీ నా భర్త ఎవర్నో ఉంచుకొన్నాడని భావించి, విచారించక మేడమీదనుండి దుమికి మరణించింది. శ్రీధరుడు అపారమైన దుఃఖంలో ఉండగా, కుబేరకాంతుడు జరిగిన విషయాన్ని తెలుసుకొని ఓదార్చడానికి వచ్చాడు. ''నా భార్య కుబేరశ్రీ తప్పుగా భ్రమించి మరణించిందని'' శ్రీధరుడు చెప్పగానే కుబేరకాంతునికి వెనుకటి జన్మ జ్ఞాపకాలు వచ్చాయి. స్నేహితునితో, ''వెనుకటి జన్మలో నా భార్య మలయావతి అనబడే ఏనుగు మాత్సర్యంతో చందన మలయ పర్వతం చివరినుంచి కిందకు దుమికి మరణించిన విధంగానే నీ భార్య కూడా మరణించింది. దుఃఖించకని'' ఓదార్చి ఇంటికెళ్ళాడు. ఇంటికెళ్ళిన పిమ్మట కూడా వెనుకటి జన్మలోని జ్ఞాపకాల్లు అతణ్ణి వేధించసాగాయి. మలయసుందర ఏనుగై ఉన్నప్పటి తన వైభవాన్ని, మలయావతి పద్మావతులతో తాను విహరిస్తున్న ఘటనల్ని, వనహస్తి క్రీడల్ని చిత్రపటంలో గీసి దాన్ని చూస్తూ, 'హా, మలయావతి! నా ప్రియతమా! ఎక్కడున్నావు?' అని పిచ్చివానివలె వదరు తుండేవాడు. ఇలా చేస్తూ కొద్దిరోజుల తర్వాత ఇల్లు వదలి ఉజ్జయంత పర్వతాన్ని చేరుకొని ఆ పర్వతాన్ని చుట్టుతూ మలయావతిని వెదుకుతుండగా చిత్రాంగదుడు అనే విద్యాధరుడు అతణ్ణి చూశాడు. అతనిపై కరుణతో, వాత్సల్యంతో తన దగ్గరున్న కామముద్రికను, ఇష్టార్థసిద్ధి విద్యను కుబేరకాంతునికి ఇచ్చాడు. కుబేరకాంతుడు ఇష్టార్థసిద్ధి విద్యతో, ''నా గతజన్మలోని భార్య ఎక్కడుంది?'' అని ప్రశ్నించగా అప్పుడు ఆ విద్యాదేవత, ''నీ ప్రియురాలు అతిరథ మహారాజు కూతురు మనోహరై జన్మించింది'' అని చెప్పింది. ఇది విన్న పిమ్మట కుబేరకాంతుడు పిచ్చివానివలె వేషం ధరించి, రాజభవనం సమీపంలో తాను గీసిన చిత్రపటాన్ని పైకెత్తి 'హా, మలయావతి! నా ప్రేయసీ, ఇప్పుడు నీవెక్కడున్నావు'' అని పాడుతుండగా, మనోహరికి ఆ పటాన్నిచూసి తన గత గతజన్మ జ్ఞాపకాలు కలిగాయి. అప్పుడు తన దాది దామరంభతో సంభ్రమం పడుతూ ఇలా అంది. ''రాజ భవనం ముందు పటాన్ని చూపిస్తున్నవాడు గత గత జన్మలో నా భర్త. అమ్మా, నేను ప్రాణంతో ఉండాలంటే అతని దగ్గరకెళ్ళి ఏకాంతంగా ఇలా చెప్పు: 'పద్మావతి తలమీద పూవు పెట్టి ఇప్పుడు, 'మలయావతి ఎక్కడున్నావు?' అని ఎందుకు నిలకడలేక తిరుగుతున్నావు మలయసుందరా? నీ ప్రాణ సమానమైన ప్రియురాలు నిన్నే కలవరిస్తూ ఉంది. ఆమె, నువ్వు ఒకటయ్యేంతవరకు ఆమె ప్రాణంతో ఉండాలంటే ఈ పటాన్ని

తీసుకెళ్ళి ఆమెకు ఇస్తాను' అని చెప్పి ఆ చిత్ర పటాన్ని తీసుకురా''. దామరథి ఆమె చెప్పిన విధంగానే కుబేరకాంతుని దగ్గరికెళ్ళి, ఏకాంతంలో అన్ని విషయాలు వివరించి, ఆ పటాన్ని తీసుకెళ్ళి మనోహరికి ఇచ్చింది. మనోహరి ఆ పటాన్ని ప్రీతిపూర్వకంగా చూసుకొంటూ సంతోషంతో కాలం గడుపుతుండేది.

ఇటు కుబేరకాంతుడు పిచ్చివాని వేషాన్ని వదలి తన మామూలు వేషంతో ఇంటికెళ్ళాడు. అప్పుడు అతని తండ్రి, ''కుబేరకాంతా, ఇన్నిరోజులు పిచ్చివానివలె ఎందుకున్నావు? ఇప్పుడు ఎలా సరిపోయింది?' అని అడిగాడు. కుబేరకాంతుడు, ''నాన్నా ఈ పట్టణం రాజుగారి కూతురు మనోహరి, నా గతగత జన్మపు భార్య. ఆమెను వెదకడానికని ఇన్ని రోజులు పిచ్చివానిగా ఉండేవాణ్ణి. ఇప్పుడు ఆమె నాకు కనిపించింది. అందువల్ల పిచ్చిపోయింది'' అన్నాడు. అందుకు అతని తండ్రి ఇలా అన్నాడు: 'నీ గతగత జన్మలోని భార్యను గుర్తించావు. బాగానే ఉంది. అయితే ఆమె రాజుగారి కూతురై ఉండడం వల్ల నువ్వు ఆమెను పెళ్ళి చేసుకోవడానికి సాధ్యం కాదు. అందువల్ల ఆమెమీద వ్యామోహాన్ని వదలిపెట్టు.'' అప్పుడు కుబేరకాంతుడు తనకు గంధర్వుడు ఇచ్చిన కామవిద్య సహాయంతో అపారమైన గజ, అశ్వ, రథ, పదాతి బలాన్ని, ఐశ్వర్యాన్ని సృష్టించి తండ్రికి చూపించగా, తన కుమారుని సామర్థ్యాన్ని చూసి ఆయన చాలా సంతోషపడ్డాడు.

ఒకరోజు రాజు మంత్రులతో ఆలోచిస్తూ, తన కూతురు మనోహరికి పెళ్ళివయసు రావడంవల్ల ఆమె పెళ్ళి ఎవరితో చేయాలనే సలహా అడిగాడు. మిగిలిన మంత్రులందరూ చాలా మంది రాకుమారుల పేర్లను చెప్పారు. కుబేర కాంతుని తండ్రి అయిన విజయుడు వాళ్ళు చెప్పిన ఒక్కొక్కర్ని ఉపాయంతో, తెలివిగా వద్దని చెబుతూ, ''మనోహరి రూపాన్ని, యవ్వనాన్ని, కళాత్మక గుణాల్ని గుర్తించేందుకు వాళ్ళు ఎవ్వరూ సరిపోరు. అందువల్ల స్వయంవరం ఏర్పాటు చేస్తే ఆమెకు తగిన వరుణ్ణే ఆమె ఎంచుకుంటుంది'' అని సలహా ఇచ్చాడు. రాజు అందుకు అంగీకరించి స్వయంవరం ఏర్పాడు చేశాడు. స్వయంవరానికి అంగ, వంగ, కళింగ, కాంభోజ, కాశి, కోసల, పల్లవ, పాంచాల, మగధ, మాళవ, వత్స, మహారాష్ట్ర, కుణాల, కురుజాంగణ, ద్రవిళ, లాళ, గౌళ, కర్నాట, సుహమ, సురక్త, సూరసేనియ మొదలైన దేశాల రాజులు వచ్చారు.

అయితే మనోహరి వీరందరిని కాదని ముందుకెళ్ళి అక్కడున్న కుబేరకాంతుని మెడలో మాలవేసింది. అప్పుడు అక్కడున్న రాజులందరూ 'మమ్మందర్నీ తిరస్కరించి ఏమిలేని బికారికి మాలవేసిందని' సభలో గందరగోళం సృష్టించి కుబేరకాంతునిపై యుద్ధానికి పూనుకొన్నారు. కుబేరకాంతుడు తన సైన్య బలంతో అందరిని ఓడించి, మనోహరిని పాణిగ్రహణ పూర్వకంగా పెళ్ళి చేసుకొని సుఖంగా ఉండేవాడు.

కుబేరకాంతునిచే ఓడింపబడ్డ సువర్మవర్మ అనబడే రాజు రాజ్యభ్రష్టుడై తపస్సు చేసి మరణించి ప్రతిసూర్యుడు అనబడే వ్యంతర దేవుడుగా పుట్టాడు. శ్రీధరుడు, కుబేరకాంతుడు మరియు మనోహరి చాలా స్నేహంగా ఉంటూ, మేము చేసిన దానధర్మాల ఫలితంగా రాబోయే జన్మలో కూడా ఇలాంటి విద్య లభించాలని సంకల్పం చేసుకొన్నారు. తరువాత మొదట మరణించిన శ్రీధరుడు విజయార్ధ పర్వతం ఉత్తరశ్రేణిలో గల అళకాపురాన్ని పరిపాలించే గగనవల్లభుడు, అతని భార్య అనంగమాల పుత్రుడు చండవేగుడు అనేవాడుగా జన్మించాడు. చండవేగుని భార్య విద్యుల్లత. వీరికుమారుడు విద్యున్మాళి అనబడే వాడుగా కుబేరకాంతుడు పుట్టాడు. విద్యుల్లత తమ్ముడు విజయార్ధ పర్వతం దక్షిణ శ్రేణిలో గల మేఘకూటం అధిపతైన మేఘమాళి అనబడే విద్యాధరుడు. అతని భార్యపేరు రతిబిందు. వీరి కూతురు విరళవేగగా మనోహరి జన్మించింది. ఒకరోజు చండవేగుడు, విద్యున్మాళి ఉజ్జయంత పర్వతంలో అరిష్టనేమి భట్టారకులు కాలధర్మం చెందిన పవిత్ర భూమిని పూజించడానికి వచ్చారు. ఆ పర్వతాన్ని చూడగానే విద్యున్మాళి మూర్ఛపోయాడు. తేరుకొన్న పిమ్మట గతజన్మలోని మనోహరిని జ్ఞాపకం చేసుకొని, మాసోపవాసమనే వ్రతాన్ని చేసి, ప్రజ్ఞప్తి అనే విద్యను సాధించగా ఆ విద్య ''మీ ఆజ్ఞ ఏమిటని?'' ముందు నిలిచింది. అప్పుడు ఆ విద్యతో విద్యున్మాళి ''నా ప్రియురాలు మనోహరి ఇప్పుడు ఈ లోకంలో ఎక్కడుందనే విషయాన్ని నాకు త్వరగా తెలియజేయి'' అని అన్నాడు. అందుకు ఆ విద్య ఇలా అంది.

''విజయార్ధ పర్వతం దక్షిణశ్రేణిలోని మేఘకూటం పురాధిపతి, నీ మేనమామ మేఘావళి అనబడే విద్యాధరుని కూతురై మనోహరి జన్మించింది. ఇప్పుడు ఆమె పేరు విరళవేగ'' ''అయితే నువ్వు మా మేనమామ ఇంటికెళ్ళి

విరళవేగతో ''ఓ మనోహరి, నువ్వు గత జన్మలో కుబేరకాంతునితో క్రీడించిన విషయాలు జ్ఞాపకం లేవా? అని ప్రశ్నించు'' అని విద్యున్మాళి చెప్పి పంపాడు. అలానే అంటూ ఆ విద్య వెళ్ళి, విరళవేగకు అదే విషయాన్ని తెలపగా ఆమె వెంటనే మూర్ఛపోయింది. మేల్కొన్న పిమ్మట ఆమెకు గతజన్మ విషయాలు జ్ఞాపకమొచ్చి విరహతాపంతో తన గతజన్మలోని భర్తను తలచి తలచి ఏడుస్తూ ఉండగా, ఇటు విద్యున్మాళి, తండ్రితో తన వృత్తాంతాన్ని అంతటిని తెలియజేశాడు. ఆయన తన బావమరది మేఘమాళునికి చెప్పి పంపి, విరళవేగను రప్పించి విద్యున్మాళితో పెండ్లి చేశాడు. విద్యున్మాళి విరళవేగ సకల భోగాల్ని అనుభవిస్తూ సుఖంగా ఉండేవారు.

కొన్నిరోజుల పిమ్మట విద్య నిర్మించి ఇచ్చిన విచిత్రమైన విమానంలో, హిమవంత పర్వతంమీద వీరిద్దరూ విహరిస్తూ వెళ్ళుతుండగా, కింద ఉన్న వ్యంతర దేవుడైన ప్రతిసూర్యుడు చూశాడు. తాను సువర్మవర్మగా ఉన్నప్పుడు జరిగిన అవమానం జ్ఞాపకం రావడంతో విద్యున్మాళుణ్ణి, విరళవేగను చంపేశాడు. అలా చంపబడ్డ విద్యున్మాళు గంగానది నైరుతి దిశలోని సుకౌశల రాజ్యానికి చెందిన అయోధ్యాపురం రాజగురువు నాగరసేనునికి ఆయన భార్య ధరణికి సిద్ధార్థుడనే పేరుగల కుమారుడై జన్మించాడు. అతడు తల్లితండ్రుల సేవచేస్తూ మంచి రూపంతోను, కాంతి సౌభాగ్యాది గుణాలతోటి పెరుగుతున్నాడు. ఇటు మగధదేశం రాజగృహ రాజగురువు సముద్ర విజయుడు ఆయన భార్య సుమతి. వీరి పుత్రిక శ్రీకాంత పేరుతో విరళవేగ జన్మించింది. (సుమతి నాగరశెట్టి చెల్లెలు). అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య, కాంతి, హావభావ, విలాస విభ్రమాలతో పెరిగిన శ్రీకాంతను సిద్ధార్థునికిచ్చి పెండ్లి చేశారు.

ఒకరోజు సిద్ధార్థుడు, శ్రీకాంత ఏడంతస్తుల భవనం పైన కూర్చొని ఇష్టపరివారంతోటి సరససల్లాపాలలో మునిగి ఉండగా, రమణీయమైన విమానంలో ఆకాశంలో విహరిస్తున్న విద్యాధర దంపతుల్ని చూశారు. వెంటనే ఇద్దరు మూర్ఛపోయారు. తేరుకొన్న పిమ్మట గతజన్మలలోని విషయాలు అన్నీ జ్ఞాపకం రాగా సంసారంలో ఉన్న దుఃఖాన్ని, అశాశ్వతను తలచుకొని వైరాగ్యం జనించగా తమ స్వజనులను, పరిజనులను, మంత్రి మిత్రులను ఆహ్వానించి తమ ఉద్దేశాన్ని వివరించారు. అప్పుడు వాళ్ళందరూ ఇలా అన్నారు:

''అయ్యా, పూర్వం నుండి వస్తున్న పద్ధతి ప్రకారం ఈ కులాన్ని ఉద్ధరించడానికి మగసంతానం ఎవ్వరూ లేదు. ఈ భారాన్ని ఎవరికి అప్పగించి వెళతావు? అందువల్ల కొద్దిరోజులు గడచి నీకు మగసంతానం కలిగిన పిమ్మట వాడికి అన్నీ అప్పగించి నువ్వు తపస్సుకు వెళ్ళడం మంచిది.''

''సరే. అయితే నాకు కుమారుడు కలిగిన పిమ్మట నేను తపస్సుకు వెళ్ళడానికి ఎవరూ కాదనకూడదు'' అని సిద్ధార్థుడు వాళ్ళను ఒప్పించాడు.

సిద్ధార్థుని పెద్దరాణి జయావతి పిల్లల కోసం అనేక దేవతలకు పూజలు చేసిన పిమ్మట ఒకరోజు త్రికాలజ్ఞానులయిన విజయభద్ర ఋషులకు భిక్షపెట్టి భక్తితో ఉపచరించి ఇలా అంది: ''భట్టారకా నాకు పిల్లలు కలుగుతారా? లేదా? దయతో చెప్పండి.'' అందుకు భట్టారకులు ఇలా అన్నారు: ''అమ్మా, ఐశ్వర్యం, రూపం, వైభవం, కాంతి, సౌభాగ్యం మొదలైన గుణాల్లో సిద్ధార్థుని కంటే ఉత్తముడైన, మీ వంశానికి వన్నె తెచ్చే పుత్రునికి నువ్వు జన్మనిస్తావు. అయితే పున్నమి చంద్రుని చూసిన వెంటనే సూర్యుడు అస్తమించునట్లు, కుమారుని చూడగానే నీ భర్త తపస్సుకు వెళ్ళి పోతాడు.'' దీన్ని విన్న జయావతికి సంతోష - విషాదాలు రెండూ ఒకేసారి కలిగాయి. కాలం గడిచింది. చండవేగుడు కొన్ని సంవత్సరాలు రాజ్యమేలి ఆయస్సు ముగిసిన పిమ్మట జయావతి గర్భంలో ప్రవేశించాడు. జయావతి తాను గర్భవతి అన్న విషయాన్ని ఎవరికీ తెలపక, ఒక భూగర్భగృహాన్ని చేయించి, తనకు జలోదర రోగం కలిగిందని అందుకు చికిత్స చేయించాలని సిద్ధార్థునితో చెప్పి అతణ్ణి నమ్మించి భూగర్భగృహంలో ఉండిపోయింది. తొమ్మిదినెలలు నిండిన పిమ్మట మగపిల్లవాణ్ణి ప్రసవించింది. ఈ విషయం ఆమెకు, దాదికి, సేవలు చేస్తున్న దాసికి తప్ప ఇతరులకు ఎవ్వరికి తెలియలేదు. ఇలా రోజులు గడిచాయి.

ఒకరోజు ఆ దాసి నీరు తేవటానికని ఏటికి వెళ్ళి తన స్నేహితురాలు నాగబ్బెను చూసింది. ఆమె ఈమెను ఇలా అడిగింది. ''అరే కుందబ్బె, కొన్ని రోజుల నుండి నువ్వు కనిపించలేదు కదా!'' ''నాగబ్బె, నీకు మాత్రం ఈ విషయం చెబుతాను. ఎవరికీ చెప్పకు. చూడు, మా శెట్టెమ్మ జయావతి మగపిల్లవాణ్ణి ప్రసవించింది. ఎవ్వరికీ తెలియకుండేలా భూగర్భగృహంలో దాగి ఉంది.'' ఈ మాటల్ని సాయంకాల వాహ్యాళికని అక్కడికి వచ్చిన సోమశర్మ అనే

బ్రాహ్మణుడు వినిపించుకొన్నాడు. వెంటనే సిద్ధార్థుని దగ్గరకెళ్ళి ''సిద్ధార్థ శెట్టి మహాపురుషా! నీకో సంతోషమైన వార్తను తెచ్చాను. నీ భార్య మగపిల్లవాణ్ణి ప్రసవించిందని'' చెప్పాడు. సిద్ధార్థ శెట్టికి అమిత సంతోషం కలుగగా ఆ బ్రాహ్మణుని దరిద్రం తీరేలా సకలాభరణాల్ని కానుకగా ఇచ్చి, వెంటనే తన కుమారుణ్ని చూడాలని భూగర్భ గృహానికి వచ్చాడు. జయావతి తన తొడమీద ఉదయిస్తున్న సూర్యునిలా ఉన్న అమితమైన తేజస్సుగల పిల్లవాణ్ణి పడుకోబెట్టుకొని ఆడిస్తుండడం చూశాడు. ''కొన్ని కాలాలు సుఖంగా ఉండు'' అని పిల్లవాణ్ణి ఆశీర్వదించి ''నా ముప్పైరెండుకోట్ల బంగారు నాణేలకు, రాజగురువు పదవికి, నా వంశానికి నువ్వే యజమానివి'' అని పలికి, తక్షణమే తల్లి తొడపై ఉన్న పిల్లవానికి శెట్టి పట్టం కట్టి, 'సుకౌశళస్వామి' అనే పేరును పెట్టి, బయటకు వచ్చాడు. ఇంతకు మునుపు సంకల్పం చేసుకొన్న విధంగా స్వజన పరిజనుల్ని పిలిపించి, ''మీరు ఇక సుకౌశళస్వామి ఆశ్రమంలో బ్రతకండని'' చెప్పి, వాళ్ళను ఒప్పించి, వినయంధరులు అనే ఆచార్యుల దగ్గర ఇంకా కొంతమందితో తపస్సుకు పూనుకొన్నాడు. శ్రీకాంత, గుణమతి మొదలైనవాళ్ళు కూడా ఆ ఋషి దగ్గర తపస్సుకు పూనుకొని, కొంతకాలం ఉగ్రమైన తపస్సు చేసి, సమాధి మరణం వల్ల మరణించి, అందరూ దేవలోకంలో జన్మించారు. సిద్ధార్థ ఋషి పండ్రెండేండ్లు గురువుగారి దగ్గర ద్వాదశాంగ చతుర్దశ పూర్వాలు మొదలైన ఆగమాల్ని నేర్చుకొన్న పిమ్మట, ఆయన అనుమతి తీసుకొని గ్రామంలో ఒకరాత్రి, నగరంలో ఐదురాత్రులు, అడవిలో పదిరాత్రులు అనే లెక్క ప్రకారం సంచరిస్తూ, అనేక రకాల ఉపవాస వ్రతాల్ని చేస్తూ తపస్సు చేస్తూ ఉండేవారు.

ఇటు జయావతి, గతంలో భట్టారకులు చెప్పిన మాటల్ని తలచుకొని, తన ఇంట్లోకి ఋషులు ఎవ్వరూ ప్రవేశించక ఉండేలా కాపలా పెట్టింది. ఆమె సిద్ధార్థ ఋషి పేరు చెబితే మండిపడుతూ ఉండేది. ఇంకనూ పెద్దవాడైనా కాని పసికూనను నిర్దయతో వదలిపెట్టి వెళ్ళిన పాపి, నిష్కరుణి అని తిడుతూ ఉండేది.

సుకౌశలస్వామి అత్యద్భుత వైభవంతో పెరిగాడు. పాలు త్రాగించడానికి సువ్రత అనే దాది, సుమతి అనే దాది భోజనం చేయించడానికి, నంది

ఆటలాడించడానికి, సుప్రభ స్నానం చేయించడానికి, మేఘమాల అలంకారం చేయడానికి నియమితులు కాగా, ఈ ఐదుమంది లాలనలో సుకౌశళ స్వామి పెరిగి పదహారేండ్ల యువకుడయ్యాడు. సుకౌశళస్వామి జయావతి అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య, కాంతి, హావభావ, విభ్రమాలతో శోభిస్తున్న ముప్పై రెండుమంది రాకుమార్తెలను తెచ్చి ఒకే ముహూర్తంలో కొడుక్కి పెళ్ళిచేసింది. ఏకశాల, ద్విశాల, త్రిశాల, చతుఃశాల, స్వస్తిక, నంద్యావర్తం మొదలైన రకరకాల అతి సుందరమైన ఏడంతస్తుల మేడల్ని, ముప్పైరెండు లతామంటపాల్ని బంతి ఆట ఆడడానికి ఇంటిముందు స్థలాన్ని, ఏనుగు ఎక్కడం మొదలైన క్రీడలు ఆడటానికి మైదానాలు మొదలైన వాటిని సుకౌశళస్వామికి నిర్మించి ఇచ్చి, ఇంటి నుండి బయటకు వెళ్ళేందుకు అవసరం లేకుండా చేసింది. కొడుకు సుఖాన్ని, ఐశ్వర్యాన్ని, వినోదాల్ని శ్రద్ధతో గమనిస్తూ సంతోషంగా కాలం గడుపుతూ ఉండేది. కొంతకాలం సుకౌశళస్వామి తన ముప్పైరెండుమంది భార్యలతో సుఖభోగాల్ని ఇలా అనుభవించాడు.

ఒకరోజు సుకౌశలస్వామి పృథ్వీదర అనే భవనం ఏడవ అంతస్తుమీద తల్లి, సువ్రత మొదలైన ఐదుమంది దాదులు, ముప్పైరెండు మంది భార్యలతో వినోద కాలక్షేపం చేస్తూ కిటికీనుండి అప్పుడప్పుడూ బయటకు చూస్తున్నాడు. సిద్ధార్థ ఋషి నగరాల్ని, పట్టణాల్ని, గ్రామాల్ని, గూడేల్ని సందర్శిస్తూ అయోధ్యా నగరానికి వచ్చి, చిన్నిల్లు, పెద్దిల్లు అని తలచక భోంచేయడానికి తగిన ఇండ్లలో భిక్షాన్ని వేడుతూ, సుకౌశళస్వామి ఇంటిదగ్గర భిక్షం స్వీకరించి బయటకు వెళ్లుతున్నారు. తపస్సు చేయడం వల్ల పెరిగిన గడ్డం, ప్రకాశిస్తున్న కళ్ళు, దేహంగల సిద్ధార్థస్వాములు కిటికీ ద్వారా సుకౌశళస్వామికి కనిపించారు. ''అమ్మా అపురూపమైన ఈ వ్యక్తి ఎవరు? ఇలాంటి వ్యక్తిని నేనింతవరకు చూడలేదు కదా?'' అని అతడు తల్లిని అడిగాడు. జయావతి ''బాబూ, వీడొక భిక్షగాడు, అంగడి దగ్గర, వీధిలో ఇక్కడ, అక్కడ పడి ఉన్నదాన్ని ఏరుకొని తినేవాడు. ఎవరూ దిక్కులేని పరదేశి; చివరకు గోచికి కూడా గతిలేని దరిద్రుడు'' అని అంది. ఈ మాటల్ని వింటున్న సువ్రత అనే దాది, ''అమ్మా, ఎందుకిలా చెడ్డగా మాట్లాడుతున్నారు? ఈ స్వామి, మీతోటి ముప్పైరెండు మంది భార్యల్ని, ముప్పైరెండు కోట్ల బంగారు నాణేల్ని ఎండిన గడ్డిపోచలా భావించి త్యజించి, పాపక్షయం కావడానికని తపస్సుకెళ్ళిన ఈ మహానుభావుని

పట్ల ఇలా అవమానకరంగా మాట్లాడవచ్చా?'' అని అనేసింది. జయావతి తక్షణం కన్ను సైగచేయగానే సువ్రత వేరే మాటను మార్చి మాట్లాడింది. దీన్ని గమనించిన సుకౌశలస్వామి వీరి మాటల్లో ఏదో రహస్యముందని అనుకొన్నాడు. వంటవాడు వచ్చి ''భోజనం చల్లారిపోతుంది లేవండి'' అని అన్న పిమ్మట తల్లి, సువ్రత, మొదలైన దాదులు, స్వయంప్రభ, శ్రీదత్త, బంధుమతి, భానుమతి, మిత్రసేన, ప్రియంగు, సుందరి, ప్రియద, శ్యామలత, విద్యుల్లత, అచల, విమలమతి, శ్రీకాంత, శశిప్రభ, సూరసేన, అనంతమతి, సరస్వతి, విజయ, వైజయంతి, అపరాజిత, కనకమాల, ధాన్య, ధనశ్రీ, వసుంధర మొదలైన భార్యలు - అందరూ కలసి ''పొద్దవుతూ ఉంది. ఆరగించడానికి లేవండి'' అని పిలవగా, సుకౌశలస్వామి ఒకే పట్టుపట్టి కూర్చున్నాడు. ''ఈ వృత్తాంతాన్ని తెలుసుకోక నేను భోంచేయను. సువ్రత నువ్వు చెప్పు. మీరేదో రహస్యాన్ని దాచిపెడుతున్నారు. ఉన్నది ఉన్నట్లు చెప్పు. లేకపోతే నామీద ఒట్టు'' అని అన్నాడు. అప్పుడు జరిగిన సంగతి బయటకు రావాల్సిన పరిస్థితి ఏర్పడింది. సువ్రత ఇలా చెప్పింది. ''బాబూ, విను. ఈయన మీ తండ్రి సిద్ధార్థులు అనబడేవారు. నీ పసితనంలోనే నీకు శెట్టిపట్టం కట్టి, సంసారం మీద జుగుప్స కలగగా, పాపక్షయం కావడానికి తపస్సు కెళ్ళారు. దేహరక్షణ కోసం భిక్ష వేడుతూ మీ ఇంటి దగ్గరకు వచ్చి వెళ్ళాడు. అది అలా ఉండనీ, బాబూ, ఇక భోజనానికి లే.'' ''ఓహో! అలానా! అయితే నేను వాళ్ళలా కానిదే భోంచేయను'' అని సుకౌశలస్వామి ప్రతిజ్ఞ చేసేశాడు. స్వజనులు, పరిజనులు, బంధువర్గమంతా అక్కడ గుమికూడి ''నీవింకా యువకుడివి. ఈ వయస్సులో నువ్వు కామభోగాల్ని అనుభవించాలేగానీ తపస్సు చేయడానికి వెళ్ళకూడదు. వయస్సు మళ్ళిన పిమ్మట నీ తండ్రి నీకు ఏ విధంగా శెట్టి పట్టంకట్టి, బాధ్యతల్ని అప్పజెప్పి వెళ్ళాడో అదేవిధంగా నువ్వుకూడా నీ కొడుక్కి పట్టంకట్టి తపస్సుకు వెళ్ళడం మంచిది'' అని అన్నారు.

''అంతవరకు ఎవరు ఉంటారో ఎవరు ఉండరో ఎవరికి తెలుసు? ఈ మనుష్యుని జన్మ గడ్డిపోచమీద నీటిబిందువులాంటిది. సాయంకాలపు వెలుతురు లాంటిది. ఇప్పుడు ఎవరు వద్దన్నా సరే నేను వినేవాణ్ణి కాదు'' - అనే దృఢ సంకల్పంతో సుకౌశలస్వామి అప్పుడు గర్భిణిగా ఉన్న స్వయంప్రభ అనే భార్యకు పట్టం కట్టి ఇంటి నుండి వెళ్ళిపోయాడు. సిద్ధార్థ ఋషులు ఉన్న స్థలాన్ని

విచారించి, ఊరు బయట ఉద్యానవనంలో స్ఫటికశిల మీద కూర్చొని ఉన్న సిద్ధార్థ భట్టారకులను చూడగానే సుకౌశలస్వామికి తన పూర్వజన్మల జ్ఞాపకాలు, తనకు సంబంధించిన వారి జ్ఞాపకాలు వచ్చాయి. అప్పుడు ఇలా అనుకొన్నాడు ''ఈయన ప్రియదర్శనుడు అనే శెట్టి, మరణించిన పిమ్మట మలయసుందరుడు అనబడే ఏనుగుగా, తరువాత కుబేరకాంతుడుగా, విద్యున్మాళిగా, అటు తరువాత సిద్ధార్థుడుగా పుట్టాడు. నేను మొదట మాలలు కట్టే ప్రియసేన అనబడేదాన్ని. మరణించిన పిమ్మట పద్మావతి అనబడే ఏనుగుగా జన్మించాను. ఆ తరువాత వరాంగుడుగా, ఆపైన శ్రీధరడుగా పుట్టాను. తదనాత చండవేగుడనబడే విద్యాధరుడుగా, ఆటు పిమ్మట సిద్ధార్థ, జయావతుల పుత్రుడు సుకౌశల స్వామిగా ఉన్నాను. ఇలా నా జన్మాంతరాలు ఆరు. నేను ప్రియసేనగా ఉన్నప్పటి నా స్నేహితురాలు సుకీర్తి. ప్రియదర్శనుని భార్యగా ఆమె మరణించి మలయావతి అనబడే ఏనుగుగా పుట్టింది. తరువాత సుకేశినిగా, మనోహరిగా, తరువాత విరళవేగ అనబడే విద్యాధరిగా జన్మించింది. అటుపైన శ్రీకాంత పేరుతో సిద్ధార్థుని భార్య అయింది. ఇలా శ్రీకాంత జన్మలు ఆరు.''

ఇలా సుకౌశలస్వామి తమ ముగ్గురి వెనుకటి జన్మలను తెలుసుకొని, సంసారమంటే జుగుప్సా భావం కలుగగా, అమితమైన విరక్తితో సిద్ధార్థ భట్టారకుని పక్కన తపస్సుకు పూనుకొన్నాడు. సుప్రభ తప్ప అతని మిగిలిన భార్యలు సిద్ధార్థ గురువుల దగ్గర, గుణమతి మునుల దగ్గర తపస్సుకు పూనుకొన్నారు. కొంత కాలం ఉగ్రమైన తపస్సుచేసి సమాధి మరణం వల్ల మరణించి దేవలోకంలో పుట్టారు.

తాను ఎంత ప్రయత్నించినా తనమాట వినక తపస్సుకెళ్ళిన సుకౌశలస్వామి మీద జయావతి కోపగించుకొని, జినధర్మాన్ని నిరసించి ఆర్తధ్యానంతో మరణించి మొగ్గళగిరి పర్వతం మీద బెబ్బులిగా పుట్టింది.

సుకౌశలస్వామి ద్వాదశాంగ, చతుర్దశ పూర్వమైన అన్ని ఆగమాల్ని నేర్చుకొని, గురువులతో సంచరిస్తూ మొగ్గళగిరి పర్వతానికి వచ్చి, వానాకాలం కావడం వల్ల ఇద్దరూ ఒకగుహలో బసచేసి యోగదీక్షలో మునిగారు.

నాలుగు నెలలు ఉపవాసం చేసి, యోగదీక్ష పూర్తి అయిన పిమ్మట చాతుర్మాస ఉపవాస దీక్షను ముగించడానికి మొదట సుకౌశలస్వామి బయటకు

వచ్చాడు. వచ్చి చూడగానే కొన్ని రోజులనుండి ఆహారం దొరక్క ఆకలితో ఉన్న పెద్దపులి - వెనుక జన్మలో సుకౌశళస్వామి తల్లిగా ఉన్న ప్రాణం - ప్రాణం ఉన్నంతవరకు ఆహారాన్ని త్యజించడానికి సంకల్పించిన అతన్ని చూసి, గాండ్రిస్తూ పైకి ఎగిరివస్తుండగా, సుకౌశళస్వామి:

''నేను అన్ని ప్రాణుల్ని క్షమిస్తాను. అన్ని ప్రాణులు నన్ను క్షమించని. సర్వభూతాల మీద నాకు స్నేహం కలగని, నాకు ఎవరిమీద ద్వేషం కాదు'' అని అంటూ ధర్మధ్యాన, శుక్లధ్యానాలలో మునిగిపోయారు. పులి ఆయన పొట్టను చీల్చి, రక్తం పీల్చి, వెన్నెముకను పీకి తింటుండగా ఋషి గుహ బయటకు వచ్చి చూశాడు. ''హా! పంచమహాపాతకి, కొడుకును ఎందుకిలా చూసి తింటున్నావు? మునుపు కుంకుమ పూసిన దేహంలో చెమటబిందువు కనిపిస్తే రక్తమని భ్రమించి మూర్ఛపోయేదానివి. ఇప్పుడు కొడుకును చీల్చి తింటున్నావు కదా!'' అని సిద్ధార్థ ఋషులు అన్నమాటలు విన్న వెంటనే ఆయన వక్షస్థలం మీదున్న గురుతును చూడగానే పులికి వెనుకటి జన్మలోని విషయాలు జ్ఞాపకం వచ్చాయి. వెంటనే అమితమైన దుఃఖంతో మూర్ఛపోయి, మేల్కొన్న పిమ్మట తాను చేసిన తప్పుకు పులి దుఃఖించసాగింది. ఇక బ్రతికి ఉండలేనని తలను, కాళ్ళను బండకు చెట్టుకు ఢీ కొట్టి రోదిస్తుండగా, సిద్ధార్థ భట్టారకులు పులికి ధర్మశ్రవణం చేశారు. లోకంలోని స్థితిగతుల్ని వివరించి వ్రతాల్ని ఇచ్చారు. ఆ పులి ధర్మధ్యానం చేస్తూ, జీవించి ఉన్నంతవరకు మంచి చేసి మరణించి సౌధర్మకల్పంలో పుట్టింది. సిద్ధార్థ ఋషులు సమ్యక్ దర్శనాన్ని, జ్ఞానాన్ని సాధించి కర్మక్షయం చేసుకొని మోక్షాన్ని పొందారు. సుకౌశళస్వామి తిరికోప సర్గాన్ని సహించి, సర్వార్థ సిద్ధితో సయసత్తమ దేవుడుగా పుట్టి, ముప్పై మూడు సాగర సంవత్సరాల ఆయుస్సుకల అహమీంద్రుడయ్యాడు.''

ఇంతటి సవిస్తారమైన కథను యశోధం మునీశ్వరుడు చంపాపురం అధిపతి అయిన గంధభాజుడికి చెప్పారు. గంధభాజుడు, భట్టారకులకు నమస్కరించి, సంసార జీవితంపై విరక్తి కలుగగా, తన పెద్దకొడుకు ధాత్ర వాహనునికి పట్టం కట్టి, నూరుమంది రాకుమారులతో యశోధర ఋషుల దగ్గర తపస్సుకు పూనుకొన్నాడు. అప్సరసల్లాంటి ఐనూరుమంది రాణులు యశోధర గురువులు మరియు పద్మావతి సన్యాసినుల వద్ద దీక్ష తీసుకొని,

తపస్సు చేసి సమాధి మరణం చేత దేహత్యాగం చేసిన పిమ్మట సౌధర్మ మొదలైన వివిధ దేవలోకాల్లో పుట్టారు. గంధభాజముని ద్వాదశాంగ, చతుర్దశ పూర్వ ఆగమాల్ని నేర్చుకొని, కొంతకాలం ఉగ్రమైన తపస్సు చేసి,. విహరిస్తూ పాండ్య దేశంలోని పళికుంతళ అనే పర్వతం మీద బాహ్యాభ్యంతర పరిగ్రహాల్ని త్యాగం చేసి, ధర్మ, శుక్లధ్యానాల్ని ధ్యానించి, కర్మక్షయం చేసుకొని, సురాసురులతో పూజలు పొంది మోక్షానికి వెళ్ళారు.

ఆరాధకులైనవారు సుకౌశలస్వామి తిరికోపసర్గాన్ని సహించిన రీతిని మనస్సులో స్మరించి ఆకలి, దాహం, వాతం, నొప్పి మొదలైన వేదనల్ని సహించి దర్శన, జ్ఞానాల్ని సాధించి సమాధి మరణంవల్ల మరణించి మోక్ష సుఖాన్ని పొందుదురుగాక!

* * *

# 3. గజకుమారుని కథ

వేల మీద వెల్లకిలా పడుకోబెట్టి, ఎద నుంచి బొడ్డుదాకా చర్మాన్ని చీల్చి - లావు, పొడవు కలిగిన మేకులతో నేలకు కొట్టి శరీరాన్ని హింసించినప్పటికీ చలించని దివ్యత్వంతో ప్రకాశించే గజకుమారుని జ్ఞాన, దర్శన, శీలం ప్రాశస్త్యం పొందాయి.

జంబూ ద్వీపమనే భారతదేశంలో సురటమనే ప్రాంతం. అందులో ద్వారావతి అనే పట్టణం. దానిని పరిపాలిస్తున్న రాజు అర్ధచక్రి విష్ణు. అతని తండ్రి వసుదేవస్వామి; తల్లి గాంధర్వదత్త. వారికి గజకుమారుడనే కుమారుడు కలిగాడు. వారంతా ఇష్ట విషయ, కామభోగాలతో సుఖంగా కాలం గడుపుతూ ఉండేవారు.

ఇక్కడ సూరదత్తమనే నాడులో పౌదనపురమనే పట్టణం. అక్కడి రాజు అపరాజితుడు, ప్రచండ పరాక్రమశాలి. ఎవరికీ భయపడని ఆ రాజు, విష్ణువు ఆజ్ఞను కూడా లెక్కించేవాడు కాదు. ఇలా ఉండగా ఒకసారి విష్ణువు ''పౌదన పురాధిపతియైన అపరాజితుణ్ణి యుద్ధంలో గెలిచి ఎవరైతే బంధించి తీసుకొస్తారో అతను కోరినదల్లా ఇస్తాను'' అని దండోరా వేయించడంతో గజకుమారునికి ఆ విషయం పట్ల ఆసక్తి కలిగింది. ఇది తెలుసుకున్న రాజు గజ కుమారుణ్ణి పిలిపించి చతుర్బల సైన్యాన్ని ఇచ్చి అపరాజితుని పైకి యుద్ధానికి పంపాడు. గజకుమారుడు యుద్ధంలో గెలిచాడు. అపరాజితుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి అనేక గజ, అశ్వ, వస్తు వాహనాలతో తీసుకొని వచ్చి విష్ణువుకు ఒప్పించాడు. తన మాట ప్రకారం అతను ''నీకేం కావాలో కోరుకో'' అనడంతో గజకుమారుడు ''నాకు వేరే ఏమి అక్కర్లేదు, మీ అనుగ్రహం వల్ల సమస్తమూ నాకు ఉంది. అయితే ఒక్కటే ఒక్కటి వేడుకుంటాను. మీ అంతఃపురాన్ని వదిలి, ఈ పట్టణంలో నాకు నచ్చిన స్త్రీలను ఎన్నుకొని, నా కోరిక తీరేంత వరకూ అనుభవిస్తాను. దీనిని దయచేసి అనుగ్రహించాలి'' అన్నాడు. రాజు అలాగే కానివ్వమన్నాడు.

గజ కుమారుడు ఆ పట్టణంలోని, పరదులు, పార్వులు, ఒక్కలిగాళ్ళు, సామంతులు అందరి ఇళ్ళలోని అందమైన స్త్రీలలో తన కంటికి,

మనస్సుకు నచ్చిన వాళ్ళను తెచ్చి వారితో సుఖించసాగాడు. ఆ ఊరిలో ఒక కంసాలి, పంగుళ అతని పేరు. అతని భార్య వసుంధరి. అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య, కాంతి, హావభావ, విలాస, విభ్రమాలు కలిగిన స్త్రీ. గజకుమారుడు ఆమెకై ఆశపడ్డాడు. ఆమెను తీసుకువెళ్ళి తన ఇంటిలో ఉంచుకొని సుఖపడుతుండగా ఇక్కడ పంగుళుడు పత్నీ విరహం చేత పగలు రాత్రి కుమిలిపోతూ తాను అసమర్థుడవడం చేత ఏమీ చేయలేక, మనస్సులో గజకుమారుని పట్ల అపారమైన ద్వేషాన్ని పెంచుకొన్నాడు.

కాలం సాగిపోతూ ఉంది. ఒకరోజు అరిష్టనేమి భట్టారకుని యాత్ర ద్వారవతికి వచ్చింది. విష్ణువుతో గజకుమారుడు తీర్థంకరుని దర్శించి నమస్కరించి, పూజించాడు. భట్టారకుడు ధర్మాన్ని బోధిస్తూ అగమ్యమార్గ గాములకు,ఇతరుల భార్యలను చెరపట్టే వారికి కలుగబోవు దుర్గతిని వివరించి చెప్పడంతో, విని జైన ముని మాటలు అబద్ధాలు కానేరవని భావించి, భోగాల పట్ల జుగుప్స వైరాగ్యం కలిగి, గజకుమారుడు అన్నిటినీ త్యజించాడు. అరిష్టనేమి భట్టారకుని వద్ద దీక్ష పొంది పన్నెండు సంవత్సరాలు భయంకరమైన తపస్సులో జీవించాడు. ఆ తరువాత గ్రామ, నగర, గిరిదుర్గ, ప్రాకారదుర్గ, ద్వీపాలలో సంచరిస్తూ, తిరిగి ద్వారవతికి వచ్చి రేవతోద్యాన వనంలో ప్రతిమా యోగంలో నిలిచాడు.

అది తెలుసుకున్న స్వజనులు, పరిజనులు, బంధువులు, సేవకులు వచ్చి గజకుమార భట్టారకుని అర్చించి వెళ్ళారు. కంసాలి పంగుళునికి గజకుమారుడు వచ్చిన విషయం తెలిసింది. తన పగ తీర్చుకోవడానికి సరియైన అవకాశం కుదిరింది అని అతనికి అనిపించింది. పొడవు, లావు అయిన ఇనుప మేకులను తీసుకొని వెళ్ళి క్షమ అనే పశ్చాత్తాప భావనతో ఉన్న మహాముని గజకుమారుని పడుకోబెట్టి, పొర్లించి గుండె నుండి బొడ్డు దాకా చీల్చి, చర్మాన్ని ఒలచి నేలకు అతుక్కునేంతవరకు ఇనుప మేకులను దించి వేసాడు. అయితే గజకుమార భట్టారకుడు క్షమతో ప్రకాశించి, ధర్మ ధ్యాన, శుక్ల ధ్యానాలను మనసులో ధ్యానించి, రత్నత్రయాలను సాధించి సమాధి మరణంలో చనిపోయి, దేవలోకమనే సౌధానికి కళసం వంటి సర్వార్థ సిద్ధి అనే స్వర్గంలో ముప్పై మూడువేల దీర్ఘ సంవత్సరాల ఆయుష్షుతో, దివ్య సుందర విగ్రహంతో, తామర పూల శోభతో అహమింద్రునిగా జన్మించాడు.

ఆరాధకులు కాదగినవారు గజకుమారునివలె మానవ ఉపసర్గంలోనే వేదనను సహించడం మనస్సులోనే అలవరచుకొని, ఆకలి, దప్పిక మొదలయిన వేదనలను సహించి దర్శన, జ్ఞాన, శీలం మొదలయినవి సాధించి, సమాధి మరణంలో చనిపోయి సుర. మోక్షాలను పొందాలి.

* * *

# 4. సనత్కుమార చక్రవర్తి కథ

దురద, వృద్ధాప్యం, వాంతి మొదలైన రోగాలను నూరేళ్ళు సహించి సనత్కుమార చక్రవర్తి ఋషి ఉత్తమగతులను పొందాడు.

జంబూద్వీపమైన భారతదేశంలో కురుజాంగణ అనే ఊరు ఉంది. అక్కడ హస్తినాపురమనే పట్టణాన్ని విశ్వసేన పరిపాలిస్తున్నాడు. అతని భార్య సహదేవి. వారికి సనత్కుమారుడనే పుత్రుడు కలిగాడు. అతడు సర్వలక్షణ సంపూర్ణుడై, సకల కళా పారంగతుడై దేవాసురులను తలదన్నే సౌందర్యంతో విలసిల్లుతుండేవాడు. సామంతరాజైన సింహవిక్రముని కుమారుడు మహేంద్రసింహుడు అతని స్నేహితుడు.

ఒకరోజు ఏకచక్ర పురాధీశ్వరుడైన శత్రుందముడు విశ్వసేన మహారాజుకు కానుకలను పంపాడు. వాటిలో పట్టవారమగ అని పిలవబడే తుంటరి అశ్వమూ ఉంది. దానిని అధిరోహించి సనత్కుమారుడు ఒకరోజు లక్ష్మీగృహమనే ఉద్యానవనంలోవిహరిస్తూ, కోలుతో ఆ అశ్వాన్ని అదిలించగా అది గాలి కంటే వేగంగా ప్రయాణించి దూరంగా ఉన్న అరణ్యం ప్రవేశించింది. ఇక్కడ విశ్వసేన మహారాజు, సామంతరాజులూ, పరివారము చేరి అశ్వపు డెక్కల గుర్తుల ఆధారంగా మూడురోజులు వెదికారు. ఐనా కుమారుని జాడదొరక్క కుమిలిపోసాగాడు. అప్పుడు మహేంద్రసింహుడు రాజును సమాధాన పరిచి, సనత్కుమారుడు పాతాళంలో ఉన్నా సరే వెతికి తెస్తాను దుఃఖించకుండా వెనుదిరగమని వారికి చెప్పి, రాజును, పరివారాన్ని వెనుకకు పంపి తాను కొంత పరివారంతో అడవిలో ప్రవేశించాడు. కొంతసేపు వెదికాక పరివార జనం విసిగి మహేంద్ర సింహుణ్ణి ఒంటరిగా వదిలివేసి రాజ్యానికి తిరిగి వచ్చేసారు.

మహేంద్రసింహుడు అనేకానేక గిరిపర్వతాలను, వేటగాళ్ళ నివాసాలను వెదుకుతూ దాటి ముందుకువెళ్ళి ప్రియంగషండమనే అరణ్యం చేరుకొన్నాడు. ఆ అరణ్యం మధ్యలో ఉన్న యింటిలో విశ్రమించి, తన స్నేహితుణ్ణి జ్ఞాపకం చేసుకుని దిగులు చెంది, అక్కడున్న దేవతా విగ్రహం ఎదురుగా నిద్రించాడు. ప్రాతఃకాలం అతనికొక కల వచ్చింది. వంద ఆడ ఏనుగులతో చెరువులోని తేట

నీటిలో క్రీడిస్తున్న మదగజము, పండ్లతో నిండిన మామిడి వృక్షముచూచి మేల్కొని, ఎంతో సంతోషంతో తన ఆశ సిద్ధిస్తుందని భావించి తిరిగి నిద్రపోయాడు. నిద్రిస్తున్న అతని వద్దకు వ్యంతరుడైన భూతాంబరుడు వచ్చి అతణ్ణి ఎత్తుకొని విజయార్ధ పర్వత సమీపంలో ఉన్న, భూతరమణమనే అరణ్యంలో క్షులక మానసమనే సరోవర తీరంలో పడుకోబెట్టి వెళ్ళిపోయాడు.

సూర్యోదయమైంది. మహేంద్రసింహుడు కళ్ళువిప్పి చుట్టూ చూసాడు. సముద్రమంత విశాలమైన విచ్చుకున్న కలువ, పద్మం, ఎర్రతామర, తెల్ల తామర పూలతో, రమణీయమైన హంస, చక్రవాక, బలాక పక్షుల కలకలా రావాలతో విహరిస్తున్న చెరువును చూశాడు. అశోక, పున్నాగ, వకుళ, చంపక, సహకార, లవంగ, క్రముక, నాళికేర, నాగవల్లి మొదలయిన వృక్షాలతో భూమికి దిగివచ్చిన ఇంద్రవనంలా ఉన్న సుందరమైన ఆ అరణ్యం సంభ్రమాశ్చర్యాలు కలిగించడమేకాక శుభశకునంగా అనిపించింది. తన మిత్రుడైన సనత్కుమారుడు కనబడతాడనే సూచనలుగా భావించి ఆనందించాడు. అదే సమయంలో మంద్రస్థాయిలో మృదు మధురమైన గంభీర ధ్వని, వేణునాదం, మృదంగ తాళగతులతో కలిసి వీనులకు, మనస్సుకు ఆనందం కలిగింపజేసేలా తేలివచ్చింది. హరిచందన, కాలాగురు, శ్రీగంధ తురుష్క సువాసనలు వ్యాపించాయి. బహుశా ఆ ప్రదేశంలో దేవాలయం ఉండవచ్చునని భావించి, ఆ దిక్కుగా నడిచాడు. అక్కడ అందమైన బంగారుతో చేయబడిన మిద్దె యిల్లు. అనేక రత్నాలతాపడంతో అలంకరించబడి విద్యాధర స్త్రీల క్రీడలకు సరితూగే ఆ భవింతిని చూసి, దాన్ని సమీపించి ఒక వృక్షం వెనుక నిలబడి చూస్తే ఎదురుగా ఏముంది? ఆ యింటి ముంగిలి ప్రదేశంలో రత్నఖచిత మంటపంలో దివ్యమైన శయ్యలపై అప్సరసలు వీవెనలతో వీస్తుండగా ఆనందంతో నాటకం తిలకిస్తున్న సనత్కుమారుడు. పూలతో విరబూసిన వృక్షంలా ఆనందంతో మహేంద్ర సింహుడు రోమాంచితుడయ్యాడు. అతడు వెంటనే పరుగుపెట్టాడు. నేరుగా వచ్చి సనత్కుమారుని కాళ్ళపైపడి మూర్ఛపోయాడు. శైత్యోపచర్యలనంతరం మేల్కొంచి ''ఆరునెలల తరువాత మిమ్మల్ని చూస్తున్నాను స్వామి! ధన్యవాదాలు'' అంటూ దుఃఖిస్తున్న మహేంద్ర కుమారుణ్ణి సనత్కుమారుడు ఓదార్చాడు. విపులశ్రీ అనే విద్యాధర స్త్రీని పిలిచి ''ఇతడు నా సోదరుడు. అనుభవించిన శ్రమ మరచిపోయేలా ఇతనికి స్నాన, పాన, భోజనాదులు ఏర్పరచు

అని ఆజ్ఞాపించాడు. ఆ విద్యాధర స్త్రీ వైభవంగా మహేంద్రసింహునికి స్నానం చేయించి, దివ్యాహారాన్ని యిచ్చి వస్త్రాభరణ గంధ మాల్య తాంబూలాదులు సమర్పించి తృప్తి పరిచింది. ఆ ఉపచారాలతో మహేంద్రసింహుడు తాను అనుభవించిన క్లేశాన్నంతా మరచిపోయాడు. ఎన్నో బాధలను అనుభవించిన వ్యక్తికి స్వర్గం లభిస్తే ఎలా ఉంటుందో అలా ఉంది మహేంద్ర సింహునికి! ఆ తరువాత సర్వాభరణభూషితుడై నేత్రమనోహరి దివ్యసభలో సనత్కుమారునితో ఆసీనుడై ''స్వామి! వ్రత, శీల, ఉపవాస, తపశ్చరణ, సన్యాసిత్వం మొదలయిన శుభాచారాలతో సత్పురుషుడైన వ్యక్తి తరువాతి జన్మలో దేవతాస్త్రీలకు అధికారి అవుతాడని విన్నాము. కానీ మీరు ఈ జన్మలోనే అంతటి వైభవాన్ని అనుభవిస్తున్నారు. ఇది నాకు మహాశ్చర్యాన్ని కలిగిస్తున్నది'' అని అడిగాడు. అప్పుడు సనత్కుమారుడు వారంతా దేవతా, విద్యాధర స్త్రీలని తెలిపాడు. ''వీరందర్ని మీరు ఎలా పొందగలిగారు? ఇక్కడికి ఎలా రాగలిగారు? దయచేసి అంతా అర్థమయ్యేలా వివరించండి'' అంటూ మహేంద్రసింహుడు విన్నవించుకున్నాడు. రాత్రంతా అతిరంజనమనే నాటకాన్ని చూస్తూ నిద్ర లేకపోవడంతో సనత్కుమారుడు కమలమతి అనే విద్యాధర స్త్రీని పిలిచి తనను గురించిన వివరాలన్నీ అతనికి తెలియపరచమని చెప్పి శయ్యాగృహానికి వెళ్ళిపోగా కమలమతి మహేంద్రునికి ఇలా చెప్పసాగింది.

''సనత్కుమారుడు కూర్చున్న ఆ తుంటరి గుర్రం వాయువేగ మనోవేగాలతో గిరివనలోయ నదీప్రదేశాలలో రాత్రిపగలు ప్రయాణించ సాగింది. ఆపై ఆయాసాన్ని భరించలేక పేగులు చిరిగి పోయి చర్మం చీరుకు పోవడంతో చనిపోయింది. సనత్కుమారుడు ఆకలి దప్పులతో అలసి ఒక మర్రి చెట్టు క్రింద ఉన్న రాయిపై స్పృహ తప్పాడు. అప్పుడు ఆ మర్రిచెట్టుపై నివసిస్తున్న మనోహరుడనే యక్షుడు సనత్కుమారుణ్ణి చూసి సర్వం సహా చక్రవర్తి అవుతాడని గ్రహించి గంధపు నీటిని అతనిపై చిలకరించి దేహం శీతలమయ్యేలా చల్లటి గాలిని ఏర్పరిచాడు. బంగారుపాత్రలో చల్లటి, సుగంధ పూరితమైన నీటిని తాగడానికి ఇచ్చాడు. అప్పుడు సనత్కుమారుడు ''అయ్యా! మీరెవరు? ఈ చల్లటి నీరు ఎక్కడినుండి తెచ్చారు?'' అనడగడంతో యక్షుడు నేను ఈ వటవృక్షంలో నివసిస్తున్న యక్షుణ్ణి, నా పేరు మనోహరుడు. క్షుల్లక మానస సరోవరం నుండి ఈ నీటిని తీసుకువచ్చాను'' అని తెలిపాడు.

''అలాగైతే నన్ను ఆ సరోవరం వద్దకు తీసుకువెళ్ళు. ఆ సరోవరంలో మునక వేసి, గుక్కెడు నీళ్ళుతాగితే కాని నాదాహం తీరదు'' అనడంతో యక్షుడు అంగీకరించి సనత్కుమారుణ్ణి ఎత్తుకొని వెళ్ళి ఆ సరోవరం వద్ద దించి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో సనత్కుమారుని శత్రువైన సితక్షయుడనే భేతాళుడు అతనిని చూచి క్రోధంతో, భీకర రూపంతో సంహరించడానికి వచ్చాడు. సనత్కుమారుడు సింహనాదం చేసి, మహాశిలను ఒకదానిని ఎత్తి యుద్ధానికి సిద్ధపడ్డాడు. భేతాళుడు నాగపాశంతో సనత్కుమారుని చేతిలోని శిలను ముక్కలు చేశాడు. అనేక విధాలైన మాయా యుద్ధాలతో ''సముద్రంలోని బడబాగ్నికి ఇతణ్ణి విసిరి వేస్తాను'' అంటూ ఆకాశానికి ఎగిరిన భేతాళుడిని సనత్కుమారుడు అతని భుజాలను బలంగా మోదడంతో భేతాళుడు వెనుదిరిగి చూడకుండా పారిపోయాడు. అక్కడున్న యక్ష, కిన్నెర, కింపురుషులు చేతులు జోడించి జయజయ ధ్వానాలతో పుష్పాలను జల్లి పూజించారు.

ఇంద్రప్రభ అనే విద్యాధరుడు వచ్చి సనత్కుమారుని పాదాలకు వంగి నమస్కరించి ఇలా చెప్పాడు: ''స్వామీ, నా రాజు యొక్క ఆజ్ఞ చేత ముప్ఫైయారు సంవత్సరాలు మీ రాక కొరకు వేచివున్నాను. నా అదృష్టం కొద్దీ మీరు వచ్చారు. రండి! విమానంలో వెళదాం''. సనత్కుమారుడు తన కోరిక తీరిన తరువాత వస్తాను అని చెప్పి క్షుల్లక మానస సరోవరంలో మనసారా క్రీడించి, తృప్తి చెంది ఇవతలకు వచ్చాడు. ఖేచరుడు అతణ్ణి ఆ వనంలో అతి రమణీయమైన ప్రదేశంలో ఆడుతున్న విద్యాధర స్త్రీల సమీపంలో నిలిపి వెళ్ళాడు. సనత్కుమారుని రూపమనే గాలము ఆ ఖేచర కన్యల కళ్ళనే చేపలను ఆకర్షించింది. మన్మథుని పంచబాణాలు వారి దేహంలో ప్రవేశించి మోహపరవశులై వారు నీరింకిన చేపలయ్యారు. మన్మథుని వింటి కౌశలమే కౌశలము. దేహాన్ని స్పృశించకనే లోపలి మనస్సును చీలుస్తుంది అది. ఆ స్త్రీలు సనత్కుమారునిముఖంచూస్తూ ఆకర్షింపబడుతుండగా ఇక్కడ ఇంద్ర ప్రభుడు ప్రియ సంగమ అనే పట్టణం చేరి భానువేగుడనే విద్యాధరునికి తాను ఆదేశ పురుషుణ్ణి తెచ్చి భూతరమణంలో జ్యోతిర్వితానమనే మంటపం లోని స్త్రీల వద్ద వదిలి వచ్చానని చెప్పడంతో భానువేగునికి అమితమైన

సంతోషం కలిగింది. తృప్తి చెందేలా ఇంద్రప్రభునికి కానుకలు ఇచ్చి విపులశ్రీ అనే విద్యాధర స్త్రీని పిలిచి నీవిపుడే వెళ్ళి సనత్కుమారునికి భోజనాది సదుపాయలను ఏర్పరచమని ఆజ్ఞాపించాడు. విపులశ్రీ పరివారంతో వచ్చి సనత్కుమారునికి స్నాన భోజనాదికాలను ఏర్పాటు చేయించి, అతనిని దివ్యమైన శయ్యపై కూర్చోబెట్టి, అనంగసుందరి అనే విద్యాధరి నాట్యాన్ని ఏర్పాట్లు చేయించింది. సనత్కుమారుడు ''ఇదేమిటి? నాకింత ఉపచారాలు మీరెందుకు చేస్తున్నారు? మీరెవరు?'' అనడిగాడు. విపులశ్రీ సనత్కుమారునికి ఇలా చెప్పింది.

స్వామి చెబుతున్నాను వినండి. ''విజయార్థ పర్వతంలో ప్రియ సంగమ పురాధిపతి భానువేగునికి శ్రీమతి మొదలైన ఎనిమిది మంది భార్యలకు జన్మించిన ఎనిమిదిమంది ఆడపిల్లలు వీరు. లక్ష్మీమతి, కనకకాంత, మందారసేన, అలక, అలంభూష, హేమవతి, హేమమాలిని, విజయార్థవతి మొదలయినవారు. ఒకరోజు తన బిడ్డలను ఎవరికిచ్చి పెళ్ళి చేయాలని ఒక నైమిత్తికుణ్ణి భానువేగుడు అడిగినపుడు అతను ''క్షుల్లకమానస సరోవరం వద్ద సిత యక్షుణ్ణి ఎవరు యుద్ధంలో గెలుస్తారో అతనికే యివ్వండి'' అని భవిష్యత్తు చెప్పాడు. ఆ కారణం చేత నీవే మా స్వామి'' అని చెబుతూండగానే మహావైభవంతో రాజైన భానువేగుడు అక్కడికే వచ్చాడు. సనత్కుమారుడు లేచి నిలబడ్డాడు. అతణ్ణి గౌరవించి వినయం ప్రకాశిస్తుండగా భానువేగుడు మూడులోకాలకు తిలకప్రాయుడైన అల్లుణ్ణి పొందానని అతిశయమైన సంతోషం పొందాడు. అంతా ఊరికి తిరిగి వచ్చారు. అదేరోజు భానువేగుడు తన ఎనిమిది మంది ఆడపిల్లలను సనత్కుమారునకిచ్చి వివాహం జరిపించాడు. ఆ దేవతాస్త్రీల వంటి పత్నులతో సనత్కుమారుడు సుఖంగా జీవించసాగాడు.

ఆ రాత్రి ఒక వనదేవత సునంద అనే కన్య దుఃఖం చూడలేక కరుణతో వచ్చి సనత్కుమారుణ్ణి తీసుకువెళ్ళి, హరికూట పర్వతం యొక్క జ్యోతిర్వనంలో ఒక దివ్యమైన పరుపును నిర్మించి, దాని మీద పడుకోబెట్టి వెళ్ళిపోయింది. తెల్లవారిన వెంటనే కళ్ళు తెరిచి సనత్కుమారుడు చూడగా, అదొక వనం. లతామంటపం! క్రితం రాత్రే తనకు వివాహం జరగడం కలయో లేక నిజమో అని అతడు సందేహపడ్డాడు. చేతికి వివాహ కంకణం కట్టే ఉంది.

'కర్మానుసారం నడవవలసిందంతా నడుస్తుంది. అందువలన కష్టసమయంలో విషాదమెందుకు? సంపదపట్ల ఆశ్చర్యమెందుకు?'' అని వస్తు స్వరూపం ఆలోచిస్తుండగా, దూరంగా ఉన్న అడవి మధ్యలో ఉన్న ఆ సునంద అనబడే కన్య మొరలిడుతూ ఉంది. ''సాకేత పురాధిపతియైన సురథమహారాజుకూ, చంద్రయశి రాణికీ కూతురునై పుట్టాను. సునంద నా పేరు. సనత్కుమారుని భార్యను. నన్ను అన్యాయంగా వజ్రవేగుడనే విద్యాధరుడు ఎత్తుకొని వచ్చాడు. ఓ కిన్నెర, కింపురుష, గరుడ, గాంధర్వ, యక్ష, రాక్షసాది దేవతలారా, విద్యాధరులారా, ఎవరైనా నన్ను కాపాడండి''. ఈ దీనాలాపాలను విని ఆశ్చర్యపోయి చుట్టుపక్కలు చూస్తుండగా అక్కడున్న స్ఫటిక శిలపైన కూర్చుని కన్నీరు పెట్టుకుంటున్న యక్షకన్య సనత్కుమారునికి కనిపించింది. ఆమె వద్దకు వెళ్ళి ''నీవెవరు? ఆ సనత్కుమారుడెవరు?'' అని అడుగగా ఆమె చెప్పింది.

''అయోధ్యాపుర రాజు సురథుడు. అతని భార్య చంద్రయశి కుమార్తె సునంద నేను. గర్భంలో ఉండగానే నన్ను సనత్కుమారునికి అని భావించారు. ఒక రోజు మదనోద్యానంలో ఉయ్యాలలూగుతుండగా వజ్రవేగుడనే విద్యాధరుడు చూసి, నన్ను ఎత్తుకొని వచ్చాడు. ఇప్పటికి ఏడురోజులైంది. సనత్కుమారుడు హస్తినాపుర రాజు విశ్వసేనుని కుమారుడు'' అని చెప్పి సునంద ఏడవసాగింది. అప్పుడు సనత్కుమారుడు ''అతడిని చూస్తే నీవు గుర్తు పట్టగలవా? అతణ్ణి చూసావా?'' అని అడుగగా ''నా తండ్రి విశ్వసేన మహారాజును స్నేహభావంతో పలుకరించడానికి వెళ్ళినప్పుడు సనత్కుమారుని చిత్రపటం చిత్రింపించి తీసుకువచ్చాడు. దాన్ని చూస్తూ, చిత్రిస్తూ, ఆలోచిస్తూ కాలం గడపసాగాను. ఆ రూపం మిమ్మల్నే పోలుతూ ఉంది'' అంది. ''అలాగైతే నేనే సనత్కుమారుణ్ణి'' అని చెప్పాడు. అప్పుడు ఆమె సంభ్రమాశ్చర్యాలతో రోమాంచనం కలిగి ''వెదకబోయే తీగ కాలికి చుట్టుకున్న చందమైంది. స్వామి! నా అదృష్టం కొద్దీ మీరు ఇక్కడికే వచ్చారు. ఆ వజ్రవేగుడు తన చెల్లెల్ని కాపలా ఉంచి, నిద్రించడానికి తన నగరానికి వెళ్ళాడు. ఆమె జలక్రీడకు వెళ్ళి ఇంకారాలేదు. నడవండి! ఆమె రాకముందే ఇక్కడి నుండి వెళ్ళిపోదాం'' అంది. అప్పుడు సనత్కుమారుడు ''బెదరవద్దు, నిన్ను అపహరించుకొని వచ్చినవాణ్ణి మృత్యువుకు ఎరవేయకుండా ఇక్కడినుండి

కదలను'' అన్నాడు. ''ఎక్కడైనా ఉందా? అతడు ఖేచరుడు. మీరు అతణ్ణి ఎలా సంహరించగలరు?'' భయపడిన సునంద అడిగింది. ''ఆకాశగామియైన కాకిని సంహరించడం కష్టమా?'' అని సనత్కుమారుడు చెబుతూండగానే వజ్రవేగుడు అక్కడికి వచ్చాడు. భీతిల్లిన సునంద ప్రాసాదంలోకి చేరుకుంది.

ఖేచరుడు సనత్కుమారుణ్ణి చూసి రోషంతో, నా భార్యతో మాటలాడుతున్న వాణ్ణి ఇప్పుడే ముగిస్తాను అంటూ ఆర్భాటంతో మీద పడ్డాడు. అతను విసిరిన కత్తి వేటును తప్పించుకొని సింహంలా ఎగిరి సనత్కుమారుడు వజ్రంలాంటి చేతితో ఆ విద్యాధరుని భుజాలను చీల్చి విద్యాధర విధానాన్ని ప్రదర్శించడానికి ఎగరగా, వజ్రవేగుడు ఎగిరి నేలకూలి పోయాడు. సనత్కుమారుడు ఒక్కతే కన్య ఉన్న ప్రదేశంలో తాను ఉండడం యోగ్యం కాదని భావించి, ముందున్న లతామంటపానికి వచ్చేసాడు. ఇక్కడ జలక్రీడ ముగించుకుని వచ్చిన వజ్రవేగుని చెల్లి సంధ్యావళి అనబడే స్త్రీ చనిపోయి పడి ఉన్న తన అన్నను చూసి దుఃఖంతో మూర్ఛపోయింది. మేల్కొని దుఃఖంతో రోషం హెచ్చి ''అన్నను సంహరించిన దురాత్ముణ్ణి పాతాళంలో ఉన్నా కూడా, వెదికి ఇప్పుడే సంహరిస్తాను'' అంటూ దిక్కు, దిసలను వెదుకుతూ వచ్చింది. ఎక్కడా ఎవరూ కనబడక సునందను అడిగింది. ''దుష్ట నిగ్రహకుడు శిష్ట పాలన స్వరూపంలో పృథ్విని పరిపాలిస్తున్న స్వామి చోర, దార, నీచులను చంపకుండా ఉంటాడా?'' అంది. ''అతనెవరు? ఎక్కడున్నాడో చూపించు'' అనడంతో సునంద సనత్కుమారుడున్న ప్రదేశం చూపించింది. కత్తి పట్టుకుని, భయంకరమైన రూపం ధరించి, అతని దగ్గరకు తోసుకుని వచ్చిన సంధ్యావళి అతని సుందరమైన రూపం చూసి కామపరవశురాలై, ప్రేమ ఉప్పొంగి తనలోనే చెప్పుకొంది. ''నా అన్న తన తప్పు కారణంగానే చనిపోయాడు. ఇందులో ఇతని తప్పు ఏమీలేదు''. భయంకర రూపాన్ని మార్చుకొని, ముందటి రూపాన్ని ధరించి వెనుదిరిగి వెళ్ళి అన్న దేహాన్ని సంస్కరించి స్నానం చేసి సనత్కుమారుని పట్ల ఉన్న మోహంచేత విరహం అధికమై సునంద వద్దకు వచ్చి చెప్పింది: ''నీవు కరుణిస్తే నేను బ్రతుకుతాను. నీవు నాకు సోదరితో సమానం. అంతేకాదు నాకు కల్యాణం చేయించేదానవు. అందువల్ల ఇపుడే వెళ్ళి సనత్కుమారునికి ఇలా చెప్పు. ''ఈమె విజయార్ధ పర్వతం యొక్క అగ్రమందిర పురాధిపతియైన అశనివేగుడనే విద్యాధరునికీ, విద్యుత్ప్రభ అనే అతని భార్యకూ కూతురు. పేరు

సంధ్యావళి. మీరే శరణని ఈమె అనుకుంటూ ఉంది. ఈమెను దయచేసి మీరు స్వీకరించాలి.'' అని చెప్పి సునందను సనత్కుమారుని వద్దకు పంపింది. ఆమె సనత్కుమారునికి అలాగే చెప్పింది. ''తండ్రి-తల్లి వచ్చి ఇవ్వని స్త్రీని ప్రాణిగ్రహణం చేయడం నాకు అయోగ్యమైనది'' అని సనత్కుమారుడు చెప్పడంతో, మిత్రులు, సంబంధీకులు ఇస్తే స్వీకరించవచ్చు అని అతణ్ణే ఒప్పించి, దివ్య దేవతలే మిత్రులు, బంధువులై వచ్చి సంధ్యావళి పెళ్ళి చేయడానికి సిద్ధపడ్డారు. మహావైభవంతో పాణిగ్రహణ పూర్వకంగా సునంద సంధ్యావళి వివాహాన్ని చేసింది. సంధ్యావళీ, సునందను సనత్కుమారునికి ఇచ్చింది. ఇలా వారంతా అన్యోన్యంగా గాంధర్వ వివాహం చేసుకొని సుఖంగా జీవించసాగారు.

ఇక్కడ వజ్రవేగుని తండ్రి అశనివేగుడు తన పుత్రుడు ఎంతకూ తిరిగి రాకపోవడం చేత చింతిల్లి, అతడిని వెతికి రావడం కోసమై అవలోకిని అనే విద్యను పంపాడు. అది పావురాయి రూపంలో వచ్చి వీరిని చూసి పోవడం సంధ్యావళి గమనించింది. భర్తతో ఇలా చెప్పింది. ''స్వామీ! నా తండ్రి వజ్రవేగుడు బహు పరాక్రమశాలి. వజ్రవేగుని మరణం అతనికి తెలిసిపోయింది. మీ పైకి యుద్ధానికి వస్తాడు. అందుకై మీరు ప్రజ్ఞప్తి అనే మహావిద్యను స్వీకరించండి''. సనత్కుమారుడు అది విని నవ్వి ఈ ఖేచరుడనే జింకలను హతమార్చడానికి నాకు విద్య వేరే కావాలా? అని తిరస్కరించినా అతనికి బలవంతంగా ఆ విద్యను నేర్పింది.

రథమాపుర చక్రవాళపురానికి విద్యాధరుడైన చంద్రయశుడు అధిపతి. అతని భార్య విద్యుద్వేగ. వారికి చంద్రవేగ, భానువేగ అని ఇద్దరు కుమారులు. కొంతకాలం గజాధరుడనే ఋషి వద్ద ఉన్న రాజు చంద్రయశునికి రాజ్యంపట్ల విరక్తి కలిగి తన పెద్ద కుమారునికి పట్టం కట్టి, చిన్న కుమారునికి యువరాజు పట్టం కట్టి తపస్సుకు వెళ్ళిపోయాడు. చంద్రవేగునికి నూరుమంది కుమార్తెలు జన్మించారు. అతి సుందరమైన రూప, లావణ్యాలతో పెరగసాగారు. వారిని వేగుడు కబురు పంపాడు. ఐతే చంద్రవేగునికి వారిని ఎవరికి ఇవ్వాలో తెలియక ఒక దైవజ్ఞుని ప్రశ్నించగా అతను ఎవరైతే మానస సరోవరంలో సితయక్షుణ్ణి గెలుస్తాడో, అశనివేగుని కుమారుడైన వజ్రవేగుణ్ణి ముష్టియుద్ధంలో సంహరిస్తాడో, అశనివేగుణ్ణి కూడా యుద్ధంలో సంహరిస్తాడో అతనికి మీ

కుమార్తెని ఇవ్వమని సలహా ఇచ్చాడు. దేవగురు అనబడే ఆ సంయమి ఆదేశాను సారం చంద్రవేగుడు తన ఇద్దరు కుమారులు హరిశ్చంద్ర, చంద్రసేనలను దివ్యరథంలో సనత్కుమారుని వద్దకు పంపాడు. వారు వచ్చి సనత్కుమారునికి నమస్కరించి తమ తండ్రి ఆజ్ఞననుసరించి తమను సేవించడానికి వచ్చాము అని అతని వద్ద నిలబడ్డారు. అంతలోనే చంద్రవేగ, భానువేగలిద్దరూ తమ భారీ సైన్యాలతో వచ్చి సమత్కుమారుని ముందు నిలబడ్డారు.

ఇక్కడ అశనివేగుడు కుమారుడు చనిపోయిన వృత్తాంతాన్ని విని కుపితుడై సమస్త సైన్యంతో బయలుదేరి ఇంద్రుడు అడ్డుకున్నప్పటికీ వదలకుండా సంహరిస్తానని గర్జిస్తూ వచ్చాడు. చంద్రవేగుడు సనత్కుమారునితో ''దేవా! ఇతనితో యుద్ధం చేయటానికి నేనొక్కడినే చాలు మీరు చూస్తూ ఉండండి'' అని భీకర యుద్ధం ప్రారంభించాడు. సనత్కుమారుడు వజ్రసారమనే రథాన్ని అధిరోహించి ఆకాశంలో ఛత్ర, చామర, ధ్వజ పతాకాలతో మహా వైభవంతో నిలిచి యుద్ధం చూడసాగాడు. ''నా కుమారుణ్ణి చంపినవాడిని ప్రాణంతో బ్రతకనిస్తానా? ఈ క్షణమే నాశనం చేస్తాను'' అని బొబ్బలు పెడుతూ అశనివేగుడు సమీపిస్తుండగా, సనత్కుమారుడు అర్ధ చంద్ర బాణంతో అతని తలను ఒక్క వేటుతో నరికాడు. తళతళమంటూ రత్నకుండలాలతో, శోభాయమానమైన కిరీటంతో వెలుగుతున్న ఆ తల నేలపడడం చూచి శత్రు జనం చెల్లాచెదురయ్యారు. కొందరు పారిపోయారు, కొందరు పళ్ళు గిటకరుచుకొని శరణు వేడారు. వారికి అభయమివ్వబడింది. చంద్రవేగుడు మహావైభవంతో సనత్కుమారుణ్ణి పిలుచుకొని పట్టణ ప్రవేశం చేసాడు. మంచి రోజు, వార, నక్షత్ర, ముహూర్త లగ్నంలో చంద్రమతి, చంద్రశ్రీ, చంద్రలేఖ, శశికాంత, మనోహరిణి, హరిణాంక, కమలముఖి, ప్రియదర్శన, మొదలైన తన నూరు కన్యలను ప్రాణిగ్రహణ పూర్వకంగా వివాహం చేయించాడు. సనత్కుమారుడు వారందరితో విద్యాధర కల్పంలో సుఖంగా జీవించసాగాడు.

ఒకరోజు చంద్రవేగుడు సిద్ధకూటానికి భక్తితో వెళ్ళి దేవుణ్ణి పూజించి అక్కడున్న సుమాళి అనే అవధిజ్ఞానికి నమస్కరించి ధర్మాన్ని విని ''మునీశ్వరా, సనత్కుమారునికీ, సితయక్షునికీ వైరముండడానికి కారణమేమి?'' అని అడిగాడు. సుమాళి మునీశ్వరులు ఆ కథను ఇలా చెప్పసాగారు.

ఈ జంబూద్వీపమైన భరతక్షేత్రంలో మగధ అనే ఊరు. అక్కడ కాంచనమనే పట్టణాన్ని ప్రతిముఖుడు పరిపాలిస్తుండేవాడు. అతను ఎనిమిది వందల అంతఃపురాలకు అధిపతి. ఇలా ఉండగా అదే ఊరిలో శ్రీమంతుడైన చంద్ర అనే కోమటి నివస్తూ ఉండేవాడు. అతని భార్య విష్ణుశ్రీ. ఆమె అత్యంత రూపవతి, లావణ్యవతి, సౌభాగ్యవతి, కాంతిమతి, హావభావ విలాస, విభ్రమ సౌందర్యాలతో కూడుకొన్న స్త్రీ. ఒకరోజు ఉద్యానవనానికి వెళుతున్న రాజు మిద్దెపైన దేవకన్య సౌందర్యంతో సమానమైన విష్ణుశ్రీని చూచాడు. వెంటనే ఆమెపట్ల మోహితుడై ఆమెను వశపరచుకొని తన పెద్దభార్యగా చేసుకున్నాడు. దీనితో సమస్త అంతఃపురమూ ఆమె పట్ల కినుక వహించింది. ఒకరోజు సార్వభౌమ అనే పట్టపుటేనుగు మదించి, సంకెలలు తెంచుకొని దొరికిన వారిని దొరికినట్టు చంపుతూ రాగా రాజు దాన్ని పట్టుకొని తిరిగి కట్టి వేసాడు. రాజు తిరిగి వచ్చేలోగా రాణులందరూ కూడా ఎవరికీ తెలియకుండా శరీరాన్ని శ్మశానంలో విసిరివేసారు. రాజు తిరిగి వచ్చి రాణి గురించి ప్రశ్నించగా చనిపోయిందని చెప్పారు. గాఢ దుఃఖంతో మూర్ఛితుడైన రాజు మేలుకొని శ్మశానికి వెళ్ళి ఆ భయంకరమైన దేహాన్ని చూసి విరక్తి చెంది పరస్త్రీ అపహరణం చేసిన తానెంత పాపిని అని తన్ను తాను దూషించుకొంటూ తన పెద్ద కుమారుడు విమలవాహనునికి పట్టం కట్టి సువ్రతుడనే ఆచార్యుని వద్ద దీక్ష స్వీకరించి కొంతకాలం తపస్సు చేసాడు. ఆ తరువాత సమాధి మరణంలో చనిపోయి ప్రాణకల్పంలో ఇరవై దీర్ఘ సంవత్సరాల తర్వాత ఆయుష్షు పొంది ప్రతీంద్రునిగా జన్మించి దేవలోక సుఖాలను అనుభవించసాగాడు. జంబూ ద్వీపమైన భరతక్షేత్రంలో మగధ పట్టణంలో కనక అనే ప్రాంతాన్ని హరివాహన పరిపాలిస్తూ ఉండేవాడు. ప్రతిముఖుడు అక్కడ రాజశ్రేష్ఠి. అర్హదాస మరియు అతని భార్య జనదత్తకు కుమారుడుగా జన్మించాడు. అప్పుడు అతని పేరు జినవర్మ, అతడు రూప, లావణ్య, సౌభాగ్య, కాంతులతో శోభిస్తు ఉండేవాడు. ఇలా ఉండగా కొంతకాలమయ్యాక అర్హదాసునికి ఏదో కారణం చేత వైరాగ్యం కలిగింది. తన అధికారాన్ని జినవర్మునికి ఇచ్చి అతను తపస్సు చేసి మోక్షానికి వెళ్ళాడు. జినవర్మ కొన్ని జైనలయాలను కట్టించి దాన, పూజ, శీల, ఉపవాసాల చేత శ్రావక ధర్మాన్ని ఆచరిస్తూ సుఖంగా జీవించసాగాడు.

క్రిందటి జన్మలో నాగచంద్ర శెట్టి తన భార్య విష్ణుశ్రీ ఎడబాటువల్ల దుఃఖితుడై ఆర్తధ్యానంతో చనిపోయి కొంతకాలం తిర్యక్ నరకంలో బాధపడి ఆ తరువాత భారతక్షేత్రంలో కపిల అనే బ్రాహ్మణునికీ, గంగ అనే అతని భార్యకూ భరద్వాజుని పేరుతో జన్మించాడు. కనకదండి, అనే సన్యాసికి శిష్యుడై సంచరిస్తూ కనక పురానికి వచ్చి మాసకాలం ఉపవాసం చేస్తూ మహాతపస్వియై అక్కడే నిలబడ్డాడు. అతని తపస్సు చూసి రాజైన హరివాహనుడు అక్కడికే వెళ్ళి పూజిస్తూ ఉండేవాడు. ఒక రోజు రాజుతో జినవర్మ కూడా అక్కడికే వెళ్ళగా, అతడిని చూసి తపస్వి భరద్వాజ మనస్సులో పూర్వవైరం కుతకుతలాడసాగింది. రాజు ఆ సమయంలో ''మీరు మా యింటిలో భోజనం చేయాలి'' అని విన్నవించడంతో భరద్వాజుడు ''ఒక నియమాన్ని పాటిస్తే మీ యింటిలో భోజనం చేస్తాను, లేకపోతే లేదు. అదేమిటంటే ఈ జినవర్మ వీపుమీద అడుగు భాగంలేని కంచం ఉంచి వేడిపాయసం అందులో వేసి తినాలని ఆశగా ఉంది అన్నాడు. ఆ ముని యొక్క విచిత్రమైన కోర్కెకు ఆశ్చర్యపడుతున్న రాజుతో జినవర్మ ''దేవా! మునీశ్వరులకు ఏ రీతిలో యిష్టం కలిగిందో ఆ పద్ధతిలోనే భుజించనివ్వండి'' అని అంగీకరించాడు. అందరూ అంతఃపురానికి వచ్చారు. ఆగర్భ శ్రీమంతుడైన జినవర్మను బోర్లాపడుకోబెట్టి అతని వీపుపైన అడుగుభాగం లేని పెద్ద కంచం ఉంచారు. దానిలో కుతకుతలాడుతున్న పాయసం పోసారు. అవి చల్లబడేదాకా ఉండి, ఆపై పాయసాన్ని తిని, కంచం పెకెత్తగా, వీపునున్న చర్మమంతా లేచి వచ్చింది. రాజు ''ఇతను తపస్వి కాదు, రాక్షసుడు, వెంటనే ఈ పంచమహాపాతకుణ్ణి ఊరి నుండి తరిమివేయండి'' అని కోపంతో ఆజ్ఞాపించగా జినవర్మ అతనిని సమాధాన పరిచాడు. ''మహారాజా! ఇతని తప్పేమీ లేదు. ఇది నా పూర్వ కర్మఫలము. తపస్వి పై కోపం తెచ్చుకోవద్దు'' అని తాను ఒక్కడే దీక్ష పొంది, మహిషగిరి అనే పర్వతంలో ఈ గాయం మానేటంత వరకు చెయ్యి ఎత్తను అని దృఢసంకల్పంతో నిలబడ్డాడు. గ్రద్దలు, కాకులు ఆ వచ్చి పుండును తోడి తోడి తిన్నాయి. అయినా మేరు పర్వతంలాగా అచంచల ధైర్యంతో ఆ వేదనను ఒక నెల వరకు సహించి సమాధి మరణంలో చనిపోయి, అచ్యుత కల్పంలో ఇరవై రెండు దీర్ఘ సంవత్సరాలు దివ్య సుఖాలను అనుభవించి తిరిగి జన్మించాడు. అచ్యుతేంద్రుడుగా ఉన్నప్పుడు అతని వాహన దేవుడుగా ఉన్న పరివ్రాజకుడు అక్కడనుండి వచ్చి చతుర్విధ సంసారంలో అనంత వేదన

అనుభవించి, చివరికి అంజనగిరి పర్వత చరియలో వశిష్ఠ ఘూక అనే ముని దంపతులకు బక అనే కుమారునిగా జన్మించి తపస్సు చేసి మరణించి సితయక్షుడయ్యాడు'' అంటూ సుమాళి మునులు చంద్రవేగునికి సనత్కుమారుని, సితయక్షుని పూర్వవైకరంయొక్క కథను చెప్పారు. అది విని మునికి నమస్కరించి రాజు తన పట్టణానికి వెనుదిరిగి వచ్చాడు.

ఇంత కథను సనత్కుమారుని ఆజ్ఞననుసరించి మహేంద్రసింహునికి కమలమతి అనే విద్యాధరి చెప్పి ముగించింది. అప్పటికీ సనత్కుమారుడు నిద్రలో ఉన్నాడు. మహేంద్రసింహుడు అతని దగ్గరకు వెళ్ళి ''నీ ఎడబాటు వల్ల దుఃఖంతో విశ్వసేన మహారాజు, సహదేవి మహారాణి కుములుతున్నారు. వారు బ్రతకడం సందేహంగా ఉంది. వెంటనే పట్టణానికి వెళ్ళాలి'' అని విన్నవించుకున్నారు. అలాగే అంటూ మామలందరినీ బయలుదేరమని చిత్ర విచిత్రమైన వాహనాలపై గజ, రథ, తురగ, గరుడ, కలహంస, మకర, మయూర, సింహ విమానాలపై కూర్చుని వస్తూ ఉన్న విద్యాధరులతో, ఎనిమిది వేలమంది రాణులతో ఎంతో వైభోగంతో హస్తినాపురానికి వచ్చాడు. సనత్కుమారుడూ, మిగిలిన అందరూ విశ్వసేనునికీ, సహదేవికీ సాష్టాంగ నమస్కారం చేసారు. వారి ఆశీర్వాదాలను పొందారు. ఇలా ఉండగా సనత్కుమారుని ఆయుధాగారంలో చక్రం పుట్టింది. అతను చక్రవర్తియై మహా భోగోపభోగాలతో మహా సముద్రంలో కొంతకాలం క్రీడిస్తూ జీవించసాగాడు.

సౌధర్మ కల్పంలో ఒక రాజు సౌధర్మేంద్రుడు తన దేవ సభలో సౌదామిని నాటకం చూస్తూ ఉండగా, ఈ కావ్యకల్పం నుండి సంగమదేవుడు సభను ప్రవేశించాడు. వెంటనే సభలో ఉన్న దేవదేవతల రూపము, తేజస్సు, లావణ్యాలు చంద్రోదయ సమయంలో గ్రహ-నక్షత్రాల కాంతి తగ్గిపోయినట్టుగా కాంతిహీను లయ్యారు. స్వయం ప్రకాశిస్తున్న సంగమదేవుని చూసి దేవతలు ''సంగమదేవుని ఈ సౌందర్యం, లావణ్యాలకు కారణమేమిటు''ని సౌధర్మేంద్రుణ్ణే ప్రశ్నించారు. అపుడు సౌధర్మేంద్రుడు ఇలా చెప్పాడు.

ఇతడు క్రిందటి జన్మలో ఈ జంబూద్వీపమైన పూర్వ విదేహంలో సీతా నదికి ఉత్తర భాగంలోని పుష్కలావతి ప్రాంతంలో పుండరీకిణి పట్టణానికి సకల చక్రవర్తి విమలవాహనునికీ, అతని మహాదేవి విమలవతికీ పుత్రుడు క్షీర

కుమారుడు. అతనికి వైరాగ్యం కలిగి తపస్సుకై యోచిస్తుండగా తల్లి అందుకు అంగీకరించలేదు. తల్లి మాట జవదాటలేక క్షీరకుమారుడు ఇంటిలోనే బ్రహ్మచర్య మొదలైన వ్రతాలను నిష్ఠతో ఆచరించాడు. 12సంవత్సరాల ఆచామ్లవర్ధన వ్రతాన్ని నిర్వర్తించాడు. ఆ తరువాత సమాధి మరణంలో చనిపోయి ఈ విధమైన రూపు, తేజస్సు, లావణ్యాలను పొంది దైవంగా జన్మించాడు. ఇది విన్న దేవతలు ''స్వామి! ఇంత రూపం, తేజస్సు, లావణ్యాలను కలిగి వేరెవరైనా ఉన్నారా?'' అని అడిగాడు. ఉన్నాడు, హస్తినాపురంలో కురువంశస్థుడైన సనత్కుమార చక్రవర్తి. అతని రూపం. లావణ్యం, తేజస్సు దేవతలకంటే విశిష్టమైనది'' అని సౌధర్మేంద్రుడు చెప్పాడు.

విజయ, వైజయంత అనే ఇద్దరు దేవతలు ఇంద్రుని మాటను నమ్మలేదు. వెళ్ళి సనత్కుమారుణ్ణి చూసి తీరాలనే నిశ్చయంతో బ్రాహ్మణుల రూపు ధరించి హస్తినాపురానికి వచ్చారు. అంతఃపురంలో వాకిలి దగ్గర ఉన్న సేవకులతో ''మీ రాజుకు చెప్పండి. మేము చాలా దూరం నుండి వచ్చాము. ఆశపడి రాజు రూపాన్ని చూడాలని వచ్చాము అని చెప్పండి'' అంటూ చెప్పి పంపారు. రాజు అంగీకారంతో లోపలికి వెళ్ళి దగ్గరగా రాజును చూసారు. సనత్కుమారుడు సుగంధ తైలంతో శరీరానికి అభ్యంగనం చేసి స్నానానికి వెళ్ళే సమయం. దేవతలు రాజు రూపాన్ని నఖశిఖ పర్యంతం చూసి తృప్తి చెందారు. ఆశ్చర్యం చెందారు. అంతటి రూపం, తేజస్సు, సౌందర్యం, యవ్వనం దేవతలకు లేదంటూ మెచ్చుకున్నారు. రాజు ''మీరెవరు? ఏమంటున్నారు? ఎక్కడ నుండి వచ్చారు?'' అనడిగాడు. ''మేము దేవలోకం నుండి వచ్చాము. సౌధర్మకల్పం లోని దేవతల సౌధర్మేంద్రుడు మీ రూపం గురించి విశేషంగా మెచ్చుకోవడంలో అతని మాటను నమ్మకుండా అది పరీక్షించడానికి వచ్చాము. ఇపుడు చూస్తే ఇంద్రుడు చెప్పినదానికంటే అధికంగానే ఉంది. మేము ఇంక వెనుదిరుగుతాము'' అని విజయ, వైజయంతులు అన్నారు. రాజు తన రూపానికి గర్వించాడు. ''కొంతసేపు ఆగండి. ఇప్పుడు అభ్యంగన రూపాన్ని చూసారు. స్నానాంతర అలంకరణ సొగసును చూచి వెళ్ళండి'' అని రాజు అన్నాడు. వాళ్ళు అందుకు అంగీకరించారు. రాజు తళుకులీనే సర్వాభరణాలను అలంకరించు కొని ఆస్థాన మంటపంలో సింహాసనంపై కూర్చుని సామంత, మహా సామంత మకుటాయమానమైన విద్యాధరయక్షదేవతలు క్రిక్కిరిసిఉండగా, ముప్పైరెండు

చామరాలు విసరడానికి సౌధర్మేంద్రుని సభలోని దేవతలను అక్కడికి పిలిపించాడు. ''ఇపుడు నా రూపాన్ని చూడండి'' అంటున్న రాజును చూసి విజయ, వైజయంతులు విస్మయం చెందారు. ''ఇదేమి విచిత్రం. మానవుల యవ్వనం, అందం, తేజస్సు ఇవన్నీ కూడా ఇంద్రధనస్సులాగా క్షణకాలమే కదా! రాజు రూపం కాంతి విహీనమైంది కదా'' అని అన్నారు. ''అపుడు మీరే పొగిడారు. ఇపుడెందుకు నా సౌందర్యాన్ని కించపరుస్తున్నారు?'' అని ప్రశ్నిస్తున్న రాజుతో వాళ్ళిలా అన్నారు. ''రాజా! దేవతల తేజస్సూ, లావణ్యమూ పుట్టిన రోజునుండీ మొదలుకొని నడివయస్సు దాకా దినదినమూ అధికమవుతూ ఉంటుంది. ఆ తరువాత ఆయుష్యాంతం వరకూ తగ్గుముఖం పడుతుంది. మేము యవ్వనంలో ఉన్న రూపాన్ని చూసాము. ఇపుడు మీ ఆయుష్షు అంతంలోని రూపము, తేజస్సు, లావణ్యం, యవ్వనాలను కొంతగా తగ్గడం చూస్తున్నాము. ''మీరు దాన్ని ఎలా తెలుసుకోగలిగారు?'' అని రాజు ప్రశ్నించాడు. ''మాకు కాలజ్ఞానం ఉంది. దాని ద్వారా తెలుసుకున్నాం. మానవులు దీనిని తెలుసుకోలేరు'' అని జవాబిచ్చి దేవతలు ఒక పాత్రలో నీరు తెప్పించి, ఒక విసనకర్రను అందులో ముంచి విసరగా అక్కడున్న అందరిపైనా నీరు చిట్లింది. ఆ తరువాత చెప్పారు. ''రాజా! వీవెన ద్వారా ఈ పాత్రలోని నీరు కొంతభాగం తగ్గింది. అది మీ కంటికి కనబడుతూందా? అది ఎలా కనబడదో ఆ విధంగానే మానవుల ఆయుష్షు, తేజస్సు, లావణ్యము, కాంతి, యవనం ప్రతి ఒక్కటి క్షణంలో కరిగి నాశనమైపోతుంది. ఆ తరిగిపోవడం మీకు తెలియదు అంతే'' అని నశ్వరత్వాన్ని ఉదాహరణ మూలకంగా రాజుకి తెలియజేసి, ఆ దేవతలు సౌధర్మ కల్పానికి వెళ్ళిపోయారు.

సనత్కుమార చక్రవర్తికి అదే నిర్మోహానికి కారణమైంది. శరీర భోగాలపట్ల అయిష్టం. మనస్సులో వైరాగ్యం నిండింది. రూపం, యవ్వనం, ఆయుష్షు, ఇంద్రియ విషయాలు, సుఖానుభవాలు, శక్తి, ఇష్టజనుల సహవాసం, నేల, సౌభాగ్యం, ఐశ్వర్యం, ఇవన్నీ అనిత్యమైనవి అని బుద్ధిమంతులైనవారు చక్కగా ధ్యానించనీ. ముందు పుట్టుక, మధ్యలో రోగాలు, చివరికి చావు, ఇలాగే పుట్టుక-చావులనే సముద్ర ప్రాణుల మధ్య చక్రంలాగా చుడుతూ ఉండడమే అని అతను నిశ్చయించుకొన్నాడు. విజయకుమారుడనే తన పెద్దకుమారునికి పట్టం కట్టి, బాహ్యాంభ్యంతర పరిగ్రహాలను తొలగించుకోడానికి రాజు పిల్లలతో

వినయంధర భట్టారకుని వద్ద దీక్ష పొంది తపస్సుకు నిలిచాడు. మూడు రోజుల ఉపవాసానంతరం శరీరధారణ కోసం భిక్షకు వెళ్ళగా, ఒక బీద వృద్ధురాలు వారిని ఆహ్వానించి, అన్నము, మజ్జిగ, పప్పు, నూనె ఇచ్చింది. దాన్ని అమృతంలా తినగలిగినంత తిని తిరిగి మూడురోజుల ఉపవాస వ్రతాన్ని స్వీకరించారు. ఆహార దోషం చేత సనత్కుమార భట్టారకునికి దురద, జ్వరం, దగ్గు మొదలయిన ఏడువందల వ్యాధులు తగులుకున్నాయి, నూరు సంవత్సరాల కాలం.

* * *

# 5. అణ్ణికా పుత్రుని కథ

గంగానది మధ్యలో నావ మునిగిపోయినప్పటికీ, మోహం లేని బుద్ధిగలవాడై ఆత్మారాధనను పొందిన అణ్ణికాపుత్రుడు విశిష్టస్థానాన్ని పొందాడు.

జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో మగధ అనే ప్రాంతం ఉంది. అక్కడ ఉత్తర మధుర అనే పట్టణాన్ని ప్రజాపాలన అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య సుప్రభ. వాళ్ళిద్దరూ ఇష్ట విషయ కామభోగాలతో సుఖంగా జీవిస్తున్నారు. అదే గ్రామంలో అధిక ధనవంతుడైన ధనదత్తుడనే ఒక వర్తకుడు వున్నాడు. అతని భార్య ధనశ్రీ. వారి పుత్రుడు ధనదేవుడు.

ఒకరోజు ధనదేవుడు వ్యాపార నిమిత్తం అమూల్యాలైన సరుకులను నింపుకొని దక్షిణ మధురకు పోయాడు. ఆ పట్టణ రాజశ్రేష్ఠి పేరు తిలక శ్రేష్ఠి. అతని భార్య నంద. వారికి పద్మావతి, సుమతి, గుణమతి మొదలైన ఎనిమిది మంది పుత్రికలు. వారిలో అత్యంత పిన్నవయస్కురాలు అణ్ణిక. ధనదేవుని రూప లావణ్యాలను, సౌభాగ్య, కాంతిగుణాలను చూచి సంతోషించిన తిలకశ్రేష్ఠి, అతని భార్య నంద తమ కుమార్తె అణ్ణికను అతనికిచ్చి వివాహం చేశారు. కొన్ని రోజులు అదే వూరిలో వుండిన ధనదేవుడు తాను తెచ్చిన సరుకులన్నిటినీ అమ్మి, తనదేశంలో దొరకని అనేక వస్తువులను నింపుకొని తన పట్టణమయిన ఉత్తర మధురకు వచ్చాడు. ఆ సమయానికి అణ్ణిక కూడా గర్భవతియై, మగబిడ్డను ప్రసవించింది. ధనదేవుని తల్లిదండ్రులు, బంధుమిత్రులు కలసి ఆ బిడ్డకు అణ్ణికాపుత్రుడు అని నామకరణం చేశారు. ఆ బిడ్డ సుఖంగా పెరిగి యువకుడయ్యాడు.

ఇలా వుండగా, ఒకమారు దమసూరి అనే విశేషజ్ఞానియైన ఆచార్యులు అతిపెద్ద మునిసమూహంతో గ్రామ, నగర, గిరి, దుర్గ, ప్రాకారదుర్గ, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖాలగుండా సంచరిస్తూ ఉత్తర మధురకు వచ్చి గ్రామం వెలుపల ఉద్యానవనంలో విశ్రమించారు. ఈ వార్త విని, అణ్ణికాపుత్రుడు ఆయన వద్దకుపోయి నమస్కరించి, క్షేమసమాచారాలను విచారించి సమ్యక్పూర్వకంగా శ్రావక వ్రతాలను అతని నుంచి స్వీకరించి, ''ఓ మునివర్యా, నా ఆయుష్షు ఇంకెంత వున్నది?'' అని ప్రశ్నించాడు. ''నీకు ఆయుష్షు వున్నది చాలా

తక్కువ'' అని ఆచార్యులవారు అన్నారు. అణ్ణికా పుత్రుడు వైరాగ్య పరాయణుడై తల్లి, తండ్రి, బంధువులను పరిత్యజించి, దమసూరి ఆచార్యుల వారిచెంత దీక్షపొంది తపస్సును ప్రారంభించాడు. కాలక్రమంలో ద్వాదశాంగ, చతుర్దశ పూర్వకమైన ఆగమాలన్నిటినీ నేర్చుకొని, గురువుగారి అనుమతి పొంది, ఏకవిహారియై సంచారం చేస్తూ, తీర్థక్షేత్రాలను దర్శించాలని వస్తూ వుండగా, గంగానది కన్పించింది. దానిని దాటిపోవడానికి నావలో కూర్చొని దాటుతుండగా, ప్రచండమైన తుఫాను చెలరేగి, భయంకరమైన అలల నడుమ నావ మునిగిపోయింది. అయినప్పటికీ చలించని మనస్సుతో శరీరంపై మమకారాన్ని త్యజించి, ధర్మధ్యాన, ముక్తిధ్యానాలను ఆచరిస్తూ పరిపూర్ణజ్ఞానియై అణ్ణికాపుత్ర మహర్షి మోక్షం పొందాడు.

ఆరాధకులైనవారు అణ్ణికా పుత్ర ఋషినే మనస్సులో ధ్యానించి, దేవ, మనుష్య, తిర్యక్, నారక అనే నాలుగు వర్గాలవారి వల్ల కలిగే తపోవిఘ్నాలనే ఉపసర్గలను; ఆకలిదప్పులు మొదలైన ఇరవైరెండు పరీషహాలను, వ్యాధుల వలన కలిగే వేదనలును భరించి, శుభకర పరిణామంతో శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాలనే రత్నత్రయాలను ఆరాధించి స్వర్గ మోక్ష సుఖాలను పొందుదురు గాక!

* * *

# 6. భద్రబాహు భట్టారకుల కథ

చాలీచాలని (సగం) భోజనంతో ఆకలిని సహించి శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రలని భద్రబాహు భట్టారకులు సాధించారు.

ఈ జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో పురవర్ధనమనే దేశం ఉంది. అందులో కౌండినీ నగరమనే పట్టణాన్ని పద్మరథుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని పట్టపురాణి పద్మశ్రీ. ఇష్టవిషయ, కామ, భోగాలతో వాళ్ళు సుఖంగా కాలం గడుపుతున్నారు. ఆ రాజు పురోహితుడు వేదవేదాంగాలనూ పద్నెనిమిది ధర్మశాస్త్రాలను తెలిసిన సోమశర్మ అనే బ్రాహ్మణుడు. సాక్షాత్తు శ్రీయాదేవతనే పోలిన సోమశ్రీ ఆయన భార్య. వీళ్ళకు ఒక కొడుకు పుట్టాడు. తల్లిదండ్రులకూ, బంధుమిత్రులకూ ఉత్సాహాన్నీ, సుఖాన్నీ, వైభవాలనూ కల్గించడంవల్ల ఆ శిశువుకు భద్రబాహుడనే పేరు పెట్టారు. విదియనాటి చంద్రుడిలా ఆ పసివాడు దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. ఉపనయన వయస్కుడు కాగానే శ్రేష్ఠమైన దినం,వారం, నక్షత్రం, ముహూర్తం చూసి ఒడుగు చేశారు.

ఒకరోజు భద్రబాహుడు తనతోటి పిల్లలతో పట్టణ పొలిమేరల్లో బిళ్ళలఆట ఆడుతున్నాడు. అతను ఒక బిళ్ళ మీద మరొక బిళ్ళనుంచి ఆడుకొంటున్నాడు. వర్ధమాన భట్టారకులు మోక్షం పొందిన తర్వాత, పద్నాలుగు పూర్వాగమ గ్రంథాలను తెలిసిన శ్రుతకేవలి అయిన నాల్గో గోవర్ధనులు ఉజ్జయంత పర్వతాన్ని నమస్కరించడం కోసం సంచారం చేస్తున్నారు. ఆయన అక్కడ ఆడుతున్న భద్రబాహు బ్రహ్మచారిని చూశారు. ఇతడు మాదగ్గర చతుర్దశ ఆగమాలను నేర్చుకునే మహాత్ముడవుతాడని గ్రహించాడు. అతణ్ణి ఇంటికి పిలుచుకొని వెళ్ళి, అతని తల్లిదండ్రులతో ''ఈయన్ని నాకు అప్పగించండి, సర్వశాస్త్రాలనూ నేర్పించి, పండితుడుగా చేసి మళ్ళీ మీ దగ్గరకి పంపిస్తాను'' అన్నారు. సోమశర్మ, సోమశ్రీ అంగీకరించారు. గోవర్ధన భట్టారకులు భద్రబాహుని పిలుచుకొని వెళ్ళి కొద్దిరోజుల్లోనే వ్యాకరణం, ప్రమాణం, ఛందస్సు, అలంకారం. నిఘంటు, కావ్యం, మొదలైన లోకంలోని సర్వశాస్త్రాలనూ నేర్పించారు. భద్రబాహుడు అధిగమ సమ్యక్

దృష్టితో ఆగమాల్లోని విషయాలను తెలుసుకొని సంసారం, శరీర భోగాల్లోని వైరాగ్యాన్ని పొందాడు. ''భట్టారకులారా, నాకు తపోదీక్షను ప్రసాదించండి'' అని అడిగిన భద్రబాహుడికి గురువులు ఇలా అన్నారు. ''మేము నీకు దీక్షను ఇవ్వలేము. కుమారా, నీ పట్టణానికి వెనుదిరికి వెళ్ళి అక్కడి పండితుల్ని వాదంలో గెలిచి, దశదిశల్లోనూ నీ కీర్తి వ్యాపించి, నిన్ను మేము పిలుచుకొని వచ్చినందుకు నీ తల్లిదండ్రులకు సంతోషం కలిగించి, వాళ్ళ అంగీకారం పొంది వచ్చినట్టయితే దీక్షను ప్రసాదించగలం, లేకపోతే లేదు'' అన్నారు. అలాగే కానివ్వండని భద్రబాహుడు గురువులకు నమస్కరించి ఊరికి వచ్చాడు. తల్లిదండ్రులు ఆనందించారు. పండితులతో వాదించి జయించగా భద్రబాహు పాండిత్య ప్రకర్ష దశదిశల్లోనూ వ్యాపించింది. తర్వాత తాను తపస్సుకోసం తల్లిదండ్రుల్ని ఒప్పించి గోవర్ధన భట్టారకుల దగ్గరికి వచ్చాడు. కుమార బ్రహ్మచారుడై ఆయన దగ్గర తపస్సు చేసి కొద్ది రోజుల్లోనే ద్వాదశాంగ, చతుర్దశ పూర్వ ఆగమాలనన్నిటినీ నేర్చుకొని సకలశాస్త్రపారంగతుడై, శాస్త్రాల్లోని భక్తి కారణంగా ప్రతిమాయోగంలో నిలబడ్డారు. దేవతలూ, మనుష్యులూ వచ్చి ఆయనని గొప్పగా పూజించి, నమస్కరించి వెళ్ళి పోయారు. ఇప్పుడు భద్రబాహు భట్టారకులు సకల ఋషి సముదాయానికి నాయకులుగా ప్రతిపాలించడానికి సమర్థులయ్యారు. ఆ సమయానికి ఆయన గురువులయిన గోవర్ధన భట్టారకులు సమాధి మరణంవల్ల రత్నత్రయాన్ని సాధించి, దివంగతులై దేవలోకం పోయారు.

ఇక్కడ చతుర్దశ పూర్వధారులయిన చివరి ఋషియూ, ఐదవ శ్రుతకేవలీ, అవధిజ్ఞానులూ, బుద్ధిమంతులూ అయిన భద్రబాహు భట్టారకులు ఋషి సముదాయానికి నాయకులై గ్రామం, నగరం, గిరిదుర్గం, ప్రాకారదుర్గం, పట్టణం మొదలైన ద్రోణముఖాల్లో సంచరిస్తున్నారు.

మగధ అనే దేశంలో పాటలీపుత్రమనే పట్టణం ఉంది. అక్కడ నందనుడనే రాజు చాలకాలం రాజ్యాన్ని పరిపాలిస్తూ, ఒకసారి చాణుక్యుడనే బ్రాహ్మణుణ్ణి అవమానించి పారద్రోలడానికి ప్రయత్నిస్తే, అతను ప్రతిజ్ఞ చేసి, కాలానుగుణ్యంగా నందనుణ్ణి నాశపరచి అతని స్థానంలో చంద్రగుప్తుడనేవాణ్ణి కూర్చోపెట్టాడు. చంద్రగుప్తుని కొడుకు బిందుసాగరుడు. అతని తర్వాత అతని కుమారుడు అశోకుడు రాజ్యపాలన చేశాడు. అశోకుని కుమారుడు

ప్రతాపంలో సూర్యుడులాంటి తేజస్సు కలిగిన కుణాళుడనేవాడు. ఒకసారి అశోకుడు శత్రువుల్ని జయించడానికని వెళ్ళి అక్కడినుంచి మంత్రి, పురోహితుడు, తలారులకు ఒక జాబు వ్రాసి పంపించాడు. ఉపాధ్యాయునికి అన్నం, నెయ్యి, పప్పు మొదలైన వంటకాలను పెట్టి, కుమారుణ్ణి అతనిదగ్గర చదివించమని ఆ ఉత్తరంలోని సారాంశం. అయితే జాబు చదివిన చదువరి దాన్ని ''ఉపాధ్యాయం శాలికూరం చ మశిం ఘృతం దత్వా కుమారమంధాపయేత్'' ('కుమార మధ్యాపయేత్' అని అతను చదవాల్సి ఉండింది) అని అపార్థం వచ్చేట్టుగా చదివాడు. విన్న ప్రతియొక్కరూ చకితులయ్యారు. అయితే రాజాజ్ఞ అప్రతిహతమైంది, మీరడానికి వీలులేదు. అందువల్ల ఉపాధ్యాయుడికి శాల్యాన్నాన్నీ, నెయ్యినీ, పప్పుకూరనీ భుజించడానికి ఇచ్చారు. కుణాళ రాజకుమారుడి రెండు కన్నుల్నీ పొడిచి అంధునిగా చేశారు. అశోకుడు కొద్దిరోజుల తర్వాత వెనుదిరిగి వచ్చాడు. కుమారుడు గ్రుడ్డివాడయి ఉండడాన్ని చూసి చాలా దుఃఖించాడు. కుణాళుడి రాణి చంద్రసేనకు ఒక కుమారుడు జన్మించగా అతనికి సంప్రతి చంద్రగుప్తుడనే పేరుపెట్టి, రాజ్యాభిషేకం గావించి సమస్తభారాన్ని వహించాడు. ఆ తర్వాత కుణాళుడిని ఉద్దేశించి, 'కుమారా, నీవు ఏది కావలిసినా అడుగు, ఇస్తాను'' అన్నాడు. కుణాళుడు కాకిణీ రత్నాన్ని కోరగా, ''అది చక్రవర్తులకు కాక మరొకరికి చెందకూడదు, అదివద్దు''ని చెప్పాడు. తాను వైరాగ్యాన్ని పొంది సువ్రతుడనే గురువుల చెంత జినదీక్షను గ్రహించి అశోకుడు మోక్షాన్ని పొందాడు.

ఇక్కడ సంప్రతి చంద్రగుప్తుడు మహారాజు రాజ్యాన్ని పాలిస్తుండగా, ఒకసారి సమాధి గుప్తులనే ఆచార్యులు సంచారం చేస్తూ వచ్చి పాటలీపుత్రం పొలిమేరల్లోని ఉద్యానవనంలో విడిది చేశారు. సంప్రతి చంద్రగుప్తుడు అక్కడికి వెళ్ళి ఆయనకు నమస్కరించి ధర్మాన్ని విని, ఆ తర్వాత తన జన్మాంతరాల విషయాలను గురించి ప్రశ్నించాడు. భట్టారకులన్నారు:

''ఈ జంబూద్వీపపు భరతక్షేత్రంలో అవంతీదేశంలో వైదిశమనే పట్టణం ఉంది. దాన్ని పరిపాలిస్తున్న రాజు జయవర్మ. అతని రాణి ధారిణి. ఆ నగర సమీపంలోని పరాళకూటమనే ఊళ్ళో సామగ్రిని రవాణా చేసే దేవిలుడనే ఒక వర్తకుడు ఉండేవాడు. అతని భార్య పృథ్విశ్రీ. ఆమె గర్భంలో ఒక పాపకర్మ జీవం వచ్చి చేరుకోగా, వినా కారణం వల్ల అతని ధనకనకాలు నాశమయ్యాయి..

ఒకరోజు దేవిలుడు తక్కిన వర్తకులతో బళ్ళల్లో పత్తినీ, ధాన్యాన్నీ నింపుకొని అమ్మడం కోసం పట్టణానికి బయల్దేరుతుండగా దార్లో దొంగలు అడ్డగించి అతన్నీ, అతనితో పాటున్న అనేకమంది వర్తకుల్నీ చంపారు. తక్కినవాళ్ళు బ్రతుకుజీవుడా అంటూ పరుగెత్తి బ్రతికిపోయారు. సరకుల నన్నింటినీ, ఎద్దుల్నీ, దొంగలు దోచుకొని వెళ్ళిపోయారు. అదే సమయంలో పృథ్విశ్రీ మగపిల్లవాణ్ణి ప్రసవించింది. ఆ శిశువుకు నందిమిత్రుడనే పేరుపెట్టారు. పిల్లవాడికి రెండుమూడు నెలలు వచ్చేసరికి తల్లికూడ కన్నుమూసింది. అప్పుడు బంధువులు పిల్లవాణ్ణి పెంచారు. వాళ్ళకు కూడ చావే గతి అయింది. ఉన్నవాళ్ళందరూ నశించి ఆ కులమే క్షయించింది. ఊళ్ళో వాళ్ళందరూ ''ఈ దిక్కులేనివాడు మా ఊళ్ళో ఉంటే మాకూ చావో, అనర్థమో జరిగేది తథ్యం. ఇప్పుడే వీణ్ణి తరిమికొట్టండి'' అని ఆడిపోస్తూ ఊళ్ళోనుంచి గెంటివేశారు. నందిమిత్రుడు చుట్టుప్రక్క గ్రామాలు - వీథులూ తిరుగుతూ భిక్షమెత్తుకుని బ్రతుకుతూ - అదీ కూడ, దొరికితే తింటూ, లేకపోతే పస్తులుంటూ ఎలాగో కాలం గడుపుతున్నాడు. ఇలా పదహైదు సంవత్సరాల ప్రాయుడై అతను వైదిశ పట్టణం చేరుకొన్నాడు.

''కాష్ఠకూటుడనే ఒక పనివాడు కట్టెల మోపును మోస్తూ పట్టణానికి వస్తుండగా నందిమిత్రుణ్ణి చూశాడు. అతనితోపాటు మాట్లాడుకుంటూ వచ్చి పట్టణ పొలిమేర్లల్లోని తోటలో కట్టెలమోపును దింపి, కొంతసేపు విశ్రాంతి తీసుకోవాలని కాష్ఠకూటుడు పడుకొన్నాడు. తానుకూడ పడుకోవాలని అనుకున్న నందిమిత్రుడు తలక్రిందికి ఆధారం ఏమి లేకపోవడంవల్ల, ఎనిమిది మంది కలిసినా ప్రక్కకి జరుపడానికి వీలులేని ఒక బండరాయిని తెచ్చి తలక్రింద పెట్టుకొని పడుకొన్నాడు. ఈ అద్భుతశక్తిని గమనించిన కాష్ఠకూటుడికి ఆశ్చర్యం వేసింది. అతన్ని తనతోపాటు ఇంటికి పిలుచుకొని వెళ్ళి భోజనం పెట్టించి, ''ఈ నగరంలో నీకెవరైనా బంధువులున్నారా?'' అని అడిగాడు. ''ఎవరూ లేరు'' అని సమాధానం ఇవ్వగా ''అలాగయితే నీవు ఎక్కడికీ వెళ్ళవద్దు, నాతో పాటు ఉండిపో'' అని కాష్ఠకూటుడు అతనికి ఆశ్రయ మిచ్చాడు. ఇద్దరూ తోడుగా కట్టెలు తేవడానికి అడవికి వెళ్ళేవారు. పదిమంది తెచ్చే పెద్ద కట్టెలమోపును నందిమిత్రుడొక్కడే తెచ్చేవాడు. ఇలా కొద్దిరోజులు గడిచాయి. కాష్ఠకూటుడు భార్య అయిన జయఘంటకు ఇలా చెప్పి ఉంచాడు.

''వీడికి ఎప్పుడూ కడుపునిండా భోజనం పెట్టవద్దు. భోజనానికి గాని, తలస్నానానికి కానీ ఎంత అర్థించినా నూనెను ఇవ్వవద్దు''. జయఘంట అదే విధంగా చేస్తూవుంది. నందిమిత్రుడు తెస్తున్న పెద్ద కట్టెలమోపును అమ్మి కాష్ఠకూటుడు పెద్ద ధనవంతుడయ్యాడు. ఒకరోజు జయఘంట నందిమిత్రుడి మీది కరుణతో కడుపునిండా భోజనం పెట్టింది. తృప్తిగా అతను భోంచేశాడు. మరుసటిరోజు కట్టెలు తీసుకురావడానికి వెళ్ళినప్పుడు కాష్ఠకూటుడిని ఉద్దేశించి, ''అయ్యా, నాకు కట్టుకోవడానికి ఏమీలేవు. ధర్మానికైనా ఒక గుడ్డను తీసివ్వండి'' అని అడిగాడు నందిమిత్రుడు. ''అలాగే కానీ'' అని జవాబిచ్చి కట్టెల్ని మోపులుకట్టి ఇంటికి తెచ్చిన తర్వాత కాష్ఠకూటుడు భార్యతో, ''ఇతనికి నీవు కడుపునిండా అన్నం పెట్టావా?'' అని ప్రశ్నించాడు. ఆమె ''పండుగ కావడం వల్ల, అయ్యోపాపం అని వడ్డించాను'' అంది. దానికి కోపగించుకొని కాష్ఠకూటుడు ఆమెను బాగా తన్ని ఇంటినుంచి గెంటివేశాడు. అప్పుడు నందిమిత్రుడు వెళ్ళి జయఘంటతో ''అమ్మా, నిన్నెందుకు ఈ కాష్ఠకూటుడు కొట్టాడు?'' అని అడిగాడు. ''నిన్నటిరోజు నీకు తృప్తిగా కడుపునిండా అన్నం పెట్టానుగదా, దానికి కోపగించుకొని ఇలా కొట్టాడు'' అన్నది జయఘంట. 'ఇంతటి పరమనీచుడూ, పంచమహాపాతకుడూ అయిన వీడి ఇంటిలో ఉపద్రవం రానీ' అని, కాష్ఠకూటుడి ఇంటినుండి వెళ్ళిపోయి రోజూ కట్టెలూ తెస్తూ తానే అమ్మి జీవిస్తున్నాడు. అయితే ఏం! అతని దురదృష్టం! ఎనిమిది మోపులంత కట్టెలు తెచ్చినా, దానికి ఒక్క కాసూ దొరకక కడుపుకోసం ఇంత అంబలికో, నూనెకో, ముద్దకో కట్టెల్ని అమ్ముతూఎలాగో కాలం గడుపుతున్నాడు. ఇలా ఉండగా -

''ఒకరోజు నందిమిత్రుడు కట్టెల మోపును తెస్తున్నప్పుడు, దార్లో శివగుప్తాచార్యులనే అష్టాంగనిమిత్తాలను అభ్యసించిన ఆచార్యులవారు అడవిలో సిద్ధాంతాన్ని అధ్యయనం చేస్తూ ఆ రోజు అక్కడే ఉండి మర్నాడు అక్షోపవాస పారణకై భిక్షకోసం నగరానికి వెళ్తున్నాడు. ఈయన ఎక్కడికి వెళ్తారో చూడాలని నందిమిత్రుడికి అనిపించింది. ఊరివెలుపల ఉన్న జైనమఠం ప్రాంగణంలో కట్టెల మోపును దింపి ఆచార్యులవెంటే వెళ్ళాడు. రాజు ఆచార్యుల్ని ఆరోజు తాను భిక్షకోసం నిల్పుకొంటున్నట్టూ, తక్కినవాళ్ళెవ్వరూ ఆయన్ను నిలుపుకోకూడదనీ దండోరా వేయించినప్పటికీ, చిన్నపెద్ద తారతమ్యం లేకుండా

తినకుండా యోగ్యమైన ఇళ్ళనన్నిటినీ ప్రవేశించి చివరికి రాజమందిరాన్ని ప్రవేశించారు ఆచార్యులు. రాజూ, రాణీ బంగారు పూర్ణ కలశం, అద్దం, బియ్యం, మాదీఫలాలతో ఆచార్యులవారికి స్వాగతంపలికారు. రాణి నీళ్ళు పోస్తుండగా రాజు కాళ్ళు కడిగాడు. వాళ్ళతోపాటే వెళ్ళిన బోడితలవాడయిన దిక్కులేని నందిమిత్రుణ్ణి, ''బ్రహ్మయ్య, మీ కాళ్ళను ఇటు పెట్టండి, కడుగుతాను'' అని రాణి చెప్పి, అతని కాళ్ళను తానే కడిగి లోనికి పిల్చుకొని వెళ్ళింది. పెద్ద బంగారు కంచాన్ని ఎత్తయిన ముక్కాలిపీటమీద ఉంచి భట్టారకులకు రాజు వడ్డిస్తే, బ్రహ్మయ్యకు మహారాణి పలువిధాలయిన భక్ష్యభోజ్యాలను వడ్డించింది. రాజాన్నం, పెసరపప్పు, వెన్న కాచిన సువాసనతో కూడిన నెయ్యి, పలురకాల కూరలు, పాయసం, పూరి, ఇడ్లీ, లడ్డు, 'మండిగలు' - మొదలయిన పద్నెనిమిది రకాల భక్ష్యాలు, పలురకాల పానీయలు, పుట్టినప్పటినుంచీ నందిమిత్రుడు కలలో కూడ చూడనట్టి దివ్యమైన ఆహారపదార్థాలను తృప్తి కలిగేంతవరకు వడ్డించింది. నందిమిత్రుడు పీకలదాకా తిన్నాడు. ఆ తర్వాత కర్పూరమిశ్రితమైన తాంబూలాన్ని బ్రహ్మయ్యకిచ్చారు. ఈ తతంగమంతా పూర్తయ్యాక రాజురాణిగారల కర్మక్షయం అవ్వాలనీ, దానం అక్షయంకావాలనీ, భట్టారకులు ఆశీర్వదించి అక్కడనుంచి బయల్దేరి జైనమఠానికి వచ్చారు. నంది మిత్రుడుకూడ ఆయనవెంటే వచ్చాడు. భట్టారకులు కాళ్ళు కడుక్కొని లోపలికి వెళ్ళి 'ఈర్యాపత్తి'ని తొలగించుకొని గోచారనియమంలో ఉండి పోయారు. నందిమిత్రుడు చూస్తూనే ఉన్నాడు. ఇలాంటి రూపం ధరిస్తే లోకంలో గౌరవం, ఆరాధనా లభ్యమవుతాయి, ఎలాంటి క్లేశమూ లేకుండా ఎల్లకాలమూ దివ్యమైన ఆహారం లభిస్తుందని ఆలోచించాడు. భట్టారకులు నియమాలను ముగించిన తర్వాత ఆయన ముందువచ్చి నిలబడి చేతులు జోడించి, ''భట్టారకులారా, నన్నుకూడ మీలాగానే చేయండి'' అని అర్థించాడు. అతడు అల్పాయుష్కుడూ, ఆసన్నభవ్యుడూ అయిన విషయాన్ని ఎరిగిన భట్టారకులు మంచిముహూర్తంలో అతనికి దీక్షనిచ్చి తపస్సుకు పంపించారు. అతను దీక్షోపవాసాన్ని చేపట్టాడు.

తమ ఇంటికి భట్టారకుడితోపాటు విచ్చేసిన బ్రహ్మచారి తపస్సు చేయడానికి ఉపక్రమించాడని విని రాజు-రాణిగారలకు సంతోషమైంది. మా యింట్లో ఉండి తపస్సు చేసిన ఆతనిని రేపు మనయింటికి భోజనానికి

పిలుద్దాము' అని, అతివైభవంతో సామంత మహా సామంతులతోపాటు రాజ్య చిహ్నాలతో, సమస్తవైభవాలతో ఉదయమే జైనమఠానికి వాళ్ళు వచ్చారు. వాహనం నుండి దిగి, జైనమఠానికి ప్రదక్షిణం చేసి, గంధం, పుష్పం, ధూపం, దీపం, అక్షింతలతో భగవంతుణ్ణి అర్చించి, భట్టారకుడికీ, చిన్న స్వాములయిన నంది మిత్రులకూ నమస్కరించి, ధర్మాన్ని అడిగారు. 'భట్టారక స్వామీ, ఒక చిన్న విన్నపం. ఈ రోజు చిన్నస్వాములవారిని మాయింటికి రావడానికి అనుమతివ్వండి. వారిని పారణకోసం పంపించండి. మేము పుణ్యం కట్టుకొంటాము'' అన్నాడు. ''అలాగే కానివ్వండి'' అన్నారు భట్టారకులు. ఆ మాటల్ని విని నందిమిత్రులు ''సామంత మహా సామంతులకు రాజయిన ఈ మహారాజు నన్ను అర్చించి, నమస్కరించి, సేవావృత్తిని అవలంబిస్తున్నాడు. ఆహా! ఏమాశ్చర్యము! తపస్సుయొక్క ధర్మవర్తన ఫలం ఇప్పుడే ప్రత్యక్షమయి పోయింది కదా! ఇకముందు అధికం కాకుండాఉండదు'' అని తనలోనే అనుకుని ఆరోజు ఉపవాసముండడానికి నిర్ణయించుకొన్నారు.

జయవర్మ మహారాజు తమకూ, చిన్న స్వాములవారికీ నమస్కరించ డాన్ని గమనించి భట్టారకులు, నందిమిత్ర చిన్న స్వాములకు ''ఏషణా సమితి'' మొదలైన కొన్ని వ్రతాలను ఉపదేశించి 'చిన్నస్వామీ, మీకు చాల బడలిక అవుతున్నది. అందువల్ల భగవంతుడికి నమస్కరించి భిక్షకు బయల్దేరండి' అన్నారు. అప్పుడు నందిమిత్రులు తాముకూడ ఆరోజు ఉపవాసం చేయడానికి నిర్ణయించుకొన్నట్టు ప్రకటించారు. రాజు నిరాశతో వెనుదిరిగి పోయాడు. ''ఈ రోజు నాకు స్వాములవారిని భిక్షకు నిలుపుకొని పుణ్యం కట్టుకొనే భాగ్యం లేదు'' అని దుఃఖించాడు. మహారాణి ''అలాగవుతే రేపు నేను ప్రార్థించి వారిని భిక్షకు నిలుపుకొంటాను'' అని అన్నది. ''నాకూ నీకు పుణ్యం సమానమే కదా?'' అన్నాడు రాజు. ''అలాకాదు, మీరెందుకు నాకు ఈ రోజు సగభాగం ఇవ్వలేక పోయారు? ఈ పుణ్యాన్ని ఇప్పుడు నేను సంపాదిస్తాను, రేపు నీవు సంపాదించుకో అని చెప్పి వెళ్ళారా? అందువల్ల నా పుణ్యం చెడిపోతుందా? రేపు నేను వారిని భిక్షకు నిలుపుకొని పుణ్యం కట్టుకొంటాను'' అన్నది రాణి.

''మరుసటిరోజు ధారిణి మహారాణి ఐదువందలమంది రాణులతో, అంతఃపురం దాసీ జనంతో, కంచెర గాడిదలు, ఏనుగు, పల్లకీలనెక్కి, గొడుగులు, చామరలను పట్టించుకొని, మద్దెల, పిల్లనగ్రోవి తప్పెట మొదలైన వాద్యాలు

వాయిస్తుండగా రక్షకభటుల మధ్య మహావైభవంతో వచ్చింది. ఎదురుగా గుంపు చేరిన జనుల్ని, సేవకులు దారి విడిపిస్తున్నారు. ఇలా విద్యాధర స్త్రీలే వస్తున్నట్టుగా ధారణీదేవీ, రాణులు, ఇతరులు జైనమఠం ద్వారాలకు వెలుపల వాహనాలనుండి దిగి మఠానికి ప్రదక్షిణం చేసి లోపలికి ప్రవేశించారు. గంధం, పుష్పం, ధూపం, దీపం, అక్షింతలతో దేవుణ్ణి అర్చించి, నమస్కరించి శివ గుప్తాచార్యులకు వందనం చేసి, శ్రావక నియమాలని స్వీకరించారు. ఆ తర్వాత ధారిణి ''భట్టారకా! ఈ రోజు మీరు చిన్నస్వాములతో పాటు మాయింటికి దయచేయండి, భిక్షను స్వీకరించి మాకు పద్ధతి మార్గాన్ని చూపించండి'' అని విన్నవించుకొంది. ''మీరే చిన్నస్వాములను ప్రార్థించండి. ఆయన అంగీకరిస్తే మేము పిలుచుకొని వస్తాము'' అని అన్నారు భట్టారకులు. ధారిణీదేవి నంది మిత్రుల చెంతకు వచ్చి, కాళ్ళుపట్టుకొని నమస్కరించి, 'చినస్వామి, ఈ రోజు మేము మిమ్మల్ని భిక్షకు నిలుపుకొంటాము, మా యింటికి దయచేయండి'' అని కాళ్ళు పట్టుకొని వేడుకొన్నది. నందిమిత్రులు రాణిగారి ముఖాన్ని చూశారు. అత్యంత సుందరంగా అలంకరించుకొని, దేవగణికలను పోలునట్టి ఐదువందలమంది రాణులతోనూ, దాసీజనులతోను ఆవరించిన, శచీదేవితో సరిపోలెడి ధారిణీదేవి నా కాళ్ళమీద పడి నమస్కరిస్తోంది. ఇదంతా తపఃఫలం. ముందు ఇంకా అధికం కావచ్చునని మనసులో అనుకొని,''అమ్మా! ఈ రోజు నేను భోంచేయడానికి అవకాశం లేదు. ఉపవాసం చేస్తున్నాము'' అన్నారు. మౌనం వహించిన రాణి భటారకులకు నమస్కరించి, రాజమందిరానికి వెళ్ళి రాజుతో ''చిన్నస్వాములవారు ఈ రోజూ ఉపవాసం చేస్తున్నారు'' అన్నది. ఆ రోజు రాత్రి వజ్రసేనుడనే మంత్రి ''రాజా, రేపు నేను చిన్నస్వాములవారికి పారణగావిస్తాను'' అని రాజు అంగీకారాన్ని పొందాడు. మరుసటిరోజు జైనమఠానికి వచ్చి ''భట్టారకా! చిన్న స్వాములవారిని మాదగ్గరికి పిలుచుకొని వచ్చి భిక్షను స్వీకరించండి'' అని భట్టారకులను కోరాడు. ఆయన ''చిన్నస్వామి అంగీకరిస్తే అలాగే చేస్తాను. ఆయనను ఒప్పించండి'' అన్నారు. మంత్రి నంది మిత్రాచార్యుల దగ్గరికి వచ్చి ''చిన్నస్వామి, ఈ రోజు మాయింట్లో పారణ గావించాలి'' అని కాళ్ళు పట్టుకొని వేడు కొన్నాడు. రాజూ, రాజసేవుకులూ, సామంత మహా సామంతుల చేత పరివృతుడైన మంత్రే నాకు నమస్కరించాడు కదా! ఇదంతా తపోమహిమ కావచ్చును. ఇకముందు ఇంకా అధికం కావచ్చును,

చూద్దామనుకొని ''మేము ఈ రోజు కూడ ఉపవాసం చేస్తున్నాము'' అని అన్నారు. నాకు కూడ పుణ్యంలేదు కదా అనుకొని మంత్రి వెనక్కి వెళ్ళిపోయాడు. ఆ రోజు రాత్రి అర్హద్దాసుడనే రాజ శ్రేష్ఠి, మరుసటిరోజు తాను ప్రయత్నిస్తానని, రాజుగారి అనుమతిని పొంది, ఉదయం జైనమఠానికి వెళ్ళాడు. ''గురువుగారి అనుమతిని పొంది మీరు భిక్షకు రావాలి'' అని చిన్నస్వాముల వారి కాళ్ళమీదపడి అర్థించాడు. ఆ రోజుకూడ మళ్ళీ ''ఉపవాసం చేస్తున్నాను'' అనే సమాధానం లభించింది. అర్హద్దాను వెను దిరిగి వెళ్ళిపోయాడు.

ఇక్కడ నందిమిత్ర స్వాములకు చాలశ్రమ కలగుతుండడాన్ని గమనించి, భట్టారకులు ''చిన్నస్వామీ, రాత్రి-పగలు వదలక పంచనమస్కారా లను ఉచ్చరిస్తూ ఉండండి'' అని చెప్పి పంపించగా, ఆయన రాత్రీ పగలు అలాగే చేస్తున్నారు. ఆరోజు రాత్రి జరిగిన రాజసభలో రాజూ, రాణీ చిన్నస్వాములవారి గుణాలను, తపోమహిమల్నీ స్తుతించారు. ''తపస్సుకు ఉపక్రమించి ఐదు రోజులయ్యాయి. ఇంకా తినలేదు. త్రాగలేదు. మేము ఎంత అర్థించినా భిక్షకు రారు. ఇలాంటి సాహసమూ,సత్వము మరొకరికి ఉన్నదా?'' అన్నారు. అప్పుడు యువరాజు, ''దేవా, చిన్నస్వాములవారికి నేను పారణ గావిస్తాను'' అని అతని అనుమతిని పొంది మరుసటిరోజు ఉదయం జైనమఠానికి వెళ్ళాడు. అత్యంత వైభవంతో అక్కడికి వెళ్ళి భగవంతుడికీ, భటారకుడికీ సమస్కరించి, ''భట్టారుస్వామీ, ఈ రోజు మాయింట పారణ గావించమని చిన్నస్వాముల వారికి చెప్పండి'' అని అర్థించాడు. ''మీరే ఆయనకు చెప్పి ఒప్పించండి'' అని భట్టారకస్వామి చెప్పగా, యువరాజు చిన్నస్వాములవారి కాళ్ళమీద పడి నమస్కరించి, ''చిన్నస్వామీ, ఈరోజు, మీరు మాయింట పారణ గావించాలి'' అని ప్రార్థించాడు. అతని సిరిసంపదలని, వైభవాన్ని, తేజస్సుని చూసి చిన్నస్వామి, 'ఇదంతా తపోమహిమ, ఇలాంటి క్షత్రియకుమారులందరూ నాకు నమస్కరించి, సేవిస్తున్నారు, భోంచేయడానికి నాకేమి కష్టం! ఈ తపస్సు యొక్క ఫలం మరింత అధికం అయి ఉండవచ్చు. తర్వాత చూస్తాను'' అని భావించి, ''ఈ రోజు ఉపవాస వ్రతాన్ని స్వీకరించాము'' అని జవాబిచ్చారు. నిరాశ చెందిన యువరాజు నమస్కరించి వెళ్ళిపోయాడు. ఇలా ఆరురోజులు గడిచాయి. ఏడోరోజు సూర్యోదయం నందిమిత్రుడు భటారక స్వాములవారికి నమస్కరించి ఇలా అన్నాడు: ''భట్టారుస్వామి, ఇంతకాలమూ తిన్నది చాలు.

ఇక నాకు బ్రతికినంత కాలమూ, జీవితాంతమూ ఉపవాస దీక్ష అనుగ్రహించాలి''. భట్టారక స్వామి, ''మీరు నిజంగా మహాపురుషులు. మీలాంటి ధైర్యవంతులూ, సత్యవంతులూ ఎవరూలేరు. ఇంతకాలం తపస్సు చేసిన మాకే ఇంతటి ధైర్యము సత్యము లేదు'' అన్నారు. ఈ పొగడ్తకు ఆనందం పొందుతుండగానే మళ్ళీ ''మీకు ఇదొక్కరోజు మాత్రమే ఆయుస్సు'' అని చెప్పి జీవితాంతమూ చతుర్విధ ఆహారానికీ, శరీరానికీ నివృత్తి దీక్ష అనుగ్రహించి, జైన మఠంలోని ఒక మూలను చూపించి, ''ఇక్కడ మీరు ఒక ప్రక్కగా పడుకొని, కదలకుండ, కాళ్ళు చేతుల్ని చలింపకుండ ప్రాణం ఉన్నంతవరకూ పంచ నమస్కారాలనే మనస్సులో ఉచ్చరిస్తూ ఉండిపొండి'' అని ఉపదేశించారు. నందిమిత్ర స్వాములవారు అలాగే పడుకొన్నారు, భటారకులు చతుర్విధ ఆరాధనలను వ్యాఖ్యానించడం మొదలుపెట్టారు.

చిన్నస్వాములవారు వైరాగ్యం పొందారు అన్నవార్త అంతటా వ్యాపించింది. రాజు, రాణి, మంత్రి, రాజశ్రేష్ఠి, యువరాజు మొదలైన పట్టణం లోని ప్రజలంతా అతి సంభ్రమంతో అక్కడికి విచ్చేసి రెండుపూటలూ అర్చనాదుల్ని గావించారు. కొంచెంసేపు అక్కడ ఉండి ఆరాధనల్ని విని, మిథ్యాదృష్టులైన కొంతమంది శ్రావక వ్రతాలని స్వీకరించారు; శ్రావకులు దృఢ సమ్యగ్దృష్టులై నమస్కరించి వెళ్ళిపోయారు.

సూర్యుడు అస్తమించాడు. చిన్నస్వాములవారికి ఆసన్నకాలం సమీపించిందని గ్రహించి భట్టారుస్వామి, ''చిన్నస్వామీ, మీకిప్పుడు ప్రాణం పోయే పరిస్థితి ఏర్పడుతుండడంవల్ల భగవంతుణ్ణే ధ్యానిస్తుండండి. పంచ నమస్కారాల పఠానాన్ని వింటూ ఉండండి'' అని త్వరత్వరగా పంచ నమస్కారా లను పఠించగా, ప్రాయోపవేశమెలాగో అలాగ శుభపరిణామంవల్ల సమ్యక్దర్శన, జ్ఞాన, చారిత్రలని సాధించి నందిమిత్రులు దేహత్యాగం గావించారు. సౌధర్మ కల్పంలో రెండుసాగర సంవత్సరాల ఆయుస్సు కలిగిన కనకధ్వజుడనే దైవంగా పుట్టి, ఆ దైవం అవధి జ్ఞానంవల్ల తన జన్మాంతరాన్ని గ్రహించి, ఈ శరీరంవల్లే తనకు ఇలాంటి దివ్యశరీరమూ, దేవలోకపు సుఖసంపదలు కలిగాయనీ, మూడుకోట్ల పరివార దేవతలూ, మూడులక్షల దేవతా స్త్రీలయిన రాణులు, గణికల చేత రత్న ఖచితమైన దివ్య విమానాన్ని అధిరోహించి అత్యంత వైభవంతో

వచ్చాడు. ఆ సమయానికి చిన్నస్వాములవారు దేహత్యాగం చేశారని విని, రాజు, రాణి, మంత్రి, పురోహితుడు మొదలైనవారు చిన్నస్వాములవారి దేహాన్ని పూజించారు. నందిమిత్రుల శరీరాన్ని తీసుకొనిపోతున్న విమానం ముందు మరికొన్ని విమానాలను నిర్మించి, పాళిధ్వజాలను పతాకాలను ఎగురవేయించి, పటు, పటహ, తుణవ, భంభా, మద్దెల, ఝల్లరి, తాళ, కాహళ, శంఖవంశ, వీణ మొదలైన వాద్య రవాలతో, బంగారు నాణేలను విసరివేస్తూ వెళ్తూండడాన్ని కనకధ్వజుడు చూశాడు. ''నా శరీరానికి వీళ్ళింత ఉద్ధృతంగా ఉత్సవం చేస్తుండగా నేను చేయలేకపోతానా?'' అనుకొని తాను కూడ అనేక విమానాలను సృష్టించి, దేవదుందుభిని సారించి, నమేరు, మందారం, సంతానకం, పారియాత్రలనే దేవలోకపు పుష్పాలతో వర్షం కురిపించి, దేవతలూ, దేవతాస్త్రీలతో క్షపణకుడి విమానం ముందు నాట్యం చేశాడు. దీన్ని చూసిన రాజూ, ప్రజలు ఆశ్చర్యపడ్డారు.

రాజు, ''మీరెవరు? ఏమంటున్నారు? ఎక్కడినుంచి వచ్చారు? ఎందుకిలా గంతులేస్తున్నారు?'' అని అడిగాడు. అందుకు కనకధ్వజ దైవం ''నేనే కదా నందిమిత్రుడనే మీ చిన్నస్వామిని? భోజనానికని వచ్చి తపస్సుకు కూర్చొని, ఏడురోజులపాటు ఉపవాసం ఉండి, దేహాన్ని త్యజించి దేవలోకంలో కనకధ్వజుడనే దేవతనై జన్మించాను. మీరు నా దేహాన్ని పూజిస్తుండగా, నా వైభవాన్ని చూపించాలని వచ్చాను'' అని చెప్పి తన శరీరాన్ని దివ్యమైన గంధ, పుష్ప, ధూప, దీపాలతో అర్చించాడు. తన గురువైన శివగుప్తాచార్యులను పూజించి, ''మీ దయవల్ల నాకింత గొప్ప వైభవం, దైవత్వం ప్రాప్తమయ్యాయి'' అని చెప్పి నమస్కరించి తన దేవలోకానికి వెనుదిరిగిపోయాడు.

''దీన్నంతా చూసి జయవర్మ మహారాజుకు తీవ్రమైన వైరాగ్యం ఏర్పడింది. శ్రీవర్మ అనే తన జ్యేష్ఠకుమారుడికి రాజ్యపట్టాన్ని కట్టి, అనేకమంది రాకుమారుల, పట్టపురాణి మొదలైన అనేకమంది రాణులు, పరివారంవారు, పట్టణవాసులతో పాటు శివగుప్త భటారకుల చెంతకువచ్చి దీక్ష గ్రహించి తపోనిరతుడయ్యాడు. సమ్యక్ జ్ఞాన, చారిత్రాలని పొంది, కాలక్రమంలో వైరాగ్యాన్ని స్వీకరించి శరీరాన్ని త్యజించి, అంతమందీ దేవలోకానికి వెళ్ళారు. కనకధ్వజుడనే దేవుడే దేవలోకపు సుఖాలను చాలాకాలం అనుభవించి వచ్చి

ఇక్కడ సంప్రతి చంద్రగుప్తుడవై జన్మించావు నీవు''. సమాధగుప్త భట్టారకులు ఇలా తన పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పడాన్ని విని ఆనందించి, సంప్రతి చంద్రగుప్తుడు వారికి నమస్కరించి రాజమందిరానికి వెనుదిరిగాడు. భూమండలాన్ని ఏకచ్ఛాధిపత్యం క్రింద ఏలుతూ ఉజ్జయినిలో సుఖంగా ఉన్నాడు.

ఇక్కడ ద్వాదశాంగ చతుర్దపూర్వధారుడైన భద్రబాహుభట్టారకులు ఒక చిన్న ఋషుల సముదాయంతో గ్రామం, నగరం, గిరిదుర్గం, ప్రాకారదుర్గం, పట్టణం, ద్రోణముఖాలలో విహరిస్తూ ఒకమారు ఉజ్జయినికి వచ్చి పట్టణ పొలిమేరలోని ఉద్యానవనంలో బసచేశారు. రాజు ఈ సమాచారం విని అపారమైన భక్తిప్రపత్తులతో విచ్చేసి ఋషీశ్వరుడికి నమస్కరించి, ధర్మాన్ని అడిగి శ్రావకవ్రతాలను స్వీకరించి వెనుదిరిగాడు. కొద్దిరోజులు భటారకస్వామి అక్కడే విడిది చేశారు. ఒకమారు తక్కిన ఋషుల సముదాయమంతా భిక్షకు బయల్దేరివెళ్ళగా భద్రబాహు భటారకులు తామొక్కరే ఒక గృహంలోనికి ప్రవేశించారు. ఇంట్లో ఎవ్వరూ లేరు. బయటి గదిలో ఉయ్యాలలో అస్పష్టంగా కన్పిస్తున్న ఒక చిన్న శిశువు; ''బోళహ, బోళహ భటారకుడా'' - 'వెళ్ళండి, వెళ్ళండి, భట్టారకులూ!' - అని అన్నది. ఆ మాటల్ని విన్నవెంటనే అది దివ్యవాక్కని గ్రహించి భద్రబాహుడు కాలావధిని కోరారు. శిశువు పన్నెండేళ్లని సమాధానం ఇచ్చింది. కాలదోషంవల్ల ఇకముందు జననష్టం అవుతుందని తెలుసుకొని, విడిదికి వెనుదిరిగారు. మునులనందరినీ అక్కడికి పిలిపించారు. ''ఈ దేశంలో పన్నెండు సంవత్సరాల కాలం వర్షాభావంవల్ల క్షామం ఏర్పడుతుంది. అందువల్ల ఈ దేశంలోని ఋషులనందరినీ పిలిపించండి. అందరం దక్షిణాపథానికి వెళ్దాం'' అన్నారు.

రాజు ఆ రోజు రాత్రి పదహారు చెడ్డకలల్ని చూశాడు. సూర్యుడు ప్రొద్దుగుంకడం, కల్పవృక్షపు కొమ్మ విరగడం, నేలమీదకి వస్తున్న విమానం క్రిందికి దిగకుండా మధ్యలోనే పైకి వెళ్ళిపోవడం, పన్నెండుతలల పాము, చంద్రుడు చీలడం,. అత్యంత రభసంతో కూడిన రెండు ఏనుగులు పరస్పరం పోరాటానికి సిద్ధమై, జడిసి వెనుదిరిగి వెళ్ళిపోవడం, మినుగురు పురుగు, నీళ్ళులేని చెరువు మధ్యభాగం, పొగ ఆవరించిన కార్చిచ్చు, సింహాసనాన్ని

అధిష్ఠించిన కోతి, బంగారుపళ్ళెరంలో కుక్క పాయసాన్ని నాకడం, మదించిన ఏనుగుమీద కూర్చున్న కోతి, మత్తెక్కిన ఏనుగు, పెంటకుప్పలో తామరపుట్టుక, సముద్రం తీరాన్ని అధిగమించి రావడం, తెల్లటి గాడిదను కట్టిన బంగారు రథం, రాజు తెల్లటి గాడిదలను అధిరోహించడం - ఈ పదహారుకలల్ని ఆయన కన్నాడు. సమ్యగ్దర్శన శుద్ధి మొదలైన సద్గుణాలతో కూడిన సంప్రతి చంద్రగుప్త మహారాజు ఈ దుస్వప్నాలకు భయపడి, సూర్యోదయంకాగానే భటారకుల చెంతకు పరిగెత్తుకుంటూ వచ్చి ఆ కలల్ని వివరించి ఫలితాలను అడిగాడు. భద్రబాహు భటారకులు ఈ విధంగా చెప్పనారంభించారు:

''సూర్యుడు గ్రుంకడాన్ని చూసిన ఫలితంగా, ఈ భరతక్షేత్రంలో ఇకముందు చతుర్దశ పూర్వధారులూ, అవధిజ్ఞానులూ జన్మించరు. కల్పవృక్షపు కొమ్మ విరిగిపడడం మూలంగా, ఈ రోజు గడిచిన తర్వాత కులం, బలం, వైభవాలతో పెద్దలైన కిరీటధారి రాజు తపస్సు చేయలేరు. నేలకు దిగుతున్న విమానం అలాగే వెనుదిరిగి పోవడం ఫలితంగా దేవతలూ, విద్యాధరులూ ఇకముందు ఈ క్షేత్రానికి రారు. పన్నెండుతలల పామును చూసిన ఫలితంగా ఇక పన్నెండేళ్ళ కాలం ఈ దేశంలో భయంకరమైన క్షామం తాండవిస్తుంది. చంద్రుడు చీలడం మూలంగా ఇంతకుముందు పండుతూ ఉండిన రుచియైన పంటలకు మారుగా గడ్డి మొలవడం ఆరంభిస్తుంది. ఏనుగులు పోరాటానికి సన్నద్ధమై వచ్చి వెనుదిరగడం మూలంగా ప్రజలు ఆశించినట్టుగా వర్షాలు కురవకుండా ఉంటాయి. ఎక్కడో కొద్దిచోట్ల మాత్రం వర్షం పడ్డట్టవతుంది. మినుగరు పురుగుల్ని చూడడంవల్ల, శాస్త్రాలు, చతుర్దశ విద్యాస్థానాలు క్రమంగా తగ్గి, కొంతమాత్రం మిగిలిపోతాయి. నీళ్ళులేని చెరువు మధ్యభాగాన్ని చూడడంవల్ల, తీర్థంకర చక్రవర్తులు జనించిన ప్రదేశం వెనుకటి ప్రసిద్ధిని కోల్పోతుంది. ఈ మధ్యదేశం అంటే, తూర్పులో అంగదేశం, దక్షిణంలో కౌశాంబి నగరం, పశ్చిమంలో దాణ, ఉత్తరంలో కుణాళ - వీటి మధ్యభాగంలో ధూమాన్ని ఉద్భృతం చేసే కార్చిచ్చు, దుష్టజనులు అధికమయ్యే సూచన; అంతేకాక దయ మొదలైన సద్ధర్మాలకు విరుద్ధంగా ఆచరించే, అపారమైన హింసాచరణలతో కూడిన వేదాది శాస్త్రాల ఆధిక్య సూచన; సింహాసనం మీద కోతి కూర్చున్నదాన్ని చూడడంవల్ల, సత్కులం కానివాళ్ళు రాజవుతారు. బంగారు కంచంలో కుక్క పాయసం నాకడాన్ని చూడడంవల్ల రాజు

హీనలాంఛనం ఉన్నవాళ్ళని పూజిస్తారు. కోతి ఏనుగును ఎక్కడాన్ని చూసిన ఫలితంగా పవిత్రమైన కులంలో పుట్టిన రాజు సంతానం తమ ఉత్తమ కుల గౌరవాన్ని కోల్పోయి పొట్టకూటికోసం సత్కులం కానివాళ్ళకు సేవకులై జీవిస్తారు. పెంటకుప్పలో తామర వికసించడాన్ని చూడడం వల్ల దయ, ఉపశమం, అపరిగ్రహం, సత్యం, శౌచం, క్షమ మొదలైన ధర్మమార్గాలని నిరాకరిస్తారు. నీచజాతులవాళ్ళు, దరిద్రులూ ధర్మాన్ని గ్రహిస్తారు. సముద్రం తీరాన్ని దాటడంవల్ల రాజు సంతానం తమ మర్యాదల్ని అతిక్రమించి ద్రవ్యం మొదలైన విషయాల్లో లోభులవుతారు. సత్యం, శౌచం, చారిత్రలు లేనివాళ్ళుగా నిర్దయులవుతారు. తెల్లటిగాడిదను బంగారు రథానికి కట్టడాన్ని చూసిన ఫలితంగా ఉత్తమమైన తపస్సును అనుసరించినా పురుష ప్రయత్నం సత్యం, మనోబలం, వీర్యాలతో కూడిన తీర్థంకర పరమదైవం, చక్రవర్తులుగైకొన్న ప్రసిద్ధ మోక్షమార్గాన్ని చేపట్టినప్పటికీ విషయసుఖాలవల్ల మోహితులై భ్రష్టులవుతారు. రాజు తెల్లటి గాడిదలను ఎక్కడాన్ని చూడడంవల్ల ఉత్తమకులజులు కులంకాని వాళ్ళతో సంబంధం చేపట్టి స్నేహం చేస్తారు''.

ఇలా తాను కన్న పదహారు దుస్వప్న ఫలితాలను విన్న సంప్రతి చంద్రగుప్తుడికి భద్రబాహులు కలియుగ మహారాజుయొక్క స్వరూపాన్ని ఇలా వివరించారు: ''అసత్యమాడడమే నిత్యాభ్యాసం, దుష్టజనుల్లో పాండిత్యం, గుణవంతుల్లో ద్వేషబుద్ధి, దుష్టుల్లో అతిమర్యాద, యతీశ్వరుల మాటల్లో కాఠిన్యం - ఇవే కలియుగ మహారాజు యొక్క లక్షణాలు. కలియుగం వస్తున్నట్టుగానే సత్యవంతులైన మనుష్యులు దుర్లభులవుతారు. నానారకాల దొంగలు, వంచకులు, భూమిని కాజేస్తారు. భూమిమీద ఆర్యజనులు నశిస్తారు. దేవతలు కనుమరుగవుతారు. రాజులు ఒంటెల్లాగా దురాశా పీడితులవుతారు. తల్లిదండ్రులు కొడుకునే నమ్మలేని వాళ్ళవుతారు. ఇలాంటి చెడ్డకాలం దాపురిస్తుంది. భూమి సత్యహీనమయింది. పైర్లు ఎండిపోయాయి. నీచులు అధికులవుతారు. రాజులు కేవలం ద్రవ్యాసక్తులయ్యారు. బ్రాహ్మణులు అకార్యల్లో నిరతులవుతారు. భార్యలకు భర్తలమీద అనురాగం లోపిస్తుంది. పుత్రులు తండ్రిని ద్వేషిస్తారు. ఇలా ఉండడంవల్ల ఈ కలియుగంలో అరణ్యానికి వెళ్ళి ఉండిపోయే వాళ్ళే ధన్యులు''. ఆ రోజు గడిస్తే, జినదీక్షను గైకొనరని తెలుసుకొని ఆతను భయపడ్డాడు.

సంప్రతి చంద్రగుప్తుడు వెంటనే కార్యోన్ముఖుడయ్యాడు. తన పెద్ద కుమారుడైన సింహసేనుడికి రాజ్య పట్టంకట్టి, అనేకమంది రాజపుత్రులతో ఆ రోజే భద్రబాహు భటారకుల చెంతకువచ్చి దీక్షగైకొని తపస్సుకు ఆసన్నుడయ్యాడు.

మధ్యదేశంలో ఋషులనందర్నీ పిలిపించి భద్రబాహు భట్టారకులు ఇలా అన్నారు: ''పన్నేండేళ్ళ దాకా ఈ దేశంలో అనావృష్టి ఏర్పడి అతిభయంకరమైన క్షామం వస్తుంది. మధ్యదేశమంతా నాశమవుతుంది. ఈ దేశంలో ఉన్న ఋషులకందరికీ వ్రతభంగం అవుతుంది. కాబట్టి దక్షిణాపథానికి వెళ్దాం''. ఇలా అని సంప్రతిచంద్రగుప్తునీ, రెండువేలమంది మునుల్నీ పిలుచుకొని దక్షిణాపథానికి వెళ్ళారు. అయితే రామిలాచార్యులు, స్థూలాచార్యులు, స్థూలభద్రాచార్యులు - అనే ముగ్గురు ఆచార్యులు మాత్రం వాళ్ళవెంట వెళ్ళడానికి అంగీకరించక, తమతమ ఋషుల సముదాయంతో సింధూ దేశానికి వెళ్ళారు.

భద్రబాహు భటారకులు ఋషుల సమూహంతోపాటు గ్రామం, నగరం, గిరిదుర్గం, ప్రాకారదుర్గం, పట్టణం, ద్రోణముఖాల్లో సంచరిస్తూ కళ్బప్పు దేశంలో ప్రవేశించారు. తమ ఆయుస్సులో ఇక మిగిలిన భాగం ఎంతో తెలుసుకొని ఆయన, ''మేము ఇక్కడ వైరాగ్యాన్ని పొందుతాము, మీరందరూ వెళ్ళండి'' అని తమ పెద్ద శిష్యుడైన, దశపూర్వధారులైన విశాఖాచార్యులనూ, సుహస్తి, అమరభద్రుడు, సుభద్రమిత్రుడు, మహాగిరి, సుమతి, మహామతి, విశాఖ నంది అనేవాళ్ళని ఆచార్యులుగా చేసి, వాళ్ళతో పాటు ఎనిమిది వేలమంది ఋషుల్ని పంపించివేశారు. చంద్రగుప్త మునుల్ని వాళ్ళతోపాటు వెళ్ళమని చెప్పగా, ఆయన, ''మేము వెళ్ళడానికి ఇష్టపడడంలేదు, ఇక్కడే మీ దగ్గరే ఉంటాము'' అని అన్నారు. భద్రబాహు భటారకులు కళ్బప్పు దేశపు అడవిలోని కొండమీదున్న ఒక బండమీద కూర్చుని చతుర్విద ఆహార, శరీర నివృత్తి చేసి వైరాగ్యం గైకొన్నారు. చంద్రగుప్త మునీ అష్టోపవాసం చేపట్టగా భద్రబాహు భటారకులు ''మేము వ్రతం చేపట్టం, మీరయిన భిక్షకు వెళ్ళిరండి'' అని అన్నారు. చంద్రగుప్తముని ''భట్టారకులూ, ఊరులేదు, వీథిలేదు. ఈ అడవిలో ఎక్కడికి భిక్షకోసం వేళ్ళేది?'' అని అడిగారు. ''ఆగమాల్లో కాంతారభైక్ష అనేది ఉంది. ఎవరైన ప్రయాణికులు అడవిలో విడిది చేస్తుండవచ్చు. వాళ్ళు భిక్షకు

మిమ్మల్ని ఆపవచ్చు, వెళ్ళిరండి'' అన్నారు భద్రబాహుడు. అలాగే అని చెప్పి చంద్రగుప్తముని అడవిలో తిరుగుతుండగా, ఒక చెట్టు తొర్రలోంచి ముత్యాల కంకణాలతో అలంకృతమైన ఒక హస్తం, బంగారు గరిటె పట్టుకుని, ''భట్టారకా, భిక్షగైకొనుమని'' అనడాన్ని చూసి, కేవలం చేయిమాత్రమే కన్పట్టంవల్ల దాన్ని స్వీకరించిక నిర్లక్ష్యం చేసి వెనుదిరిగారు. భద్రబాహు భటారకులు భిక్ష లభించిందా? అని ప్రశ్నించగా తాము చూసినదాన్ని చంద్రగుప్తముని వివరించారు. రేపు ప్రయత్నించమని చెప్పారు గురువుగారు. మరుసటిరోజు చంద్రగుప్తముని మళ్ళీ భిక్షకోసం అడవిలో తిరుగుతుండగా ఒక చెట్టుక్రింద బంగారు పాత్రనుంచుకొని, అందులో అన్నం నింపి, బాగా అలంకారం చేసుకొన్న ఒక దివ్యస్త్రీ ఎదురై వచ్చి భిక్షకోసం నిలిపింది. అప్పుడు చంద్రగుప్తముని, ''అమ్మా, నీవొక్కదానివే ఇక్కడున్నావే, ఇతరులెవ్వరూ లేరు. అందువల్ల ఋషులు ఇలాంటి ప్రదేశాల్లో భిక్షను కోరరు'' అని చెప్పి మళ్ళీ తామున్న ప్రదేశానికే వెనుదిరిగి పోయారు. గురువులకు జరిగిన విషయాన్ని తెలిపారు. ''మంచిపనిచేశా''రని మౌనం వహించారు భద్రబాహుడు. ఇలా పదిరోజులు ఉపవాసం చేసి పదకొండవరోజు మళ్ళీ భిక్షకోసం అడవిలో సంచరిస్తుండగా ఒక చోట, ఒక సుందరమైన పట్టణమూ, భవ్యమైన సౌధాలూ, మేడలూ, వేశ్య వాటికలూ, దేవాలయాలూ, ఏనుగులు - గుర్రాలూ, జనసంచారం - ఇవన్నీ కన్పించాయి. ఇన్నిరోజులు చెట్టూచేమల పొదల మధ్య ఉన్న ఈ పట్టణాన్ని చూడలేదని మనస్సులో అనుకొని, అక్కడ భిక్షను అడగడానికి లోపలికి ప్రవేశించారు. అప్పుడొక దివ్యస్త్రీ పరివారంతో పాటు ఎదురుగా వచ్చి, ఆయనను నిలిపి తన భవ్యమైన గృహానికి పిలుచుకొని వెళ్ళి, పాదాలు కడిగి, పూజించి, గురుభక్తిని ప్రకటించి, నమస్కరించి, నిండుభక్తితో దివ్యాహారాన్ని మళ్ళీ, మళ్ళీ వడ్డించి ఉపచారం చేసింది. చంద్రగుప్తముని తృప్తిగా భిక్షను స్వీకరించి, ఆశీర్వదించి తమ బసకు వచ్చారు. భద్రబాహు గురువులు ప్రశ్నించారు, ''ఈ రోజు భిక్ష లభించిందా?'' ''లభించింది''. ''ఎక్కడ''. ''భట్టారకస్వామీ, ఇన్నిరోజులూ చెట్ల పొదలచాటున ఉన్న ఒక పట్టణాన్ని మేమిదివరకూ చూడనేలేదు. ఈ రోజు దూరంగా సంచరిస్తుండగా, ఆపట్టణాన్ని చూసి భిక్షకోసం అక్కడికి వెళ్ళాను. ఒక దివ్యస్త్రీ సపరివారంగా ఎదురువచ్చి నిలిచి భిక్షను ప్రసాదించింది. స్వీకరించి, దీవించి వచ్చాను'' అన్నారు చంద్రగుప్తముని. మంచిదయిందని గురువులు సంతసించారు.

ఇలాగే ప్రతిరోజూ చంద్రగుప్తముని అడవి మధ్యలో ఉన్న ఆ ఊరికి వెళ్ళి భిక్షగైకొనేవారు. భద్రబాహు భట్టారకులు తపస్సు చేస్తున్నంత కాలమూ ''అవమోదర్య చర్య' చేసి, ఆకలిని సహించి, తమ శరీరాన్ని శుష్కింప చేసుకొని వైరాగ్యం పొంది, చాల రోజులు ఆకలిదప్పుల్ని సహించి శుభపరిణామం వల్ల సమ్యక్‌దర్శనం, జ్ఞానం, చారిత్రలని సాధించి దేహత్యాగం చేశారు; బ్రహ్మకల్పంలో పదిసాగర సంవత్సరాలు ఆయుస్సు కలిగిన అమితకాంతి అనే దైవంగా జనించారు.

చంద్రగుప్తముని అక్కడే ఉండిపోయి, భద్రబాహు భట్టారకుల సమాధికి నమస్కరిస్తూ, ఆ వనదేవత సేవిస్తుండగా భిక్షాటన చేస్తూ, తపస్సు చేస్తూ పండ్రెండేళ్ళు గడిపారు. ఆ సమయానికి తమిళనాడుకు వెళ్ళిన ఋషి సముదాయం పన్నెండేళ్ళు ఏ కష్టమూ లేక కాలం గడిపి, ఉత్తరదేశం క్షామ పరిహారమయిందని, అక్కడినుంచి వచ్చిన వాళ్ళనుండి తెలుసుకొని అక్కడికి వెళ్ళడానికి బయల్దేరింది. దారిలో భద్రబాహు భట్టారకుల సమాచారాన్ని విని, ఆయన సమాధికి నమస్కరించి వెళ్ళాలనుకొని విశాఖాచార్యులు మొదలైన మునులందరూ అక్కడికి వచ్చారు. చంద్రగుప్తముని వాళ్ళను ఎదుర్కొని నమస్కరించారు. అప్పుడు మునులందరూ, ఈఅడవిలో కందమూలాలను తింటూ, ఏటి నీళ్లు త్రాగుతూ పన్నెండేళ్ళ కాలం వీళ్ళు ఎలా జీవించారు?'' అని అనుకొన్నారు. అంతేకాక తలవెంట్రుకలు పెరిగిన దాన్ని చూసి చంద్రగుప్తమునికి ఎవరూ ప్రతి నమస్కారం చేయలేదు. ఆ రోజు మునులు ఉపవాసం చేసి భట్టారకుల సమాధిని అర్చించి, నమస్కరించి అక్కడే పడుకొని మరుసటి రోజు బయల్దేరుతుండగా చంద్రగుప్తముని, ''భటారకులారా, నిన్నటిరోజు చాలదూరం నడచి ఆయాసపడ్డారు. ఈ రోజు ఇక్కడే ఉండి భిక్షగావించి, బడలికను పరిహరించుకొని రేపు వెళ్ళవచ్చును కదా'' అన్నారు. ''ఇక్కడేం ఊరుందా, వీధులున్నాయా? ఇక్కడెక్కడ భిక్షకు వెళ్తాం? ఊరికే ఎందుకు మమ్మల్ని హింసిస్తారు?'' అని ఆ మునులు ప్రశ్నించారు. అప్పుడు చంద్రగుప్తముని, ''ఇక్కడొక పెద్ద నగరం ఉంది. మీరు చింతించకండి, ఈ రోజు ఇక్కడే ఉండండి''. ఈ రోజు ఇక్కడే ఉండి వీరి మాటల్ని చూద్దాం అని అనుకుని అక్కడే ఉండిపోయి, మధ్యాహ్నం కావస్తుండగానే అందరూ దేవుణ్ణి ప్రార్థించి చంద్రగుప్తులతో పాటు బయల్దేరారు. ఆ నగరంలో అందరికీ వేరే వేరే

ఇళ్ళలో భిక్ష లభించింది. చంద్రగుప్తుడూ, మరికొంతమంది మునులూ, ఆచార్యులతోపాటు ఒక ఇంట్లో దివ్యాహారాలను భిక్షగా స్వీకరించి వచ్చారు. కొంత సేపయ్యాక విశాఖాచార్యులు తమ శిష్యుడికి, ''బ్రహ్మయ్యా, కాళ్ళు కడుక్కోవాలి, చెంబు తెచ్చి ఇవ్వు'' అని అడిగారు. భోజనం చేసిన ఇంట్లోనే చెంబు మరచి వచ్చాను అన్నాడు బ్రహ్మయ్య. ''త్వరగా వెళ్ళి తీసుకురా'' అన్నారు గురువులు. బ్రహ్మయ్య వెళ్ళి అడవిలో ఎక్కడ వెదికినా పట్టణమే లేదు, చెంబు అసలే లేదు! అటు ఇటు చూస్తుండగా ఒక చెట్టు. చిట్టచివరలో వ్రేలాడుతోంది చెంబు! బ్రహ్మయ్య వెనుదిరిగి వచ్చి గురువులకు చెప్పాడు. ''భట్టారకా, మనం భోంచేసిన ప్రదేశంలో ఆ పట్టణం లేనేలేదు. ఆ ఇల్లూ లేదు. కమండలం మాత్రం ఒక ఎత్తయిన చెట్టు చిట్టచివర్లో వ్రేలాడుతోంది. ఎవరినైనా చెట్టు ఎక్కగలిగే వాళ్ళను పంపించాలి.'' ఋషులందరికీ అత్యాశ్చర్యం వేసింది. అందరూ వెళ్ళి అక్కడ పట్టణం కన్పించక, చెట్టు చిట్టచివర్లో ఉన్న కమండలాన్ని తీయించుకొని వచ్చారు. అందరూ వెళ్ళి చంద్రగుప్తమునుల నుద్దేశించి, ''మీరింతకాలం ఈ అడవిలో కందమూల ఫలాలను తింటూ, ఏటి నీళ్ళు త్రాగుతూ జీవిస్తున్నారని భావించి మీకు నమస్కరించలేదు. మనసులో విచారం పెట్టుకోక క్షమించాలి, మీకు దేవతలే సేవ చేశారు. ఇన్ని రోజులూ దేవతలు తయారుచేసిన ఆహారాన్ని భోంచేసేసినట్టయినది. ఇక తినకండి దేవతలు తయారుచేసిన ఆహారాన్ని ఋషులు భోజనం చేయకూడదు'' అని చెప్పారు. చంద్రగుప్తమునికి నమస్కరించారు. వాళ్ళకు తలవెంట్రుకలను తీయించి, వ్రతాలను ఇచ్చి, ప్రత్యాఖ్యానం చెప్పి వాళ్ళను పిలుచుకొని ఉత్తరాపథానికి బయల్దేరారు. కొంతకాలం ప్రయాణం చేసి మధ్యదేశాన్ని ప్రవేశించారు. ఋషుల సముదాయం ఆ దేశంలో ఎలాంటి అడ్డంకులూ లేక ఉండిపోయింది.

ఇక్కడ రామిలాచార్యులు, స్థూలాచార్యులు, స్థూలభద్రాచార్యులు తమతమ ఋషుల సముదాయాలతో సింధుదేశానికి వెళ్ళారు. అప్పుడక్కడ మనుష్యులు మనుష్యుల్నే తినేంతటి కరువు. అక్కడ ఉన్న శ్రావకులందరూ ఏకమై మునుల దగ్గరకు వెళ్ళి, ''భట్టారకులారా, బయటివాళ్ళు ఇప్పుడిక్కడ ఉదయం తినడానికీ, వంట చేయడానికీ భయపడతారు; ఇతరులు మీదపడి లాగికొని తినేస్తారు. దీనివల్ల ప్రజలందరూ పగలు వంటచేయడం మానివేసి

రాత్రిపూట వంట చేసుకుని భోంచేస్తున్నారు. మీరు కూడ మీ భిక్షాపాత్రల్ని తీసుకుని వచ్చి, రాత్రిపూట అందులో భిక్ష వేయించుకుని వచ్చి, అలాగే ఉంచుకుని మరుసటిరోజు ఉదయం భోంచేయండి'' అని చెప్పారు. ఆ రోజు నుంచీ అదే విధంగా మునులు రాత్రి సమయాల్లో భిక్షకోసం రాసాగారు. కొంతకాలం గడిచింది. ఒకరోజు ఒక దిగంబర ముని భిక్షాపాత్రను పట్టుకు వచ్చి రాత్రి భిక్షకోసం తిరుగుతూ ఒక ఇంటిలోనికి ప్రవేశించాడు. అక్కడున్న ఒక స్త్రీ శ్రావకి - వేళాస్వామిని అనబడే ఈ యువతి గర్భిణి. ఆ కటిక చీకటి రాత్రి, ఒంటిమీద పేలిక బట్ట కూడ లేకవచ్చిన ముని రూపాన్ని చూసి భయపడ్డది. ఆ భయానికి అప్పుడే ఆమెకు గర్భం దిగిపోయింది. దీన్ని గమనించిన శ్రావకులు అందరూ ఒక్కటిగా చేరి, ''భట్టారకులారా, కాలం చెడిపోయింది. మంచికాలం వచ్చినప్పుడు మీరు ప్రాయశ్చిత్తం చేసుకుని తపస్సు చేద్దురుగాని. ఇప్పుడు మాత్రం ఈ కరువు నివారణ అయ్యేదాకా మీరు ఎడమచేతిని క్రిందికి దించి, సగం వస్త్రాన్ని ఎడమభుజం మీద వేసుకుని, లోపల దిగంబరుల్లాగా ఉంటూ, కుడిచేత్తో భిక్షాపాత్రని పట్టుకుని భిక్షకురండి'' అన్నారు. మునులు దానికి అంగీకరించారు. కొంతకాలం గడిచిన తర్వాత క్షామం నివారణ అయింది. రామిల, స్థూల, స్థూలభద్రాచార్యులు తమతమ ఋషుల సముదాయంతో మధ్యదేశానికి వెనుదిరిగి వచ్చారు. అప్పుడు విశాఖాచార్యులు మొదలైనవారు, ''మీరందరూ సగం గుడ్డల్ని ధరించడాన్ని వదలిపెట్టి, ముందులాగానే దిగంబరంగా వ్రతాలను చేపట్టి ప్రాయశ్చిత్తం చేసుకోండి'' అని చెప్పారు. అలాగే అని రామిలాచార్యులూ, స్థూలాచార్యులూ, ఋషి సముదాయంతోపాటు సగం వస్త్రాన్ని విసరి పారేసి, వ్రతధారులై విశాఖాచార్యుల దగ్గర తపస్సుకు వచ్చి నిలిచారు. అయితే స్థూల భద్రాచార్యులు మొదలైన కొంతమంది మాత్రం దానిని అంగీకరించలేదు. జినకల్పం, స్థవిరకల్పం అని రెండు భాగాలు చేసి సగం వస్త్ర సంప్రదాయాన్ని వాళ్ళు చేపట్టారు.

ఇలా మొదలయిన సగం వస్త్రధారణా పంథం సురథమనే దేశంలోని వళభి అనే పట్టణం దాకా ప్రాకింది. ఆ నగరాన్ని పరిపాలిస్తున్న రాజు వజ్రపాలు డనేవాడు. అతడు మిథ్యాదృష్టి. అయితే అతని భార్య, పట్టపురాణి స్వామిని అనే యువతి సగం వస్త్రధారణా సంప్రదాయాన్ని పాలించే మునుల భక్తురాలు. ఒకరోజు రాజూ రాణీ ఇద్దరు ప్రాసాదాన్ని అధిరోహించి, కూర్చొని చుట్టుప్రక్కల

చూస్తుండగా సగం వస్త్రధారణా సంప్రదాయపు మునులు రాజమందిరపు వైపు వస్తుండడం కన్పించింది. అర్ధనగ్న మునులనందరినీ పిలిపించి రాజు ఇలా చెప్పాడు. ''మీరందరూ ఇక ముందు ఈ సగం వస్త్రాన్ని వదలి దిగంబరంగా తపస్సు చేయండి'' దీన్ని మునులు అంగీకరించలేదు. ''అలాగవుతే అర్ధనగ్నాన్ని తీసివేసి పూర్తిగా గుడ్డల్ని కట్టుకోండి'' అన్నాడు రాజు. మునులు దానికి అంగీకరించి ఒక వస్త్రాన్ని పంచెకట్టు లేకుండా చుట్టి కట్టుకొని మరొక చిన్న వస్త్రాన్ని కప్పుకొన్నారు. దానికి కంబళ తీర్థమనే పేరువచ్చింది. వాళ్ళని శ్వేతపటులని పిల్వదొడిగారు. అదే పరంపరలోని శ్వేత భిక్షుజాపులి సంఘానికి దక్షిణాపథంలో సామళిపుత్రుడనే రాజు శ్వేతభిక్షుజాపులి సంఘానికి మొదటివాడయ్యాడు.

ఇక్కడ చంద్రగుప్తముని అతి భయంకరమైన తపశ్చరణ గావించి వైరాగ్య విధానంతో దేహత్యాగం చేసి పరమశుద్ధ సహజ రత్నత్రయాన్ని సాధించి దేహత్యాగం గావించి బ్రహ్మకల్పంలో పదిసాగర సంవత్సరాల ఆయుస్సు కలిగిన శ్రీధరుడనే దేవుడై జనించాడు. ఇది భద్రభాహు భట్టారకుల కథ.

విరక్తులైన ఇతరులూ మనస్సులో భద్రబాహు భట్టారకులనే స్మరించి ఆకలి, దప్పి, శీతం, ఉష్ణం, దంశ, మశకాది బాధల్ని ఎలా సహించారో అలాగే భవ్యులు కూడ పరిషేహాలని సహించి పరమశుద్ధ సహజ రత్నత్రయాలను సాధించి స్వర్గాపవర్గ సుఖాలని పొందనీ.

* * *

# 7. లలిత ఘటి కథ

కౌశాంబీ పట్టణానికి చెందిన లలితఘటి సమ్యక్, జ్ఞాన, దర్శన, చారిత్ర పూర్వక ఆరాధనను ఆచరించి, ప్రాయోపగమనంతో అత్యంత వేగంగా నదీ ప్రవాహంలో చిక్కుకొని పోయింది.

జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో వత్స అనే ప్రాంతం ఉంది. అందులో కౌశాంబి అనే పట్టణం ఉంది. దానిని పాలిస్తున్న రాజు పేరు హరి ధ్వజుడు. అతని పత్ని వారుణి. వారికి శ్రీవర్ధన, విజయంధర, వీరబాహు మొదలైన ముప్పయిరెండు మంది సంతానం ఉన్నారు. వీరందరూ మరియు సామంత, మహాసామంతుల బిడ్డలూ కలసి మొత్తం ఐదువందలమంది రూపం, తేజస్సు, యవ్వన సంపదలలో సమానంగా వుండటం వల్ల వారందరికీ మొత్తంగా లలితఘటి అని పేరువచ్చింది. అంతమంది మిథ్యాదృష్టులు, పండితులు ఒకరోజు శ్రీకాంతమనే పర్వతారణ్యంలో కలవడానికి వారంతా పోయారు. అక్కడ అభయ ఘోషుడనే ఋషి వున్నాడు. గర్భంలో ఉన్నపుడే వారి తల్లికి జీవులను చంపరాదనే కోరిక కలిగి, ఆ ప్రాంతమంతా అభయఘోషణ చేయించి, జీవులన్నిటికీ అభయదానమిచ్చింది. అలాగే పుట్టడం చేత అతనికి అభయఘోషుడని పేరు వచ్చింది. అతని తపోమహిమ చేత ఆ వేళ లలితఘటికి ఒకే ఒక్క ప్రాణికూడా దొరకలేదు. వారు గ్రామానికి మళ్ళారు. ఈ విధంగా విశ్రాంతిలేకుండా ఏడురోజులు పోయి, విఫలురై, నిరాశచెంది, ఎనిమిదవరోజు అడవిలో మృగాలను వెతుకుతూ తిరుగుతున్నారు. అప్పుడు ఋషి ఒక రాతిమీద కూర్చొని ఆగమను ఉచ్చరిస్తూ, మనస్సులో దాని అర్థాన్ని ధ్యానిస్తూ వున్నాడు. దూరం నుండి చూచి, అతన్ని ఒక నల్లటి ప్రాణిగా భావించి శ్రీవర్ధనుడు మొదలైన వారంతా విల్లుల్ని సారించి బాణాలను వేయగా, ఆ బాణాలు విరిగిపోయాయి. అంతమందీ వెనక్కి పడిపొయ్యారు. ఇదేమి మహాచోద్యం పోయి చూద్దాం అని దగ్గరకి పోగా, అక్కడ అభయఘోషుడు కన్పించాడు. ''ఎక్కడ దయవుందో, అదే ధర్మం; ఎక్కడ ఇంద్రియ నిగ్రహముంటుందో అదే ధర్మం. పద్దెనిమిది దోషాలు లేనివాడే దేవుడు. ఇందులో సందేహం లేదు. జీవులను చంపకుండా వుండటమే ధర్మం. బాహ్యాభ్యంతర పరిగ్రహాలను త్యజించి, ఐదు ఇంద్రియాలను జయించి, ఇరవై

రెండు పరీషహాలను సహించి, యమ, నియమ స్వాధ్యాయ, ధ్యానానుష్ఠానపరులై తపస్సు చేయు ఋషులే నిజమైన తపస్వులు. ఆకలిదప్పులు మొదలైన పద్దెనిమిది దోషాలు లేనివాడే పరమాత్మ. మనిషి పాపం వల్ల నరకాన్ని మరియు ఇతర ప్రాణి జన్మలను పొందుతాడు. ధర్మం వల్ల దేవజన్మాన్ని పొందుతాడు. అవి రెండింటినీ నశింపచేయడం వలన మోక్షాన్ని పొందుతాడు.

వివిధాలైన పాపాలను ఆచరించేవారు, వాటి వెంటబడేవారు, మధు, మద్య, మాంసాదులను సేవించేవారు, శిశువధ, స్త్రీ వధ, గోవధ, బ్రాహ్మణవధ, ఋషివధ అనే పంచమహాపాతకాలకు పాల్పడినవారు, అగమ్యగమన, అపేయపాన, అభక్షభక్ష్యాలను దుష్కర్మలను ఆచరించేవారు - వీరంతా ఏడవ నరకంలో ముప్పయి మూడు సాగరాల కాలం పాపులై జన్మిస్తారు. అక్కడ కొరకడం, కత్తిరించడం, పొడిచల్లడం, బంధించడం, ముల్లుగ్రతో పొడవడం, బల్లేలతో ఈటెలతో పేగులను వెలికితీయడం, చక్రాలతో భుజాలను నరకడం, చెట్టును చీల్చేటట్టు, రంపాలతో దేహాన్ని పొడవుగా రెండు తుండ్లు గావించడం - యిటువంటి అపారమైన దుఃఖాలను వారు అనుభవిస్తారు. కనురెప్పలు మూయడానికి కూడా, వూపిరి పీల్చుకొనే సమయం కూడా లేకుండా దండనలకు గురి అవుతారు. పాపాలను ఆచరించేవారు, ఏనుగు, సింహము, పులి, ఎలుగు, జింక, పంది, తోడేలు, అడవికుక్క, ఎద్దు, గాడిద, ఆవు, బర్రె, గుర్రము, ఒంటె, ఉడుము, పాము, ఎలుక, పిల్లి, తొండ, కప్ప, ముంగిస మొదలైన భూచరాలుగాను; చేప, మొసలి, తాబేలు, మకరం, తిమింగలం మొదలైన జలచరాలుగాను; కాకి, గుడ్లగూబ, గద్ద, చకోరము, హంస, కుక్కుటము, రామచిలుక, చిలుక, తెల్లగూబ మొదలైన గగన చరాలుగాను; ప్రాణి-పక్షులుగా, ఏకేంద్రియ, ద్వీంద్రియ, త్రీంద్రియ, చతురింద్రియ, పంచేంద్రియ జీవులుగా జన్మిస్తారు.

పుణ్య-పాపాల మిశ్రమంలో మనుష్యత్వాన్ని పొందుతారు. పూర్వం చేసిన పాప కర్మల ఫలితంగా శారీరక, మానసిక, ఆగంతుక దుఃఖాలను, అనిష్ట సంయోగ, ఇష్టవియోగ మరియు రాగ, శోకాలను, దరిద్రాలను అనుభవిస్తారు. ఆ జీవులు శుభకర్మల ఫలితంగా (శ్రీ) సంపద, వైభవము, ఐశ్వర్య ఆరోగ్యాలను పొంది పుత్ర, మిత్ర, కళత్ర, స్వజన, బంధుజనులతో సుఖకరంగా జీవిస్తారు.

సుఖము తర్వాత దుఃఖము, దుఃఖము తర్వాత సుఖము - ఈ విధంగా సుఖదుఃఖాలు చక్రాలువలె తిరుగుతాయి. ధర్మకార్యాలను చేసినవారు సౌధర్మ ఈశాన, సనత్కుమార, మహేంద్ర, బ్రహ్మబ్రహ్మోత్తర, లాంతన, కాపిష్ఠ, శుక్ర, మహాశుక్ర, శత, సహస్ర, ఆనత, ప్రాణత, ఆరణ, అచ్యుత - అను పదహారు కల్పాలలోనూ, వాటికన్నా ఉచ్ఛ స్థానంలో వున్న సుదర్శన, అమోఘ, సుప్రబుద్ధ, యశోధర, సోమ, సోమరూప, అంక, పళిక, ఆయిచ్ఛ అను తొమ్మిది అనుద్దిశలలో వాటికన్నా పైనున్న వైజయంత, జయంత, అపరాజిత, సర్వార్థసిద్ధి అను ఐదు అనుత్తరలలో, ఇంద్ర, పతీంద్ర, సామానిక, త్రయంస్త్రింశ, పారిషద, ఆత్మరక్ష, లోకపాల, అహమింద్ర - అను పదవులను పొంది జన్మిస్తారు. వారికి అణిమా, మహిమా, లఘిమా, ప్రాప్తి, పాగల్బ్య, ఈశిత్వ, ఏశిత్వ, కామరూపిత్వ అను ఎనిమిది గుణములతో కూడిన ఐశ్వర్యం సిద్ధిస్తుంది. దివ్యమైన రూప, లావణ్య, సౌభాగ్య, కాంతులను వారు పొందుతారు. వారి వూపిరి పరిమళిస్తుంది. ఆయుష్షు పొందినవారు నిత్య యౌవనులై వుంటారు. మృత్యు, అపమృత్యు, మూత్ర పురీషలూ, చుబుకం, కక్షా, కుక్షి ప్రదేశములలో రోమములూ, రోక, శోక, దుఃఖములూ, రస, రుధిర, మాంస, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్ల అను సప్తధాతువులూ వుండవు. సహజమైన కటక, కటసూత్ర, కుండలాది పదహారు ఆభరణములను ధరించి, దివ్యవస్త్రములను కట్టి, సూర్యుని మించిన అధిక తేజోవంతులై, రెప్పమూయడానికి కూడా తెరపిలేకుండా రెండు సాగరాల కాలంనుండి ముప్పయి మూడు సాగరాల కాలము వరకు దివ్యభోగములను అనుభవిస్తారు. ఆటపాట, వినోదాలతో, దేవేరులు, అప్సరలతో దివ్యసుఖములను అనుభవించి, ఆ పిమ్మట మనుష్యజన్మకు మరలుతారు.

ఇక్కడ కురు, భోజ, ఇక్ష్వాకు, నాథ, హరి, ఉగ్ర, సూర్య, సోమ, మయూర, నంద మొదలైన శ్రేష్ఠ వంశములలో ఉత్తములైన శ్రావకుల గర్భములో జన్మించి, అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య, కాంతులతో కూడి పెరిగి, పృథ్విని ఏకఛత్రాధిపత్యంలో పరిపాలిస్తారు. ఆ పిమ్మట ఏ కారణము చేతనైనా వైరాగ్యము వచ్చి, కుమారునికి పట్టము కట్టి, బాహ్యాభ్యంత పరిగ్రహానాన్ని త్యజించి, అందరిలో నిశ్చల్యం చేసి, ఘోర, వీర తపస్సులోకి దిగుతారు. ఉత్తమమనగా మూడు, మధ్యమమనగా ఐదు, కనిష్టమనగా ఏడు జన్మలనెత్తి,

అష్టవిధ కర్మలను నిర్జించి మోక్షమును సాధిస్తారు. శుభాశుభకర్మల రెండింటి నుండియూ విడుదలయిన పిమ్మటనే వారికి మోక్షం సిద్ధిస్తుంది.

ఇంకా ఆ మోక్షం కూడా ఎటువంటిదంటే, ''చావు పుట్టుకలు లేకుండా, అనిష్ట సంయోగ, ఇష్టవియోగాలు కానీ, శారీరక, మానసిక, ఆగంతుక సహజమైన దుఃఖములుగానీ, ఆహార, భయ, మైథున పరిగ్రహాలుగానీ వుండవు. వాత, పిత్త, శ్లేష్మ, కాస, శ్వాస, జ్వర, అరుచి, వమనము, అతిసార, అక్షి, కుక్షి, వేదన, అస్ఫోటక, శూల, భగందర, కుష్ఠ, క్షయ, శిరోవేదన మున్నగు ఐదుకోటి అరవై ఎనిమిది లక్షల తొంబయి తొమ్మిదివేల ఇన్నూటఎనభయి నాలుగు వ్యాధులూ అక్కడ వుండవు. క్రోధ, మాయా, లోభములూ, రాగ, ద్వేష, మోహములూ, శోకమూ సమీపించవు. అది పోలికే లేని స్థితి. ఎప్పటికీ నాశనం కాని స్థితి. పాపము దానికి అంటదు. తనకు తానే ఆ మోక్ష సుఖమును సాధించి, అనంతజ్ఞాన, అనంతదర్శన, అనంతశౌర్య, అనంత సుఖములను పొంది లోకాలోకాన్ని ఏకకాలంలో వీక్షిస్తూ, తెలుసుకొంటూ, అనంతకాలం మోక్షమునందు ఉందురు'' అని అభయఘోష ఋషివరేణ్యులు లలితఘటికి ధర్మోపదేశం చేశారు.

ఈ విధంగా ధర్మశ్రవణమును విని శ్రీ వర్ధన మొదలైన లలితఘటి యొక్క ఐదువందల మందికీ మనస్సు పరివర్తన చెందింది. ''మేము పంచమహా పాతకులమే. భట్టారకులను చంపడానికి పోయాము. తప్పు చేశాము. తన తపోమహిమతో ఆయన బ్రతికిపోయారు. మేము చేసిన తప్పుకు మా తలలనెడి తామరపూవులతో వారి పాదములను పూజించడమే మా పాపములను తొలగించుకొను మార్గము అని ఆయుధములను పట్టుకొని తమ తలల్ని నరుక్కోవడానికి ప్రయత్నించారు. భట్టారకులు ''అలా చేయవద్దు'' అని ఆపినారు. ''మేము ఏమి ఆలోచించినామో మీకు తెలిసిందా'' అని అడిగాడు శ్రీవర్ధన కుమారుడు. ''అవును, మీ తలల్ని కత్తిరించి మా పాదాలకు పూజచేయాలని ఆలోచించారు.'' ఈ విధంగా మనస్సులో అనుకొన్నదంతా తెలుసుకొను సామర్థ్యమున్నవారు వున్నారా అని ఆశ్చర్యపోయి, భట్టారకులకు నమస్కరించి శ్రీవర్ధనుడు యిలా అన్నాడు. ''అలా చేయకపోతే మా పాపాలు నివృత్తమయ్యేది ఎలా మునిపుంగవా'' అన్నాడు శ్రీవర్ధనుడు. ''ఈ విధంగా చేస్తే మా పాపం అణగిపోదు'' శ్రీవర్ధనుడు అన్నాడు '' ాగయితే మాకు

దీక్షను దయచేయండి''. ''ఇది మంచి మార్గము. అయితే మీకు ఆయుష్షు వున్నదే చాలా తక్కువ'' అన్నారు భట్టారకులు. శ్రీవర్ధనుని చిన్న తమ్ముడు నందివర్మ నవ్వి ''ఇదేమిటి, మేమంతా ఇంకా చిన్నవాళ్ళం. నవయౌవనం ఇప్పుడే సమీపిస్తున్నది. తేజస్సు, సత్యం, బల, పరాక్రమములతో కూడిన మాకు ఆయుష్షు తక్కువ అంటే నమ్మడం ఎలా?'' అన్నాడు. అభయఘోష భట్టారకులు ''ఎందుకు నవ్వుతావు నాయనా? మీ అందరికీ ఇక ఇరవైఒకరోజు మాత్రమే ఆయుస్సు వుంది. నీటివల్ల మీకు మరణం సంభవిస్తుంది'' అన్నారు. ''దీనికి సాక్ష్యమేమిటి'', ''మీరు పట్టణానికి తిరిగి వేళ్ళేటప్పుడు రెండు కాళింగ సర్పాలు పడగలెత్తి, నాలుకలను చాస్తూ మీకు ఎదురవుతాయి. మీరు అరచి, బెదిరిస్తే అవి అదృశ్యమవుతాయి. ఇది ఒక సాక్ష్యం. అలాగే ముందుకు పోతుండగా ఒక శిశువు బడితె తీసుకొని మిమ్ములను కొట్టడానికి వస్తుంది. దానిని చూసి మీరు నవ్వుతారు. చూస్తూ చూస్తూ వుండగానే అది భయంకరమైన భేతాళరూపము తాల్చి ఆకాశమంత పెరిగి మాయమవుతుంది. యిది రెండవ సాక్ష్యము. అలాగే ముందుకు పోతుండగా, నది వున్నట్టుండి నిండి పోతుంది. అంతేకాకుండా, మీ తల్లి, ఈ రాత్రి మీలో ముప్పయి రెండుమందిని రాక్షసుడు మ్రింగినట్లు కలకని మీకు చెబుతుంది. యిది కూడా ఒక సాక్షి.'' అని అభయ ఘోషుల వారు అన్నారు.

అందరూ ఋషికి నమస్కరించి పట్టణానికి బయలుదేరారు. ముని పుంగవులు చెప్పినట్లుగా దారిలో అన్ని గురుతులూ కనిపించాయి. మరుసటి రోజు తల్లి కలకని చెప్పడంతో వారికి తమ అల్పాయుస్సు యెడల నమ్మకం కల్గింది. ఆ సమయంలో వర్ధమాన ఋషి పుంగవుల సమూహం కౌశాంబికి వచ్చింది. శ్రీవర్ధన మొదలైన లలితఘటిలోని అందరూ అర్చనలు తీసుకెళ్ళి వర్ధమాన ఋషికి నమస్కరించి యిలా అడిగారు. ''ఋషివర్యా, మాకు ఆయుస్సు ఎంత వుంది?''

''మీ అందరికీ చాలా అల్పాయుస్సు వున్నది''

''మేము భవ్యులమా, అభవ్యులమా?''

''మీరంతా భవ్యులు. అయితేపరిశుద్ధమయిన, సహజమైన జ్ఞాన, దర్శన, చారిత్రాలను ఆరాధించకపోతే మోక్షము లభించదు. రాతిలో బంగారు

వున్నప్పటికీ, అది తాపన పిండిబద్ధనాది క్రియలకు గురికాకపోతే ఎలా బంగారు కాదో, అలాగే తపస్సు లేకుండా మోక్షం సిద్ధించదు''.

ఇది విని లలితఘటిలోని ఐదువందలమంది వర్ధమాన ఋషికి శిష్యులై తపస్సుచేసి పంచ మహావ్రతాలను స్వీకరించి, ప్రాయోపగమనంతో మరణమంటే ఏమిటో తెలుసుకొన్నారు. నిలుచున్నా, కూర్చొన్నా, పడుకొన్నా ఎప్పుడైతే సమస్త ఆశ, ఆకాంక్షలను త్యజిస్తారో ఆ స్థితే ప్రాయోపగమనమని తెలుసుకున్నందు వల్ల, జీవమున్నంతవరకు ఆహారాన్ని విసర్జించి, భట్టారకునికి నమస్కరించి అక్కడినుంచి విశాల అను నదీతీరానికి పోయి, అందరూ ఒకే వైపున పడుకొని, చేతులు, కాళ్ళు ఆడించకుండా, అటు, యిటు పొర్లకుండా, కూర్చోకుండా, నిలుచోకుండా, అటూ యిటూ చూడకుండా, మాట్లాడకుండా ప్రాయోపగమనంలో పదిహేను రోజులు పడుకొని వున్నారు. అంతలో పెద్దవర్షం రావడంవల్ల మహాప్రవాహం వచ్చి, గట్టున వున్న వారందరినీ లాక్కొని వెళ్ళి, ఒక పెద్ద మడుగులో వేసింది. నీటిలో మునిగి పోయినప్పటికీ నిర్మోహకులై, దేవుడిని ధ్యానిస్తూ, పంచ నమస్కారాలను మనస్సులో ఉచ్చరిస్తూ, శుభ ధ్యానంలో పరిణుతులై దర్శన, జ్ఞాన, చారిత్రములను ఆరాధించి, దేహ త్యాగమొనర్చి ఐదువందల మంది వైజయంతియను ఉచ్చస్థానంలో ముప్పయిమూడు సాగర సంవత్సరాలు ఆయుష్కులై, ఏకహస్త ప్రమాణపు శ్వేతవర్ణపు అహమింద్ర దేవులై జన్మించారు.

రత్నత్రయాలను ఆరాధించువారు లలితఘటిని మనస్సులో ధ్యానించి, నాలుగు ఉపసర్గలనూ, ఇరవై రెండు పరీషహాలనూ గెలిచి, శుభపరిణామంతో దర్శన, జ్ఞాన, చారిత్రాలను ఆరాధించి స్వర్గ, మోక్ష సుఖములను పొందుదురు గాక!

* * *

# 8. ధర్మఘోష భట్టారకుని కథ

చంపానగరంలోని గంగాతీరంలో, ఒక మాసం ఉపవాసం వుండి, దాహాన్ని సహించి, ధర్మఘోషుడను ఋషి ఉత్తమ దర్శన, జ్ఞాన, చారిత్రాలను పొందారు.

జంబూద్వీపంలోని భరతక్షేత్రములో కౌశాంబి ప్రాంతంలోని వారణాసి నగరాన్ని కీర్తిధరుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి పట్టమహిషులు యిద్దరు. ఆరతి మరియు రతి. వీరిద్దరికీ యిద్దరు కుమారులు. ధర్మఘోష మరియు ధర్మకీర్తి. వారు ఇష్ట, విషయ, కామ భోగాలతో కాలం గడుపుతుండగా, ఒక మారు గుణోత్తముడను భట్టారకులు గ్రామ, నగర, గిరిదుర్గ, ప్రాకారదుర్గ, సరిహద్దు పట్టణ, ద్రోణముఖాల గుండా సంచరిస్తూ వారణాసికి వచ్చారు. వూరి బయట ఉద్యానవనంలో ఒక స్ఫటిక శిలమీద పంథాతి వార నియమములో కూర్చొని వున్నారు. వనక్రీడకు పోయిన ధర్మఘోషుడూ, ధర్మకీర్తీ వారిని చూచి, నమస్కరించి, వారి చెంత కూర్చొని, ''భట్టారకా, మాకు ధర్మమును బోధించండి'' అని ప్రార్థించారు. వారు యిలా బోధించారు.

''ధర్మము నందు శ్రేష్ఠమైనవాడు, దయాపరుడైన వాడు ఎవరు? ఆత్మస్నేహితుడు ఎవడు? మనస్సనగా ఏమిటి? నిజమైన లక్ష్యం ఏమిటి? వీటన్నిటినీ తెలుసుకోవాలి. మహారాజు సమ్యక్త్వమను ఏనుగునెక్కి కూర్చొని వుంటాడు. సుజ్ఞానమనెడి ధ్వజముల సమూహము అతని చుట్టూ మెరుస్తుంది. నానా శీల-గుణములు అను సైన్యాలు, శాస్త్రాభ్యాసమను శంఖధ్వని, సమాయత్తమనెడి కవచములను అతను ధరించి వుంటాడు. తీక్ష్ణమైన ఆయుధములు అతని దగ్గర లేవు. స్వర్గ, మోక్షస్థితిని యిచ్చు శక్తి అతనికి వున్నది. విద్వాంసులు అతన్ని సేవిస్తారు. ధర్మ, అర్థ, కామ, మోక్షములలో ఏ ఒక్కటీ ఎవరికి వుండవో అతని జీవితం వ్యర్థం. మేకపోతు మెడలో మొలచిన స్థనాల (అజాగళస్తనాలు) వలె విద్య, తపస్సు, దానం, శీలం, గుణం, ధర్మం - యివి లేనివారు భూమికి భారంగా వుంటారు. మనిషి రూపంలో సంచరించు మృగాలవుతారు. ఏదో ఒకటి తింటూ క్రిమికీటకాలు బ్రతకడం లేదా? అదీ ఒక బ్రతుకేనా? పరలోకానికి విరుద్ధంకాని రీతిలో బ్రతకడమే నిజమైన, శ్లాఘనీయమైన బ్రతుకు. ఏ పనిమూలంగా నింద కల్గుతుందో, అవిశ్వాసం

ఏర్పడుతుందో, నరకం ప్రాప్తిస్తుందో, ఆ పనిని చేయకూడదు''. ఈ విధంగా గుణోత్తమ ముని ధర్మబోధ గావించాడు. అది విని కుమారులిద్దరికీ వైరాగ్యం కల్గి, తల్లి, తండ్రి, స్వజన, బాంధవులందర్నీ విడచిపెట్టి, బాహ్యాభ్యంతర పరిగ్రహాలను విసర్జించి, గుణోత్తమ భట్టారకుల ప్రక్కన తపస్సు ప్రారంభించారు. పన్నెండు సంవత్సరాల కాలం తపస్సు చేసి, నాలుగు రకాల అనుయోగాలను నేర్చుకొని, శాస్త్ర పారంగతులై, గురువుల అనుమతి పొంది, యిద్దరూ విడివిడిగా గ్రామ, నగర, గిరిదుర్గ, ప్రాకారదుర్గ, సరిహద్దు పట్టణం, ద్రోణముఖాలగుండా సంచారం చేస్తూ చంపానగరానికి పోయారు. అక్కడ ఒక తామరకొలను ఒడ్డున మాసోపవాసం చేశారు. మరుసటి రోజు ఆహారాన్ని భుజించాల్సి వుంది. ఆ వూరి ప్రజలందరికీ తాము వ్రతము నందు వుండిన విషయం తెలియడం చేత, అదే వూరిలో భోజనం చేస్తే ''ఆ యథాకర్మ'' దోషం కలుగుతుందని భావించి, గంగానది ఒడ్డున వున్న ఒక పశువుల కాపర్ల సమూహం దగ్గరికి భిక్షము అడగను పోయారు. వారు పోయేవేళకు సరిగ్గా, ఆ పశువుల కాపర్ల సమూహం బిడారం ఎత్తివేసి, దూరంగా వెళ్ళిపోయింది. మరొక పశువుల కాపర్ల సమూహం చెంతకు పోవచ్చునని ధర్మకీర్తి భట్టారకుడు ముందుకు సాగారు. అయితే ధర్మఘోషులు పోలేక, అక్కడే గంగానది ఒడ్డునే ఆకలి దప్పులచేత మూర్ఛపోయి, పడిపోగా, గంగాదేవి అది చూచి, అతనిపై అనుకంప, భక్తి కలిగి అక్కడికి వచ్చింది.

శ్వేత వస్త్రాలంకృతయై, దివ్యమైన ఆభరణాలను ధరించి, పెద్ద బంగారు బిందెలో చల్లటి సుగంధపూరితమైన నీటిని నింపుకొని వచ్చిన గంగాదేవి ధర్మఘోషునితో ఈ విధంగా అన్నది. ''భట్టారకా, ఇదిగో, ఎటువంటి జీవులూ లేని శుద్ధమైన, బంగారు పాత్రలో తెచ్చిన ఈ నీటిని సేవించి బడలిక తీర్చుకోండి. అంతలోగా, అంతఃపురానికి వెళ్ళి మీకు భోజనం తెస్తాను. అంతవరకు ఈ జలాన్ని సేవించి దప్పిక తీర్చుకోండి.'' ధర్మఘోషముని ''మంచిది అమ్మా, నేను త్రాగలేను'' అన్నారు. గంగాదేవికి ఆశ్చర్యమేసింది. వెంటనే ఆమె మార్వ విదేహక్షేత్రానికి పోయి, సీమంధర తీర్థంకరున్ని చూసి, నమస్కరించి ఈ విధంగా చెప్పింది ''మునివర్యా, ఒక ఋషి దప్పికతో అలసి మూర్ఛపోయారు. అది చూసి నేను బంగారు కుండలో చల్లటి, కమ్మటి నీటిని నింపుకొని పోయి ఇస్తే, వారు దానిని స్వీకరించలేదు. కారణమేమిటి?''

దానికి తీర్థంకరుడు యిలా అన్నాడు. ''తీసుకు వెళ్ళిన నీళ్ళు జీవులు లేనిదైననూ, బంగారు పాత్రలో వున్నదైనప్పటికీ, దేవుడు, దేవతలు తీసుకెళ్ళిన నీటిని ఋషులు సేవించలేరు, త్రాగలేరు. మీకు సమ్యక్త్వ, పూజ, ఋషులకు ప్రాతిహార్యము చేయుట - యివి కూడా అంతే యోగ్యమైనవి''. తీర్థంకర పరమ దేవుల మాటల్ని విని, గంగాదేవత శీఘ్రంగా వచ్చి, ధర్మఘోష భట్టారకుని మీద చల్లటిగాలి వీచునట్లు చేసి, సుగంధ జలపూరితమైన వర్షం కురియునట్లు చేసింది. ఋషికి ఆప్యాయమానమైనది ఈ వుపచారం. ఆయన శుక్లధ్యానమును ధ్యానించి, ఘాతక కర్మలను నాశనం చేసి, కేవల జ్ఞానాన్ని పొందారు. చతుర్విధ దేవతా సమూహము వచ్చి, పరమ సంతోషముతో, భక్తితో వారిని పూజించారు. ఆ పిమ్మట ఆ భట్టారకుడు అఘాతకర్మలను నశింపచేసి మోక్షాన్ని పొందాడు.

ఇక్కడ ధర్మకీర్తి భట్టారకుడు మరొక గొల్లపల్లిని వెతుక్కుంటూ పోయారు. వీరు పోయేవేళకు సరిగ్గా ఆ గొల్లరి బిడారం అక్కడినుంచి బయలుదేరి దూరంగా పోవడంచేత వారికి చాలా నిరాశ అయింది. ఆకలి దప్పులు ఎక్కువై స్పృహతప్పి, అశుభ పరిణామానికి చేరుకొన్నారు. గంగాదేవత వారిని చూచి, మేల్కొల్పడానికి ప్రయత్నించి విఫలమై, మళ్ళీ పూర్వపు విదేహమునకు పోయి సీమంధర తీర్థంకర పరమదేవులకు నమస్కరించి, ఈ విషయాలన్నిటినీ వివరించి, సమాధినుంచి వారిని మేల్కొల్పు ఉపాయాన్ని అడిగింది. సర్వజ్ఞులైన తీర్థంకరులు ఈ విధంగా చెప్పారు. ''ఆయన ఆసన్న భవ్యులు. ఇప్పటినుంచి మూడవ జన్మలో ఆయన మోక్షాన్ని పొందుతారు. మేము ఈ విధంగా చెప్పినట్లు నువ్వు తెలిపితే వెంటనే ఆయన అశుభపరిణామాన్ని వదిలి శుభపరిణామానికి చేరి, సమాధి పొందుతారు. నువ్వు ఇప్పుడే వెళ్ళి చెప్పు.''

గంగాదేవి ధర్మకీర్తి భట్టారకుని వద్దకు వచ్చి ''భట్టారకా, మీరు ఈ జన్మనుంచి మూడవ జన్మలో కర్మక్షయం చేసి, కేవల జ్ఞానియై మోక్షానికి పోతారని సీమంధర తీర్థంకర పరమదేవులు తెలిపారు.'' అన్నది. ఆ మాట విన్న వెంటనే ధర్మకీర్త భట్టారకుడు మనస్సును అశుభమార్గము నుండి సన్మార్గానికి తెచ్చి నిల్పి, ''అయ్యో! చెడ్డపని చేశానే, చెడ్డపని చేయించానే, చెడ్డపని ఆమోదించానే అని అంతరంగంలో జీవుడు పశ్చాత్తాపంతో వేగిపోతున్నాడు. ఇప్పటికే తప్పుచేశానే?'' అని పశ్చాత్తాపపడి తనను తానే నిందించుకొంటూ,

సీమంధర స్వాముల పేరు విన్నవింటనే శుభ శుద్ధ పరిణామాలను పొంది, రత్నత్రయాలను ఆరాధించి, పదహారవ కల్పంలో, ఇరవైరెండు సాగరాల కాలం ఆయుష్షుతో అచ్యుతేంద్రుడై జన్మించాడు.

ఆ విధంగానే యితర ఆరాధకులూ, ధర్మఘోష భట్టారకులను జపించి, ఆకలిదప్పులు మొదలైన పరీషలను భరించి, సమ్యక్ దర్శన, జ్ఞాన, చారిత్రాలను సాధించి, స్వర్గ, మోక్ష సుఖములను పొందుదురు గాక!

* * *

# 9. సిరిదణ్ణ ఋషి కథ

ఘోరమైన చలివల్లనూ, పూర్వజన్మపు శత్రువైన దేవుని వల్లనూ సమస్యలకు గురియై, సిరిదిణ్ణ ఋషి వాటిని భరించి, శ్రేష్ఠమైన జ్ఞాన, దర్శన, చారిత్రాల ఆరాధనను సాధించారు.

ఈ జంబూద్వీపపు భరతక్షేత్రంలో అంగమనెడి ప్రాంతము. అందు చంపానగరమను పట్టణమున్నది. దానిని పరిపాలిస్తున్న అతను అధిక సమ్యక్ దృష్టి కలిగిన, శ్రావకుడు అయిన సింహరథుడను రాజు. ఇటు మగధ దేశపు సాకేతమనే పట్టణాన్ని సుమంతుడను రాజు పరిపాలిస్తున్నాడు. మంగళావతి దేశంలో ఇళాపట్టణమను పట్టణమును జితశత్రు అను రాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య ఇళమహాదేవి. ఆ రాజు దాదిపేరు వినయమతి. ఈ విధంగా ఆ ముగ్గురు మండలాధీశులూ సుఖంగా వుండగా, ఒకసారి ఫాల్గుణ నందీశ్వర అను పండుగ వచ్చింది. ఆ ముగ్గురూ తమతమ పట్టణాలలో ఎనిమిది రోజులపాటు తీర్థంకరుల సేవలను చేయడానికి ప్రారంభించారు. జితశత్రుని వూరిలోనూ ఉత్సవము ప్రారంభమయ్యింది. అతని దాది వినయమతి కుబ్జ. వంకరనోరు, కురూపి, చూసేందుకు జుగుప్స కల్గించేట్లు వుంటుంది. చూచువారికి భయము, సిగ్గు కలుగునట్లు వుంటుంది. ఆమె రాజుతో కూడ తానూ ప్రజల ఉత్సవాన్ని చూడాలని బయలుదేరగా జితశత్రువు, ''అమ్మా, మీరు అక్కడికి రావద్దు. మిమ్ములను చూసి ఉత్సవానికి వచ్చే ప్రజలు భయపడుతారు. జుగుప్స పడతారు. అమంగళకరమైన మాటలంటారు. మీరు యింటిలోనే వుండండి'' అని చెప్పి, ఇంటిలోనే వదలి తాను సహస్ర కోట చైత్యాలయానికి పోయాడు.

ఇక్కడ వినయమతి, కొడుకు నడుపుతున్న ఉత్సవాన్ని చూసి సంతోషించేందుకు తాను వరాలు పొందలేదని దుఃఖించి, తనను తానే నిందించు కొంటూ నందీశ్వరునికి ఎనిమిది రోజులూ ఇంటిలోనే అర్చన, అభిషేకాలను జరిపి అష్టోపవాసం చేసి పూజించింది. రాజు ఉత్సవము ముగిసిన తర్వాత వినయమతికి చెప్పి పంపి పిలపించుకొన్నాడు. ''అమ్మా, యిదేమిటి ఈ విధంగా చిక్కిపోయారు?'' అని అడిగాడు. ''బిడ్డా! ఎనిమిది రోజులు ఉపవాసముండి దేవునికి అభిషేకము, పూజ చేస్తుండినాను. అంతే,'' అన్నది దాది. అది విని

రాజు ''అమ్మా, నాకు చాలా సంతోషమైనది. మీరు ఏదైనా కోరుకోండి నెరవేరుస్తాను'' అని అన్నాడు. ''నాయనా, ఆ విధంగా నీకు సంతోషమయితే, నాకోసం, మళ్ళీ ఎనిమిది రోజులు దేవునికి ఉత్సవాన్ని జరిపించు''. రాజు అలాగే అని దేవునికి మహామహిమను జరిపించడానికి ఉద్యుక్తుడయ్యాడు. తనకోసం ఉత్సవాన్ని నడుపుతున్నప్పుడు ఆహారాన్ని తీసుకోవడం సరికాదని, మళ్ళీ ఎనిమిది రోజులు ఆమె ఉపవాసం చేసింది. పారణి దినం (ఉపవాసం ముగిసిన తర్వాత ఆహారాన్ని తీసుకొనే రోజు) ఆమెకు కలిగిన శ్రమ, బడలికలను చూసి హిమవంత పర్వతపు పద్మ అను సరస్సులో శ్రీయాదేవత తన పరివారంతో వచ్చి, మహా వైభవంతో దాదిని బంగారు పీఠం మీద కూర్చుండబెట్టి, సువర్ణ కళశాల్లో తెచ్చిన గంధోదకంతో అభిషేకం చేసి, నమేరు, మందార, సంతానక, పారియాత్రకలు అను దివ్య పుష్పములతో పూజించి, సుగంధమయమైన చల్లటిగాలిని వీచి, దేవదుందుభిలను మ్రోగించింది.

దాది వినయామతియూ శ్రీయాదేవత యొక్క వైభవాన్ని చూసి తానూ ఆ విధంగా కావాలని సంకల్పించుకొన్నది. కొన్ని రోజుల తర్వాత చనిపోయి, జంబూద్వీపంలోని హిమవంత పర్వతంలోని పద్మ అను సరోవరంలో శ్రీయాదేవతయై జన్మించింది. ఇళాపట్టణానికి వచ్చి, ఆ వూరి ప్రజలకు కలలో కన్పించి ''నేను శ్రీయాదేవతను. మీ పట్టణానికి వచ్చాను. నాకొక శ్రీ విహారమును కట్టించి, నా విగ్రహాన్ని ప్రతిష్ఠించి పూజించండి. మీ ఇష్టాలన్నిటినీ నేను నెరవేరుస్తాను'' అని చెప్పింది. వూరి జనమంతా ఆమె చెప్పినట్లే చేశారు. శ్రీ విహారాన్ని కట్టినారు. శ్రీయాదేవత ప్రతిమను పెట్టి పూజించసాగారు. జితశత్రురాజు పట్టమహిషికి పిల్లలు లేరు. బిడ్డలు కావాలని వరాన్ని కోరి పన్నెండు సంవత్సరాల కాలం ఆమె శ్రీ విహారానికి వెళ్ళి పూజ చేసింది. శ్రీయాదేవత పూర్వ విదేహమునకు వెళ్ళి స్వయంప్రభ తీర్థంకరున్ని చూసి ఇళాదేవికి ఎందుకు బిడ్డలు పుట్టలేదని అడిగింది. ఆయన ''ఒక దేవుడు స్వర్గం నుంచి వచ్చి ఇళాదేవికి కొడుకుగా పుడతాడు'' అని చెప్పాడు. శ్రీయా దేవత ఆ రాత్రి రాణికి కలలో కన్పించి, ''ఇళమహాదేవీ, నా వరప్రసాదంతో నీ కొక కొడుకు జన్మిస్తాడు. సౌధర్మకల్పంలో మేఘమాల విమానంలో వున్న వర్ధమానుడను దేవుడు నీ కొడుకై జన్మిస్తాడు'' అని చెప్పింది. ఇళాదేవికి అపారమైన సంతోషమైనది. కొన్ని రోజుల్లోనే ఆమె గర్భం దాల్చి తొమ్మిది నెలలు

నిండి మగబిడ్డను ప్రసవించింది. శ్రీయాదేవత అనుగ్రహంతో పుట్టిన ఆ బిడ్డకు సిరిదిణ్ణ అని పేరు పెట్టారు.

సిరిదిణ్ణుడు శుక్లపక్ష చంద్రునివలె పెరిగాడు, యువకుడైనాడు, సర్వకళాకుశలుడైనాడు. సాకేత నగరపు రాజు సుమంతుని కుమార్తె స్వయంవరం ఏర్పాటయింది. అందరి యువరాజులతో పాటు సిరిదిణ్ణుడు కూడా అక్కడికి పోయాడు. సుమతి అక్కడికి విచ్చేసిన యువరాజులనందరినీ కాదని సిరిదిణ్ణనికి మాలవేసింది. వారి వివాహం జరిగింది. కొన్నిరోజులు మామగారి ఇంటనే వుండి, ఆ పిమ్మట సిరిదిణ్ణుడు అందరి అనుమతితో భార్యను తీసుకొని తన వూరికి బయలుదేరాడు. సుమతి తండ్రి అనేక కానుకలతోపాటు సుందరమైన మాట్లాడే చిలుకనొకదానిని కూతురికిచ్చి పంపాడు.

ఒకరోజు సుమతి, సిరిదిణ్ణలు చదరంగమాడుతున్నారు. చిలుక వారి ఆటకు సాక్షిగా వున్నది. రాణి రాజును గెలిస్తే నేలమీద రెండుగీతలు గీయాలి, రాణి ఓడిపోతే ఒక గీతగీయాలి - యిది నియమము. కొద్ది సేపటిలో రాజు గెలిచి సుమతి ఓడిపోయింది. అయినప్పటికీ, చిలుక రెండు గీతలు గీయడాన్ని చూచి, సిరిదిణ్ణనికి చాలా కోపం వచ్చి, ఆ చిలుక మెడను విరచేసినాడు. చిలుక చనిపోయి ఆ పట్టణపు వెలుపల వ్యంతరదేవుడై పుట్టింది.

కొంతకాలం గడచింది. ఒకరోజు సిరిదిణ్ణడూ, సుమతి ప్రాసాదం మీద కూర్చొని దిశావలోకనం చేస్తుండగా సహస్ర్రకూటపు ఆకారంలో ఒక మేఘం కన్పించింది. ఇదే ఆకారంలో నేనొక చైత్యాలయమును కట్టిస్తానని అనుకొని, దాని రేఖలను పలకమీద పెడుతున్న లోపలే అది కరిగిపోయింది. ఇదే వైరాగ్యమునకు కారణమై సిరిదిణ్ణుడు తల్లి, తండ్రి, బంధుబలగాలను, సమస్త వైభవాలను విడచి పెట్టి వరధర్ముడను తపస్వి చెంత దీక్షపొంది, పన్నెండు సంవత్సరాలు సమస్త ఆగమాలనూ నేర్చుకొని, తపస్సు చేశాడు. అనంతరం సిరిదిణ్ణ భట్టారకుడు గురువుల అనుమతితో గ్రామ, నగర, గిరిదుర్గ, ప్రాకారదుర్గ, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖముల గుండా సంచారం చేస్తూ, మాఘమాసంలో ఇళాపట్టణానికి వచ్చి వూరిబయట ఉద్యానవనంలో రాత్రి ప్రతిమాయోగంలో నిలుచున్నారు.

మొదట సిరిదిణ్ణని చేతిలో చచ్చిన చిలుక వ్యంతరదేవుడై అక్కడ పుట్టింది. ఎలాంటి కారణమూ లేకుండానే తనను చంపినవాడు ఇతను అను

కక్షతో వ్యంతరదేవుడు ఘోరమైన చలినీ, గాలినీ పుట్టించి, భోరున వర్షం వచ్చేట్లు చేసి, ప్రచండమైన గాలివీచి, నాలుగు జావల కాలమూ సిరిదిణ్ణులపై భయంకరమైన హింసను ప్రయోగించాడు. అది దేవుని ప్రతీకారమని సిరిదిణ్ణ భట్టారకులు తెలుసుకొన్నారు. ''సర్వజీవులనూ నేను క్షమిస్తాను. సర్వజీవులూ నన్ను క్షమించనీ, సర్వభూతములతో నాకు మైత్రి వున్నది. శత్రుత్వంలేదు. నేను కత్తిరించలేనివాడిని అనంత సుఖశాలిని, జ్ఞాని అనాదియైన వాణ్ణి, కర్మలేపము లేనివాడను. సకల దుఃఖములకు ఆశ్రయమైన ఈ దేహమును వదలివేస్తాను'' అని సమత్వభావనను భావించి, శుక్లధ్యానమును ధ్యానించి, ఎనిమిది కర్మలనూ నశింప చేసి మోక్షానికి పోయాడు.

రత్నత్రయాలను ఆరాధించు సాధకులు సిరిదిణ్ణ భట్టారకులను మనస్సులో జపించి దేవ, మనుష్య, తిర్యక్, అచేతన ఉపసర్గ అను నాలుగు సమస్యలనూ, ఆకలి దప్పిక మొదలైన ఇరవైరెండు పరీషహానలనూ, వ్యాధులవలన కలిగిన వేదనలనూ, సహించి స్వర్గమోక్ష సుఖములను పొందుదురుగాక!

* * *

# 10. వృషభసేన భట్టారకుని కథ

వేడిగావున్న శిలమీద కూర్చొని వేడిగాలిని, ఎండను సులభంగా సహించి, వృషభసేన భట్టారకులు శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాల ఆరాధనను సాధించారు.

జంబూద్వీపపు భరతక్షేత్రంలో అవంతి అను ప్రాంతంలో ఉజ్జయిని అను పట్టణం వున్నది. దానిని ప్రద్యోతనుడు పరిపాలిస్తున్నాడు. అతని భార్య జోతిర్మాల. ఒక రోజు రాజు అడవి ఏనుగును పట్టుకునేందుకు ఏనుగునెక్కి అడవికి పోయాడు. ఏనుగు మదమెక్కి, వశం తప్పి దిక్కూ దిశలేకుండా పరిగెత్తి దండకారణ్యం నడుమ పరుగెత్తుతుండగా, రాజు దారికి అడ్డంగా వున్న చెట్టుకొమ్మను పట్టుకొన్నాడు. ఏనుగు పరుగెత్తుకొని పోయింది. రాజు చెట్టునుంచి దిగి వూరి దారిపట్టుకొని అడవినుంచి వెలుపలికి వచ్చాడు. ఖేడ అనే వూరును చేరాడు. దానికి సమీపంలో ఒక పొలము. అందులో ఒక బావి. ఆకలి, దప్పిక బడలికల చేత అలసిపోయిన రాజు ఆ బావివద్ద కూర్చొన్నాడు.

ఆ వూరి పెద్ద జినవాదికుడనువాడు. అతని భార్య జినమతి. వారికి ఒకతే కూతురు జినదత్త. అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య, కాంతులతో కూడిన జినదత్త నీటిని తెచ్చేందుకు బావికి పోగా, అక్కడ కూర్చొనివున్న రాజు ''ఓ యువతీ! త్రాగను నీళ్ళు పోస్తావా?'' అని అడిగాడు. అలాగే అని జినదత్త అతని రూపం, అందము, తేజస్సుకు మైమరచి, నీటిని చేదుకొని వచ్చి, రాజు చేతుల్లో ధారగా పోస్తూ మధ్య మధ్యలో ఆగిపోగా, రాజు ఆమె ముఖం చూసి నవ్వి, ''ఎందుకు అడవి కన్యా, బాధపెట్టకుండా నీళ్ళు పొయ్యి'' అన్నాడు. నీళ్ళు యిచ్చిన తర్వాత జినదత్త యింటికిపోయి తండ్రితో ''నాన్నా, వూరిబయట బావి చెంత ఒక మహాపురుషుడు వచ్చి వున్నాడు. అతన్ని యింటికి పిలుచుకొని రండి'' అన్నది. జినవాదికుడు అలాగే అని చెప్పి పోయి రాజును పిలుచుకొని వచ్చి, అతని బడలికను పోగొట్టి, దివ్యమైన ఆహారాన్ని భుజింపచేశాడు.

అంతలో కాలిగుర్తులవెంబడి రాజును వెతుక్కుంటూ వచ్చిన సైన్యము ''ఇక్కడికి రాజు వచ్చాడా?'' అని వూరంతా వెదుకుతూ జినవాదికుని యింట్లో రాజును చూసి నమస్కరించారు. వూరిపెద్ద అతను రాజు అని తెలిసి అతని పట్ల

భయభక్తులతో గౌరవాన్ని ప్రదర్శించాడు. అప్పుడు రాజు తన ముఖ్యుల ద్వారా ఆమెను వేడుకొని, తండ్రి ఒప్పుదలతో జినదత్తను వివాహమాడి పట్టపురాణిగా చేశాడు. వూరికి పిలుచుకొని వచ్చి, ఒక సుందరమైన భవంతిని ఆమెకు కట్టిచ్చి, సకల వైభవములతో ఆమెను అలరించి, తాను మిగిలిన రాణులందరినీ మరచి ఆమెతోనే సుఖంగా వుండిపోయాడు.

ఒకరోజు మదమెక్కిన అడవిఏనుగు ఒకటి, గుంపుతో కూడ వచ్చి, ఆ ఏనుగు బావిని తొక్కుతున్నదన్న ఆశ్చర్యకరవార్త రాజుకు తెలిసింది. దానిని పట్టి కట్టాలని రాజు గబగబా వెళ్ళాడు. అలంకారం చేసుకొంటున్న జినదత్త తనని వదలి రాజు బయటకి పోయాడని కోపగించుకొని మాట్లాడుతుండగా, మిగిలిన రాణులు అది చూసి, చాలా సంతోషపడి, ''ఇక మనకు రాజు వంతుల ప్రకారం సంతోషాన్ని కల్గిస్తాడు' అని మాట్లాడుకొన్నారు. అది జినదత్తచెవిని పడింది. ఇక తనకు రాజుతో జీవించడం వీలుకాదని నిశ్చయించి, వెంటనే ఆ స్థలాన్ని వదలి మరొక యింటికి వెళ్ళిపోయింది.

రాజు అడవి ఏనుగును పట్టి కట్టించి యింటికి తిరిగివచ్చాడు. ఎక్కడ చూచినా జినదత్త కన్పించక, అక్కడ వున్నవారిని ప్రశ్నించగా, వాళ్ళు ''మహారాజా, మీరు మీ జతలో పిలుచుకొని పోలేదనే కోపంతో రాణిపురుష వ్రతమును చేపట్టి, తపస్వినియై మరొక యింటిలో వుంటున్నది'' అని చెప్పారు. ఆ మాటవిని రాజుకు విపరీతమైన కోపమొచ్చింది. ''ఇటువంటి వ్రతమూ, తపమూ నా దగ్గర జరగదు'' అని పెడబొబ్బలు పెట్టి, ''యిప్పుడే ఆమెను లాక్కొని వెళ్ళి శ్మశానంలో తోసిరండి'' అని ఆజ్ఞాపించాడు. ఆమె అప్పుడు తొమ్మిదినెలలు నిండు గర్భిణి. ''అమ్మా, మా తప్పు లేదు. రాజు ఆజ్ఞప్రకారం మేము నడచుకొన్నాము. క్షమించండి'' అని చెప్పి ఆమెను అక్కడనే వదిలిపెట్టి వెనక్కి తిరిగారు. అదే రాత్రి జినదత్త అదే స్థలంలో మగబిడ్డను ప్రసవించింది.

ఇక్కడ రాజుకు ఆ రాత్రి కలవచ్చి, అందులో తెల్లని వృషభం కన్పించింది. మరుసటి దినం ఉదయం సభలో తాను కన్న కలను మంత్రికి వివరించగా, అతను, ''దేవా, మీకు యిప్పుడు పుత్రలాభం కలిగింది. కొడుకు పుట్టినాడు'' అని దాని ఫలాన్ని వివరించాడు. తన అనేకమంది రాణుల్లో ఎవరు కొడుకును కన్నారో రాజుకు తెలియదు. దూతలు రాణివాసంలో వాళ్ళను

విడివిడిగా కలసి, ''మీకు కొడుకు పుట్టాడా?'' అని అడిగారు. వాళ్ళు ''మాకు ఆ సౌభాగ్యమే లేదు. భర్త ప్రేమ, అపేక్ష లేకుండా మాకు గర్భమెక్కడ? బిడ్డ ఎక్కడ? అంతటి అదృష్టం, సౌభాగ్యం ఎవరికి వున్నాయో వారి దగ్గరికి పోయి బిడ్డను వెతకండి, మమ్మల్ని ఎందుకు అడుగుతారు?'' అని అన్నారు. వారు శ్మశానికి పోయి, అక్కడ జినదత్త ప్రసవించివున్నది చూచి వచ్చి, రాజుకు ఆ విషయాన్ని తెలిపారు. సంతోషించిన రాజు తన కొడుకునూ, రాణినీ పిలిపించుకొని, ముందులాగానే ప్రీతి, సంతోషాలతో పెట్టుకొన్నాడు. కలలో వృషభాన్ని చూచినందువల్ల బిడ్డకు వృషభసేన అని పేరు పెట్టాడు. రాణిని దాన సన్మానాలతో సంతోషపెట్టి సుఖంగా వున్నాడు.

కుమార వృషభసేనునికి ఎనిమిది సంవత్సరాలైంది. రాజుకు తపస్సుకు పోవాలనే కోరిక కల్గింది. ఒకరోజు కొడుకును పిలిచి, కూర్చొని బెట్టుకొని ''బిడ్డా, నీకు పట్టం కట్టాలని నిశ్చయించుకొన్నాను.'' అన్నాడు. వృషభసేనుడు అడిగాడు, ''అయ్యా, మీరు నాకు రాజ్యపట్టం కడతారా, మోక్షపట్టం కడతారా?''

''నాయనా, నీకు మనుష్యరాజ్య పట్టాన్ని కడతాను''

''దేవా, రాజ్యపట్ట బంధమనగా ఏమి? మోక్షరాజ్యపట్ట బందమనగా ఏమి?''

''మోక్షరాజ్యపట్టాన్ని కట్టేది తపస్సు చేసేవారికి మాత్రమే''

''అలా అయితే తండ్రీ'' వృషభసేనుడు అన్నాడు: ''నాకు మోక్ష రాజ్య పట్టాన్నే కట్టండి. మనుష్యరాజ్య పట్టం వద్దు.''

రాజు అన్నాడు ''నాయనా, నువ్వింకా బాలుడివి, బాగా పెరిగి, రాజ్యాన్ని పరిపాలించి, ఇష్ట విషయ, కామ, భోగాలను అనుభవించి, ఆ తర్వాత వృద్ధాప్యంలో తపస్సుకు పోవాలి''.

అప్పుడు వృషభసేనుడు అన్నాడు. ''అప్పటివరకు చస్తారో, బ్రతుకుతారో చెప్పేది ఎలా? మనుషుల యౌవనమూ, సంపద, జీవితం అనునవి గడ్డితేనె లాగ, ఆకాశంలాగ, సాయంత్రం లాగ, కలలాగ, ఇంద్రధనుస్సులాగ, నీటి బుడగల లాగ, కొంచెంసేపు కూడా నిలవదు. మండుతున్న అడవిలాగ అంతమే

లేకుండ, ఆశయను ।అగ్నిని పెంచకుండా, భోగలాలస అను అగ్నిని ఆర్పి, పరగతిని గూర్చి ఆలోచించాలి. ముక్తిపథంలో చిన్న-పెద్ద సంబంధాలను విడచిపెట్టి, భోగ, సుఖ, లోభములలో అనాసక్తుడై మోక్షంలో మనస్సును లగ్నం చేయాలి. మనస్సుకు తాత్కాలిక సుఖములనిచ్చు వస్తువులు కింపాక ఫలమును తిన్నట్లు, తినేటప్పుడు రుచి, తినిన తర్వాత దుఃఖం. అందువల్ల నాకు ఈ భోగ సుఖాలు వద్దు. పుట్టుక, వృద్ధాప్యం, చావు - వీటి బాధలేకుండా మోక్షసుఖమే నాకు కావాలి.''

కొడుకు నిర్ణయాన్ని చూసి రాజు జోతిర్మాల అను మరొక భార్యకు పుట్టిన కొడుకు వసుపాలుడు అను అతనికి రాజ్యపట్టాన్ని కట్టాడు. ఆ తర్వాత తండ్రి, కొడుకు అందరినీ విడచిపెట్టి, బాహ్య అభ్యంతర పరిగ్రహాలను త్యాగం చేసి, గుణధరుడను ఆచార్యుల చెంత దీక్ష పొంది పన్నెండు సంవత్సరాలు గురువుల వద్దే వుండి ఆగమాలన్నిటినీ నేర్చుకొన్నారు. ఆ తర్వాత వారి అనుమతి పొంది గ్రామ, నగర, గిరిదుర్గం, ప్రాకారదుర్గం, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖముల గుండా సంచారం చేస్తూ వృషభసేన మునివత్స దేశంలో కౌశాంబి నగరానికి వచ్చాడు. దానికి సమీపంలో ఉదయావతమను పర్వతము. అక్కడ వృషభసేన భట్టారకులు నాలుగు నెలల కాలం ఆతపస్థిత యోగమును ధరించి, ఒక రాతిమీద నిలుచున్నారు. శ్రావకులందరూ వచ్చి అతన్ని పూజించారు.

ఆ వూరిలో బుద్ధజుడను ఉపాసకుడు వున్నాడు. ఋషులయందు వున్న సహజమైన మాత్సర్యముతో, వృషభసేనులు భిక్షకోసం వూరిలోపలికి పోయినపుడు అతను చేస్తున్న స్థలానికి వెళ్ళాడు. పెద్ద పెద్ద కొమ్మలను, పుల్లలను తెచ్చి ఆ బండమీద, క్రింద, చుట్టుప్రక్కల పెట్టి, నిప్పు పెట్టాడు. ఆ బండ కాలిన బొగ్గులాగ అయ్యింది. ఆ తర్వాత బొగ్గులన్నిటినీ ఒక పక్కకు జరిపి అతను వెళ్ళిపోయాడు. అప్పుడే భిక్షము ముగించుకొని వచ్చిన వృషభసేన భట్టారకులు నిప్పులాగ ఎర్రగా కాలివున్న ఆ బండను చూచి, మనకు ఇంతే ఆయుష్షు'' అని తీర్మానించుకొని, చతుర్విధ ఆహారమునూ, శరీరాన్నీ, త్యాగం చేసి, ఆ బండమీద ఎక్కి కూర్చొన్నాడు. జ్యేష్ఠమాసపు ఎండ వేడి, కాలుతున్న బండ, వీటన్నిటినీ శాంతచిత్తముతో సహించి, నీటిలో వున్నట్లుగా వుంటూ శుక్ల ధ్యానమును ధ్యానించి ఎనిమిది కర్మలను నశింపచేసి మోక్షానికి పోయారు.

ప్రద్యోత ఋషియై సమ్యక్ జ్ఞాన, దర్శన, చారిత్రాలను సాధించి స్వర్గంలో పుట్టినాడు.

సహజంగా రత్నత్రయాలను ఆరాధించు భవ్యజనులు వృషభసేన భట్టారకుని మనస్సులో జపించి ఉష్ణము, నిప్పు, దాహము, శీతలము, వాతము, రోగము, ఆకలి, దప్పిక మొదలైన ఇరవైరెండు పరీషహాలను సహించి శుభపరిణామముతో సమ్యక్ దర్శన, జ్ఞాన, చారిత్రాలను సాధించి స్వర్గ, మోక్ష సుఖములను పొందుదురు గాక!

* * *

# 11. కార్తిక ఋషి కథ

రోహీదకమనే పట్టణంలో కార్తిక ఋషి, శక్తి అనే ఆయుధాన్ని కలిగి ఉన్నప్పటికీ, వేదనని శాంత చిత్తంతో సహించి దర్శన, జ్ఞాన, చారిత్రాల ఆరాధనలని సాధించారు.

ఈ జంబూద్వీపపు భరతక్షేత్రంలోని లాళదేశంలో కృత్తికాపురం అనే పట్టణం ఉంది. దాన్ని అగ్నిరాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య వీరమతి. వీళ్ళకి బంధుమతి, శివసేన, శ్రీమతి, స్వయంప్రభ, లక్ష్మీమతి, కృత్తిక అనే ఆరుమంది ఆడపిల్లలు ఉన్నారు. అందరూ ఇష్టవిషయ కామభోగాలను అనుభవిస్తూ సుఖంగా ఉన్నారు.

ఒకమారు ఫాల్గుణమాసంలో నందీశ్వర ఉత్సవంనాడు ఆరుమందీ ఉపవాసం ఉండి జైనమఠంలో అర్చన చేయించడానికి వెళ్ళి, దేవుణ్ణి పూజించి, నందీశ్వర వ్రతం జరిపి, ఋషులకూ, గురువులకూ నమస్కరించి వ్రతాలను స్వీకరించి సిద్ధశేషాన్ని తీసుకొనివచ్చి తల్లిదండ్రులకిచ్చారు. ఆ సమయంలో రాజు తన చిన్న కుమార్తె అయిన కృత్తిక రూప లావణ్యాలకు ముగ్ధుడై మోహించాడు. ఆమెను వాంఛించాడు. వెంటనే సామంత, మహాసామంత, మంత్రి వర్గానికీ, వీరమతి మహాదేవికీ, సర్వమతాల వారికీ చెప్పి పంపించి, పిలిపించుకొని ''నేను పరిపాలిస్తున్న రాజ్యంలో జన్మించిన అత్యంత శ్రేష్ఠమైన వస్తువు ఎవరికి చెందాలి'' అని ప్రశ్నించాడు. వాళ్ళనందర్నీ విడివిడిగా ప్రశ్నించాడు. వాళ్ళు ''మంచి ఏనుగు, గుర్రం, ముత్యం, మాణిక్యం, యువతి మొదలైనవన్నీ రాజ్యాన్ని పరిపాలించేవాళ్ళకే చెందాలి'' అన్నారు. రాజుకు కోపం వచ్చింది. వీళ్ళందరూ చెప్పినదాన్ని ఒప్పుకునేవాళ్ళు కారు, అధిక ప్రలాపంతో కూడుకొన్నవాళ్ళు. వీళ్ళని నగరం నుంచి గెంటివేయండని ఆజ్ఞాపించి తక్కిన వాళ్ళను అడిగాడు. వాళ్ళందరూ ఏకకంఠంతో ''మంచి వస్తువు నీకు చెందుతుంది'' అన్నారు. ''నీకు చెందుతుంది అంతే'' అని మూడుసార్లు చెప్పి ఒప్పించి, ఆ తర్వాత వీరమతి మహాదేవికి నిజస్థితిని తెలిపి, కృత్తికను అర్థించి, తన చిన్నకూతుర్ని తానే వివాహం చేసుకొన్నాడు. వీరమతి మహాదేవి మాత్రం బ్రహ్మచర్యవ్రతాన్ని చేపట్టింది.

కృత్తిక గర్భం ధరించింది. నవమాసాలు నిండాయి. సరవణమనే ఉద్యానవనంలోని సరవణమనే సరస్సులో జలక్రీడ గావించాలన్న కోరిక ఆమెకు కలిగింది. రాజు అందుకు ఏర్పాటు చేయించాడు. అక్కడ జలక్రీడ గావించి పుత్రుణ్ణి ప్రసవించింది కృత్తిక. అతనికి కార్తికస్వామి అనే పేరు పెట్టారు. ఆ తర్వాత ఆమె ఒక ఆడపిల్లను ప్రసవించింది. ఆ శిశువుకు వీరశ్రీ అన్న పేరు పెట్టారు. వీరశ్రీని కోగళిని పరిపాలించే క్రౌంచుడనే రాజుకిచ్చి పెళ్ళి చేశారు.

కాలం గడిచింది. నమి మొదలైన సోదరులతో పాటు కార్తికస్వామి పెరిగి, పదహారు సంవత్సరాల ప్రాయానికి వచ్చాక, ఒక రోజు పిల్లలందరూ ఆటలాడడం కోసం ఉద్యానవనానికి వెళ్ళారు. ఆ పిల్లలకు వాళ్ళ తాతల ఇళ్ళనుండి తినడానికి తిండీ, కట్టుకోవడానికి గుడ్డలూ పంపించబడ్డాయి. అయితే కార్తికస్వామికి మాత్రం ఎవ్వరూ ఏమీ పంపించలేదు. కార్తికుడు ఆటలాడిన తర్వాత, మనోవిచారంతో ఇంటికివచ్చి, తల్లినుద్దేశించి ''అమ్మా, మీ తండ్రి, నా తాత, ఉన్నాడా లేడా?'' అని ప్రశ్నించాడు. మనోవేదనని అనుభవిస్తూ ''ఏమని చెప్పను కుమారా, నీకు తండ్రయినవాడే నాకు కూడ తండ్రి'' అని కృత్తిక అన్నది. ఆమె అన్న ఈ మాటలే కార్తికుడి వైరాగ్యానికి కారణమైంది. వెంటనే అతను శ్రీవర్యుడనే ఆచార్యుల దగ్గర దీక్షగైకొని తపస్సు చేశాడు. ఆగమాలను అభ్యసించి, గురువుల అనుమతిని పొంది గ్రామం నగరం, గిరిదుర్గం, ప్రాకారదుర్గం, పట్టణం మొదలైన ద్రోణముఖాల్లో సంచరిస్తూ, కిష్కింధమనే పర్వతం దగ్గరకి వచ్చి, దానిమీద ప్రతిమా యోగంలో నిలబడ్డాడు. ఆరాత్రి కుంభవృష్టి గురిసి, అతని శరీరం మీది మాలిన్యమంతా కొట్టుకు వచ్చి పాషణమనే మడుగులో సంగ్రహించబడింది. ఆ మడుగులోని నీరు సర్వౌషధమైంది. అందులో మునిగిన వాళ్ళ సర్వవ్యాధులూ పరిహరింపబడేవిగా ఉండి మొత్తం దక్షిణాపథంలోనే అదొక తీర్థక్షేత్రమైంది.

మళ్ళీ స్వామి కార్తికఋషి సంచారం గావిస్తూ కోగళి దేశానికి వచ్చారు. అక్కడి జైనమఠంలో పంథాతిచార నియమం గావించుకొని దేవుడికి నమస్కరించి, మధ్యాహ్నం భిక్షకోసం ఊళ్ళోని ఇంటింటికీ వెళ్తున్నారు. అలాగే తిరుగుతూ రాజమందిరాన్ని ప్రవేశించారు. మేడమీద వీరశ్రీ తన భర్త అయిన క్రౌంచ మహరాజు శిరస్సును తన తొడమీద ఉంచుకొని దువ్వుతూ, ఋషిని

అక్కడినుంచే చూసి ''నా అన్నగారయిన ఋషులు వచ్చా''రని నిద్రిస్తున్న మహారాజు తలక్రింద ఒక దిండునుంచి, ఋషుల్ని భిక్షకోసం నిలుపుకోవడానికి క్రిందకి దిగివచ్చింది. ఇంతలో ఋషి రాజమందిరం ప్రాంగణం నుండి వెనుదిరిగి తలుపుదగ్గరికి వచ్చేశారు. రాణి ఎదురువెళ్ళి, ముందు నిల్చి చేతులు జోడించి, ''భటారకులారా, ఆగండి'' అని ప్రార్థించింది. ''తల్లీ, ఒకసారి ఇంటినుంచి బయటకు వచ్చాము, మళ్ళీ ఇక్కడ నిలవడానికి వీల్లేదు'' అన్నారు. ''భటారకా, నా మీద దయ చూపెట్టాలి, దయచేసి నిలబడండి'' అని వీరశ్రీ అతని కాళ్ళు పట్టుకొని ప్రార్థిస్తోంది.

ఈలోగా రాజు మేల్కొని, రాణి కనపడక పోగా అక్కడున్నవాళ్ళను అడిగాడు. ''ఒక సన్యాసిరాగా, రాణి అతని దగ్గరికి వెళ్ళి, కాళ్ళు పట్టుకొని ప్రాధేయపడుతున్నది, అదిగో'' అని చెప్పారు. రాజు ఆ దృశ్యాన్ని చూశాడు. ప్రతిరోజూ తనని వదలిపెట్టి ఈమె ఈ సన్యాసి దగ్గరరికి వెళ్తోందని భావించి, చక చకా దిగివచ్చి శక్తి అనే ఆయుధంతో ఋషి వక్షస్థలాన్ని చీల్చి, వీరశ్రీ తల వెంట్రుకల్ని పట్టుకొని చరచరా ఈడ్చుకు వచ్చాడు.

కార్తికఋషి దయార్ద్రుడై, రక్తం స్రవించి, ఆయాసపడుతూ, వేసవిలోని ఎండతాపంవల్ల దాహమధికమై, చల్లగా ఉండి ఉంటే బాగుండేదని మనస్సులో అనుకొన్నారు. అతని అమ్మమ్మ అయిన వీరమతి బ్రహ్మచర్య వ్రతాన్ని స్వీకరించి, మరణించిన ఆమె ఇప్పుడు భూతదేవతగా జన్మించింది. అప్పుడు ఆమెకు ఆసనకంపమైంది. వెంటనే ఋషీశ్వరుడి దగ్గరకి వచ్చి, ''భట్టారకా, అనుమతివ్వండి, ఇప్పుడే వీళ్ళను అంతం చేస్తాను'' అంది. ''అలాంటిదేమీ అక్కరలేదు. చల్లని ప్రదేశానికి మమ్మల్ని తీసుకెళ్ళు. ఆ మాత్రం చాలు'' అన్నారు భట్టారకులు. ఆ దేవత నెమలి రూపంలో అతనిని ఎత్తుకొని, కోగళి దేశానికి తూర్పుభాగంలోఉన్న సరోవరం దగ్గరికి వచ్చి, ఒక లతామంటపంలో అతన్ని వదలి వెళ్ళిపోయింది. పర్వతం మీదనుంచి దుముకుతున్న జలపాతపు తుంపరలు శరీరానికి ఉల్లాసం చేకూరుస్తుండగా, 'సంన్యసనం' గావించి, శుభపరిణామం వల్ల దివంగతుడై, సర్వార్థసిద్ధిలో ముప్పయిమూడు సాగర సంవత్సరాల ఆయుస్సు కలిగిన అహమింద్రుడుగా అతను జన్మించాడు.

ఇక్కడ భట్టారకుడి సోదరియైన వీరశ్రీ సోదరుణ్ణే తలచుకొంటూ, ''హా! భట్టారకా!'' అని చాలరోజులకాలం రాత్రింబవళ్ళూ ఏకధాటిగా రోదించింది. ఆమెమీద అత్యధిక ప్రేమను కలిగి ఉండడంవల్ల రాజు దుఃఖించి, ఆమె ఏడ్పును మాన్పించి నవ్వించగలిగే వాళ్ళకు కోరిన బహుమానాన్నిస్తానని పట్టణంలో చాటింపు వేయించాడు. పలురీతుల వేషగాళ్ళు, చెక్క ముసుగుల్ని ధరించిన పలువురూ ఆమెముందు ఆడి, పాడి గంతులువేస్తూ నవ్వించడానికి ఎంత ప్రయత్నం చేసినప్పటికీ ఆమె ఏడుపు మాత్రం తగ్గలేదు. అప్పుడొకడు నల్లటి కౌపీనాన్ని ధరించి, దేహానికి మసిపూసుకొని, బోడితలతో, నోట్లోని పళ్ళలాగా గవ్వలను జోడించి, కుంచాన్ని, కమండలాన్ని పట్టుకొనిరాగా, రాజు ''ఓ రాణీ, ఇదిగో నీ అన్నగారయిన భట్టారకులు వస్తున్నారు చూడు'' అనగానే దిగ్గున పైకిలేచి, చూసి, కనపడక, ఆ విచిత్రరూపాన్ని చూసి, నవ్వి, దుఃఖాన్ని మరచింది. ఆమెను నవ్వించిన ఆ వేషగాడికి రాజు విశేష బహుమానాన్నిచ్చాడు. అప్పటినుంచి ఇప్పటిదాకా ''బాదుబ్బె'' పండుగా, హగరిణేగుల ఆట పాటలూ వ్యవహారంలోనికి వచ్చాయి. స్వామి కార్తిక ఋషి దేహత్యాగం చేసిన ప్రదేశంలో అతడి సోదరి వీరశ్రీ జైనమతాన్ని కట్టించింది. స్వామి అనబడే క్షేత్రంగా ఆ జైనమతం ప్రఖ్యాతి చెందింది.

కృత్తికా నగరపు రాజయిన అగ్నిరాజు తన కూతుర్ని తానే వివాహం చేసుకోవడంవల్ల అక్కడి ప్రజలు, రాజు ధర్మబుద్ధి కలిగి ఉంటే ప్రజలు కూడ ధర్మావలంబులవుతారనీ, రాజు పాపిష్ఠివాడవుతే వాళ్ళూ పాపాలను ఆశ్రయిస్తారనీ, యథారాజా తథాప్రజా అనుకొని నీతి నియమాలను వదలి జీవింపదొడగారు. ఆ గ్రామానికి ''బోగంకారోహణ'' అన్న పేరు వచ్చింది.

రత్నత్రయాన్ని ఆరాధించే భవ్యులు కార్తిక ఋషిని మనస్సులో ధ్యానించి గాయం, పుండు, రోగం, ఆకలి, దాహం, వాతం ఉష్ణాలను సహించి స్వర్గాపవర్గ సుఖాలను అనుభవించనీ.

★ ★ ★

# 12. అభయ ఘోష ముని కథ

కాకంది పట్టణంలో చండవేగ రాజు చక్రంతో కొట్టి, శరీరాన్ని కత్తిరించి నప్పటికీ, ఆ వేదనను శాంతుడై సహించి అభయఘోషముని సద్గతిని పొందాడు.

ఈ జంబూ ద్వీపపు భరతక్షేత్రంలో మగధ అను ప్రాంతం. అందులో కాకంది అనే పట్టణాన్ని అభయఘోషుడను రాజు పరిపాలిస్తూ వున్నాడు. అతని భార్య అభయమతి. వారు ఇష్టవిషయ, కామ, భోగాలతో సుఖంగా వున్నారు. ఒకరోజు రాజు వూరి వెలుపల సౌందర్యమును చూస్తూ సంచరిస్తుండగా, ఒక బెస్తవాడు ఒక తాబేలును జీవముండగనే నాలుగు కాళ్ళు కట్టి వ్రేలాడులాగ మెడలో కట్టుకొని వస్తున్నాడు. రాజు తన హస్తలాఘవాన్ని ప్రజలకు చూపించాలనుకొని, దూరమునుంచే చక్రంతో కొట్టి తాబేలు నాలుగు కాళ్ళనూ కత్తిరించాడు. దాని ప్రాణం యింకా వుండగానే బెస్తవాడు యింటికి తీసుకొని పోయాడు. ఆ రాత్రి అపారమైన వేదనతో బాధపడి ఆ తాబేలు చనిపోయింది. అభయఘోష, అభయమతులకు కొడుకై పుట్టింది ఆ జీవము. కొడుక్కు రాజు చండవేగుడని పేరుపెట్టాడు.

ఒకరోజు రాజు-రాణి అంతఃపురంలో సుఖ, వినోదాలతో కాలం గడుపుతుండగా, అప్పుడు చంద్రగ్రహణమైంది. అదే రాజుకు వైరాగ్యానికి కారణమై, చండవేగునికి రాజ్యపట్టము కట్టి, నందనుడను ఆచార్యుల చెంత తపస్సు మొదలుపెట్టాడు. పన్నెండు సంవత్సరాలు గురువుల దగ్గర వుండి, ఆగమాలను నేర్చుకొని, ఆ తర్వాత గురువుల అనుమతితో గ్రామం, గిరిదుర్గం, నగరం, ప్రాకారదుర్గం, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖముల గుండా సంచరిస్తూ అన్ని చోట్లా తిరిగి మళ్ళీ కాకంది పట్టణానికి వచ్చారు. ఉద్యానవనంలో వీరాసనంలో తపస్సుకు కూర్చొన్నారు. మొదట తాబేలుగా వుండి, ఆ తర్వాత వారి కొడుకు అయిన చండవేగుడు భవంతి మీదినుంచి దూరంగా చక్రమును విసరగా అది ఋషి రెండు చేతులు, రెండు కాళ్ళను కసుక్కున కత్తిరించింది. అయితే అభయఘోష ఋషి వేదనను సహించి, ఆహార, శరీరాలను త్యజించి, శుభపరిణామముతో రత్నత్రయాన్ని సాధించి, పదునాల్గవ ప్రాణతమను కల్పంలో ఇరవై సాగర సంవత్సరాలు ఆయుష్షు కల ఇంద్రుడై జన్మించాడు.

రత్నత్రయాన్ని ఆరాధించే యితర భవ్యులు అభయఘోష భట్టారకులను మనస్సులో జపించి ఆకలి, పుండు, గాయం, వ్యాధి, చలి, వాతం, ఉష్ణం మొదలైన దుఃఖాలను సహించి దర్శన, జ్ఞాన, చారిత్రాలను సాధించి స్వర్గ మోక్ష సుఖాన్ని పొందుదురు గాక!

* * *

# 13. విద్యుచ్చోరుడను ఋషి కథ

భయంకరమైన చిమ్మెటలు మరియు దోమలచేత కొరకబడినప్పటికీ ఘోరమైన వేదనలను సహించి, విద్యుచ్చోర ముని ఉత్తమమైన దర్శన, జ్ఞాన, చరిత్రలను సాధించాడు.

ఈ జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో విదేహమనే దేశం. అక్కడ మిథిల అనే పట్టణం దానిని పాలించేవాడు పద్మరథుడు అనే రాజ సంతతిలోంచి వచ్చిన వామరథుడనేవాడు. అతని భార్య బంధుమతి. అదే ఊరిలోని తలారి యమదండుడు.

అక్కడ విద్యుచ్చోరుడు అనే దొంగ. జృంభిని, స్తంభిని, మోహిని సర్షపి, తాళోద్ఘాటిని, విద్యామంత్ర, చూర్ణ, యోగ, ఘటకాంజన మొదలైన తస్కర శాస్త్రాల్లో బాగా నేర్పును కలిగిఉండేవాడు. రాత్రిపూట నగరంలో దొంగతనం చేసి, బంగారు నగలను దోచి, పట్టణం బయట కొంచం దూరంలో ఒక పర్వతం, అక్కడొక గుహ, దానిలోపల వానినన్నింటినీ దాచి, గుహద్వారానికి పెద్దదైన ఒక రాయిని అడ్డంపెట్టి వస్తూ ఉండేవాడు. పగలంతా ఒక పాడుపడిన దేవాలయంలో అంజనాన్ని రాసుకుని కుష్ఠువానిలా, చేయి, కాళ్ళు ముడుచుకుని, ముక్కు లోపలికి పోయి, రసికారుతు ఉండగా, ఈగలు ముసురుకుని ఉండగా అందరికీ జుగుప్స పుట్టే విధంగా పట్టణంలోని వాళ్ళ ఇళ్ళల్లో భిక్షను అడుగుతూ ఇంటింటికీ తానొక కుష్ఠ భిక్షుకుడు అని తెలిసే విధంగా తిరుగుతూ ఉండేవాడు. రాత్రి అయ్యేసరికి తన స్వాభావికమైన రూపాన్ని ధరించి, పట్టుబట్టలను కట్టుకుని, వంటికి సుగంధ ద్రవ్యాలను పూసుకుని, పూలు ముడుచుకుని, కర్పూర తాంబూలాన్ని నములుతూ, ఊళ్ళోని వేశ్యావాటికల్లో తిరుగుతూ, తనకిష్టమైన స్త్రీలకు కావలసినంత బంగారం, ఆభరణాలను ఇచ్చి, సుఖిస్తూ తానెవరో గుర్తు తెలియనట్లుగా ఉండిపోయేవాడు. ఇలాగే ఆ ఊళ్ళోని వైశ్యులు, వస్త్రవ్యాపారులు, ఉద్యోగులు, వేశ్యలు మరియు సామంతులు మొదలైనవాళ్ళ బంగారాన్నంతా అతడు అపహరించాడు.

ఒకరోజు రాజగృహంలో దొంగతనం జరిగింది. పద్మరథుణ్ణి మెచ్చి అచ్యుతేంద్రుడిచ్చిన అనర్ఘమైన సర్వరుజాపహారము అనే హారం పరంపరగా వామరథునికి వచ్చింది. అతడు దానిని ఎత్తైన చోటులో తన శయన మందిరంలో ఒక పెట్టెలో పెట్టి, ఎల్లకాలమూ పూజిస్తూ ఉండేవాడు. విద్యుచ్చోరుడు అంజనాన్ని కళ్ళకు పూసుకుని ఎవరికీ తను కనబడకుండా రాజు పడుకునే గదిలో హొక్కు పెట్టెను తెరచి హారాన్ని దొంగలించి, గుహలో దాచిపెట్టి పట్టణానికి వచ్చి మొదటిలాగ కుష్ఠురూపం ధరించి ఏమి తెలియనట్లుగా ఉండిపోయాడు.

తెల్లవారింది. రాజు హారం కనుపించక కలవరం చెందాడు. ఆస్థానంలో తలారి యమదండుణ్ణి పిలిచి ''ఒరేయ్ యమదండా, పట్టణంలో బ్రాహ్మణుల, వర్తకుల, వేశ్యల, వ్యవసాయదారుల, ఆభరణాలు విపరీతంగా దొంగలింపబడు తున్నాయి. అయినా నువ్వు దొంగను వెతకకుండా ఊరకనే ఉన్నావు. ఇదిగో, ఇప్పుడు రాజు గృహంలో శయనాగారంలోనే దొంగతనం జరిగింది. లోపల హొక్కు పెట్టెను తెరచి అచ్యుతేంద్రుడిచ్చిన కులధనమైన హారాన్నే దొంగ అపహరించుకొని వెళ్ళాడు. వెంటనే దొంగను వెతికి లాక్కొని రా. లేకపోతే వాడికి విధించవలసిన దండన నీకు వేయవలసి వస్తుంది'' అని చెప్పాడు. తలారి అప్పుడు ''దేవా ఏడురోజులు అవకాశాన్ని ఇవ్వండి. అంతలో దొంగని నేను వెతకి తేకపోతే మీరు విధంచే శిక్షకి నేను బద్ధుణ్ణవుతాను. మీ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు'' అని పలికి అవకాశం దొరకించుకొని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

తలారి ఎక్కడెక్కడో వెతికాడు. పట్టణంలో, వేశ్యావాటికలలో, అంగడి వీధులలో, వసతి విహారాలలో, ఇళ్ళవరుసల్లో, తోటల్లో, దేవాలయాల్లో, ఇలా ఆరు రోజులు నిరంతరంగా వెదికినా ఎక్కడా అతనికి దొంగ జాడ దొరకలేదు. ఏడవరోజు పాడుబడిన దేవాలయంలో ఉండి కుష్ఠురోగి వెళ్ళడాన్నే గమనిస్తున్న యమదండునికి ఒక ఆశ్చర్యమైన దృశ్యం కనబడింది. కుష్ఠురోగి వెళ్తున్నాడు. ఎదురుగా ఒక చిన్న గుంట. దానిని విద్యాధర కరణం చేత లంఘించి వెళ్తున్నాడు. దానిని దూరంలో ఉన్న యమదండుడు చూచి, వీడే దొంగ కావచ్చునని నిశ్చయించి, వెంటనే, వాడ్నిపట్టుకొని రాజగృహానికి తీసుకొని వెళ్ళాడు. గోలపెడుతున్నవాణ్ణి చూపించి ''మహారాజా వీడే దొంగ'' అని అప్పగించాడు. కాని ఆ కుష్ఠురోగి గొడవ చేస్తూ రాజును చూసి ఇలా అన్నాడు. ''దేవా నేను దొంగను కాదు. ఊరంతటికీ ఈ విషయం తెలుసు. నిజమైన

దొంగను పట్టుకోలేక, బీదవాడ్ని, దేసికుణ్ణి, ఊరిలో భిక్షను వేడుకుని జీవిస్తున్న నన్ను అన్యాయంగా పట్టుకుని వచ్చి, తన చావుకు బెదరి నన్ను చంపిస్తున్నాడు''. యమదండుడు దొంగలను పట్టుకునే శాస్త్రాలను తెలిసిన వాడవడంవల్ల ఇలా అన్నాడు. ''ప్రభూ, ఇప్పుడు తన రూపును మార్చుకుని, రాత్రి దొంగతనం చేసి, పగలంతా ఇలా ఉంటాడు. దీనిని మీరు నమ్మకపోయినట్లయితే నేనిపుడే దీనిని ప్రత్యక్షం చేసి చూపిస్తాను'' అని చెప్పి ప్రతిఘుటకాంజనాలను తెప్పించి కుష్ఠువాడి కన్నులకు పూసిన వెంటనే వాడి రూపుపోయి స్వాభావికమైన రూపు వచ్చింది. అయినావాడు తన పట్టు వీడలేదు. ''ఈ తలారికి ఇంద్రజాల విద్య వచ్చినందువల్ల ఏ రూపు కావలసినా చూపించగలడు.'' అన్నాడు. ''అలాగైతే వేరేవాళ్ళకు ఇలా చేసి చూపిస్తాను'' అని యమదండుడు, రాజుయొక్క అనుమతితో, రాజకాంతల, దాసీల కళ్ళకు ఘుటకాంజనాన్ని పూయగా వాళ్ళందరూ కుష్ఠువాళ్ళు అయ్యారు. ప్రతిఘుటకాంజనాన్ని రాయగా మొదటిరూపును పొందారు. దీనిని చూచివాడు దొంగ అని రాజుకు నమ్మకం కలిగింది. ''వీడు నిజంగా దొంగ వీడిని ఇప్పుడే దండించు'' అని ఆజ్ఞ నిచ్చాడు. యమదండుడు విద్యుచ్చోరుణ్ణి తన ఇంటికి పిలుచుకెళ్ళి, మాఘమాసం చలి రాత్రిలో భయంకరమైన ముప్పైరెండు రకాల దండనలతో దండించాడు. దానినంతటినీ సహించుకుని విద్యుచ్చోరుడు ''అయ్యా, నేను దొంగను కాను అధికార బలంతో ఈతలారి నన్ను ఊరికినే చంపుతున్నాడు కదా''! అని కేకలు పెట్టసాగాడు. దానిని చూచి వాడు నిజంగా దొంగేనా అనే విషయంలో తలారికి సందేహం కలిగింది. తెల్లారగానే వాడిని రాజు దగ్గరకు లాక్కునిపోయి ''దేవా ముప్పైరెండు ఘోరమైన దండనలతో వీడిని శిక్షించి చూసాను. వీడు దొంగ కాదు. మీరు ఇష్టం వచ్చినట్లు నాకు దండన విధించవచ్చు'' - అన్నాడు. రాజు యమదండుని శూలానికెక్కించమని ఆజ్ఞాపించాడు. భటులు వానిని శ్మశానానికి తీసుకుని పోయి ముందుకు తోసి ఇంకేమి శూలానికి తగిలించాలి, అంతలో విద్యుచ్చోరుడు తన రూపాన్ని మార్చుకుని, తన స్వాభావికమైన రూపంలో అక్కడకు వెళ్ళి, భటుల్ని ఆపి ''అన్నలారా, మీరు ఈతడ్ని చంపినట్లే అయింది. శూలానికి తగలడానికి సిద్ధపడడంవల్ల ఇతను రాజాజ్ఞ ప్రకారం శూలమెక్కినట్లే అయింది. కొంచెం ఆగండి'' అని పలికి యమదండునితో ఇలా చెప్పాడు ''ఓయీ యమదండా! నువ్వు, నేను

చిన్నప్పుడు ఒక్కడే ఉపాధ్యాయుని దగ్గర చదువుకునేటప్పుడు శపథం చేసుకున్నాం, జ్ఞాపకం ఉందా? ఏ దోషమూ లేకుండానే నేను నిన్ను చంపించానా లేదా? చేసిన ప్రతిజ్ఞను జ్ఞప్తికి తెచ్చుకున్నావో లేదో చెప్పు''. యమదండుడు ''బాగానే గుర్తుంది'' అన్నాడు. ''ఇప్పుడు నువ్వు చచ్చావా లేదా?'' అన్నాడు విద్యుచ్చోరుడు. ''దేవా నువ్వు గెలిచావు. నేను చచ్చాను. ఓడిపోయాను'' అని ఉత్తరమిచ్చాడు యమదండుడు. వీళ్ళిద్దరూ మాట్లాడే ఈ చమత్కారమైన మాటలకు భటులూ, పట్టణజనులూ ఆశ్చర్యపోగా మళ్ళీ విద్యుచ్చోరుడు ''నన్నూ, ఇతణ్ణీ, మళ్ళీ రాజు దగ్గరకు తీసుకుని వెళ్ళండి. అక్కడ రాజు ఎదుట నాకూ, ఇతనికీ మాట్లాడవలసినదుంది. తరువాత రాజు ఇతణ్ణి ఏమన్నా చేయనీ, ఎలాగూ చంపేముందు మూడుసార్లు అడిగే చంపాలి. నడవండి, రాజగృహానికి వెళ్దాం'' అన్నాడు. భటులు అలాగే చేసారు. ఇద్దరినీ రాజు దగ్గరకు తీసుకొని వెళ్ళి నిలబెట్టి ''దేవా, ఇతడు యమదండుని చంపనీక ఆపాడు'' అని విద్యుచ్చోరుణ్ణి చూపిస్తూ అన్నారు. రాజు ''నువ్వెందుకు ఇతడి వధను ఆపావు'' అని అడిగాడు. దానికి విద్యుచ్చోరుడు ''రాజా యమదండుని తప్పేమీలేదు. మీ దేవతా రక్షిత మైన సర్వరుజాప హారం నుండి మొదలుకొని, ఈ ఊర్లో అపహరింపబడిన అన్ని నగ, నాణ్యాలనూ రాత్రివేళ నేనే ఈ రూపంలో దొంగలించి, పగటివేళ శిథిల దేవాలయంలో కుష్ఠువానిలా ఉండేవాడిని. అందుకని నన్ను చంపండి'' అన్నాడు.

రాజు అడిగాడు. ''అలాగయితే దొంగలించిన ఆవస్తువుల్ని ఏం చేసావు''?

విద్యుచ్చోరుడు: ''అన్నీ అలాగే ఉన్నాయి. సుమారు ఐదారువేల దీనారాలను వేశ్యలకోసం ఖర్చు చేసాను. తక్కినదంతా రంగు మాయకుండా అలాగే సురక్షితంగా ఉంది''.

''అలాగైతే ఇప్పుడే దానినంతా తీసుకునిరా. ఈ పట్టణంలోని వారికందరకూ వాళ్ళ వస్తువులను పెట్టిన జాగాను చూపించు'' అన్నాడు రాజు. విద్యుచ్చోరుని వెంబడి పట్టణ జనులంతా నడిచారు. ఊరు బయటి పర్వత గుహకి వెళ్ళి దాని ద్వారానికి పెట్టిన బండను జరపి లోపలికి వెళ్ళి, విద్యుచ్చోరుడు హారాన్ని తీసుకొన్నాడు. జనులకు మీమీ వస్తువుల్ని కలిసి పోకుండా సరిగ్గా చూసి తీసుకోండి అని చెప్పాడు. వాళ్ళందరూ తమతమ వస్తువులను తీసుకున్నారు.

విద్యుచ్చోరుడు హారాన్ని తీసికెళ్ళి రాజుకు అప్పగించాడు. అప్పుడు రాజు మాఘమాసపు చలి రాత్రిలో నాల్గుఝాములూ భయంకరమైన ముప్పైరెండు దండనల్ని నువ్వెలా సహించావు? అని ప్రశ్నించాడు. దానికి విద్యుచ్చోరుడు ఇలా అన్నాడు.

''దేవా! చిన్నప్పుడొకరోజు నేనూ, నాకు చదువుచెప్పే ఉపాధ్యాయుడూ సహస్రకోటి చైత్యాలయానికి దేవుణ్ణి పూజించడానికి వెళ్ళాం. అక్కడ గురువులు వందనం చేస్తూ ఉండగా, అక్కడే శివగుప్తాచార్యుడనే ఆచార్యుడు చరిత పురాణాలను వ్యాఖ్యానం చేస్తూ ఉండడాన్ని చూచి వారి దగ్గర నేను కూర్చున్నాను. వారి వ్యాఖ్యానం వింటుండగా, వారు నరకాన్ని ఇలా వర్ణించారు. వ్రత, శీల, చరిత్ర గుణాదులు లేనివారు, జీవుల్ని చంపేవారు, వేటాడేవారూ, రాగద్వేష లోభాలచే అబద్ధం చెప్పి జీవులకు సంతాపం కలిగించే వారూ, మోసం చేసేవాళ్ళూ, దొంగతనం చేసేవాళ్ళూ, పరస్త్రీలతో చాటు జీవితం గడిపేవారూ, ఇతరుల సొత్తు అపహరించి సంగ్రహించేవారూ, మధు, మద్య, మాంసాలనూ, ఐదు నిషిద్ధమైన చెట్ల పళ్ళనూ, కుక్కగొడుగులు, 'సెణబు' పూలనూ సేవించేవారు, త్రాగరానిది త్రాగి, తినరానిదాన్ని తినేవారూ, వీళ్ళందరూ పంచ మహాపాతకాలను చేసిన వాళ్ళతో సరి. చనిపోయిన తరువాత వీళ్ళు ఏడు నరకాలలో పుట్టి అపారమైన దుఃఖాలను అనుభవిస్తారు. పగలు, రాత్రి ఒకే రకంగా నరకంలో బాధపడే వీళ్ళకు రెప్పపాటు కాలం కూడా సుఖం లేదు. వాళ్ళ పాలిట దుఃఖం ఒక్కటే కలుగుతుంది. గోళ్ళకు కాల్చిన ఇనపసలాకులను గుచ్చుతారు. రంపంతో దేహాన్ని చీలుస్తారు. చాలాకాలం దుఃఖాన్ని అనుభవిస్తారు. పట్టు, కొట్టు, ముక్కలు చేయి. ఎముకలనువిరు. మర్మస్థానా లను లాగి గాయం చేయి. గాయాలకు మరగుతున్న లోహపు ద్రవాన్ని పొయ్యి. నడుమును కత్తిరించు. తొడను విరుచు. వణుకుతున్న ఈ దుష్టుణ్ణి కదలకుండా కట్టి, పెడతలను క్రతో కొట్టు, చంపు, గుచ్చు, తెంచు, నరుకు, గుచ్చి నరాల్ని వెనక్కి తిప్పు అని నరకంలో వాళ్ళు వాళ్ళ చుట్టూ చేరి నానా శిక్షలనూ వేస్తారు. రోకలి, ఈటెలతో గుచ్చి పేగులు చుట్టలు చుట్టలుగా బయటః పడేటట్లు చేస్తారు. కాళ్ళూ చేతులూ గట్టిగా కట్టి రంపంతో మధ్యకు చీలుస్తారు. ఇలా నానా రకాలైన యాతనలనూ రెప్పపాటంత సేపైనా వ్యవధి లేకుండా ముప్పైమూడు సాగర కాలాలు అనుభవిస్తారు.

కాని దానం పూజ, శీలం, ఉపవాసం అనే నాల్గు విధాల శ్రావక వ్రతాలను ఆచరించేవాళ్ళు, తపస్సు చేసేవాళ్ళు, స్వర్గం, మోక్షం అనే సుఖాలను పొందుతారు'' అని వర్ణించడం విని నేను భట్టారుని వద్ద అణువ్రతము గుణవ్రతము, శిక్షావ్రతము అన్న పన్నెండు రకాలైన శ్రావక ధర్మాలను స్వీకరించాను. తీర్థంకరులే పరమదేవులు. అహింస పరమధర్మం. బాహాభ్యంతర పరిగ్రహం ఉండేదే తపస్సు. నవపదార్థాలు, పంచాణస్థి కాయము, షడ్ద్రవ్యాలను నమ్మేదే సమ్యక్త్వము. శంకాదులైన ఎనిమిది మలాలు ఎనిమిది మదాలు. మూడు మూఢత్వాలు. ఆరు అనాయత సేవలు, ఇలా ఇరవై ఐదింటిని అణచి, నిశ్శంకాది గుణాలతో కూడిన సమ్యక్త్వాన్ని స్వీకరించాను. ఇప్పుడైనా నరకంలో ఉండేవాళ్ళ దుఃఖానికి, కష్టానికి పోల్చుకుంటే వాటికి సహస్రం పాలైనా సమానం కాదు అని భావించుకుని యమదండు డిచ్చిన శిక్షల్ని నేను సహించాను -

''నిన్ను చూసి నాకు చాలా సంతోషం కలిగింది. నీకు ఏం కావాలో అడుగు. ఇస్తాను'' అన్నాడు సంతుష్టుడైన రాజు.

''నాకు వేరేమీ వద్దు ప్రభు'', విద్యుచ్చోరుడు రాజునిలా అడిగాడు'' నా స్నేహితుడైన యమదండుని క్షమించాలి''.

''ఈ యమదండుడు నీకెలా మిత్రుడు? నువ్వేమో శ్రావకధర్మాలను గ్రహించానన్నావు. అయినా ఎందుకు దొంగతనం చేసావు?'' రాజు కుతూహలంతో అడిగాడు.

''దానిని చెప్తాను విను రాజా'' అని విద్యుచ్చోరుడు తన వృత్తాంతాన్ని ఇలా చెప్పాడు.

''ఈ జంబూద్వీపం యొక్క భరతక్షేత్రపు తిలకమైన దక్షిణా పథంలో అభీరము అనే దేశం ఉంది. అక్కడ వర్ణి అనే నదియొక్క అంచున వీణాతటం అనే పట్టణం ఉంది. చాలా రమ్యమైన నగరం అది. స్వర్గాన్ని పోలుతుంది. దానిని పాలించేరాజు జితశత్రుడు. ఆతని మహాదేవి విజయమతి. వారిద్దరికి పుత్రుణ్ణి నేను. విద్యుచ్చోరుణ్ణి. అదే నగరపు యమపాశుడు అనే తలారి మరియు వాడి భార్య నిజగుణదేవతల యొక్క కొడుకు ఈ యమదండుడు. మేమిద్దరం సమాన వయస్కులం. ఐదారు సంవత్సరాల వయసులో సిద్ధార్థులు అనే ఉపాధ్యాయుల వద్ద విద్యాభ్యాసానికై నిలిచాం. ఏడెనిమిది సంవత్సరాలకు

కూర్చుండ చేసి రాజు, ''కుమారా, నువ్వు నా చెల్లెలి కొడుకువు. మేనల్లుడివి. నా కుమార్తెలు, శ్రీమతి, వసుమతి, గుణమతి, సులోచన, సుప్రభ, సుకాంత, సుశీల, మనోహరులు చాలా లావణ్యవతులు. అత్యంత రూప, లావణ్య, సౌభాగ్య శాంతి, హావభావ, విలాస, విభ్రమములను కలిగినవారు, నవయౌవనవతులు, అక్షర, అలేఖ్య, గణిత, గాంధర్వ, నృత్య, చిత్రకర్మ, పత్రచ్ఛేదాది అరవై నాల్గు కళల్లో కుశలులు. వేరే రాజులు వాళ్ళను పెళ్ళి చేసుకోవాలనే కోరికతో ప్రధానుల ద్వారా కానుకలను పంపుతున్నారు. నేను యెవరిని ఇష్టపడలేదు. ఈ కన్యారత్నాలకు నువ్విపుడు యోగ్యమైనవాడివి. ఈ ఎనిమిది మందిని నువ్వు పెండ్లి చేసుకో'' అన్నాడు. అపుడు విద్యుచ్చోరుడు ''నేనిదవరకే ఒక్కతెను ప్రేమించాను'' అనగా ''ఆమె ఎవరు? అని రాజు ప్రశ్నించాడు.

''ముక్తి అనే వనితను ప్రేమించాను. నేను ఆమెను వివాహం చేసుకుంటాను. మీరు నా స్నేహితుడైన యమదండుని నాకు అప్పగించండి'' అన్నాడు విద్యుచ్చోరుడు.

రాజు అలాగే కానిమ్మన్నాడు. వెంటనే రాజును వేడుకొని యమదండు నితో విద్యుచ్చోరుడు ఒంటెమీద ఎక్కి వేగంగా ప్రయాణించి వీణాతటాన్ని చేరాడు. ఊరు బయట ఉద్యానవనంలో ఉండి చెప్పి పంపాడు. ఊరంతటా అష్ట శోభలతో అలంకరించారు. మంత్రులు మహత్తర పరివారము, సామంతులు, మహా సామంతులు, అంతఃపురంలోని దాసీజనమూ, అందరూ వచ్చి కాలికి మొక్కి సేసలను చల్లారు. ఇద్దరూ పట్టపుటేనుగునెక్కి 'బెళ్గొడ' మొదలైన రాజ చిహ్నాలు ముందు వెళ్తూ ఉండగా, పంచ మహా శబ్దాలూ, నగారాలూ మ్రోగుతూ ఉండగా రాజప్రసాదాన్ని చేరారు. పట్టపుటేనుగునెక్కి రాజు పురప్రవేశం చేసాడు.

మర్నాడు ఆస్థాన మంటపంలో సభ చేసి, మంత్రులనూ, మహత్తర సామంతులనూ, పురోహితులనూ, రాజకాంతలనూ పిలిచి వారందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు. ''నేను ఈ సంసారపు భోగోపభోగాలకు విసుగెత్తాను. విరక్తుడనై తపస్సు చేసుకోడానికి వెళ్ళాలని నిశ్చయించాను''. దాన్ని విని వాళ్ళందరూ ముక్తకంఠంతో ఇలా అన్నారు. ''ఎక్కడైనా ఉందా? తపస్సుకిపుడు ఏం తొందర? నువ్వింకా కుర్రవాడవు. నవయువకుడవు. కొంతకాలం రాజ్యమేలిన తరువాత తపస్సు చేసే ఆలోచన చేయి''. ''అంతవరకు

ఉంటామో, చస్తామో ఎవరెరుగుదురు? ఈసంసారంలో చిక్కుకున్న వాళ్ళ బతుకు నీటిబుడగలాంటిది. రూప, యవ్వనాలు ఇంద్రధనుస్సులాంటివి. ఆయుష్షు, ఇంద్రియ సుఖాలు. భోగాలు దేహము, శక్తి. ఇష్టజనులతో సహవాసం, రాజ్యం, సౌభాగ్యం. ఇవన్నీ అనిత్యమైనవి. జ్ఞానులైనవారు వీటినన్నింటిని సరిగ్గా పర్యాలోచించి అలవరచుకోవాలి. పుట్టుక, ముప్పు, చావు అనేవి లేకపోతే, ఇష్టమైన వాళ్ళ విరహం లేకపోతే, సర్వవస్తువులూ శాశ్వతంగా ఉండిపోతే, అప్పుడు ఎవరికి ఈ ఇహలోకం పట్ల ప్రేమ ఉండదు? మనుష్య దేహం కూడా అంతే. అదేమీ ఉత్తమమైనది కాదు. శుచికానిది. నిరంతరం రాగ ద్వేషాలకు ఆశ్రయమైనది. అశుభమైనది. మూల మాంసాలతో నరాలతో చుట్టుకోబడింది. అశుభ్రమైన శుక్ల, శోణితాలతో కూడి, మూత్ర పురీషాదులకు నెలవైన ఈ దేహం ఎల్లప్పుడూ అశుచియై ఉంటుంది. బుడగయైన శ్వాసకోశం చెత్తతో నిండి క్రిములను కూడి, మాంస చర్మాల పొందికయైన ఈ చర్మం చాలా అశుచి. దుర్గంధం నిండి, ముడతలు పడి సారరహితమైన ఈ దేహం పట్ల సజ్జనులు ప్రేమను నిలపరు.

మనుష్యులు చేసిన కర్మలు వారిని నీడల్లా వెంటాడుతూ ఉంటాయి. దానివల్ల జినశాసనాన్ని శరణువేడడం కాక వేరేవిధమైన ఆశ్రయం అశక్యమైనది. చెడ్డ వాసన కలిగి, భరింపరాని దుఃఖం కలిగిన, దుష్ట స్వభావం కలిగిన, నశ్వరమైన, చూడడానికి కూడా అసహ్యమైన ఈ దేహం మీద జ్ఞానియైనవాడు ప్రేమను నిలుపకూడదు. అది వ్యర్థమైనది. జాతులనే చెట్లు యముని వలె లేచిపడే క్రూర జంతువులు. రోగాలనే వేటగాడివల్ల భయం, పాపమనే దావాగ్ని, వీటన్నింటిని కలిగిన జన్మమనే దట్టమైన అడవిలో త్రాణమూ, చైతన్యమూ లేని వ్యక్తికి జినశాసనం ఒక్కటే ఆశ్రయస్థానం. ఈ దేహం ఎక్కడివరకు క్షేమంగా రోగం లేకుండా ఉంటుందో, ముప్పు దూరంగా ఉంటుందో, ఇంద్రియాల పట్ల ప్రేమ తగ్గకుండా ఉంటుందో, ఆయస్సు తగ్గకుండా ఉంటుందో అప్పుడే బుద్ధిమంతుడైనవాడు ఆత్మశ్రేయస్సు కోసం విశేష ప్రయత్నం చేయాలి. ఇల్లు తగలబడుతున్నప్పుడు బావితోడడానికి ప్రయత్నించవచ్చునా? అని వివరించి ''నేను రాజును, మీరు నా ప్రజలు అనే భావంతో తెలిసో, తెలియకో నేను హీనంగా మాట్లాడి మిమ్మల్ని బాధపెడితే దయచేసి దాన్ని మరచిపోండి. సర్వ జీవులమూ నేను క్షమించాను. సర్వజీవాలు నన్ను క్షమించాలి. సర్వభూతాలపై

నాకు మైత్రి ఉంది. వైరం లేదు'' మొదలుగా మాట్లాడి, వాళ్ళను ఒప్పించి, తన పెద్దకొడుకు విద్యుదంగనికి రాజ్యపట్టానికట్టి మీరందరూ ఈతనిని అనుసరించి జీవించండి అని జనులకు చెప్పాడు. యమదండుడికి పట్టణ తలారితనాన్ని అప్పగించాడు. తాను పట్టపుటేనుగునెక్కి సతులతో వెండి గొడుగు, పాళి ధ్వజము, చంద్ర సూర్యచిహ్నాలు, సమస్త రాజ చిహ్నాలతో వైభవంతో వంది మాగధులకూ, యాచకులకూ, దీనులకూ, అనాథలకూ, అంధులకూ తృప్తి కలిగేటట్లు దానం చేస్తూ సహస్రకోటి చైత్యాలయానికి వచ్చాడు. అక్కడ ఏనుగునుదిగి ఆరామానికి మూడుసార్లు ప్రదిక్షిణం చేసి వచ్చి, దేవుడికి నమస్కరించి, గుణధరుడు అనే ఆచార్యుని వద్ద కూర్చుని ఇలా అన్నాడు. ''ఆచార్యా! సంసారమనే సముద్రంలో మునిగి పోతున్నాను. మునిగి పోకుండా నన్ను పైకెత్తండి, నాకు దీక్షనివ్వండి'' వారి అనుమతితో, వేయిమంది ఇతర రాజకుమారులతో, సర్వాన్నీ త్యాగం చేసి దీక్షను పుచ్చుకొని తపస్వి అయ్యాడు. అప్సరసలా ఉన్న సౌందరి మహాదేవి మొదలైన ఏడునూరు మంది రాజకాంతలు గుణధర భట్టారకుడే గురువుగా వినయంతో తపస్సును చేసారు. ''గిడిగిడి జంత్రము, మిళిమిళి నేత్రము' అన్నట్టు ఉగ్రమైన తపస్సు నారంభించారు.

విద్యుచ్చోర ముని కూడా 12 సంవత్సరాల కాలం గురువుల వద్ద, ద్వాదశాంగ, చతుర్దశ పూర్వకమైన ఆగమాలనన్నింటిని నేర్చాడు. ఉగ్రమైన తపస్సును చేసి ఆచార్యుడయ్యాడు. ఆ తరువాత ఐదువందలమంది శిష్యులతో గ్రామాలు, నగరాలు, ఖేడ, ఖర్వడ, మడంబ, ద్రోణముఖాలలో సంచరిస్తూ పోయి పూర్వదేశం యొక్క ఖాళిమండలము అనే దేశంలో తామ్రలిప్తి అనే పట్టణాన్ని చేరారు. ఊరు బయటనున్న ఉద్యానవనంలో ఆగారు. అక్కడొక పరాంగాయి అనే ఉగ్రదేవతకు, ప్రతి ఆరునెలలకొకసారి జాత్ర, ఉత్సవం జరగాలి. ఆ దుర్గాదేవత, విద్యుచ్చోర ఋషి వచ్చిన వార్తను తెలుసుకుని, వారి వద్దకు పోయి ''నా జాత్ర ఉత్సవం ముగిసే వరకూ ఈ పట్టణానికి రావద్దు'' అని అడ్డు పెట్టింది. శిష్యులు ''ఈ దేవత మనల్ని ఏం మహా చేస్తుంది? రండి, భట్టారా వెళ్దాం'' అని ఆమె ఎంత వద్దన్నా నిలువకుండా పట్టణాన్ని ప్రవేశించారు. అక్కడ పట్టణం పశ్చిమ దిక్కులో కోట వెలుపల ఉద్యానవనంలో విద్యుచ్చోర భట్టారుడు రాత్రి ప్రతిమాయోగంలోనిల్చున్నాడు. దేవత కోపించినదై పావురాలంత పెద్దవైన దోమల్ని సృష్టించి అతని పైకి వదిలింది. అవి

నాల్గు ఝాములూ పూర్తిగా మునిశరీరాన్ని పీకి పీకి తిని నరక వేదన కన్నా కఠినమైన వేదనని కలిగించాయి. అంతటి యాతనని విద్యుచ్చోరముని సహించి, ఆజ్ఞావిచయము, అపాయ విచయము, విపాక విచయము మరియు సంస్థాన విచయాలు అనే నాల్గు ధర్మ ధ్యానాలను ధ్యానించి, తరువాత పృథక్త్వము, వితర్క విచారము మొదలైన శుక్లధ్యానాన్ని ధ్యానించి, ఏకత్వ వితర్క విచారము, సూక్ష్మ క్రియాప్రతిపాతి సముచ్ఛిన్న క్రియానివృత్తి అనే శుక్ల ధ్యానాలను ధ్యానించి, ఘాతి కర్మలనూ, అఘాత కర్మలనూ చెరచి మోక్షానికి వెళ్ళాడు.

పరమశుద్ధ సహజ రత్నత్రయాలను ఆరాధిస్తున్న భవ్యులు విద్యుచ్చోర ఋషిని మనస్సులో భావిస్తూ, దండన, వ్యాధి చతుర్విధ ఉపసర్గలు, ఆకలి, దాహము, చలి, ఉష్ణము, వాతము, దోమలపీడ మున్నగు యాతనలను వారించి, రత్నత్రయాలను సాధించి స్వర్గాపవర్గ సుఖాలను పొందుదురుగాక.

* * *

# 14. గురుదత్త భట్టారుని కథ

మునుపటి హస్తినాపురాన్ని పరిపాలించిన గురుదత్త ఋషి ద్రోణిమంత పర్వతం దగ్గర జీవసహితంగా మంటలలో కాలుతున్నప్పటికీ ఆ వేదనను సహించి సద్గతిని సాధించాడు.

ఈ జంబూద్వీపంలోని భరతక్షేత్రంలో కుణాళమనే నాడు. అక్కడ సావస్తి అనే పట్టణం. ఉపరిచరుడు అనే రాజు దానిని పాలిస్తూ ఉండేవాడు. అతనికి పద్మావతి, అమితప్రభ, సుప్రభ, ప్రభావతి అనే నల్గురు పట్టమహిషులతోపాటు 500మంది భార్యలు. పద్మావతి కొడుకు అనంత వీర్యుడు. అమితప్రభ కొడుకు వజ్రపాణి. సుప్రభ కొడుకు వజ్రబాహుడు, మరియు ప్రభావతి కొడుకు వజ్రధరుడు. వీళ్ళూ తక్కిన రాణుల కొడుకులూ కలిసి మొత్తం ఐదువందలమంది. ఇలా వీళ్ళందరూ, ఇష్ట విషయ, కామ, భోగాలతో సుఖంగా కాలాన్ని గడుపుతూ ఉండేవారు.

వసంతకాలంలో ఒకరోజు రాజు, రాణులతోనూ కొడుకులతోనూ, పూలు, చిగుళ్ళు, పళ్ళు, కాయలతో నిండిన రమ్యమైన ఉద్యానవనంలో వనక్రీడలాడి, అనంతరం రత్నఖచితమైనమెట్లు కలిగిన పెద్దబావిలో జలక్రీడ లాడడానికై దిగాడు. కర్పూరం, చందనం కాలాగరు మొదలైన సుగంధ ద్రవ్యాలతో కూడినదీ, నీలోత్పలం, కువలయాలు మొదలైన అనేక పుష్పాలతో నిండినదీ, చక్రవాకమూ, బకమూ, బలాకమూ, హంస, మండూకమూ, చకోరాది జలచరాలను కలిగినదీ అయిన ఆ సరస్సులో తన నల్గురు పట్టమహిషులతో, విధవిధాలైన జలయంత్రాలతో నీళ్ళను ఎగరేస్తూ, చిమ్ముతూ పైకి చల్లుతూ మనస్సుకు ఆనందం కలిగేటట్లుగా రాజు సంతోషంతో జలక్రీడలాడసాగాడు.

ఇక్కడ విజయార్ధ పర్వతం యొక్క ఉత్తర శ్రేణిలో అలకాపురం అనే పట్టణం. దాన్ని విద్యాబల గర్వితుడైన వజ్రదాడుడు అనే విద్యాధరుడు పరిపాలించేవాడు. అతని భార్య మదనవేగ. ఇద్దరూ విమానాన్నెక్కి విహారం కోసం బయలదేరి ఆకాశపథంలో వెళ్తూ క్రింద ఉపరిచరుడు జలక్రీడలాడడాన్ని చూచారు. దేవ సమానులైన సామంత, మహా సామంతులు, అప్సరసలను మీరే

రాణులు, తక్కిన స్త్రీలు, పరివార జనులు, పటహ, పణవ, తుణవ, మద్దెల ఝుల్లరి ముకుంద, శంఖ, వంశ, తాళ, భేరి, మృదంగ, వీణ, కాహళ మొదలైన నానా ప్రకారాలైన వాద్యధ్వనులతోను, మహా వైభవంతో ఉపరిచర రాజు జలక్రీడ లాడుతున్నాడు. ''మనం ఆకాశంలో కాకుల్లాగ ఎగరడం ఒక్కటి తప్పితే ఇంత వైభవం కానీ, సంతోషం కానీ మనకుందా? సిరి, సంపద, రూపం, వైభవాలలో ఉపరిచర మహారాజు కంటె వేరే వారు సాటిలేరు. నిజంగా ఇతని బ్రతుకు సార్థకం'', అంది మదనవేగ. వజ్రదాడునికి ఆమె మాటలు అసంతృప్తిని కలిగించాయి. తక్షణమే నగరానికి వెనుదిరిగి మదనవేగని వదలి తానొక్కడే వచ్చి, తన విద్యాబలంతో పెద్ద బండ నొకదాన్ని తెచ్చి ఉపరిచరుడు జలక్రీడ లాడే బావియొక్క మూతికిఅడ్డంగాపెట్టి వెళ్ళిపోయాడు. అందరూ చచ్చిపోయారు. కాని పద్మావతి మొదలైన నలుగురు పట్టమహిషులు నిర్మోహులై, ఆహార, శరీర, నివృత్తులను పొంది, పంచ నమస్కారాలను నడుపుతూ, దైవాన్ని ధ్యానిస్తూ రత్నత్రయాలను ఆరాధించి చనిపోవడం వల్ల సౌధర్మ కల్పంలో స్వస్తికావర్తము అనే విమానంలో ఒక సాగర కాలం ఆయుష్షు కలిగిన సామానిక దేవులుగా పుట్టారు. ఉపరిచరుడో మిథ్యాదృష్టి అవడంవల్ల రాజ్యవైభవాదులను మోహించే బుద్ధి ఉన్నవాడవడం వల్ల, అర్తధ్యానంతో చనిపోయి మనోహరం అనే పేరు కలిగిన తన ఉద్యానవనంలో పెద్ద పాము (కొండచిలువ) వలె పుట్టాడు.

ఇక్కడ మర్నాడు సామంత, మహాసామంతులూ పరివారం అంతా సభను చేసి, రాజు యొక్క పెద్దకొడుకు అనంత వీర్యుడికి పట్టం కట్టారు. కాని మర్నాడు అవధి జ్ఞానులైన సారస్వతుడు అనే ఆచార్యుడు ఐదునూరు మంది ఋషులతో, గ్రామం నగరం, పల్లె, కొండల నడుమనున్న చిన్న ఊరు, మడంబము, పట్టణము, జలమార్గాలున్న పట్టణం ఇలా అన్నింటిలోనూ సంచరిస్తూ ఆ పట్టణానికి వచ్చి అదే ఉద్యానవనంలో విడిది చేసాడు. ఋషి నివేదకుని వల్ల ఆ విషయాన్నెరిగి, అనంతవీర్యుడు సపరివార సమేతుడై అక్కడకు వచ్చి, వినయంగా మునికి నమస్కరించి, సారస్వత ముని వద్ద కూర్చుని ''మా తల్లిదండ్రులు, ఉన్నట్టుండి ఒకేసారి చావడానికి కారణం ఏమిటో చెప్పండి భట్టారకా?'' అని అడిగాడు. అపుడా భట్టారుడు జరిగినదంతా చెప్పాడు ''సుదర్శనం అనే బావిలో నీ తండ్రి రాణులతో కలసి జల

క్రీడలాడుతున్నప్పుడు వజ్రదాడుడనే విద్యాధరుడు, తన భార్య నీ తండ్రి వైభవాన్ని పొగడడం సహించలేక క్రోధంతో ఆ బావిని రాతితో మూసి వంపేశాడు''. ఇప్పుడు వాళ్ళు ఎక్కడ పుట్టారు? అని రాజు అడుగగా ''నీ తల్లులు శుభపరిణామంతో చనిపోవడంవల్ల సౌధర్మ కల్పయం యొక్క స్వస్తికావర్త విమానంలో ఒక సాగరకాలం ఆయుష్షు కలిగిన, కాంత, సుకాంత, నంద, సునంద అనే నలుగురు సామానిక దేవులుగా పుట్టారు. నీకూ, నీ తండ్రికీ ఉపదేశం ఇవ్వడానికి త్వరలో ఇక్కడకు వస్తారు. నీ తండ్రి, భార్యలు, పిల్లలు, పరివారం, ఐశ్వర్యం వీని మోహం వల్ల సర్వాశ్రయం అనే గుహలో పెద్ద కొండ చిలువగా పుట్టాడు'' - అని చెప్పాడు, ''భట్టారా నా తండ్రి ఇప్పుడైనా ధర్మాన్ని స్వీకరిస్తాడా లేదా''? అని రాజు మళ్ళీ ప్రశ్నించాడు. ''నువ్వు చెప్తే స్వీకరిస్తాడు'' - అని సారస్వతముని పలికాడు. వెంటనే అనంత వీర్య మహారాజు తన తమ్ములతోనూ, పరివారంతోనూ ఆ గుహవద్దకు వెళ్ళాడు. దాని ద్వారం వద్ద నిలిచి ఇలా చెప్పసాగాడు.

''ఓయీ ఉపరిచర మహారాజ, కొండచిలువగా పుట్టినా, ఈ అవస్థలో కూడా, ఈ బతుకులో కూడా ఇంకా ఆశ తగ్గిపోలేదా? ఇందులో నీ తప్పేమీ లేదు. ఎందుకంటే జీవుల స్వభావమే అంత. కర్మవశాన జీవులు ఎక్కడ పుడతారో, ఆయా స్థితికి తగినట్లుగా, ఆశ, ఆకాంక్షలను పొందుతూనే ఉంటారు. ఇది వరకు నువ్వు రాజభవన మహాసౌధంలో సింహాసనం పైన కూర్చుని సామంత, మహాసామంతులతోనూ, ఐదునూర్లమంది రాణులతోనూ, అగ్రగణ్యులైన అంతఃపుర దాసీజనులతోను, పరివారంతోనూ పరివేష్టితుడవై దివ్యమైన ఆటపాటలతోనూ, వినోదాలతో సభను నడిపించి సుఖంగా ఉండే నువ్వు కొండ చిలువలతో కాలాన్ని గడుపుతున్నావు. దివ్యమైన పర్యంకం పై శయనించే నువ్వు ఇపుడు, రాళ్ళు, మన్ను, ఇటుక గుచ్చుకుంటూ ఉండగా పడి ఉన్నావు. అమృతోపమైన ఆహారాన్ని సేవించే నువ్వు ఇప్పుడు కప్పలు ఎలుక మొదలైన జీవరాశుల్ని తింటున్నావు. వాటిని అలాగే చంపి తిని మళ్ళీ నరకానికి పోవాలని కోరుకుంటున్నావా?''. అనంతవీర్యుడు చెప్పిన ఈ మాటను విని కొండ చిలువకు పూర్వజన్మ స్మరణ కలిగింది. ఆ వేళకు సౌధర్మకల్పంలో పుట్టిన నలుగురు దేవతలూ (దేవుళ్ళూ) మునుపటి స్త్రీ రూపాన్నే ధరించి అక్కడకు వచ్చారు. కొడుకులు తల్లులను చూచి వాళ్ళ క్షేమాన్ని విచారించడానికి దగ్గరకు

పోగా, వాళ్ళు ముట్టుకోకుండా పైకి ఎగిరారు. ''అలా ఎందుకని చేసారు?'' అనంత వీరుడు అడిగాడు. వాళ్ళు వజ్రదాడునివల్ల తాము చచ్చిన విధానాన్ని వివరించారు. తరువాత ఉపరిచరుణ్ణి ఉద్దేశించి

'' ఈ నేల నాది. ఈ ఇల్లు నాది. ఈ తల్లి, భార్య పిల్లలు వీళ్ళందరూ నావాళ్ళు, ఈ సుందరులైన కోడళ్ళు, స్త్రీలు నా భండారం అని మోహం ఆక్రమించిన బుద్ధి కలిగిన వాడవుకానటం వల్ల ఆర్తధ్యానంతో చచ్చి కొండచిలువ వయ్యావు. మేము స్త్రీలమైనా ఇంత శ్రీ సంపత్తును, వైభవాలను పొందాము' అని చెప్పి వాళ్ళు ఆకాశానికి ఎగిరి చిత్రపటాల్లో గీసినట్లున్న విచిత్ర విమానాలతోనూ, అసంఖ్యాకమైన పరివారంతోను, వనదేవతలతోనూ, దేవగణికలతోనూ చుట్టుకొనబడి తమ వైభవాన్ని చూపించారు. ఘంటాజాల, ముక్తాజాలలతో వైభవో పేతమైన రత్న విమానాలనెక్కి దేవతలు చామరాలు వీస్తూ ఉండగా నానావిధమైన ఆటపాటలతోనూ, వినోదాలతోనూ తమ ఐశ్వర్యాన్నంతా చాటుకున్న తరువాత ''ఇవన్నీ మాకు జినధర్మం యొక్క పరమసత్వం వల్ల వచ్చాయి' అని చెప్పి, కొడుకులకూ, కొండచిలుకకూ ఉపదేశాన్ని చేసి స్వర్గలోకానికి వెళ్ళిపోయారు.

పాముకు తన భార్యలు, ఆవైభవస్థితిని పొందడం సంతోషం కలిగించింది. మనస్సు ధర్మాన్ని ఆశ్రయించింది. దాన్ని తెలుసుకుని సారస్వత భట్టారుడు ఋషి సమూహంతో ఆ పాము వద్దకు పోయి ధర్మాన్ని ఉపదేశించాడు. దానికి శ్రావకవ్రతాలను ఇచ్చాడు. ''దయయే ధర్మం, ఇంద్రియ నిగ్రహమే ధర్మం. పద్దెనిమిది దోషాలు లేనివాడే దేవత. ఇందులో సందేహం లేదు. జనులు ప్రయత్న పూర్వకంగా పాపాలను చేస్తారు. సందర్భ వశంగానైనా ధర్మాన్ని ఆచరించరు. ఆశ్చర్యం! పాలను వదలి విషాన్ని తాగుతారు కదా! సమాగమం మనవశంలో లేదు. ఐశ్వర్యాలు అల్పకాలికాలు. అర్హంతలు చెప్పిన ఈ ధర్మమొక్కటే శాశ్వతమైనది. సూర్యుడస్తమించటం ఎంత నిశ్చయమైన విషయమో అలాగే జన్మను పొందిన సమస్తమూ నాశనం కావడం నిశ్చయం. అందుకని ఎప్పుడూ ధర్మాన్ని గురించి చింతించాలి. యౌవనం, శక్తి, వైభవం, రూపం ఇవన్నీ పూలూ, పళ్ళూ నిండిన చెట్లలాంటివి. జీవితమూ అంతే. కొండ నుంచి పారుతూ వచ్చే నదిలా వేగంగా జీవుడు ఒక్కడే పుడతాడు. అలాగే అసహాయుడై ఒక్కడే చస్తాడు. వేరే వేరే జన్మల్లో వేరే వేరే తల్లి తండ్రి. భార్య,

కొడుకు చచ్చాక సంపద ఇంట్లో ఉంటుంది. బంధువులు శ్మశానంలో నిలుచుంటారు. దేహం మంటల మధ్య నిలుస్తుంది. కాని పుణ్య, పాపాలు మాత్రం మనతోటే వస్తాయి. మహారాజా, నీకు ఇంకా పదిహేనురోజులే ఆయుష్షు వుంది అని చెప్పారు. ఆ పాము ఆహారాన్ని శరీరాన్ని నివృత్తి చేసికొని సన్యాసాన్ని తీసుకుంది. అప్పుడు సారస్వత భట్టారుకుడు దాని స్థితిని తెలుసుకొని, ఇపుడు దానిని పూజించండి అన్నప్పుడు అనంతవీర్యుడు పెద్ద పందరిని వేసి, బావుటాలను కట్టించి, దేవతా విగ్రహాన్ని పెట్టి అభిషేక అర్చనలను చేయసాగాడు. మూడుపూటలూ పూజా ఉత్సవాలు నడచాయి. భట్టారకుడు ఆరాధనా మహిమను వ్యాఖ్యానం చేయసాగాడు. ''ప్రాణం కంఠానికి వచ్చినప్పుడు ఎవ్వడు సన్యాసానికి మనసుపడతాడో వాడు తిరుగులేని మోక్షస్థితిని పొందుతాడు. ఈ జన్మలోనూ వెనుక జన్మల్లోనూ చేసిన పాపాలు 'సంన్యసనం'తో నిప్పుల్లోకి కట్టెలు వెళ్తున్నట్టు కాలిపోతాయి. ఊర్ధ్వ, అధోలోకాలలో వేరే వేరే జీవ జాతుల్లో చాలాసార్లు మరణం వచ్చివుంది. దానివల్ల ఇప్పుడు సమ్యగ్ జ్ఞానము, దర్శనము సమానంగా కూడిన పండిత మరణాన్ని నేను కోరుకుంటాను. ఉద్వేగ యుక్తమైన మరణం, జాతి మరణం, నరకంలో హింస మొదలైన వాటిని స్మరించుకుని, ఇప్పుడు పండిత మరణాన్ని కోరి చచ్చిపోతాను. ఈ ఒక్క పండిత మరణం ఇతర నూరు జన్మాలను కత్తిరిస్తుంది. అదే మనం పొందవలసిన మరణపు రీతి. దుఃఖం పుట్టినపుడు దానికి స్వభావ సహజంగానే నరకంతో హింస కూడా వేచి ఉంటుంది. అలాంటప్పుడు జనన-మరణాలు అనే రాట్నంలో తిరిగే నాకు దుఃఖం లేకుండా ఉంటుందా? జనన-మరణాల సుడిలో తిరుగుతూ అనేకానేక పర్యాయాలు నేను 'వుద్గాలా'లను సేవించాను. దీనివల్ల నాకు ఆశ పోలేదు. తృప్తి కాలేదు. ప్రాణిహింసవల్ల వచ్చే ఆహారాన్ని సేవించడం మాటటుంచి, మనసా దాన్ని గురించి ఆలోచించనూ కూడదు. గడ్డి, కట్టెలు మొదలైన వానిని ఎంత వేసినా మంట ఎలాగైతే తృప్తిని పొందదో, అలాగే ఈ జీవుడు తన్ను కోరిన స్త్రీ, వస్త్రాది, భోగ భాగ్యాలను ఎంత అనుభవించినా తృప్తి చెందడు. వాటిని భోగించిన కొలదీ ఆశ వర్ధిల్లుతుంది. కట్టెలు అగ్నిని దీపింప చేసే విధంగా అవన్నీ ఆశను పెంపొందిస్తాయి. దాహంతో ఉన్నవాడు ఉప్పునీరు త్రాగితే ఆ దాహం ఇంకా హెచ్చుతుంది. బాధ ఇంకా ఎక్కువవుతుంది. అలాగే ఆశతో పీడింపబడేవాళ్ళు ఇంద్రియ సుఖాలను చవి చూసి ఇంకా అధికాధికంగా ఆశాపీడితులవుతారు.

దుఃఖితులౌతారు. మనస్సుకు తృప్తినిచ్చే విషయసుఖాలు కింపాక ఫలాలవలె తినేటప్పుడు రుచిగాను, తిన్నాక హానికరంగాను పరిణమిస్తాయి. మంత్రాలు, మందులు, ఇష్టదేవతలు, చతురంగ బలాలు, అంగరక్షక దళాలు, కర్మ, మిత్రులయొక్క బలము ఇవన్నీ మృత్యువెదురైనపుడు ప్రాణాన్ని రక్షించడానికి సమర్థాలైన పక్షంలో పన్నెండు మంది చక్రవర్తులు ఎందుకని చనిపోయారు? చావు సమీపించినపుడు జినతత్త్వాన్ని ధ్యానించి, 'పరిష'లను జయించి, శాంత మనస్సుతో ప్రాణందేహాన్ని వదలి వెళ్ళాలని పరిభావించాలి. నాకు ఎవరిమీదా మోహం లేదు. భీకరమైన జనన-మరణ దుఃఖాల్ని అర్హంతుని పాద కమలాలు మాత్రమే పరిహరించగలవు. ధర్మం ఒక్కటే శరణం అని అనుకోవాలి. చెప్పడానికి శక్తి ఉంటే పంచ నమస్కారాలను చెప్పాలి. జీవన ఉపదేశం దివ్యమైన ఔషధం. విషయ సుఖాలకు అది వ్యతిరేకమైన ద్రవ్యం. జీవులకది అమృతంతో సమానం. సర్వజీవుల పుట్టుక చావు రోగాలయొక్క నివారిణి. ఒక్క జన్మను పొందినపుడే సమాధి మరణాన్ని ఏ జీవి పొందుతాడో, వాడు అనంతరం ఏడెనిమిది జన్మాలలో అత్యంత శ్రేష్ఠమైన మోక్షాన్ని పొందుతాడు, ''ణమో అరహంతాణం'' అనే సప్తాక్షర పఠనాన్ని కాయా-వాచా-మనసా ఎవరు చేస్తారో వాడు సర్వ శుభాలను పొందుతాడు. సకలపాపాలను నాశనం చేసే ఈ పంచ నమస్కార మంత్రం అన్ని శుభాలలోకి అత్యంత శ్రేష్ఠమైన శుభం. మనస్సులో ఎవడైతే ఈ పంచనమస్కార మంత్రాన్ని భావిస్తాడో వాడు నిర్మలుడై మోక్ష సుఖానికి భాగస్వామి ఔతాడు. గురుసాన్నిధ్యంలో, యతులవద్ద, జినాలయంలో, సిద్ధాంతం అనే సముద్రతీరంలో జన్మజన్మలకూ నాకు సంన్యసన పూర్వకమైన మరణమే లభించనీ''. పదుహేను రోజులు ఇలాగే గడిచాయి. ధర్మానురాగంలోనే ఉన్నప్పటికీ పాము చనిపోయేటప్పుడు ''దురాత్ముడైన వజ్రదాడుడు నన్ను నిష్కారణంగా చంపాడు'' అని రోషంతో చనిపోవడంవల్ల భవనవాసిగ లోకంలో నూరు 'పళిత' ఆయుష్షు కలిగిన నాగేంద్ర దేవుడుగా పుట్టింది.

ఇక్కడ అనంత వీర్యుడు భట్టారకుడి ధర్మశ్రవణాన్ని విన్నాడు. ధర్మం యొక్క ఫలంవల్ల తన తల్లులు పొందిన సద్గతినీ, రాజ్య వ్యామోహంవల్ల తన తండ్రి పొందిన దుర్గతిని పరిభావించాడు. మనుష్యజన్మ దుర్లభమనే విషయాన్నీ, భోగోపభోగాల అశాశ్వతత్వాన్నీ మనస్సులో తలచాడు. అతనికి

వైరాగ్యం కలిగింది. తనతోపాటు తపస్సు చేయడానికి రావాలని నిశ్చయించిన పెద్ద కొడుకు సుబాహుణ్ణి వారించి ''కుమారా, ఆశలను ఛిద్రం చేయి. క్షమనే భావించు, మదాన్ని విడు, పాపాలపై ఆశనుంచకు, సత్యాన్నే చెప్పు, సాధువృత్తిని అనుసరించు, విద్వజ్జనుల్ని సేవించు, మాన్యుల్ని గౌరవించు, విద్వాంసులను అనునయించు, కీర్తిని పాలించు, ఆశ్రయాన్నివ్వు. దుఃఖితులపై దయను చూపించు - ఇవే సజ్జనులు చేయవలసినది '' అని మంచిమాటలు చెప్పి, అతడికి రాజ్యం అప్పగించి, తాను అనేకమంది రాజపుత్రులతో తపస్సుకై తరలాడు. సారస్వత భట్టారుని వద్ద అనేక సంవత్సరాలు ఉగ్రోగ్ర తపస్సును చేసి సమ్మేద పర్వతం పైన వసించి, ఎనిమిది కర్మలనూ త్యజించి మోక్షానికి వెళ్ళాడు.

ఇక్కడ ధరణేంద్రుడు - నాగేంద్రుడు - ఒకరోజు జినేంద్ర చైత్యాలయాలను వందించడానికై వెళ్ళి బయలుదేరి మందరపర్వతానికి వచ్చాడు. అక్కడికి అదే సమయానికి తనకున్న వానికంటె ఎక్కువ విద్యలను సాధించాలని వజ్రదాడుడు తన భార్యతో వచ్చాడు. ధరణేంద్రుడికి అతడు తన పూర్వజన్మవైరి అన్నది తెలిసింది. 'ఒరేయ్, పాపకర్ముడా, స్త్రీలతో జలక్రీడలాడుతున్న నన్ను నిష్కారణంగా చంపావు'' అని వాని విద్యలన్నింటినీ నాశనం చేసి, వాణ్ణీ, మదనవేగనూ ఎత్తుకొని పోయి, సముద్రంలో, మహాపాతాళం దగ్గర మరుగుతున్న నీట్లో అద్ది ముంచి, అపారమైన వేదనను కలిగించి చంపాడు. అలా చనిపోయిన వజ్రదాడుడు ప్రథమ నరకం యొక్క ఖళఖళమనే అతి ఘోరమైన నరకబిలంలో మూడు పళిత ఆయుష్షు కలిగిన నారకుడుగా పుట్టి, అక్కడి దుఃఖాలనన్నింటినీ అనుభవించి ఆయుష్యాంతంలో అక్కడినుంచి బయలుదేరి వచ్చి నీలగిరి అనే పర్వతంలో ఒక పులిగా పుట్టాడు. ధరణేంద్రుడు కూడా ఆయుష్యాంతంలో కురుజాంగణదేశం యొక్క హస్తినాపుర పట్టణంలోని విజయదత్తుడనే రాజుకూ, అతని భార్య విజయమతి మహాదేవికీ కుమారుడిగా పుట్టాడు. వాడిపేరు గురుదత్తుడు. పుత్రుడు కావాలని తహతహ లాడుతున్న విజయమతికి గురువులనే ఋషి అనుగ్రహించడం వల్ల పుట్టినవాడైన అతనికి గురుదత్తుడనే పేరు కలిగింది.

గురుదత్తుడు ఏడు సంవత్సరాల వాడయ్యేటప్పటికీ అరవై నాలుగు కళలనూ, డెబ్బైరెండు శాస్త్రాలనూ అన్నింటినీ విడవకుండా నేర్చుకుని పారంగతుడయ్యాడు. మంచి రూపు, తేజస్సు, సౌందర్యం, సౌభాగ్యం అన్నీ

అతనికి ఉండేవి. ఎనిమిది సంవత్సరాల వాడైనప్పుడు రాజు విజయదత్తుడు అతనికి రాజ్యపట్టాన్ని కట్టి తాను తపస్సుకు వెళ్ళాడు. ఇప్పుడు రాజైన గురుదత్త కుమారుడు తన తండ్రికి కప్పం ఇవ్వకుండా తప్పించుకుంటున్న మాండలికుల పైకి దండెత్తివెళ్ళి, వాళ్ళందర్నీ గెలిచి అనేక మండలాలనూ, దుర్గాలనూ వశం చేసుకున్నాడు. అపారమైన కీర్తిని పొంది సుఖంగా రాజ్యభారాన్ని వహించాడు.

ఇక్కడ నీలగిరిపర్వతం చుట్టుపట్ల పులియొక్క ఉపద్రవం ఎక్కువయింది. ప్రజలందరూ వచ్చి రాజుతో విన్నవించుకున్నారు. ''దేవా, నీలగిరి పర్వతం చుట్టూ ఉన్న రాజ్యం నాశనమౌతోంది. ఆ పర్వత గుహలో ఒక బెబ్బులి చేరి రాజ్యప్రజలందర్నీ చంపుతోంది. అక్కడ నివసించడానికి కూడా అందరూ భయపడుతున్నారు.'' దానిని విని మనస్సులో పూర్వవైరం ఉప్పొంగి గురుదత్త కుమారుడు పులిని చంపాలని పర్వత గుహ వద్దకుపోయి చుట్టు ముట్టాడు. సముద్రగర్జనలా ఉన్న అతని పరివారం యొక్క శబ్దాన్నీ, శంఖ,కాహళాల యొక్క ధ్వనులనూ విని పులి బెదరి గుహలో మూల దాక్కుందే తప్ప బయటకు రాలేదు. రాజు గుహద్వారానికి గడ్డిని, కట్టెలనూ తూరి నిప్పుపెట్టి అది లోపలే కాలిపోయేటట్లు చేసి వెనుతిరుగాడు. పులి కర్మ నిర్జరత్వం వల్ల చచ్చింది. ఆ తరువాత సురాష్ట్ర దేశంలో ద్రోణిమంతము అనే పర్వతం వద్ద పల్లిఖేడమనే ఊర్లో, సలిదాభరణుడనే బ్రాహ్మణునికి అతని భార్య కటుకి అనే వనితకూ హాళముఖుడనే పేరుతో పుత్రునిగా జన్మించాడు.

అంగము అనేనాడు ఉంది. అక్కడ చంపానగరం అనే పట్టణం. దాని రాజు ధాత్రివాహనుడు. అతని భార్య శ్రీమతి. కూతురు అభయమతి. ఆమె అత్యంత రూప లావణ్య, సౌభాగ్య, హావభావ విలాస విభ్రమాలను కలిగింది. ఎన్నోసార్లు గురుదత్త కుమారుడు ఆమెను తనకిచ్చి వివాహం చేయమని రాజును అభ్యర్థించినా రాజు ఒప్పుకోలేదు. ఒకసారి అతడు విశ్వకర్మ, విశ్వమతి అనే తన ఇద్దరు వడ్రంగులను పిలిచి, ఆరునెలలలోపున ఒక్కొక్కరూ తనకు ఐదువందల రథాలను తయారు చేసి ఇవ్వాలని ఆజ్ఞ ఇచ్చాడు. విశ్వమతి ఆరునెలల్లో ఐదువందల రథాలను తయారుచేసి రాజుకు అప్పగించాడు. కాని విశ్వకర్మ ఆరునెలల్లో ఒకే ఒక్క రథ చక్రాన్ని మాత్రమే తయారుచేసాడు. దీనివల్ల కుపితుడైన రాజు వాణ్ణి చంపించాలని అనుకున్నప్పుడు, వాడు బెదరి అక్కడనుంచి పారిపోయి గురుదత్త కుమారుణ్ణి ఆశ్రయించాడు. వాడు

నిర్మించిన చక్రం నేలను తాకకుండా పదిహేనురోజులు అంతరిక్షంలో గరగర తిరుగ గలదు. దాని అప్రతిమ కౌశలాన్ని చూసి ఆశ్చర్యపడ్డ ధాత్రీవాహనుడు విశ్వకర్మ పట్ల అనుగ్రహాన్ని, మెప్పుదలను దాల్చాడు. కాని ఆవేళకు విశ్వకర్మ గురుదత్త రాజు దగ్గరకు రావడం జరిగింది. ''కప్పము-కానుకలతో వెంటనే తమ వడ్రంగి విశ్వకర్మన్ణి తీసుకొచ్చి అప్పగించవలసింది''గా అని గురుదత్తునికి ఆజ్ఞ నిచ్చి ధాత్రీవాహనుడు మంత్రులను పంపించాడు. గురుదత్త నృపతికి ఆ మాటలను విని అసాధ్యమైన క్రోధం కలిగింది. ''మండలాన్ని పరిపాలించే రాజునై కూడా ఇతరులకు కప్పం ఇవ్వాలా? అలాగైతే, ఈ సింహాసనం, వెండి గొడుగు, చామరం, పాళిధ్వజం, పంచ మహాశబ్దాలు, మదపుటేనుగు, జాత్యశ్వము ఇవన్నీ ఎందుకుండాలి? వెంటనే తన కుమార్తె అభయమతితో పట్టపుటేనుగు, శ్రేష్ఠవస్తు వాహనాలను పంపకపోతే, నేనే వచ్చి అతని తలతో సహా వీటినన్నింటినీ తీసుకోవలసి ఉంటుంది. చెప్పండి, ఇదిగో మీ వెనుక నేను వస్తున్నాను'' అన్నాడు. సేనాసన్నద్ధుడై బయలుదేరివచ్చి చంపా నగరాన్ని మూడు వరసులుగా చుట్టి ముట్టడించాడు.

ధాత్రీవాహనుడు సకల సైన్యంతో వచ్చి యుద్ధాన్ని చేశాడు. ఇరుపక్షాల లోనూ, ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, పదాతులు పరస్పర వైరంతో పెక్కు దినాలు యుద్ధాన్ని చేసాయి. ఒకరోజు గురుదత్త రాజు యొక్క ప్రధాన సామంతు డైన మహేంద్రదత్తుడనే రాజుయొక్క హస్తం, ధాత్రీవాహనుని వైపునున్న యోధుడొకడు విసిరిన చక్రానికి తగిలి ఖండింపబడింది. నేలమీద పడిన ఆ ముంజేతిని ఒక గ్రద్ద నోటికి కరచుకొని వెళ్ళసాగింది. ధాత్రీవాహనుడి కూతురు అభయమతి తన అంతఃపురం రెండవ అంతస్తు మేడమీద సఖీజనులతోనూ, దాదులతోనూ సల్లాపిస్తూ కూర్చుండగా, గ్రద్ద కరచుకొని వెళ్తున్న ముంజేయి జారి పడింది. దానిని అభయమతి చూచింది. అనేక వజ్ర, వైఢూర్య, పద్మరాగ, పుష్యరాగ, సస్య, కర్కేతన, ఇంద్ర నీలాది నానారత్న కంకణాలతో శోభిస్తున్న ముంజేయినీ, శంఖ, చక్ర పద్మ, అంకుశ, చామర, తోరణ పతకాది శుభలక్షణాలతో కూడి కెందామర వర్ణాన్ని కలదీ అయిన అరచేతినీ కలిగిన ఆ వ్యక్తి సామాన్యుడు కాడు. అతడు శ్రేష్ఠ రాజన్యుడై వుండి తీరాలి అని తలచి, తన దాదిని ''ఇదేమిటి ఈ చేయి ఎందుకని కత్తిరింపబడింది అవ్వా?'' అని అడిగింది. ఆ దాది, ''పుత్రీ నీ కారణంగా ఇలాంటి అంగాంగాలున్న అనేక

రాజులు చస్తున్నారు'' అని చెప్పింది. ''నా కారణంగానా? అదెందుకో చెప్పవ్వా''? అని అభయమతి అడిగింది. ''కురుజాంగణ దేశానికి తిలకం వంటి హస్తినావతిని పాలించే రాజు గురుదత్తుడు అత్యంత సుందర రూప లావణ్య సౌభాగ్య శాంతి ధృతి, దీప్తి, కీర్తి, శౌర్య, బలపరాక్రమయుతుడు అనేకానేక శత్రు రాజులను ఓడించి తన అధీనంలో ఉంచుకున్నాడు. అతడు నిన్ను పరిణయమాడగోరి అనేకసార్లు బహుమతులతో తన ప్రధానులను పంపించాడు. నీ తండ్రి అతనికి నిన్నివ్వడానికి ఒప్పుకోలేదు. ఇపుడు అతని తలను నరికి నిన్ను పొందుతాననే సంకల్పం చేసుకుని భారీ సైన్యంతో వచ్చి ముట్టడి చేసాడు. యుద్ధం ప్రారంభమై ఏడురోజు లయింది. భయంకరంగా యుద్ధం నడుస్తోంది'' అని దాది వివరించింది. ''అవ్వా అలాగైతే నువ్వు తక్షణం వెళ్ళి రాజుతో 'ఇచ్చేటట్లయితే గురుదత్త రాజుకే నన్నిచ్చి పరిణయం చేయండి. ఇతర పురుషులు నాకు ఇష్టం లేదు. ఇది నీకు అంగీకారం కానట్లయితే నేను ఇప్పుడే తపస్సుకు పోతాను' అని నేను చెప్పినట్లుగా రాజుకు తెలుపు'' అని అభయమతి దాదికి చెప్పి పంపింది. దాది ధాత్రీవాహనుడికి ఆ విషయాన్ని తెలిపింది. రాజు ఒప్పుకొని ప్రముఖులైన నల్గురు ప్రధానుల మూలకంగా ఈ సందేశాన్ని గురుదత్తునికి పంపించాడు. రెండు పక్షాల మధ్య యుద్ధం ఆగిపోయింది. చచ్చిన వారికి, గాయపడ్డవాళ్ళకూ ఉచిత ప్రకారంగా క్రియలు నడిపించబడ్డాయి. వధువు యొక్క అనుకూలతను చూచి ప్రశస్తమైన దిన, వార నక్షత్రంలో హోరా మూహూర్తంలో మహావైభవంగా గురుదత్తునికి అభయమతికీ వివాహం జరిగింది. కొన్ని రోజులక్కడే ఉండి, తరువాత రాజు యొక్క అనుమతితో గురుదత్తుడు భార్యను తీసికొని హస్తినాపురానికి వచ్చాడు. ధాత్రీవాహనుడు తన కుమార్తెకు తగిన కొద్దిమంది అంతఃపుర దాసీలను, ఏనుగులను, గుఱ్ఱాలను, రథాలను మొదలైన అనేక వాహనాలను, ముత్యాలు, మాణిక్యాలు పొదిగిన అనేక రకాల అనర్ఘ్యాలైన ఆభరణాలనూ, పల్లకీలను ఇచ్చి, వాళ్ళను ఆశీర్వదించి పంపాడు. ఆ దంపతులు కొద్దికాలం ఇష్ట విషయ, కామ భోగాలతో సుఖాంగా ఉన్నారు. కాలానుక్రమాన సువర్ణభద్రుడు అనే పేరు కలిగిన పుత్రుడు వారికి పుట్టాడు.

ఇలా ఉండగా హస్తినాపుర సమీపంలో ధరణి భూషణమనే పర్వతానికి అమృతాస్రవులు అనే గురువులు ఐదువందల మంది ఋషులతో వచ్చి విడిది చేసారన్న వార్త రాజుకు తెలిసింది. పుత్ర, కళత్ర, మిత్ర, పరివార సమేతుడై

గురుదత్తుడు వెళ్ళి, వారిని పూజించి, వందనం చేసి ధర్మాన్ని గురించి అడిగాడు. ఆ తరువాత ''భట్టారా నా పూర్వజన్మాల వృత్తాంతాన్ని చెప్పండి'' అని అడిగాడు. భట్టారకులు ''దీనికి పూర్వం నాల్గవ జన్మంలో నువ్వు సావస్తి అనే పట్టణంలో ఉన్న ఉపరిచరుడనే మాండలికుడవు. జలక్రీడలాడుతున్నప్పుడు వజ్రదాడుడనే విద్యాధరునివల్ల చంపబడి, అదే పట్టణంలో పెద్దపాముపలె పుట్టావు. ఆ జన్మలో చనిపోయి భవన వాసికమనే లోకంలో ధరణీంద్రుడయ్యావు. అక్కడనుంచి వచ్చి ఇపుడు గురుదత్తుడవయ్యావు'' అని చెప్పాడు. అపుడు అభయమతి కూడా తన జన్మాలనూ గూర్చి చెప్పాలని వేడుకొనగా భట్టారకుడు చెప్పాడు.

''చంపా నగరంలో ఉన్న గరుడ వేగుడనే పుళిందునికి గోమతి అనే భార్యవయ్యావు. ఒకరోజు సమాధిగుప్తులనే ముని కొంతమంది ఋషులతో అక్కడకు వచ్చారు. నువ్వు ఆ ముని వద్ద ధర్మాన్ని అడిగి, చంపడం, దొంగతనం చేయడం, మధు, మద్య, మాంసాలు, ఐదు చెట్ల పళ్ళు, కుక్కగొడుగులు ఇవన్నీ సేవించని వ్రతాలను స్వీకరించి ఇంటికి వెళ్ళావు. అప్పుడు నీ భర్త గొప్పగా కొరసు మొదలైన పక్షులను పట్టుకొని వచ్చాడు. వాటిని ఇంట్లో ఉంచి మళ్ళీ వేటకని వెళ్ళాడు. నువ్వు వాటిమీద కరుణతో వాటి చెరను విప్పి ఎగుర వేసావు. నీ భర్త ఇంటికి వచ్చి పక్షులు కనుపించకపోగా, వాటిని ఎగురగొట్టిన వాళ్ళెవరు? అని అడుగితే, నేను అని నువ్వు జవాబునిచ్చావు. ఇంత ధర్మనిష్ట కలిగిన నువ్వు నా ఇంట్లో ఉండనవసరం లేదు అని తిట్టి కొట్టి తరిమేసాడు. నువ్వు బంధువుల ఇంట్లో ఉన్నావు. ఒకరోజు ధాత్రీవాహనరాజు, శ్రీమతి మహాదేవి రాణి మహా వైభవంతో వెళ్తూ ఉండగా, వాళ్ళకు కుమార్తెగా జన్మిస్తే బాగుంటుందని మనసులో అనుకున్నావు. కొన్ని రోజుల్లో మరణించి వాళ్ళకు కుమార్తెగా పుట్టావు. నువ్వు గర్భంలో ఉండగా శ్రీమతికి ఎల్ల జీవులపైనా దయను చూపాలన్న కోరిక పుట్టింది. తన పట్టణం లోనూ, దేశంలోనూ ఎవరూ ఏ జీవులనూ చంపకూడదని చాటించింది. దానివల్ల నీకు అభయమతి అనే పేరు పెట్టారు.

ఇలా తను పూర్వభవ వృత్తాంతాలను విని గురుదత్త, అభయమతులకు వైరాగ్యం కలిగింది. శ్రీదత్తుడనే తమ పెద్దకొడుక్కి పట్టం కట్టి, కొద్దిమంది రాజుపుత్రులతో అమృతాస్రవ భట్టారకుని వద్ద దీక్షనుగైకొని తపస్సును చేసారు. అభయమతికి కూడా వారే గురువులయ్యారు. సువ్రతమనే కంతికి కంతిగా అయి

కొద్దికాలం ఉగ్రోగ్ర తపస్సు, వ్రతాలను చేసి, గిడిగిడి జంత్ర, మిళిమిళి నేత్రాలుగా సన్యాసాన్ని గ్రహించి, సమాధి మరణం వల్ల చనిపోయి కాపిష్టమనే ఎనిమిదవ స్వర్గంలో స్వయంప్రభ విమానంలో పధ్నాల్గు సంవత్సరాల ఆయుష్షు కలిగిన అమితకాంత అనే దేవతగా పుట్టింది.

గురుదత్త భట్టారుడు 12 సంవత్సరాలు గురువులు వద్దనే ఉండి ద్వాదశాంగ చతుర్దశ పూర్వ ఆగమాలనన్నింటిని చదివి, తరువాత గురువుల అనుమతితో ఏక విహారియై గ్రామంలో ఒక రాత్రి, నగరంలో ఐదు రాత్రులు, అడవిలో పదిరాత్రులు గ్రామ, నగర, ఖేడ, ఖర్వడ, మడంబ, పట్టణ, ద్రోణాముఖాలలో సంచారం చేస్తూ సురాష్ట్రానికి వచ్చి, అక్కడ, ద్రోణిమంతమనే పర్వతం దగ్గర హాళముఖుడు వసిస్తున్న పల్లిఖేడ గ్రామానికి వస్తున్నాడు. అంతలో సూర్యుడస్తమించాడు. సన్యాసులు సూర్యాస్తమయం అయినపుడు ఎక్కడ ఉంటారో అక్కడే బస చేయాలి, కాబట్టి ఆ ఊరు యొక్క బయట భాగంలోని పొలంలో దారికి ఎదురుగా గురుదత్త భట్టారకుడు ప్రతిమాయోగంలో నిల్చున్నాడు. అక్కడ రాత్రి నాల్గు జాములూ భోరని వాన కురిసింది. నేలంతా బురదగా అయింది. తెల్లారాకా కూడా దారి జీవజంతువు లతో కూడి ఉండటంవల్ల నడక సాగదని భావించి క్రిందకు దించిన చేతుల్ని మళ్ళీ పైకి ఎత్తక, ఆ ఎండలో ప్రతిమవలె నుంచున్నాడు.

ఆ వేళకు హాళముఖుడనే బ్రాహ్మణుడు పొలాన్ని దున్నుకోవాలని అక్కడకు వచ్చాడు. ఆ పొలం బురదగా ఉండడం చూచి చదును కాలేదని ఆ కొండ యొక్క పశ్చిమంలో ఉన్న ఇంకొక పొలానికి వెళ్తూ దారిలో ప్రతిమా యోగంలో నుల్చున్న గురుదత్త భట్టారుణ్ణి చూచాడు. ''అయ్యా, నా భార్య నాకు భోజనం తెస్తుంది. ఆమె ఇక్కడకు వస్తే, నేను పశ్చిమంలో ఉన్న పొలానికి వెళ్ళాను అని చెప్పి అక్కడకు పంపించండి'' అని వారితో చెప్పి వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం అయింది. హాళముఖుని భార్య భోజనం తెచ్చింది. అక్కడ ఎక్కడా తన భర్తను కానక, అక్కడున్న భట్టారకుని చూచి ''అయ్యా ఈ పొలాన్ని దున్న వచ్చిన నాభర్త ఎక్కడా కనుపించటం లేదు. ఎక్కడికి వెళ్ళాడు?'' అని అడిగింది. మౌనవ్రతాన్ని ధరించడం వల్ల భట్టారకుడు ఉత్తరమీయలేదు. కొద్దిసేపు ఎదురు చూచి ఆమె ఇంటికి తిరిగి వెళ్ళింది. హాళముఖుడేమో పొలాన్ని సాగు చేసి ఎంత సేపైనా భార్య రానందువల్ల ఆకలితో, బడలి, చెమటలు పట్టి విసుగు చెంది

ఇంటికి వచ్చాడు. భార్యతో ''ఒసేయ్ నువ్వు పొలానికి భోజనం ఎందుకు తేలేదు? అని గద్దించి ఆమెను ఆకుకూరకాడలా కొట్టసాగాడు. అప్పుడామె ''ఎందుకు నన్నిలా ఊరికెనే కొడుతున్నారు? నేను భోజనాన్ని తెచ్చాను. పొలంలో వెతికి చూసాను. ఇంటికి వెనక్కి తీసుకొచ్చాను.''

''ఎందుకు అక్కడున్న సన్యాసిని అడగలేదా? నువ్వు భోజనం తెస్తే అక్కడనుంచి పశ్చిమంలో ఉన్న పొలానికి తెమ్మని చెప్పమని ఆతనికి చెప్పాను.''

''నేను ఎన్నిసార్లు అడిగినా అతడు మాట్లాడనే లేదు''. ''అలాగైతే నీదేమీ తప్పులేదు అని భార్యపైన కోపాన్ని విడిచి ఋషిపైన కోపం ఉప్పొంగి, జన్మాంతర సంబంధమైన వైరం కూడా చేరగా ''నన్ను ఆకలితో కాల్చినవాణ్ణి, నిప్పుల్లో కాల్చందే నేను భోంచేయను అని ప్రతిజ్ఞ చేసాడు. గడ్డితో చేసిన తాడును పేని దాన్నీ, నూనే కుండనూ, నిప్పునూ తీసుకుని పొలానికి వెళ్ళాడు. గురుదత్త భట్టారుని ముందు వానిని ఉంచి ''ఒరేయ్ శ్రవణకా, నువ్వు నన్ను ఆకలితో మాడ్చావు. అలాగే నిన్ను నిప్పుతో కాలుస్తాను. నిన్ను ఎవరు కాపాడుతారో చూస్తాను అన్నాడు. గురుదత్త భట్టారకుడు ఇతనిదేమీ తప్పులేదు. నేను మునుపు చేసిన కర్మయొక్క ఫలం ఇపుడు ఉదయిస్తోంది. నన్ను అది కాలుస్తోందే కాని ఇతడు కాదు. ''నేను సర్వజీవుల్నీ క్షమించాను. సర్వజీవులూ నన్ను క్షమించనీ, సర్వభూతాల పట్లా నాకు మైత్రి ఉంది. వైరం లేదు అని భావించాడు. వాడు తనకు మిత్రుడని తలచాడు. అంతలో హాళముఖుడు గడ్డితో చేసిన పగ్గాన్నీ నూనెలో తడిపి కాలిగోరు దగ్గరనుంచి నెత్తివరకూ చుట్టి, నిప్పును అంతటా ముట్టించి, నూనెను చల్లాడు. మంట ఏక జ్వాలలాగ చుట్టుకుంది. కాని మంట అతని శరీరాన్ని తాకలేదు. ఆజ్ఞావిచయము, అపాక విచయము, విపాట విచయము, సంస్థాన విచయము అను నాల్గు ధర్మ ధ్యానాలనూ ధ్యానిస్తూ, తరువాత పృథక్త్వ వితర్క విచారమనే ప్రథమ శుక్ల ధ్యానాన్ని ధ్యానించాడు. అటుపైన రెండవ శుక్ల ధ్యానాన్ని ధ్యానించినపుడు సప్తధాతువులు నశించాయి. జ్ఞానవరణీయాలైదు, దర్శనావణీయాలు తొమ్మిది ఇలా ఘాతికర్మలు క్షయించాయి. అనంతజ్ఞాన, అనంత దర్శనాలు లభించాయి. 28 రకాలైన మోహనీయమనే కర్మను తొలగించి సుఖి అయ్యాడు. ఐదువిధాల అంతరాయ మనే కర్మను భంగం చేసి అనంతవీర్యుడై ఇలా అనంత చతుష్టయాలను సాధించి కైవల్యాన్ని పొందాడు.

అప్పుడు ఇంద్రుడి అనుమతితో కుబేరుడు నేలపైన ఐదువేల ధనుస్సుల ఎత్తులో అంతరిక్షంలో ఒక యోజన విస్తీర్ణంతో ఏకశిలగా ఉన్న ఇంద్రనీల రత్నఖచితమైన నేలపైన, ఏకయోజన విస్తీర్ణమైన రత్నఖచితమైన శ్రీ మంటపాన్ని నిర్మించాడు. నాల్గుదిక్కులూ బంగారపు మెట్లు వాటిపైన సింహాసనం దానిపైన బంగారు తామర. దాన్ని ముట్టిన నాల్గు వేళ్ళంత ఎత్తున్న పద్మాసనంలో కూర్చుని, వెండి గొడుగుతో, దేవతలు ముప్పైరెండు వీవెనలు వీస్తూ ఉండగా గురుదత్త కైవల్యుడు శోభించాడు. ఈ గుర్తులవల్ల దేవతలు అతడున్న నెలవును తెలుసుకుని తమతమ పరివారాలతో వచ్చి దివ్యమైన, గంధ, పుష్ప, దీప, అక్షతలతో అర్చించి, వందనం చేసి, ఆ అందరు దేవ, దేవీ సమూహాలు చాతుర్వర్ణ జనసముదాయము, మృగ-సంకుల సమస్తమూ అక్కడ చుట్టుకొని నిలిచి, భట్టారకుని ధర్మోపదేశాన్ని విన్నారు. హాళముఖుడు కూడా ధర్మాన్ని ఆలకించాడు. తరువాత నమస్కరించి ''భట్టారా, నీకు నేను చెడును కలిగించాను. దయచేసి క్షమించండి అని వేడుకున్నాడు. భట్టారకుడు అతనిదేమీ తప్పులేదు అని తనది అతనిది పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరించాడు. ''ఈ దోషం ఇలా కాకపోతే పోదు. దయచేసి నాకు దీక్షనివ్వు - అని హాళముఖుడు వేడుకున్నాడు. అతడి శిష్యుడై తపస్సు చేసి ఆగమాలను నేర్చుకున్నాడు. గురుదత్తకైవల్యుడు గ్రామ, నగర, ఖేడ, ఖర్వడాలను సంచరిస్తూ భవ్యజనులకు ధర్మోపదేశాన్ని చేస్తూ గ్రామ ఖేడ్డానికి వచ్చారు. అక్కడ యోగ నిరోధంలో ఉండి ఆయుర్నామం, గోత్రం, వేదనీయం అనే నాల్గు అఘాతికర్మలను ఒకేసారి అణచి మోక్షస్థానంలో వెలసి, పుట్టుక, ముప్పు చావు, ఆకలి, దాహం మొదలైన ఏ బాధలూ లేని అనంత జ్ఞానం, అనంత దర్శనం, అనంత సుఖం, అనంత వీర్యాలతో కూడి సదాకాలం సుఖిగా ఉండిపోయాడు.

హాళముఖ ఋషి ఏకవిహారుడై గ్రామాలలో నగరాలలో సంచరిస్తూ కొంకణదేశానికి వస్తూ ఒకచోట పొలంలో వెళ్తూ ఉన్నప్పుడు సూర్యుడస్త మించగా, అక్కడే కుమ్మరి వ్యవసాయంకోసం నరికి రాశి వేసిన కట్టెలపైన దేవుని ధ్యానం చేస్తూ రాత్రి కూర్చున్నాడు. తుంగభద్రుడనే అడవులను నరికేవాడు ఆసమయంలో వచ్చి నిద్రకళ్ళతో, ఆ కారు చీకటిలో ఇంధన రాశి మంటపెట్టి వెళ్ళిపోయాడు. ఆ మంటలో కాలుతూ హాళముఖ ఋషి ధర్మధ్యానాలను

ధ్యానిస్తూ, శుభపరిణామంతో చనిపోయి పదహారవ అచ్యుత కల్పంలో ఇరవై రెండు సాగర సంవత్సరాలు ఆయుష్షు కలిగిన అచ్యుతేంద్రుడిగా పుట్టాడు.

ఇక్కడ తుంగభద్రుడు పొద్దు పొడవగానే వచ్చి చూసి నిష్కారణంగా తాను ఋషిని కాల్చినందుకు చాలా దుఃఖించాడు. ''పంచ మహాపాతకుణ్ణి నేను, తెలియకుండా ఋషిని చంపేశాను కదా'' అని తనను తానే నిందించుకుని, అదే మంటల్లో దూకి తాను కూడా కాలి చచ్చిపోయాడు. అక్కడే వ్యంతర దేవుడిగా పుట్టి ఆయుష్యాంతంలో వింధ్యాటవిలో ఒక భయంకరమైన పెద్ద తెల్ల ఏనుగుగా పుట్టాడు. దారిలో వచ్చిపోయే జనులందర్ని ఇట్టే చంపుతుండేది ఆ ఏనుగు. హాళముఖుడుగా ఉండిన అచ్యుతేంద్రుడు అవధి జ్ఞానంతో దాన్ని తెలుసుకుని వచ్చి, ఆ ఏనుగుకు ధర్మోపదేశాన్ని చేసి వెళ్ళాడు. ఏనుగు జీవులను చంపడం ఆపేసింది. మధు, మధ్య, మాంసాలను వదిలేసింది. ఆరు, ఎనిమిది, పది, పన్నెండు వ్రతాలను స్వీకరించింది. వ్రతం ముగిసి పారణం చేయాల్సిన రోజు జీవులులేని ఎండుటాకుల్ని మేసి, ఏనుగుల గుంపు మేసి వెళ్ళిన తరువాత అవి కలచిన నీరునే త్రాగి, ఇలాగే కొద్దికాలం సంయమము అనే వ్రతాన్ని ఆచరిస్తూ ఉంది. ఒకరోజు అరణ్యంలో దావాగ్ని చెలరేగింది. ఆ మంటకు బెదిరి ఒక పెద్ద మఱ్ఱిచెట్టు క్రింద ఏనుగు గుంపుతో నిల్చుని ఉంది. ఆ చెట్టుకున్న ఎండుకొమ్మలకు తగిలిన మంట తనను కాలుస్తూ ఉంటే అక్కడ ఒక కుందేలు మంటల్లో కాలి నిప్పులా ఎఱ్ఱగా దొర్లుతూ వచ్చి తన కాలిదగ్గర పడితే, దయతో అయ్యో పాపం! అని కరుణను చూపిస్తుండగనే చనిపోయి పన్నెండవ సహస్రార కల్పంతో పద్మగుల్మ విమానంలో పద్దెనిమిది సాగర సంవత్సరాలు ఆయుష్షు కలిగిన సామానికి దేవుడిగా పుట్టింది. దేవుడు కొద్దికాలం దేవలోకం యొక్కసుఖాన్ని అనుభవించి ఆయుష్యాంతంలో అక్కడనుంచి వచ్చి భరతక్షేత్రంలోని మగధ దేశంలో రాజగృహం యొక్క రాజు శ్రేణికుని ఎనిమిది మంది రాణుల్లో ధనశ్రీ అనే ఆవిడ గర్భంలో వెలసాడు.

ధనశ్రీకి విచిత్రమైన కోర్కె పుట్టింది. వర్షాకాలంలో ఏనుగునెక్కి సైన్య సమేతంగా అడవికి వెళ్ళి మఱ్ఱిచెట్టు పళ్ళను కొయ్యాలనే కోరిక కలిగింది. బైగు, సంజె, మనోహరి అనే జాములో తెల్లని అడవి ఏనుగును ఆమె కలలో చూచింది. తన కోరికనూ, కలనీ రాజుకి చెప్పగా, కాలంకాని కాలంలో

వర్షాకాలాన్ని ఎలా తీసుకురావాలి, భార్య కోర్కెను ఎలా తీర్చాలి అని చింతిస్తూ తన కొడుకు అభయ కుమారుణ్ణి పిలిచి ''ఏం చేద్దాం'' అని అడిగాడు. అభయ కుమారుడు ''దీనికొక ఉపాయాన్ని నిశ్చయిద్దాం'' మీరు నిశ్చింతగా ఉండండి అని రాజును సమాధాన పరచి వెళ్ళాడు.

ఇక్కడ విజయార్థ పర్వతం దక్షిణశ్రేణిలో గగన తిలకమనే పట్టణం. దానిని మనోగతి అనే విద్యాధరుడు పరిపాలిస్తూ ఉండేవాడు. వాని భార్య కనకమాల. వారి కుమార్తె కనకచిత్ర. ఒకరోజు ఆమె దట్టమైన అడవికి వెళ్ళి విద్యను సాధిస్తున్నప్పుడు, చింతాగతి అనే విద్యాధరుడు ఆమె రూప, లావణ్య, సౌభాగ్య, కాంతులను చూచి ఆశపడి, నువ్వు నా భార్యవు కమ్మని చేయి పట్టుకొని వేధిస్తూ ఉండగా, ఆమె తండ్రి, కుమార్తె చాలా సేపయినా రాలేదని చూచి రమ్మని అవలోకినీ విద్యను పంపించాడు. కూతుర్ని చింతాగతి విద్యాధరుడు వేధిస్తున్నాడు అన్న విషయాన్ని ఆ విద్యవల్ల తెలుసుకుని కుపితుడై మనోగతి మొదలైన విద్యాధరులందరితో కలసి వెళ్ళి చింతాగతి విద్యల నన్నింటినీ నాశనం చేసి ''పన్నెండు సంవత్సరాల వరకు భూమి గోచరుడై ఉండమని శాపాన్నిచ్చేసాడు. వాడు దానిని పూర్తి చేయడానికి రాజగృహానికి వచ్చి అంతఃపుర దాసి కామలత అనే దానితో జీవిస్తూ దాని ఇంట్లో పన్నెండు సంవత్సరాలు గడిపాడు. ఆ అవధి పూర్తయిన వెంటనే విద్యాధర శ్రేణికి తిరిగి వెళ్ళడానికి విద్యలను సాధించాలని ఒక రాత్రి శ్మశానంలో సాధన చేస్తున్నాడు. అదే సమయానికి అభయ కుమారుడు తన తండ్రి మాట జరిగే ఉపాయాన్ని గురించి ఆలోచిస్తూ ఒరలో ఉన్న కత్తితో తిరుగాడుతూ శ్మశానానికి వచ్చాడు. పైకి ఎగురుతూ, కిందకి పడుతూ విధవిధాలుగా సాధన చేస్తున్న చింతాగతిని చూసి ''నువ్వు ఎవరివి; ఎక్కడుంటావు, ఇలా ఎందుకని ఎగురుతూ, పడుతూ ఉన్నావు? అని అడిగాడు. దానికి చింతాగతి తన వృత్తాంతాన్నంతా చెప్పాడు. ''ఇప్పుడు నువ్వేమి చేస్తున్నావు''? అన్నాడు అభయకుమారుడు. ''మంత్రాలను ఉచ్చరిస్తూ, ఎగురుతూ విద్యలను సాధిస్తున్నాను. కాని ఎందుకో ఏమో విద్య సాధ్యం కావటం లేదు. దానివల్లనే క్రింద పడిపోతున్నాను.

''అదేం మంత్రం, చెప్పు చూద్దాం?'' అభయకుమారుడు అడిగాడు. చింతగతి మంత్రాలను చెప్పాడు. అభయకుమారుడు వ్యాకరణంలో కుశల

ప్రస్తారాన్ని వేసి చూస్తే, అతడు చెప్పే మంత్రాల్లో కొన్నిచోట్ల అక్షరాల కొరత ఉంది. మరికొన్నచోట్ల అవి హెచ్చయ్యాయి. ఇది తెలుసుకున్న మీదట హెచ్చైన అక్షరాలు తీసి, తక్కువైన చోట ఉచితంగా చేర్చి మంత్రాన్ని సరిచేసి ''ఇప్పుడు చెప్పు చూద్దాం'' అని చింతాగతికి నేర్పించాడు. ఆ రీతి చెప్పిన వెంటనే విద్యలు అతడి వశం అయ్యాయి. చింతాగతికి చాల సంతోషం కలిగింది. ''అయ్యా నువ్వు నాకు ఉపకారాన్ని చేసావు నా పరమ మిత్రుడివి నువ్వు. నువ్వు చెప్పింది చేస్తాను. ఏమైన చెప్పు' అని అభయకుమారుడికి చెప్పాడు. అప్పుడతడు ''నా తల్లి ఆశను నెరవేర్చు, అంతేచాలు' అని అన్నాడు.

సూర్యోదయం అయిన తక్షణమే చింతాగతి తన విద్యాబలంతో ఎండాకాలాన్నే వర్షాకాలంగా మార్చి రాణిని తెల్ల ఏనుగుమీద కూర్చోబెట్టి, పరివార సేనా సమేతంగా, సుగంధ పుష్పాలను కురిపిస్తూ అనేక విధాలైన కాహళాలు, మద్దెలలు మొదలైన వాద్యాల రభసతో వింధ్యాటవికి తీసికొని వెళ్ళాడు. మహారాణి చాలా సంతోషంతో అడవిలో ఏనుగునెక్కి తిరిగి, మఱ్ఱిచెట్టు పళ్ళను వెతికి వెతికి కోసి తన ఒడిని నింపుకుని తృప్తి పొందింది. తరువాత తిరిగి ఆమెను పట్టణానికి పిలుచుకొచ్చి అంతఃపురంలో సుఖంగా ఉంచి, చింతాగతి అభయకుమారుడితో నే నింక వెళ్తాను. నీ కెపుడైనా అవసరం వస్తే నన్ను తలుచుకో' అని చెప్పి అతణ్ణి వీడ్కొని కామలతకు కూడా చెప్పి తన విద్యాధర లోకానికి వెళ్ళాడు.

ధనశ్రీ మహాదేవికి తొమ్మిదినెలలు నిండాయి. పుట్టిన కొడుక్కి గజ కుమారుడని పేరు పెట్టారు. సుఖంగా కాలం దొర్లింది. ఒకసారి రాజగృహం యొక్క నైఋతి దిశలో విపులగిరి అనే పర్వతంపైన వర్ధమాన భట్టారుని సవన శరణం వచ్చింది. ఋషి నివేదకుడు దాన్ని చూచి, వెళ్ళి శ్రేణిక మహారాజుకు వార్తను తెలిపాడు. వెంటనే రాజు సింహాసనం దిగి, ఆ దిక్కుగా ఏడడుగులు నడచి, సాష్టాంగ నమస్కారం చేసి, వార్తనందించిన వాడికి కావలసినంత కానుకల నిచ్చి, ఆనందభేరిని మోగించి, పుత్ర, పౌత్ర, కళత్ర, మిత్ర పరివారంగా అక్కడకు వెళ్ళాడు. స్ఫటికమయమైన మెట్లను ఎక్కి సమవశరణాన్ని ప్రవేశించి, గంధకూటాన్ని మూడుసార్లు ప్రదక్షిణం చేసి, స్తుతి శత సహస్రాలతో ప్రార్థనను చేసి, గంధ, పుష్ప, ధూప, దీపాలతో అర్చించి, ఎల్ల ఋషి సముదాయాన్నీ వరుసగా వందించి తన స్థానంలో కూర్చుని ధర్మశ్రవణాన్ని

ఆలించాడు. తరువాత గజకుమారుడు తన పూర్వజన్మల విషయాన్ని గూర్చి అడుగగా గణధర దేవుడు ఈ విధంగా వివరించాడు.

ఈ జన్మనుంచి వెనుక ఐదవ జన్మలో నువ్వు కొంకణదేశంలో అడవి నరికేవాడిగా ఉండేవాడవు. తెలియక కట్టెలను కాల్చి ఆ తరువాత ఆ మంటకు చిక్కి చచ్చిపోయిన ఋషిని చూచి పశ్చాత్తాపంతో అదే మంటల్లో పడి చచ్చావు. వ్యంతర దేవుడై తరువాత వింధ్యాడవిలో తెల్ల ఏనుగులా పుట్టావు. అచ్యుతేంద్రుడు ఉపదేశించక సమ్యక్త పూర్వకంగా శ్రావక వ్రతాలను గైకొని ఆయుష్యాంతంలో పద్దెనిమిది సాగర వర్షాలు ఆయుష్షు కలిగిన దేవునిగా సహస్రార కల్పంలో పుట్టావు. అక్కడనుంచి వచ్చి ఇప్పుడు గజకుమారుడి వయ్యావు. ''తన భవాల వృత్తాంతాన్ని విన్న గజకుమారుడికి అప్పుడే వైరాగ్యం జనించింది. వర్ధమాన భట్టారకుడికి నమస్కరించి ఇప్పుడే దీక్షనివ్వండి అని వేడుకున్నాడు. తపస్సుకై నిలచి, ఆగమాలనన్నింటినీ నేర్చాడు. అనంతరం గజకుమార ఋషి ఏక విహారిగా గ్రామ, నగర, ఖేడ, ఖర్వడ, మడంబ, పట్టణ, ద్రోణాముఖాలలో సంచరిస్తూ, కళింగ దేశానికి వచ్చి అక్కడ దంతపురమనే పట్టణం పశ్చిమంలో ఉన్న కొండమీద రాయిలో ప్రతిమాయోగంలో నిల్చున్నాడు.

ఆ పట్టణాన్ని పాలించేవాడు నరసింహుడనే రాజు. అతని భార్య వసుమతి. కొడుకు నరపాలుడు. మంత్రి బుద్ధదాసు. రాజు రాజభవనం పై మేడమీద కూర్చున్నప్పుడు దూరంలో, కొండమీద తపస్సు చేస్తూ నించున్న గజకుమార ఋషిని చూచాడు. ''ఎందుకు, ఈ వేడిలో, ఈ తపస్వి ఎండకు కాస్తున్నాడు'' అన్న రాజుకు, కుటిలుడైన మంత్రి బుద్ధదాసు ''మహారాజ, ఆ తపస్వికి మహావాతం పట్టుకుంది. అందుకని అలా నించున్నాడు అన్నాడు.

''అలాగైతే దానికి పరిహారం ఏమిటి?''

''అతడు నుంచున్న రాయిని వేడి చేయాలి''

''సరి, అలాగైతే, నువ్వే అక్కడికి వెళ్ళి, ఆ రాయిని వేడిచేయి''

రాజు మాటప్రకారం బుద్ధిదాసు కొండకి వెళ్ళాడు. ఆ రాతిబండను నిప్పులా ఎఱ్ఱగా వేడిచేసి వెనక్కొచ్చాడు. ఇక్కడ ఋషి భిక్ష కోసం వెళ్తూ ఉండగా దేవత

చూచి ''నీకు ఆయుష్షు లేదు. భిక్షకోసం ఎందుకని వెళ్తావు అన్నది. భట్టారకుడు వెనక్కి తిరిగొచ్చేసాడు. వచ్చి చూస్తాడు కదా. తాను నిల్చున్న రాయి నిప్పులా ఎఱ్ఱగా కాలుతోంది. తనకింతే ఆయుష్షు అని ఎరిగిన ఋషి కూడా, చతుర్విధ ఆహారాలు, శరీర నివృత్తి చేసి, ఆచార్య భక్తిని స్వీకరించి, ఎఱ్ఱగా కాలుతున్న ఆ రాయిమీదకెక్కి నిల్చున్నాడు. బాహ్యాభ్యంతర పరిగ్రహాలను వదలి, సమత్వేభావనను భావించి, ఆ నిప్పుల బాధను సహించి నాల్గు విధాలైన ధర్మధ్యాన, శుక్లధ్యానాలను ధ్యానించి, ఎనిమిది కర్మలను తొలగించుకొని మోక్షానికి వెళ్ళాడు.

అప్పుడూ దేవతలందరూ అపారమైన భక్తితో వచ్చి దివ్యగంధ, పుష్ప, ధూప, దీప అక్షతలతో అర్చించి అతనికి నమస్కరించారు. బుద్ధదాసుణ్ణి గద్దించి అడగ్గా, వాడు బయపడి, తెలియక మహాపాతకాన్ని చేసాను. ఈ ఒక్కసారికి క్షమించండి'' అని వేడుకున్నాడు. వాళ్ళు క్షమించి దేవలోకానికి వెళ్ళారు. బుద్ధదాసుడికి జ్ఞానోదయం అయింది. దీన్ని ధర్మంయొక్క మహిమ, తపస్సుయొక్క మహిమ అని తెలుసుకుని, సమ్యక్త పూర్వకంగా శ్రావక వ్రతాలను స్వీకరించాడు. నరసింహ రాజు కూడాఋషివధకు కారకుడనయ్యా ననే పశ్చాత్తాపంతో తన కొడుకు నరపాలుడికి పట్టం కట్టి, సుధర్ముడనే ఆచార్యుని వద్ద దీక్షను గ్రహించి తపస్సుకు నిలచాడు. కొద్దికాలం ఉగ్రోగ్ర తపస్సు చేసి సమాధి మరణంతో చచ్చి రత్నత్రయాలను సాధించి సర్వార్థ సిద్ధిలో ముప్పై మూడు సాగర సంవత్సరాలు ఆయుష్షు కలిగిన అహమింద్ర దేవునిగా పుట్టాడు. ఈ కథలన్నీ గురుదత్త భట్టారుని కథకు చేరినవి*

సన్యాసం స్వీకరించి భవ్యులూ, ఇతరులూ, గురుదత్త భట్టారునీ, హాళముఖ ఋషినీ, గజకుమార భట్టారునీ మనస్సులో ధ్యానించి, ఆకలి, దాహం మొదలైన ఇరవైరెండు పరిషలనూ జయించి సమాధి మరణంతో పరిశుద్ధ, సహజ దర్శన, జ్ఞాన, చరిత్రలను సాధించి స్వర్గాపవర్గ సుఖాలను పొందుదురు గాక.

---

*ఈ కథయొక్క సంవిధానం, పాత్రల వికాసం ఇవి చాలా సంకీర్ణంగా ఉండడం వల్ల పాఠకులకు స్పష్టం చేయడం కోసమో అన్నట్లుగా ఈ మాటను కృతికర్త చెప్పి ఉండవచ్చు? వడ్డారాధనలోని వేరే యే కథలోనూ ఈ రీతి ఉల్లేఖనం లేకపోవడం గమనార్హం.*

# 15. చిలాత పుత్రుని కథ

గాయాలను కండచీమలు ముసిరి కుట్టి పీడిస్తున్నప్పుడు ఆ అసాధ్యమైన వేదనని శాంతంగా సహించి చిలాత పుత్రముని సద్గతిని సాధించాడు.

ఈ జంబూ ద్వీపంలోని భరతక్షేత్రంలో మగధ అనే దేశం ఉంది. అక్కడ రాజగృహమనే పట్టణం. దానిని ఉపశ్రేణికుడు అనేరాజు పరిపాలించాడు. అతనికి జయావతి మహాదేవి మొదలైన మూడువేల మంది భార్యలు. వాళ్ళందరూ ఇష్ట విషయ భోగాలనూ అనుభవిస్తూ సుఖంగా ఉండేవారు.

ఒకరోజు ఉపశ్రేణికుడు వేటాడడానికై వెళ్ళాడు. అతడు అడవిలో ఒక దుష్టాశ్వాన్నెక్కి పందిని వెంబడిస్తూ, వెళ్తూ ఉండగా ఆ గుఱ్ఱం దిక్కుతోచక పరుగెడుతూ వింధ్యాటవి నట్ట నడుమ సురన్య అనేటటువంటి కోయవాడ దగ్గర గల వాగు గట్టుమీద ఆయాసపడి నిలిచింది. రాజు గుఱ్ఱాన్ని దిగి, దాని కళ్ళాన్ని, జీనును విదలించి దానికి నీరు తాగించి శరీరాన్ని కడిగి గుఱ్ఱాన్ని ఒక చోట కట్టి, తానుకూడా నీరును తాగి ఒక చెట్టుకింద కంబళిని పరచుకొని అలాగే నిద్రపోయాడు.

ఆ కోయలకు దొర మహాకాళుడు. వాడు రాజకులానికి చెందిన వాడైనప్పటికి దాయాదులచే ఓడింపబడి అడవి మధ్యలో ఒక పట్టణాన్ని కట్టుకొని కొంతకాలంగా దానిని పాలించుతూ ఉన్నాడు. వాడి భార్య సౌందరి. వాళ్ళ కూతురు గుణసౌందరి. ఆమె అత్యంతమైన రూప లావణ్య సౌభాగ్య, హావభావ, విలాస విభ్రమమూలు కలిగినది. ఆమె అక్కడ అనేక కన్యలతోనూ రక్షకులతోనూ కూడి. వనక్రీడలాడడానికి వచ్చింది. అక్కడ చెట్టుక్రింద నిద్రపోతున్న రాజు ఉపశ్రేణికుణ్ణి చూచి మోహించింది. రాజు కూడా ఆ కన్య సౌందర్యానికి మనసుపడి మోహపరవశుడై ఆమెను వెంబడించి పరుగెత్తాడు. దీనిని చూచిన కోయవాళ్ళు గుణసౌందరిని మందలించి ఆమెనక్కడనుంచి పిలుచుకొని పోయారు. ఇలా తన వారివెంట వెళ్తూ ఆమె ''నీవు తప్ప నాకు వేరే పురుషుడెవరూ తగినవాడు కాదు'' అని ఒక పత్రాన్ని రాసి కింద పడేసి వెళ్ళింది. ఉపశ్రేణికుడు దానిని చూచి చదివి సంతోషించాడు. ఆ వేళకి అతని అడుగు జాడలను చూచుకుంటూ, అతని సేనా పరివారమంతా తండోపతండాలుగా

అక్కడకు వచ్చి చేరింది. అందరూ ఒకేసారి కాహళాన్ని, శంఖాన్నీ, డప్పులనూ ఊదేటప్పటికి ఆ ధ్వనికి కోయలదొర మహాకాళుడు ఎవరో తనపైకి దాడి చేయడానికి వచ్చారని బెదరి అక్కడనుంచి పారిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు. దానిని చూచి ఉపశ్రేణికుడు తన భటులను పంపి కోయదొరను పారిపోవద్దని చెప్పి సమాధాన పరచాడు. అప్పుడు మహాకాళుడు ఏనుగు దంతాలను ముత్యాలనూ, పులి చర్మాలనూ, తోళ్ళనూ రాజుకు కానుకగా తెచ్చి ఇచ్చి కుశల మడిగాడు. కోయదొర రాజకులానికి చెందినవాడేనని తెలిసి రాజు సంతోషించాడు. కోయదొర మహారాజుకు గొప్ప విందును ఏర్పాటు చేశాడు. మహారాజు కోయదొర కూతుర్ని కానుకగా అడిగి ఒక ప్రశస్తమైన రోజు, మంచి వారము, నక్షత్రాన్ని కలిగిన ముహూర్తంలో ఆమెను వివాహమాడి, ఆమెను తీసుకొని తన నగరానికి మరలి వెళ్ళాడు. తరువాత ఆమెకు చిలాత మహాదేవి అని పేరును పెట్టి ఆమెతో సుఖంగా ఉన్నాడు. ఇలాగే కాలం దొర్లిపోయింది.

అదే దేశంలో ధనికుడైన ఒక వైశ్యుడు నందిమిత్రుడనే వాడుండేవాడు. వాడు చాలా ధనాన్ని తీసికొని వ్యాపారానికై వెళ్తూ మధ్య ఒక ఊరిలో బస చేసాడు. అప్పుడు తపోవరుడు అనే ఋషి ఒంటరిగా సంచారానికై బయలుదేరి అనేక గ్రామాలనూ, నగరాలనూ, ఖేడాలను, ఖర్వడాలనూ, మడంబ, పట్టణ, ద్రోణాముఖాలనూ చూచి అదే ఊరికి వచ్చి పంథాతిచార నియమంలో ఉన్నాడు. పగలు భిక్షకోసం ఊళ్ళో తిరిగి, తననెవ్వరూ అడ్డుపెట్టకుండా ఊరినుంచి వెళ్ళిపోతూ ఉండగా అతణ్ణి నందిమిత్రుడు చూచాడు. ఆ మునిని భిక్షకోసం నిలిపి ఆయనకు రుచికరమైన నువ్వుల ఉండలను తినడానికై ఇచ్చాడు. వాటిని తిని, మంచినీళ్ళను తాగిన తపోధనుడు నందిమిత్రుణ్ణి దీవించి వెళ్ళిపోయాడు. నందిమిత్రుడు కొంతకాలం బతికి, తన ఆయుష్యాంతంలో, జంబూద్వీపంలోని హైమవతం అనేటటువంటి భోగభూమిలో ఒక పళితకాలం ఆయుష్షు కలిగిన భోగ భూమిజునిలా పుట్టాడు. అక్కడ, మద్య, వాద్య, ఆభరణ దీప, గృహ, భోజన, పాత్రలతోనూ, ప్రకాశ మానమైన వస్త్రాలు పూలహారాలు, వీనిని ఇచ్చేటటువంటి వృక్షాలు, భోగవస్తువులన్నీ సమకూడగా కొంతకాలం సుఖించాడు. ఆయుష్యాంతంలో మందర పర్వతంయొక్క నందనము అనే అరణ్యంలో వ్యంతర దేవునిగా పుట్టి, అక్కడ నుంచి తిరిగి రాజగృహంలో చిలాత మహాదేవి, ఉపశ్రేణి మహారాజులకు చిలాత పుత్రునిగా

పుట్టాడు. వాడే రాజు యొక్క పెద్దకొడుకు. తరువాత జయావతి అనే పెద్దరాణికి శ్రేణికుడు అనే కొడుకు పుట్టాడు. తక్కిన రాణులకు కూడ పిల్లలు కలిగారు. ఇలా మొత్తం ఐదువందల మంది సంతానంతో ఉపశ్రేణికుడు సుఖంగా ఉన్నాడు.

ఒకరోజు రాజు నైమిత్తికుణ్ణి పిలిచి ''నా పుత్రులలో రాజ్యానికి అర్హులెవరు?'' అని ప్రశ్నించాడు. నీ పుత్రులను ఒక పంక్తిలో కూర్చోబెట్టు. వారికి పాయసం వడ్డించి, వాళ్ళపైకి ఐదువందల కుక్కలను వదిలిపెట్టు, ఎవడైతే బెదరకుండా భోజనం చేస్తుంటాడో వాడే రాజ్యానికి అర్హుడు. రాజభవనంలో తగులబెడితే, ఎవడైతే రాజ్యచిహ్నాలను రక్షించాలని ప్రయత్నిస్తాడో వాడే అర్హుడు'' అని నైమిత్తికుడు జవాబిచ్చాడు.

రాజు అలాగే పరీక్షించదలచి ఒకరోజు తన ఐదువందల మంది పుత్రులను కూర్చోబెట్టి, భోజనంలో పాయసాన్ని వడ్డించి వారిమీదకు కుక్కలను వదిలాడు. శ్రేణికుడు మాత్రం పాయసాన్ని కుక్కలకు కూడా పెట్టి తానుకూడా తిన్నాడు. తక్కినవాళ్ళు పారిపోయారు. ఇంకొకరోజు రాజగృహంలో మంటలు చెలరేగినప్పుడు కూడా అంతే. తక్కిన వాళ్ళందరూ, ఏనుగులు, గుఱ్ఱాలు భండారమూ, ఆయుధాగారాలను రక్షించాలని చూచారు. శ్రేణికుడు మాత్రం రాజు చిహ్నాలను పట్టుకొన్నాడు. రాజు వాడే రాజ్యానికి అర్హుడనీ, వాడక్కడే ఉంటే తక్కినవారు వాడిపై కోపిస్తారని, దానికి అవకాశం ఇవ్వకూడదని ఆలోచించి, శ్రేణికుణ్ణి పిలిచి, నువ్వు నాతోటే భుజించావు, రాజ్య చిహ్నాలను తీసుకొన్నావు. నేను బ్రతికుండగానే రాజు కావాలని ఆశించావు. కాబట్టి ఇక్కడ నీవు ఉండకూడదు. వెళ్ళిపో అని నేరారోపణ చేసి పంపించి వేశాడు.

శ్రేణికుడు దక్షిణ మధురకు వచ్చి అక్కడ ఇంద్రదత్తుడు అనే వైశ్యునికీ శ్రీకాంత అనే ఆతని భార్యకూ కుమార్తెయైన అభయమతి అనేదానిని వివాహం చేసుకొన్నాడు. కొంతకాలం గడిచాక వారికి అభయకుమారుడనే పుత్రుడు కలిగాడు.

ఇక్కడ మారుగమనే పట్టణాన్ని పరిపాలించే ఒడ్డాయనుడు అనే రాజుని ఉపశ్రేణికుడు పిలిచి తనకు విరోధియైన ఉజ్జయిని మహాసామంతుడైన ప్రద్యోతనుణ్ణి చెరపట్టి తెమ్మన్నాడు. ఒడ్డాయనునికీ, ప్రద్యోతనునికీ యుద్ధం

జరిగింది. అందులో ప్రద్యోతనుడే గెలిచి ఒడ్డాయనుణ్ణి చెరలో బంధించాడు. విజయుడనే కుమారుడు ఒడ్డాయనుణ్ణి చెరనుండి విడిపించి రాజగృహానికి కొనిపోయాడు. దీనివల్ల అసంతృప్తి చెందిన ప్రద్యోతనుడు వాళ్ళ దేశాన్ని చుట్టుముట్టి, ఆక్రమించి, నాశనం చేస్తూ వస్తూ ఉండగా ఉపశ్రేణికుడు ''ఎవరైతే ప్రద్యోతనుణ్ణి చెరపడతారో వాళ్ళకు కోరిన ఇష్టాలను చెల్లిస్తాను' అని ఊళ్ళో చాటించాడు. దాన్ని విన్న చిలాతపుత్రుడు రాజు అనుమతితో సైన్యసమేతంగా వెళ్ళి జలక్రీడలాడుతున్న ప్రద్యోతనుణ్ణి పట్టి కట్టి తెచ్చి రాజుకి అప్పగించాడు. ఉపశ్రేణికుడికి చాలా సంతోషం కలిగి. చిలాత పుత్రుణ్ణి చూసి ''నీకేం కావాలో అడుగు ఇస్తాను'' అన్నాడు. వాడు ''నాకు వేరే ఏమీ వద్దు మహారాజా, ఒక్కటి మాత్రం అడుగుతాను. పన్నెండు సంవత్సరాలు నీ అంతఃపురం తప్ప తక్కిన ఊళ్ళో నాకిష్టమైన స్త్రీలందరితో అరమరికలు లేకుండా వ్యవహరించడానికి అనుమతి నివ్వాలి'' అన్నాడు. రాజు ''అలాగే కానీ'' అనవలసి వచ్చింది. చిలాతపుత్రుడు, ఆ ఊళ్ళో సామంత వర్తక, బ్రాహ్మణ స్త్రీ లంగరినీ వాళ్ళని బలవంతంగానో, లొంగదీసుకునో, బలాత్కారించో తన ఇష్టం వచ్చిన వాళ్ళతో సుఖిస్తూ పన్నెండు సంవత్సరాలు గడిపాడు. ఆ అవధిముగిసిన దినమే రాజు వాడిని పిలిచి ''ఇలాంటి గొడ్డాట ఇంక నువ్వాడడానికీ వీలుకాదు'' అని కట్టడి చేసినప్పటికీ, తన అలవాటుని మానక స్వేచ్ఛగా వ్యవహరించసాగాడు. వాడిని రాజు దేశబహిష్కారం కావించాడు. వాడప్పుడు అడవికి వెళ్ళి అక్కడ మహేంద్రుడనే తపసి ఉండేచోట దుర్గమమైన స్థలంలో ఒక ఊరును కట్టుకుని, కోట కొత్తలాల్ని కట్టి చుట్టుపక్కల ఊళ్ళను దోచుకుని తిని సుఖంగా జీవించసాగాడు.

అక్కడ ఉపశ్రేణికుడు వైరాగ్యాన్ని పొంది యమధర భట్టారకుడి దగ్గర ధర్మాన్ని తెలిసికుని, శ్రావకవ్రతాలను స్వీకరించాడు. శ్రేణికుణ్ణి రమ్మని పిలిచి వాడికి రాజ్యపట్టాన్ని కట్టి తాను చిరకాలం తపస్సు చేసి, సమాధి మరణాన్ని పొంది స్వర్గంలో పుట్టాడు. శ్రేణిక మహారాజు రాజ్యాన్ని పరిపాలించసాగాడు.

చిలాత పుత్రుని సేవకుడు భట్టమిత్రుడు. వాడి మేనమామ రుద్ర మిత్రుడు. రుద్రమిత్రుడు తన కుమార్తె సుభద్రను భట్టమిత్రునకీయక మరొకని కిచ్చి పెండ్లి చేయాలనుకున్నాడు. అప్పుడు భట్టమిత్రుడు చిలాత పుత్రుడి దగ్గరకు వెళ్ళి ''నా మేనమామ తన కుమార్తెను చిన్నప్పటినుంచి నాకిచ్చి పెళ్ళి

చేస్తానని ఇపుడు మాటతప్పి వేరే ఎవరికో ఇచ్చి పెళ్ళి చేస్తున్నాడు'' అని ఫిర్యాదు చేసాడు. వాడి ఫిర్యాదును విని, పెళ్ళి జరిగే రోజు చిలాతపుత్రుడు ఐదువందల సుభటులతో వెళ్ళి ఈ కుమార్తెను భట్టమిత్రుని కిచ్చి పెళ్ళి చేయమని మరి మరి చెప్పాడు. కాని రుద్రమిత్రుడు చిలాతపుత్రుని మాటలను పెడచెవిన పెట్టాడు. అప్పుడు చిలాత పుత్రుడు బలవంతంగా ఆమెను ఈడ్చుకొని పోయాడు. రుద్రమిత్రుడు శ్రేణిక మహారాజు వద్దకు పోయి మొరపెట్టాడు. అన్యాయంగా ప్రవర్తించిన చిలాతపుత్రుణ్ణి చంపి ఆ బాలికను పిలుచుకొని రండి'' అని సామంత, మహాసామంతులకు ఆజ్ఞనిచ్చాడు. సామంతులు, మహాసామంతులు, రాజాజ్ఞకు బద్ధులైన వారందరూ వచ్చి చుట్టుముట్టగా, వేరే దారితోచని చిలాతపుత్రుడు, ఆ కన్యను చంపివేసాడు. ఆమె చనిపోయి ఆ పట్టణంలో వ్యంతర దేవతగా పుట్టింది. చిలాతపుత్రుడు సువైభారము అనే పర్వతానికి వెళ్ళి అక్కడ సర్వగుప్తుడు అనే ఆచార్యుడు తన ఐదునూరు శిష్యజనంతో కూర్చుని వుండగా పోయి ''నాకు త్వరగా సంక్షిప్తమైన ధర్మాన్ని చెప్పు'' అని అడిగాడు. ఆ ముని ''నువ్వు దేనినైతే కోరుతున్నావో అది అనంతమైనది. నీవు దేనినైతే కోరుకుంటావో అది అల్పమైనది, పురుషసింహుడా! ఈ సంసార సాగరాన్ని దాటుటకై అపేక్షించు అని ధర్మాన్ని ఉపదేశించి ''నీకు ఇక బహుస్వల్పమైన ఆయుష్షు మాత్రమే ఉంది'' అని చెప్పాడు. ''అయితే నాకిప్పుడే దీక్షనియ్యి అని వేడుకొని చిలాతపుత్రుడు, బాహ్యాభ్యంతర పరిగ్రహాలను త్యజించి తపస్సు చేస్తూ, దోషయుక్తములైన అన్ని యోగాలనుంచి విముక్తుడైనట్లు తలచి ప్రాణం ఉన్నంతవరకూ ఆహార శరీరాలను తపస్సు చేసి కార్యోత్సర్గను కావించాడు.

ఇక్కడ చిలాత పుత్రుని చంపడానికి శ్రేణికుడు పంపిన సైన్యం వచ్చి వాడు తపస్సు చేస్తూ ఉండడాన్ని చూచి రాజాజ్ఞను పొందడానికై చెప్పి పంపారు. రాజపుడు అలాగైతే మంచిదే, వాడు ముందు చేసిన పాపాలు,అపయశము, అపకీర్తులను ఇపుడు దాటినట్లయింది'' అని జవాబు పంపించాడు. చిలాతపుత్రుని చెరపట్టాలని వచ్చిన సైన్యం ఆ ముని దగ్గర చేరి పూజించి, నమస్కరించి వెనుదిరిగారు.

పూర్వజన్మలో సుభద్రయైన వ్యంతరదేవి చిలాతపుత్రుడు మునియైన వృత్తాంతాన్ని విభంగ జ్ఞానం ద్వారా తెలుసికొని పగతో, గద్దరూపాన్ని ధరించి నెత్తిపైన తిరుగుతూ మునియొక్క కన్నులను పీకి తింది. పెద్దతల ఉన్న గండు

చీమలు గరిటను ముసురుకొన్నట్లు ముసిరి ముని దేహాన్నంతా చీరి తిని ఛిద్ర ఛిద్రంగా చేసాయి. రెండురోజులు పగలు, రాత్రి ఈ దేవోపసర్గను సహించి శుభపరిణామంతో చనిపోయి, చిలాతపుత్రముని సర్వార్ధసిద్ధితో ముప్పై మూడు సాగర సంవత్సరాలు ఆయుష్షు వున్న అహమీంద్ర దేవునిగా జన్మించాడు.

ఇతరులైన భవ్యులు చిలాత ఋషిని మనసులో స్మరించుకొని, నాల్గు విధాలైన ఉపసర్గలనూ, ఆకలి, దాహం మొదలైన దుఃఖాలనూ సహించి, పరమశుద్ధ, సహజ, దర్శన జ్ఞాన, చారిత్రలను సాధించి స్వర్గాపవర్గ సుఖములను పొందుదురు గాక!

* * *

# 16. దండక ఋషి కథ

యమునావంకుడనే రాజు వేసిన పదునైన బాణాలు శరీరంలో గుచ్చుకొన్నా కూడా, వేదన చెందకుండా దండక ఋషి శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాల ఆరాధనను సాధించాడు.

జంబూద్వీపపు భరతక్షేత్రంలో అమళకంఠమనే పట్టణముంది. దానిని అవిష్టసేనుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య నందిని. వారికి దండకుడనే కొడుకు. అతను గర్భంలో వుండగా తల్లికి ప్రజలందర్నీ దండించాలనే కోరిక పుట్టింది. అందువల్ల తల్లిదండ్రులు బిడ్డకు దండకుడని పేరు పెట్టారు. అతనికంటే చిన్నదయిన నందవతి అను కూతురును అర్ధచక్రవర్తి అయిన విష్ణువుకి యిచ్చి పెళ్ళిచేశారు. దండకడు విష్ణువుకు మిక్కిలి ప్రీతిపాత్రుడైన సేనాపతి అయ్యాడు. ఈ విధంగా వారందరూ ఇష్ట, విషయ, కామ, భోగాలను అనుభవిస్తూ కొంతకాలం సుఖంగా వున్నారు.

ఒకరోజు విష్ణువు బలదేవునితో పాటు, పుత్ర, కళత్ర పరివారంతో అరిష్టనేమి భట్టారకుని సందర్శన కోసం సమవరణ మంటపానికి పోయాడు. అక్కడ స్ఫటికపు సోపానాలతో శోభిల్లుతున్న గంధకుటీరాన్ని మూడుసార్లు ప్రదక్షిణ చేసి, గంధ, పుష్ప, ధూప, దీపాలతో అర్చన చేసి, గణధర దేవులు మొదలైన ఋషి సముదాయాన్ని వరుసగా నమస్కరించి ధర్మమును అడిగాడు. ఆ తర్వాత విష్ణువు భట్టారకులను, ''భట్టారా, ఈ అతిరౌద్రుడైన దండకుడు నరకాన్ని ప్రవేశించునట్లు విపరీతమైన పాపాలను మూటగట్టుకుంటున్నాడు. ఇతని పాపకర్మలు వుపశమనమయ్యే కాలం ఎప్పుడు సమీపిస్తుంది? మరియు యితని పూర్వ జన్మాంతరం ఏమిటి? దయచేసి చెప్పండి'' అని అడిగాడు. కేవల జ్ఞానియైన అరిష్టనేమి భట్టారకులు ఈ విధంగా చెప్పినారు:

''జంబూద్వీపపు పూర్వ విదేహంలో వీతశోకమను పట్టణము. దానిని పరిపాలిస్తున్నవాడు అశోకుడను రాజు. అతన్ని మహా సామంతుడు సుధామకుడని పిలుస్తారు. అతను తీవ్రలోభి, అతిక్రూరుడై వ్యవసాయ పనులను చేస్తుండేవాడు. తన పొలము, భూములను దున్ను ఎద్దుల నోళ్ళను కట్టివేసేవాడు. వంటచేసే, వడ్డించే స్త్రీల పాలిండ్లను బట్టతో కట్టివేసి, బిడ్డలు

పాలు త్రాగకుండా చేసేవాడు. అతను చస్తున్న హత్యలు, వ్యవసాయంలో చేసే హింస, మొదలైన కారణాల మూలంగా అతను నరకాన్ని అనుభవించాడు. భయంకరమైన శిరోవేదనా, ముఖరోగమూ అతనికి ప్రాప్తించాయి. వేదనను తాళలేక వైద్యులను సంప్రదించాడు. వాళ్ళు మందులు తయారుచేసి యిచ్చారు. అది పూసుకొని, ఇంకేమి అన్నం తినవచ్చు అనుకొంటున్నంతలో, సమాధిగుప్తుడను ముని భిక్షకోసం వచ్చాడు. తనకున్న రోగమే, ఆ ఋషికీ వుండడాన్ని తెలుసుకొని, ఆ ఔషధాలను అతనికి భక్తితో పూసినాడు. ముఖరోగాలు, పన్నెండు సంవత్సరాలుగా వున్న అతని శిరోరోగమూ నయమయి పోయాయి. ఆదానం వల్ల కొంచెం పుణ్యం వచ్చినప్పటికీ, చనిపోయిన తర్వాత సుధామకుడు మూడవ నరకంలో ఏడు సాగర సంవత్సరాలు ఆయుష్షు కలవాడై జన్మించాడు. నరకంలో పగలూ రాత్రి రెప్పలు మూయడానికి కూడా తీరిక లేకుండా శిక్ష తప్ప మరేమీ లేదు. దుఃఖము కట్టలు కట్టుతున్నది. ఆ సహించ సాధ్యంకాని దండనలను, యాతనలను అక్క డ అనుభవించి, ఆ తర్వాత యిక్కడ డండకుడై పుట్టినాడు. పూర్వ జన్మంలో ప్రాణులను దండించిన తన్న పాత అలవాటునే నందిని మహాదేవి గర్భంలో వున్నపుడూ ప్రదర్శించాడు.''

ఈ విధంగా తను అనుభవించిన నరకలోకపు మహాదుఖాల్ని ఆచార్యులవారు తెలుపగా, నరక దుఃఖానికి భయపడి, దండకుడు అక్కడే దీక్షపొంది, తపస్సుకు వుపక్రమించి, అన్ని విద్యలను నేర్చుకొని, ఋషులతో కూడి, గ్రామ, నగర, గిరిదుర్గం, ప్రాకార దుర్గాల గుండా సంచారం చేస్తూ వచ్చాడు. కానీ, భిక్షానికి పోతే ఎవరూ నిల్పి ఆహ్వానిరచడం లేదు. బలవంతంగా ఆపినా, తింటే వాంతి అవుతున్నది. ఇతర ఋషులతో భిక్షానికీ పోతే, యితనికే కాక, మిగిలిన వాళ్ళకూ ఏమీ దొరక్కుండా 'అలాభ' మవుతున్నది. చాలనిదానికి, వాతా, పిత్త, శ్లేష్మ, దగ్గు, శ్వాస, జ్వర, అరుచి, వాంతి, అతిసార, అక్షి, కుక్షి, వేదన, స్ఫోటక, మంట, శూల, భగుందర, కుష్ఠ, క్షయ, శిరోవేదన మొదలైన అనేక వ్యాధులు సోకి, రూపే తెలియకుండా వ్యాధిగ్రస్తులయినప్పటికీ, ఋషులతో పాటు సంచారం చేస్తూ ద్వారావతికి వచ్చారు.

ఒకరోజు విష్ణువు అక్కడకి వచ్చి, ఋషులందరికీ నమస్కరించి, వారిలో దండక ఋషి ఎవరు అని అడగ్గా, వాళ్ళు చూపించారు. విష్ణువు వారికి నమస్కరించి, వ్యాధి ప్రబలత్వాన్ని చూచి, దానికి పరిహారం చేయించాలనే

కోరికతో అతన్ని ఉద్దేశించి, ''భటారా, మిమ్ములను ఒకటి వేడుకొంటాను. ఈ వానాకాలం పూర్తిగా దండక ఋషులు మా యింట్లో దేవునిగదిలో వుండి నా అంతఃపురంలో భిక్షమడుక్కుంటూ గడుపునట్లు అనుగ్రహించాలి'' అని వేడుకొన్నాడు. అతను అలాగే అని విష్ణువు యింటిలో, దేవుడి గదిలో యోగస్థితులై కూర్చొన్నారు. విష్ణువు తన ప్రధాన వైద్యులైన జయుడను వాడిని పిలిపించి, ''మా దండక ఋషి యొక్క ఈ రోగాలను నీకు తెలిసిన రీతిలో పరిహరించు'' అని అడిగాడు. జయుడు దివ్యమైన ఔషధాలతో తయారుచేసిన వుండల్ని పిండిరూపంలో ప్రయోగించి వేయి రాజుల యిండ్లలోని ఆహారాల ద్వారా ఋషి దేహానికి ఔషధం ప్రవేశించునట్లు చేశాడు. వూరిలో వుండల పండుగను చేయించాడు. వర్షాకాలపు నాలుగు మాసాలూ ఈ విధంగా మందును తినిపించి, దండక ఋషుల వ్యాధులను వశంలోకి తెచ్చాడు. ఈ విధంగా చికిత్స చేయించే వుద్యోగంలో నిమగ్నమయి వుండటం వల్ల విష్ణువుకు ''తీర్థకరుడు' అను పేరు వచ్చింది. రోగదూరుడైన దండకుడుఋషుల దేహపు చర్మం పాము పొరలాగు రాలిపోయి, కొత్త చర్మం తేజస్సులో తళతళ మెరవడం చూసి విష్ణువు యితని రోగాలన్నీ పోయాయని తెలిసికొని హర్షచిత్తుడై, అతని ఎదురుగా అక్కడే కూర్చొని వున్న వైద్యుడు జయుడిని పొగిడాడు. అయితే ఋషి ఒక మాట కూడా మాట్లాడకుండా మౌనంగా వుండటంతో జయుడికి అతనిమీద అసమాధానమయ్యింది. అంత కష్టపడి వ్యాధులను నయం చేసిన తనను గురించి ఒ.క మాట కూడా మాట్లాడలేదు అని కోపం రేగి, ఆర్తధ్యానంలో కొంతకాలం తర్వాత చనిపోయి, వింధ్య అరణ్యం మధ్యలో నర్మదా నది తీరంలో ఒక కోతియై జన్మించాడు.

ఇక్కడ దండక ఋషి తమ ఎదురుగా విష్ణువు జయుడ్ని పొగడడం వల్ల, అతను రాజాజ్ఞవల్ల తన దేహరోగాలను పరిహరించాడు అని తెలుసుకొన్నాడు. దానికి తీవ్రంగా బాధపడి, దానికి ప్రాయశ్చిత్తంగా సింహనిష్క్రీడమను వ్రతాన్ని చేపట్టాడు. అక్కడినుంచి మళ్ళీ సంచారానికి బయలుదేరి నర్మదా తీరంలో ఒక మామిడి చెట్టు క్రింద కూర్చొని, స్వాధ్యాయంలో నిమగ్నులయ్యారు. అప్పుడు ఆ కోతి అక్కడికి వచ్చి, ఆయన్ను చూచి, పూర్వ జన్మపు వైరం పెరిగి, శక్తి అను ఒక ఆయుధంలాగే వున్న ఒక మామిడిచెట్టు కొమ్మను విరచి, ఋషి తొడను చీల్చివేసింది. అయితే ఋషి

ఎలాంటి అసంతృప్తి చెందకుండా, దుఃఖించకుండా వుండగా ఆ కోతికి పశ్చాత్తాపం కల్గింది. ''తన దేహానికి బాధ కల్గినా కూడా ఏమి బాధపడలేదు కదా, ఇక నాదేమిటి మహా' అని ఆ కోతి, యితర కోతుల్ని పిలుచుకొని వచ్చి, తొడలో గుచ్చుకొన్న కొమ్మని లాగివేసి, మందు పెట్టింది. ఋషి కాళ్ళమీద పడింది. దానిని భవ్యమైనదని తెలుసుకొని దండకముని దానికి ధర్మాన్ని తెలియ చెప్పారు.సమ్యక్ పూర్వకంగా వ్రతాలను యిచ్చారు. కోతి ఆ వ్రతోపవాసముల ద్వారా దేహాన్ని దండనలకు గురిచేసి, ధర్మాన్నే ధ్యానిస్తూ ఒక రోజు పర్వత శిఖరం నుండి జారి కింద పడి, ఇంకా జీవం వుండగనే మునివర్యుల చెంత పడింది. ఆ స్థితిలో దానికి సన్యసనపూర్వకంగా పంచనమస్కారాలను తెలియ చెప్పారు. ఆ తర్వాత అది చనిపోయి సనత్కుమార కల్పంలో రెండు సాగర సంవత్సరాలు ఆయుష్షులో సామానిక దేవుడై జన్మించింది. అవధి జ్ఞానంతో తన పూర్వజన్మ వృత్తాంతమును తెలుసుకొని, మహా వైభవంతో వచ్చి, ధ్వజ, మకుట, రత్నఖచితమైన మర్కట చిహ్నంతో మునిని పూజించి, ''ఈ దేవత్వమునూ, వైభవమునూ, పశుజాతిదైన నాకు మీరు దయచేశారు భటరా'' అని తనదేహాన్ని పూజించి పోయింది. ఆ స్థలము అమరేశ్వరమనే క్షేత్రమై ప్రసిద్ధి పొందింది.

ఇక్కడ దండక ఋషి గ్రామ, నగర, గిరిదుర్గం, ప్రాకార దుర్గం, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖాలగుండా సంచారం చేస్తూ, ఉత్తర మధురకు వచ్చి అక్కడ సూర్య ప్రతిమాయోగంలో నిలుచున్నారు. ఆ పట్టణపు రాజు యమునావంశకుడనువాడు. పూర్వం అతడు దండకుని చేత అనేక శిక్షలను అనుభవించినవాడు. అతను వచ్చాడన్న వార్త విని యమునావంకుడు గుర్రానెక్కి, మంత్రి 'యిప్పుడు దండకుడు తపస్వియై వచ్చివున్నాడు' అని ఎంత చెప్పి ఆపినా, ఆగకుండా వేగంగా వచ్చి, పగతీర్చుకోవడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఎర్రగా కాల్చిన, పదునైన అంచులు కలిగివున్న అనేక బాణాలను అతని శరీరం పైకి వేశాడు. ఆయన ఆ వేదనను సహించి, సమత్వభావనను మనస్సులో ధ్యానిస్తూ, ఆహార, శరీరాలను విసర్జించి, శుక్ల ధ్యానాలను ధ్యానించి, కర్మను క్షయం చేసి మోక్షాన్ని పొందారు.

అనేక వాహనాలను ఎక్కి, ధగధగలాడుతున్న రత్న కిరీటాలను ధరించి, చేతులు జోడించి ఇంద్రాది చతుర్విధ దేవతలూ తమతమ జ్ఞానంతో ఇది

తెలుసుకొని చిత్రపటాన్ని కదిల్చినట్లుగా ఆకాశం నిండా వచ్చి నిలచి, జయము జయమని దండకముని గుణగణాలను పొగడుతూ వుండడాన్ని చూచి యమునా వంకుడికి తత్తరపాటు కల్గింది. ఆ వేళకు అతని కర్మలూ నశించాయి. అతడు తపస్సుకు కూర్చొన్నాడు. అయినా, ఋషిని చంపిన పాపానికి ఫలితంగా, అనేక వ్యాధులు అతనికి సంక్రమించాయి. ప్రాయశ్చిత్తం కోసం అనేక సంవత్సరాలు అతడు ఉగ్రమైన తపస్సు చేశాడు. అనంతరం గ్రామ, నగరాలను సంచారం చేస్తూ ఆ ముని సజ్జాతగిరికి వచ్చి, అక్కడే ఆ రాత్రి ప్రతిమాయోగంలో నిలుచున్నారు. అక్కడ కార్చిచ్చు కొండను మూడుచుట్లు చుట్టి అతన్ని సజీవంగా కాల్చివేసింది. అయినా కూడా శుభకరమైన శుక్లధ్యానంలో నిమగ్నుడై, ఘాతికర్మలను నశింపచేసి, అంతర్గత ఏకాకియై, ఎనిమిది రకాల కర్మలను నశింపచేసి, తపోగ్నిచేత వాటిని కాల్చి మోక్షాన్ని పొందాడు.

ఇతడు భవ్యజనులూ దండక ఋషులు కాల్చిన పదునైన బాణములతో పొడచినా సహించిన విషయాన్ని ఆలోచిస్తూ, ఆకలి, దప్పిక మొదలైన ఇరవైరెండు పరీషలను గెలచి, యమునావంక ఋషి అగ్నివల్ల పొందిన దుఃఖాన్నీ, మనస్సులో వ్యాధులు తెచ్చిన వేదనను సహించి, పరమశుద్ధ సహజ రత్నత్రయాలను సాధించి స్వర్గ, మోక్ష సుఖములను పొందుదురు గాక.

* * *

# 17. మహేంద్ర దత్తాచార్యులు మొదలైన ఐదువందలమంది ఋషుల కథ

గానుగలలో వేసి పిండినా, భరింపరాని వేదనను సహించి, మహేంద్ర దత్తాచార్యులు మొదలైన ఐదువందలమంది ఋషులు శ్రేష్ఠమైన సద్గతి సాధించారు.

ఈ జంబూద్వీపపు భరతక్షేత్రంలో విదేహమను ప్రాంతం. అక్కడ సావస్తి అను పట్టణం. దానిని జితశత్రువను రాజు పరిపాలిస్తున్నాడు. అతని మహాదేవి ధారిణి. అతని కుమారుడు స్కంద కుమారుడు. అతని చెల్లెలు పుండ్రయశి. ఆమెను దక్షిణాపథపు కుంభకార ఘటమను పట్టణపు రాజు దండకునకు యిచ్చి వివాహం చేశారు.

ఇలావుండగా, ముని సువ్రత తీర్థంకరుల దగ్గర మహేంద్రదత్తుడూ, జిత శత్రువుని కుమారుడు స్కంద కుమారుడు మొదలైన ఐదువందలమంది రాజపుత్రులు తపస్సులో నిలచి చదువులన్నీ నేర్చుకుని, అభినందనుడను గణధరునితో గ్రామ,నగర, గిరిదుర్గ, ప్రాకారదుర్గ, సరిహద్దు పట్టణం, ద్రోణాముఖములగుండా సంచారం చేస్తూ వస్తుండగా, కళింగదేశములోని దంతపురమను పట్టణానికి వచ్చారు. అక్కడ కొన్ని రోజులు ఆగారు. ఆ పట్టణాన్ని పరిపాలిస్తున్నది జనార్ధన మహారాజు. అతని పురోహితుడు వ్యాళుడు. రాజు సమక్షంలో విద్వద్గోష్ఠిలో వ్యాళుడు స్కంద కుమారునితో వాదించి ఓడిపోయాడు. రాజు అతన్ని తరిమివేశాడు. అతను అక్కడినుంచి పోయి దండక రాజు దగ్గర మంత్రిగా పనిచేస్తున్నాడు.

ఇక్కడ ఋషులు సంచారాన్ని కొనసాగించి, కుంభాకార ఘట పట్టణానికి వచ్చారు. అక్కడి రాజు దండకుడు భిక్షుల భక్తుడు. అందువల్ల వారంతా వచ్చివున్నారన్న వార్త విని, అక్కడికి పోయి, భక్తితో నమస్కరించి, అభినందన భట్టారుల వద్ద ధర్మమును విని, శ్రావక వ్రతాలను చేపట్టాడు. ఐదువందల ఋషులనూ ప్రతిదినమూ భిక్షకు ఆహ్వానించి తానే దగ్గర కూర్చొని భక్తితో వారికి భోజనం పెట్టిస్తూ, సేవిస్తూ వున్నాడు. ఇప్పుడు అతని మంత్రిగా

వున్న వ్యాళుడు స్కంద కుమార ఋషి మీద వున్న మాత్సర్యంతో ఆ ఋషులను అక్కడినుంచి తరిమివేసే వుపాయాన్నే ఎల్లప్పుడూ ఆలోచిస్తూ వున్నాడు. ఒకరోజు అడవికి పోయి ఋషులు సిద్ధాంతాన్ని పఠించి రావడాన్ని తెలుసుకొని వారు వూరికి వెనక్కు వచ్చిన తర్వాత తానుపోయి, వారు కూర్చొని చదువు స్థలానికి సమీపంలో ఒక పొదక్రింద కొన్ని ఆయుధాలను పాతిపెట్టి ఏమీ తెలియనివాడిలా వచ్చేశాడు. ఆ తర్వాత రాజుకు, ''ఈ ఐదువందలమంది ఋషులు నిజానికి రాజకుమారులు. మహాశక్తి శాలులు. ఋషులవలె వేషం ధరించి, మిమ్మల్ని నమ్మించి, మీ ప్రాణానికి అపాయాన్ని కల్గించాలని ఆలోచించి, యిక్కడికి వచ్చివున్నారు. అందువల్ల పదేపదే వారిదగ్గరకి పోవద్దండి. వారిని నమ్మకండి.'' అని ఏకాంతంలో చెప్పాడు. ''మనకేమి తెలుసు. ఒకవేళ వారు అధ్యయనం చేసే స్థలంలో ఆయుధాలను దాచి వుంచివున్నా వుండవచ్చును. అక్కడ వెతికించి చూడండి'' అని చెప్పిచ్చినాడు. రాజు సేవకులను ఆజ్ఞాపించాడు. సేవకులు వెతికి చూడగా, పొదక్రింద ఆయుధాలు కన్పించాయి. అయితే రాజు ''ఎక్కడైనా వుందా? ఋషులు ఒక చీమకు కూడా హానిచేయనివారు. అలాంటివారు నాకు హాని తలపెడతారా? ఎవరో కానివాళ్ళు, ఋషులమీద కోపం వున్నవాళ్ళు అక్కడ ఆయుధాలను దాచిపెట్టివుంటారు'' అని దాన్ని లక్ష్యపెట్టక గమ్మున వున్నాడు.

మరికొన్ని రోజులు గడచిన తర్వాత వ్యాళుడు అంతఃపురపు కోశాగారానికి ఒక రాత్రి కన్నమేసి, పెట్టెలను తెరచి కావలసినంత ద్రవ్యాలనూ, బంగారు వస్త్రాలనూ తీసుకొని, అక్కడనుంచి, బస వరకు అక్కడక్కడా వరుసగా విదలించి, కొన్ని ఆభరణాలను బస గదిలో దాచిపెట్టాడు. ఉదయాన్నే, రాజు దగ్గరకి వచ్చి, ''కోశాగారంలో దొంగతనం జరిగింది కన్నమేసి అంతా దొంగిలించుకొని పోయారు'' అని తెలిపినాడు. కావలివాడిని పిలిచి, దొంగలను పట్టుకోవాల్సిందిగా రాజు ఆజ్ఞాపించాడు. అతను పరిశీలించి వచ్చి, ''దేవా ఋషులు తమ కోశాగారంలో దొంగిలించిన వాటిని బసలో రాశిపోసి వున్నారు. దారిపొడుక్కూ వరుసపెట్టినట్లు బంగారు పడివుంది'' అని చెప్పాడు. రాజు, ''ఋషులు శ్రావకులకు దొంగిలించ వద్దనీ, పరుల వస్తువులను తీసుకోవద్దని ఉపదేశిస్తుంటారు. అలాంటివారు తామే దొంగిలిస్తారా? ఎప్పటికీ జరగదు. ఎవరో గిట్టనివాళ్ళు ఇలా చేసి వుంటారు'' అని దానిని కూడా త్రోసివేశాడు.

ఇంకా కొన్ని రోజులు గడచాక వ్యాళుడు సువ్రత అను రాణితో కలసి ఒక ఉపాయాన్ని ఆలోచించాడు. ఒకరోజు ఒకనికి కావలసినంత బంగారు యిచ్చి ఒప్పించి, అతనికి గుండు కొట్టించి, నల్లని కౌపీనం కట్టించి, పళ్ళకు గవ్వ కట్టించి, చేతికి కుంచెను యిచ్చి, ''నువ్వు మహాదేవి మంచం మీద కూర్చొని, భయపడకుండా ఆమెతో నవ్వుతూ, కబుర్లు చెబుతూ వుండు'' అని చెప్పి పంపినాడు. అలాగే అని ఆవ్యక్తి రాణి దగ్గరికి పోయాడు. సువ్రత మంచం నుంచి దిగి ''నమోస్తు, ఇదేమిటి'' అని అంటుండగా అతను, ''నిన్ను కోరి వచ్చాను, ప్రేమించి వచ్చాను. యింకేమీ మాట్లాడకుండా రా'' అన్నాడు. మంచంవైపుకు ఆమెను పిలిచాడు. దీన్నంతా వ్యాళుడు రాజుకు చూపించి యిలా అన్నాడు, ''చూడు రాజా, మీ శ్రవణుని ప్రేలాపనను చూడు. నిన్ను చంపడానికి ఆయుధాలను దాచిపెట్టినది చూపిస్తే నువ్వు నమ్మలేదు. కోశాగారాన్ని దొంగిలిస్తే నమ్మలేదు. ఇప్పుడు నువ్వే కళ్ళార చూడు. నీ భార్యతో ఆ శ్రవణుడు ప్రలాపిస్తున్నాడు. నీ భార్యను వాడు ఖచ్చితంగా వదలిపెట్టడు''. యిప్పటికి రాజుకు నమ్మకం తగ్గిపోయింది. యింతకు మునుపు తప్పులన్నీ ఈ ఋషులే చేసి వుంటారనే నమ్మకం అతనికి కల్గింది. వాళ్ళమీద విపరీతమైన కోపం వచ్చింది. 'వీళ్ళకు తగ్గ శిక్ష నువ్వే విధించు' అని అనుమతి యిచ్చాడు. వ్యాళుడు ఐదువందల మంది ఋషులనూ లాక్కొని వచ్చి తిరుగుతున్న గానుగల్లో వేసి పిండిచేశాడు. వారు శుక్లధ్యానం చేస్తూ ప్రాణం వదలి స్వర్గంలో జన్మించారు.

స్కందకుమార ఋషి నిరపరాధులూ, నిర్దోషులూ అయిన ముని సముదాయాన్ని ఈ పాపి నిరర్థకంగా చంపినాడు కదా అని సహించలేక, తీవ్రకోపంతో, తేజస్సు ఉద్భవించి, భారీ ఉరుములాంటి శబ్దంలో వచ్చి, రాజునూ, వ్యాళుడూ మొదలైన మొత్తం పట్టణ ప్రజలను, దేశంలోని సమస్త జీవరాశులనూ, కాల్చి భస్మం చేశాడు. అట్లే తన శరీరాన్ని దహించుకొని చనిపోయి, ఏడవ నరకానికి పోయాడు.

దండక నృపతి కూడా ఏడవ నరకంలో ముప్పయి మూడు సాగరాల కాలం నరకుడై వుండి, అక్కడి నుంచి వచ్చి స్వయంభూరమణ సముద్రంలో పెద్ద చేపగా పుట్టి, కొన్ని జీవాలను చంపి, తిని, చనిపోయి, ఆరవ నరకంలో పుట్టినాడు. అక్కడ ఇరవైరెండు సాగరాల కాలం గడపి, చనిపోయి, ఆ తర్వాత యిక్కడ సింహంగా పుట్టి, చచ్చి ఐదవ నరకంలో పదిహేను సాగరాల కాలం

గడిపివచ్చి ఇక్కడ పెద్ద పాముగా పుట్టి, చచ్చి నాల్గవ నరకంలో పది సాగరాల కాలం గడిపాడు. ఆ తర్వాత ఇక్కడ పులిగా పుట్టి, చచ్చి మూడవ నరకంలో ఏడు సాగరాల కాలం వున్నాడు. అక్కడ చనిపోయిన తర్వాత ఇక్కడ భేరుండ పక్షిగా పుట్టి, చచ్చి రెండవ నరకంలో మూడు సాగరాలకాలం వుండి, ఆ తర్వాత యిక్కడ వక్రుడై పుట్టి పాపంచేసి చచ్చి, ఒకటవ నరకానికి వచ్చాడు. అక్కడ ఒక సాగర కాలం వుండి చచ్చి, ఇక్కడ చరాచర జీవుల మధ్య పుట్టి చాలాకాలం సంసార సుఖాన్ని అనుభవించి, ఎలాగో జటాయువను పక్షియై పుట్టి, శ్రీరామదేవుని సంపర్కంలో ప్రజాధర్మమును విని, దానిని అనుసరించి, పంచ నమస్కారాలు చేస్తూ స్వర్గంలో పుట్టినాడు.

భవ్యులైనవారు మహేంద్రదత్త మొదలైన ఐదువందలమంది మునులు గానుగలో పిండి చేయబడి చనిపోవడాన్ని మనస్సులో స్మరిస్తూ ఆకలి, దప్పిక మొదలైన పరీషలను సహించి సాధనచేసి స్వర్గ మోక్షసుఖములను పొందుదురు గాక!

* * *

# 18. చాణక్య ఋషి కథ

చాణక్య ఋషి కథ చెబుతాను:

చాణక్యుడనే ఋషి పశువుల కొట్టంలో ప్రాయోపవేశానికి సిద్ధపడి సుబంధువు అనే మంత్రి చేత పిడకలతో కాల్చబడి దహించుకు పోతున్నప్పటికీ శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాలను ఆరాధించాడు. అదెలాగంటె -

ఈ జంబూద్వీపపు భరత క్షేత్రంలోని మగధ అనే దేశంలో పాటలీ పుత్రమనే పట్టణం వుండేది. దాన్ని నందవంశానికి చెందిన పద్మడనే రాజు పరిపాలించేవాడు. అతని పట్టపురాణి సుందరి. వారిద్దరికి మహాపద్మడనే కుమారుడు. కాపి అనేవాడు మంత్రి. కాపికి విశ్వసేనుడనే మరో పేరూ వుంది. మొత్తానికి వారంతా తాము కోరుకున్న కామ భోగాలను అనుభవిస్తూ సుఖంగా వున్నారు.

ఒకరోజు మంత్రి కాపి పట్టపురాణి సుందరిని చూసి ఆమెపట్ల మోహితుడయ్యాడు. రాజును చంపి రాణితో కలసి జీవించాలనే దురాలోచనతో శత్రు రాజులను పద్మడిపై దండెత్తి వచ్చేట్టుగా పురికొల్పాడు. అటు తరువాత ఇలా అన్నాడు. ''ప్రభూ! మీ విలువైన సంపదను, వస్తువులను ఎవరికీ తెలియని చోట దాచిపెట్టి మనం యుద్ధరంగంలో నిలిచి పోరాడుదాం'' ఇలా చెప్పి అమూల్యమైన వస్తువులను దాచి పెట్టడానికి తగిన స్థలం చూపే నెపంతో రాజును వేకువ మసకలో ఉద్యానవనంలోకి తీసుకువెళ్ళాడు. అక్కడ లోతైన, బురద నిండిన పాడుబడ్డ బావి గట్టు దగ్గర రాజును పొడిచి చంపి బావిలోకి నెట్టేశాడు. అటు తరువాత దిక్కులు పరికించసాగాడు.

అదే సమయంలో చెట్టు మీద పువ్వులు కోసుకుంటున్న వసంతకుడనే పూలవాడు రాజు మరణాన్ని చూసి, విశ్వసేనుడికి ఝడిసి పారిపోయే కంగారులో చెట్టుకొమ్మ వూగిసలాడింది. బలంగా ఊగే కొమ్మను చూసి భయపడ్డ విశ్వసేనుడు ఇలా అనుకున్నాడు - 'ఏ కోతివల్ల లేదా మనిషి వల్ల ఈ చెట్టుకొమ్మ వూగిందో కానీ అది వేయి సంవత్సరాల చివరి వరకూ ఈ నా నేరాన్ని చెబుతూనే వుంటుంది'. ఈ విధంగా మనసులో మధనపడుతూ తన ఇంటికి వెళ్ళాడు.

సూర్యోదయం కాగానే సామంతులు, మహా సామంతులతో పాటు రాజసభకు వెళ్ళి రాజు కోసం అన్ని చోట్లా వెదికి వెదికి కానక కృత్రిమ శోకాన్ని అతిశయంగా ప్రదర్శించాడు. కొన్నాళ్ళు అలాగే వుండి అటు తరువాత ప్రశస్తమనిపించిన తిథి, వార, నక్షత్రయుక్త ముహూర్తంలో మహా పద్ముడికి రాజ్యాభిషేకం చేసి, పట్టం కట్టి, సువ్రత అనే రాణికి పట్టపురాణి స్థానం యిచ్చి విశ్వసేనుడు మహారాణి సుందరితో రహస్య సంబంధం పెట్టుకొని కాలం గడుపసాగాడు.

ఇది చాలా కాలం గడిచింది.

ఒకరోజు మహాపద్మడు ఈ విధంగా ఆలోచించాడు - 'ఇంత పెద్ద నగరంలో నా తండ్రి మరణమర్మం ఏ ఒక్కరికైనా తెలియకుండా వుంటుందా? ఈ రహస్యం తెలిసినవాణ్ణి కనుక్కుంటాను' ఇలా అనుకుని అంతఃపురం నుంచి బయలుదేరాడు.

అర్ధరాత్రివేళ రత్నఖచితమైన డాలును ఎదకు అడ్డంగా పెట్టుకుని, ఒర నుంచి బయటకు దూసిన ఖడ్గాన్ని చేత పట్టుకుని, ప్రతి ఇంటివారూ మాట్లాడుకునే విషయాలు వింటూ ముందుకు సాగుతూ వసంతకుడనే పూలవాడి ఇంటి దగ్గరకి వెళ్ళి అక్కడి మాటలు వినసాగాడు. ఆ సమయంలో వసంతకుడు వనమాల అనే తన భార్య మరణవియోగం వల్ల కలిగిన అతి దుఃఖంతో గూఢార్థంతో కూడిన మాటలను పలకటం విన్నాడు. అదేమిటంటే - 'నీలోత్పల దళముల వంటి శ్యామల వర్ణము కలదానా! బాలా! మంగళాంగీ! నీ గుణ గణాల తలంపులో నేను దహించుకు పోతున్నాను. విశ్వము, విశ్వసేనుడు, చెట్టు కొమ్మ వల్ల వొణుకుతోంది వొణుకుతున్నాడు' ఈ గూఢార్థపు మాటలు విని మహాపద్మడు అంతఃపురానికి తిరిగి వెళ్ళాడు.

సూర్యోదయం కాగానే సభామంటపంలో సింహాసనం పై కూర్చుని, సామంతులతో పరివేష్ఠితుడై, పూలవాడి దగ్గరికి దూతను పంపి అతన్ని రప్పించాడు. ''మన మహారాజును ఎవరు చంపారో నీకు తెలుసు. భయపడకుండా చెప్పు. లేకపోతే నిన్ను చంపిస్తాను'' అన్నాడు. పూలవాడు భయగ్రస్తుడై ఇలా అన్నాడు - ''ప్రభూ! వేకువ మసకలో విశ్వసేన మంత్రి మహారాజును ఉద్యానవనంలోకి తీసుకువచ్చి బావిగట్టున పొడిచి చంపి బావిలోకి

త్రోసేసాడు. ఆ సమయంలో చెట్టెక్కి పూలు కోస్తున్న నేను అది చూసి, నన్ను కూడా ఎక్కడ చంపేస్తాడోనని భయపడి పారిపోయి తప్పించుకున్నాను. ఇది నేను కళ్ళారా చూసిన వాస్తవం అని చెప్పాడు. అలా నిజం చెప్పిన పూలవాడిని రాజు మెచ్చుకుని, గొప్పగా పొగిడి, తాను ధరించిన ఆభరణాలను విలువైన వస్త్రాలను, భూములను కానుకగా ఇచ్చి అతన్ని సంతోష పరిచాడు. అటు తరువాత మంత్రి చేసిన దుష్కృత్యాన్ని అందరికి తెలియజెప్పి అతన్ని పుత్ర, మిత్ర, కళత్ర, స్వజన, బంధు సమేతంగా చంపాలని తలపోశాడు. అప్పుడు సామంతులు మొదలైన వారు ఆపి శాంతింపజేయటంతో వారందర్ని భూగృహంలో బంధించాడు. ఒక మట్టి మూకుడు దూరగలిగే తలుపును చేయించి, ప్రతిరోజూ ఒక మూకుడు నిండా అన్నాన్ని, ఒక పిడత నీటిని ఆ భూగృహంలోకి చేర్చే ఏర్పాటు చేశాడు. అలా ఇవ్వబడ్డ ఆహారాన్ని వాళ్ళందరు పంచుకుని తినేవారు. ఇలాగే కొంతకాలం గడిచింది.

ఆ తరువాత ఒకరోజు కాపి తన వాళ్ళతో - మనం ఇంతమందిమీ అటు చచ్చినట్లూ కాదు, ఇటు బ్రతికినట్లూ కాదు. మనలో ఎవడు మన విరోధిని చంప గలడో, నందవంశాన్ని నిర్మూలించి నాశనం చేయగల సమర్థుడు కాగలడో అతడు మాత్రమే ఈ మూకుడులోని ఆహారాన్ని భుజించాలి'' అని అన్నాడు.

ఈ మాటలకు కాపి కుమారుడు సుబంధువు అనే అతను - ''నేను మన శత్రువునుచంపగల, నందవంశాన్ని నిర్మూలం చేయగల సమర్థుణ్ణవుతాను'' అని శపథం చేశాడు. కాపి అతన్ని అన్నం తినమని చెప్పాడు. మిగిలిన వాళ్ళంతా తిండిమాని కృశించి ప్రాణాలు వదిలారు. సుబంధువు మాత్రమే బ్రదికాడు. ఇలా మూడేళ్లు గడిచాయి.

అదే సమయంలో రాజ్యపు సరిహద్దులో వుంటున్న రాజులు రెచ్చిపోయి రాజుమీదకు దండెత్తి వచ్చారు. అప్పుడు రాజు మంత్రి కాపి శౌర్యసాహసాలను గుర్తు తెచ్చుకుని ''మట్టి మూకుడులో ఇస్తున్న అన్నం తింటూ యింకా ఎవరైనా బ్రతికి వున్నారా?'' అని అడిగాడు. 'ఉన్నారు' అని చెప్పగానే, సుబంధువును భూగృహంలోంచి తీయించి, దాన సన్మానాలతో అతన్ని సత్కరించి, సమాధాన పరిచి, అతనికి మంత్రి పదవి ఇచ్చాడు. సుబంధువు శత్రు రాజులు ఉద్రిక్తపడటానికి అవకాశం యివ్వక, తన బుద్ధిబల ప్రయోగంతో

వారిని అణచి మునుపటి విధంగానే వుండేలా చేశాడు. రాజు అతన్ని చాలా అభిమానించి, అతని తండ్రి పదవి కన్నా ఉన్నత పదవిని అతనికి ఇచ్చాడు. అటు తరువాత రెండవ మంత్రి శకటాళుడి కూతురైన నందవతి అనే కన్యను సుబంధువు పెళ్ళాడి, ప్రధానమంత్రియై కోరిన కామసుఖ భోగాలను అనుభవిస్తూ ఆనందంగా కాలం గడపసాగాడు. ఇలా కొంతకాలం గడిచింది.

ఇదిలా వుండగా 'మగధ' అనే దేశంలోని 'శాల్మలి'. అనే అగ్రహారంలో సోమశర్మ అనే బ్రాహ్మణుడికీ, కపిల అనే బ్రాహ్మెతకూ నాలుగు కోరపళ్ళతో ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాడికి తల్లిదండ్రులు 'చాణక్య' అని పేరు పెట్టారు. జ్యోతిష్కుడు, జైనగృహస్థుడు అయిన వసంతుడనే వాడు కోరపళ్ళతో బాలుడు జన్మించాడని విని ఈ విధంగా భవిష్యత్తు చెప్పాడు - 'నాలుగు కోరపళ్ళున్న ఈ చాణక్యుడు నంద వంశ నాశనానికి కారకుడవుతాడు. అంతేకాక ఇతను రాజు కానీ, రాజును చంపేవాడు కానీ లేదా మంత్రి కానీ అవుతాడు. ఇందులో సందేహం లేదు' ఇలా భవిష్యత్తు చెప్పటం చాణక్యుడి తండ్రి సోమశర్మ విని ఆకురాయితో పిల్లవాడి నాలుగు కోరపళ్ళను అరగదీసి సమం చేశాడు.

చాణక్యుడు పెరిగి పెద్దవాడయ్యాడు. నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు, పద్దెనిమిది ధర్మశాస్త్రాలు, మీమాంస, వ్యాకరణ శాస్త్రం, ఛందస్సు, అలంకారం, నిఘంటువు, కావ్యం, నాటకం, అశ్వశాస్త్రం, వైద్యం, సాముద్రికం, నీతి మొదలైన శాస్త్రాలన్నిటిని నేర్చుకున్నాడు. ఋషుల దగ్గర ధర్మాలను విని, జైన గృహస్థ వ్రతాలను స్వీకరించి సమ్యగ్విచార దృష్టిని కలిగిన వాడయ్యాడు. కొద్దికాలం గడిచింది. ఆ తరువాత అతను పాటలీపుత్ర పట్టణానికి వెళ్ళాడు. అతని పాండిత్యాన్ని, సూక్ష్మదృష్టిని, ఉదాత్తమైన రూపాన్ని శకటాలుడు చూచి తన చిన్న కూతురు యశోవతిని ఇచ్చి పెళ్ళి చేశాడు. చాణక్యుడు ఆమెను పెళ్ళాడి సుఖంగా కాలం గడుపసాగాడు.

ఆ తరువాత ఒకరోజు శోణానదీ తీరంలో చాణక్యుడు నడుచుకుంటూ వస్తుండగా అతని కాలికి ఒక దర్భముల్లు గుచ్చుకుని రక్తం కారింది. అప్పుడతను కోపగించుకుని దాన్ని సమూలంగా పెరికి కాల్చివేశాడు. ఇది చూసిన సుబంధువు విషయం అడిగాడు. అందుకు చాణక్యుడు 'తన శత్రువును నాశనం చేస్తున్నాను' అని అర్థం వచ్చేటట్టు చెప్పాడు. గతంలో

చాణక్యుడి గురించి చెప్పిన భవిష్యత్తు విని ఉండటం వల్ల సుబంధువు ఇలా అనుకున్నాడు - ''నాలుగు కోరపళ్ళు వున్నవాడూ, నందవంశ నాశకుడూ అయిన ఆ చాణక్యుడు ఇతనే! ఇతను రాజు లేదా మంత్రి అవుతాడు. సందేహం లేదు'' ఇలా అనుకుని 'స్నేహితుడు దొరికాడు' అని సంతోషపడ్డాడు. అయినా చాణక్యుడి బుద్ధి. కుశలత పరీక్షించాలని ఒకరోజు పండిత సభామంటపంలో ఈ క్రింది శ్లోకాన్ని రాసి వెళ్ళాడు.

శ్లో॥ శక్యా శక్తి సహస్రేణి నీతి శాస్త్ర విశారదై:
వ్యవసాయ ద్వితీయేన కృత్స్నా జేతుం వసుంధరా॥

(రాజనీతి శాస్త్రంలో పారంగతులైన వారివల్ల వేలాది శక్తులు గలవారి వల్ల పోరాటాన్ని రెండవ అంశంగా వున్నవారి వల్ల మొత్తం భూమండలాన్ని గెలవటం సాధ్యమవుతుంది.)

శ్లో॥ శక్యాహ్యేక శరీరేణ నీతి శాస్త్ర విశారదై:
వ్యవసాయ ద్వితీయేనా కృత్స్నా చేతుం వసుంధరా॥

(రాజనీతి శాస్త్రంలో పారంగతుడైన వల్ల, ఒకె వ్యక్తి వల్ల పోరాట న్ని రెండవ అంశంగా భావించిన వాడివల్ల భూమండలం మొత్తాన్ని జయించటం సాధ్యం.)

సుబంధువు అది చూసి - ''దీన్నెవరు రాశారు?'' అని అడిగాడు. ''చాణక్యుడు రాశాడు'' అని భటులు చెప్పారు. అది విని, 'చాణక్యుడు ఇలా రాయగలిగాడంటే దీనికి తగిన తెలివితేటలు అతనిలో వుండే ఉంటాయి.' అని సుబంధువు భావించాడు.

ఒక రోజు తన కూతురుకు జరిగే 'పుట్టుదట్టి' వేడుకకు సుబంధువు స్వజనులను, బంధువులను, పరిజనులను ఆహ్వానించి, మృష్టాన్న భోజనం పెట్టి, వస్త్రాది ఆభరణాలతో వారిని సత్కరించాడు. చాణక్య, యశోమతు లిద్దరికి తేట అన్నపు గంజిని తన భార్య నందవతి ద్వారా పంపించాడు. ఆమె దాన్ని తీసుకుని వెళ్ళి - మీ ఇద్దరికి తేట గంజి తెచ్చాను'' అని చెప్పి, యశోమతికి ఇచ్చి వెళ్ళింది. అది చూసి చాణక్యుడు తన మనసులో ఇలా అనుకున్నాడు - 'లోకంలో దారిద్ర్యం కంటే దుఃఖకరమైనది ఏదీ లేదు, దారిద్ర్యమే లోకంలో

మహాపాపం. ఏదెలావున్నా నీతి ఇదే కదా చెప్పేది. పేదవాడితో ఎవరూ స్నేహం చేయరు. పండుగ పబ్బాలవంటి ప్రత్యేక సమారంభాల్లో ఇతరుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు ఆ ఇంటివారు బీదవాళ్ళను హీనంగా చూస్తారు. విలువ చేయని వస్త్రాలు ధరించిన బీదవాడ్ని చూసి గొప్పవాళ్ళు సిగ్గుతో, సంకోచంతో దూరంగా తొలగిపోతారు. దారిద్ర్యం అనుభవించటం అంతులేని దుఃఖంగా, ఘోరపాపంగా భావిస్తున్నాను. కాబట్టి ధన సంపాదన చేయాలి' అనే అభిప్రాయానికి వచ్చాడు. అతని అభిప్రాయాన్ని గ్రహించిన సుబంధువు ఒక రోజు చాణక్యుడ్ని కలసి ఇలా అన్నాడు - ''మీరు దారిద్ర్యం నుంచి విముక్తి పొందాలంటే, రాజును అభ్యర్థించి అరవై గ్రామాల పౌరోహిత్యంతో కూడిన అగ్రాసనాన్ని పొందండి. అలా చేయగలిగితే మీరు సుఖంగా జీవించగలరు'' అని చెప్పాడు. చాణక్యుడు అతని సలహా మేరకు రాజును దర్శించి, శ్లోకాలతో స్తుతించి అగ్రాసనాన్ని అర్థించాడు. రాజు మెచ్చుకుని చాణక్యుడు కోరింది ఇచ్చాడు. ఇలా చాణక్యుడు పౌరోహిత్యాన్ని అనుభవిస్తూ అరవై గ్రామాలకు అధిపతియై సుఖసల్లాప కథా వినోదాలతో కాలం గడుపసాగాడు.

ఆ తరువాత ఒక రోజు సుబంధువు మహాపద్మున్ని నాశనం చేసే ఆలోచనతో నందమహారాజు కాలం నాటినుంచి వంశపారంపర్యంగా పౌరోహిత్యాన్ని అనుభవిస్తున్న బ్రాహ్మణులను పిలిచి, వారి నుద్దేశించి ఇలా అన్నాడు - ''మీ పదవులు అక్రమంగా నందమహారాజు, విజయుడు, నందనుడు, సునందనుడు, నందివర్ధనుడు, నందుడు, శ్రీనందుడు, పద్ముడు, మహాపద్ముడు - ఇలా తొమ్మిది తరాలుగా వస్తున్నవి. ఆ విధంగా మీకు వచ్చిన అగ్రహారాలను మరొకరు అనుభవించటాన్ని చూస్తూ ఊరుకోవటం ధర్మమేనా?'' అందుకు వారు - ''మీ అండదండలతో మేము మళ్ళీ మా పదవులు పొందుతాము'' అన్నారు. ''అలాగే చెయ్యండి'' అని సుబంధువు అన్నాడు. ఆ బ్రాహ్మణులు రాజు దగ్గరికి వెళ్ళి - ''ఓ మహారాజా! మేము వంశపారంపర్యంగా మీ అనుగ్రహంతో పౌరోహిత జీవితాన్ని సాగిస్తున్నవాళ్ళం. తరతరాలుగా వస్తున్న మా పదవులను మీరు లాగేసుకుని మమ్మల్ని నాశనం చేయకండి'' అని విన్నవించుకున్నారు. అప్పుడు అక్కడే వున్న సుబంధువు - ''పూర్వం నుంచి తరతరాలుగా వస్తున్న అధికారాన్ని పాడు చేయకుండా నిలపటమే క్షత్రియ ధర్మం'' అని అన్నాడు. అప్పుడు మహాపద్మరాజు

''చాణక్యుడిని, అతడికిచ్చిన అగ్రహార అధికారం నుంచి తొలగించండి'' అని ఆజ్ఞాపించాడు. అలాగే చేస్తానని అంటూ సుబంధువు బయలుదేరాడు.

ఆ సమయంలో చాణక్యుడు తనకు ఇచ్చిన అగ్రహార గ్రామాల అధికారంలో వుండి, భోజనం చేయటానికి ఒక పీట మీద కూర్చునివున్నాడు. అదే సమయంలో అక్కడికి వచ్చిన సుబంధువు - ''రాజుగారు మీ పట్ల చాలా కోపంగా వున్నారు మదనతాపంతో విహ్వాలులైన వేశ్యాంగనలపట్ల ఆసక్తులైన విటులతో కలసి వుంటున్న చాణక్యుడు నేను యిచ్చిన అగ్రహారాన్ని, పౌరోహిత్యాన్ని అనుభవించటానికి అర్హుడు కాడు. అందువల్ల అతన్ని ఇప్పుడే అగ్రాసనం నుంచి తొలగించి పంపేయండి' అని రాజుగారు నన్ను ఆజ్ఞాపించారు'' అని చెప్పి, సుబంధువు ద్వారపాలకుడి చేత చాణక్యుడ్ని పట్టి ఈడ్పించాడు. చాణక్యుడి శిఖను పట్టుకుని అతడ్ని తోయిస్తూ అంతఃపురం నుంచి బయటికి గెంటించాడు. అప్పుడు చాణక్యుడు కోపంతో - ''నందుడ్ని నందుడు కాని వాడిగా చేస్తాను ( అంటే నాశనం చేస్తాను). సుబంధువును బంధువు కానివాడిగా చేస్తాను, ( అంటే, నిస్సహాయ స్థితిలో వుండేటట్లు చేస్తాను)'' - అని ప్రతిజ్ఞ చేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. పన్నెండేళ్ళలోగా మహాపద్ముడ్ని నాశనం చేస్తాను. అంతవరకు నా జుట్టు ముడివేయను' - ఆని శపథం చేసి, కాషాయ వస్త్రాలు ధరించి, సన్యాసి వేషం వేసుకుని మహోదకమనే పట్టణానికి తరలి వెళ్ళి అక్కడ కాపురం పెట్టాడు.

ఆ సమయంలో ఆ పట్టణాన్ని మయూర వంశానికి చెందిన కుముదుడనే రాజు పాలిస్తున్నాడు. అతని పట్టపురాణి మంద, అప్పుడామె గర్భవతి. ఆమెకు చంద్రుడ్ని మింగాలనే గర్భిణీ వాంఛ కలిగింది. ఆ కోరికతోటే ఆమె కృశించసాగింది. ఆమె కోరిక రాజుకు తెలిసినా, అది తీర్చలేక రాజు చింతతో వికలమనస్కుడయ్యాడు. ఈ విషయం చాణక్యుడు విని, రాజును దర్శించి - ''రాణి గర్భాన జన్మించే బిడ్డను నాకు ఇచ్చివేసే పక్షంలో, రాణి అభిలాషను నేను తీరుస్తాను'' అని చెప్పాడు. అందుకు రాజు, రాణి యిద్దరూ అంగీకరించి మాట యిచ్చారు. అటు తరువాత చాణక్యుడు ఎవరికి తెలియకుండా అంతఃపురపు పై కప్పు మధ్యభాగంలో గవాక్షంలా ఒక రంధ్రాన్ని చేశాడు. ఆ రాత్రి చంద్రుడు నడినెత్తి మీదకు వస్తున్న సమయంలో ఆ రంధ్రానికి కిందుగా ఒక పెద్ద గాజుపాత్రను వుంచాడు. అందులో సుగంధభరితమైన నీటిని

నింపి, ఆ నీటిలో చంద్రబింబం కనిపించేలా చేశాడు. ఆ తరువాత రాణికి తీవ్రంగా దాహం వేసేవరకు ఆమె చేత ఆహారం తినిపించి, ఆమె దాహ తీవ్రతలో వుండటం చూచి చాణక్యుడు ఇలా అన్నాడు - ''నేను మంత్రం ద్వారా చంద్రుడ్ని ఆహ్వానించి తెచ్చాను మింగుదువురా'' అని రాణి కళ్ళకు గంతలు కట్టి తీసుకు వెళ్ళాడు. పాత్ర దగ్గర కళ్ళకు కట్టిన గంతలు విప్పాడు. పాత్రలోని మధుర పరిమళాలు విరజిమ్ముతున్న నీటిలో తళతళమని మెరుస్తున్న చంద్రబింబాన్ని చూపించి ''చంద్రుణ్ని మింగు'' అన్నాడు. ఆమె చూచి సంతోషపడుతూ నీళ్ళను త్రాగింది. ఆమె కోరిక నెరవేరింది.

ఆ తర్వాత కొన్నాళ్ళకు ఆమెకు తొమ్మిది నెలలు నిండి బిడ్డను ప్రసవించింది. పురిటిబిడ్డ ఆలనాపాలనకు దాదిని నియమించి, బిడ్డను చాణక్యుడికి అప్పగించారు. చాణక్యుడు ఆ బిడ్డకు చంద్రభుక్తుడని పేరు పెట్టాడు. వాడికి తినిపించే వెన్నలో కొద్దికొద్దిగా విషం తినిపిస్తూ, వాడు పెరిగి పెద్దవాడైనా ఆహారంతో పాటు కొంచెం కొంచెం విషాన్ని తినిపించసాగాడు.

చంద్రభుక్తుడికి పదహారేళ్ళవయస్సు రాగానే చాణక్యుడు సామంతులను అక్కడి మంత్రులను, రాజ కుమారులను, నగర రక్షకులను సమావేశ పరిచి ఈ విధంగా అన్నాడు - ''చంద్రభుక్తుడికి పృథ్విని పాలించే లక్షణాలన్నీ వున్నాయి. ఇతడ్ని రాజును చేస్తాను. మీకందరికీ ఇప్పటి వేతనము కన్నా పదిరెట్లు అధిక వేతనము చేస్తాను'' అని ఆశ చూపి వాళ్ళను లోబరుచుకున్నాడు. అటు తరువాత ఇతరులనూ కూడగట్టి పెద్ద సైన్యాన్ని సిద్ధం చేశాడు. వాళ్ళందర్నీ శ్రీ పర్వతం మీద నిలిపాడు. తానొక్కడే వెళ్ళి బంగారం తయారు చేయాలన్న అభిలాషతో మూలికలు, మందుల కోసం వెదుకుతూ చుట్టుప్రక్కలంతా తిరుగసాగాడు. ఆ సందర్భంలో పర్వత సానువుల్లో చాలా లోతుగా వున్న పాదరసపు (ముట్టినదంతా బంగారంగా మార్చే ద్రవపు) బావిని చూశాడు. అది పుల్లమజ్జిగలా వాసన కొడుతుంది.(పాసిపోయిన మాంసపు వాసన కలిగి వుంది). అది చూచి, మూసిన రాతిపలకను తీసి చూశాడు. అప్పుడు అందులో సజీవంగా వున్న ఒక మనిషిని చూచి - ''నీవు ఇందులో ఎందుకు దిగావు?'' అని అడిగాడు. అతను ఇలా అన్నాడు - ''రసవాదకుడనే ఒక సన్యాసి నాతో 'ఈ బావిలోకి దిగి రసాన్ని తోడియిస్తే దాని సహాయంతో చేసిన బంగారాన్ని నీవూ నేనూ సమానంగా పంచుకుందాం అన్నాడు. అప్పుడు నేను బంగారం మీది దురాశతో బావిలోకి దిగి

పాదరసాన్ని సొరకాయ బుర్రలో నింపి కావలసినంత తీసి ఇచ్చాను. అటు తరువాత అతను నన్ను బయటకు తీయకుండానే వెళ్ళిపోయాడు. గతంలోనూ యిలా చాలా మందిని బావిలోకి దింపి రసాన్ని తీయించి, మళ్ళీ వాళ్ళను బయటకు తీయకుండా చంపేశాడు'' అని చెప్పాడు.

''నేను నిన్ను బయటకు తీసి బ్రతికిస్తాను. నాకు రసం తోడివ్వు'' అని చాణక్యుడు పెద్దత్రాటిని, కొన్ని సొరకాయ బుర్రలను తెచ్చి పాదరసాన్ని నింపుకున్నాడు. ఆ వ్యక్తిని బావిలోంచి బయటకు తీసి సిద్ధరసం తినివెయ్యడం వల్ల పుళ్ళుపడిన శరీరానికి చక్కటి ఉపశమానాన్ని కలిగించే ఔషధాలను తయారు చేసి అతడ్ని స్వస్థుడ్ని చేసి పంపేశాడు. ఆ తరువాత సిద్ధరసంతో ఎన్నో బంగారు రాసులు చేసి, ''ఎవరైతే ఒక మూట మట్టిని శ్రీ పర్వతం మీదికి తెచ్చి వేస్తారో వారికి ఒక మూట బంగారాన్ని ఇస్తాను'' అని ఆ ప్రాంతమంతా చాటింపు వేయించాడు. అది విని ఒక రైతు మూట మట్టిని తెచ్చి శ్రీపర్వతం పైన గుట్టగా పోశాడు. చాణక్యుడు అతనికి మూట బంగారాన్ని ఇచ్చాడు. అది విన్న ఆ ప్రాంతపు రైతులంతా మట్టి మూటలు తెచ్చి శ్రీ పర్వతం పైన చుట్టూ పెద్ద గుట్టలుగా పోసి, చాణక్యుడిని 'బంగారం' ఇవ్వమని అడిగారు. అయితే చాణక్యుడు - ''మిమ్మల్ని మన్ను తెమ్మని ఎవరు చెప్పారు. మాకు అవసరమైన ఒక మూట మన్ను తెప్పించుకున్నాం. ఈ మిగిలిన మట్టితో మాకు అవసరం లేదు. మీరు తెచ్చిన మట్టిని తీసుకెళ్ళండి'' అని చెప్పాడు. అప్పుడు వారు నిరాశ చెంది మట్టి అక్కడే వదిలేసి వెళ్ళిపోయారు. చాణక్యుడు ఆ మట్టితో శ్రీ పర్వతం చుట్టూ కోటను నిర్మించి, మేడలు, మిద్దెలు, అంతఃపుర భవనాలు సమేతంగా పట్టణాన్ని నిర్మించాడు. బంగారం ఇచ్చి అనేక గుర్రాలను తెప్పించి సైనికులకు ఇచ్చి పెద్ద సైన్యాన్ని సిద్ధం చేశాడు. తర్వాత చంద్రభుక్తుడ్ని వెంటబెట్టుకుని వెళ్ళి మహాపద్ముడిపై దాడి చేశాడు. అతనితో పోరాడి యుద్ధంలో ఓడి పారిపోయి ప్రాణాలు రక్షించుకున్నాడు. మళ్ళీ సైన్యాన్ని సిద్ధం చేసుకొని వెళ్ళి యుద్ధం చేసి ఓడిపోయాడు. ఇలా ప్రతీ సంవత్సరం సైన్యం సిద్ధం చేసుకుని వెళ్ళి పోరాడి, ఓడిపోయి తిరిగొచ్చేవాడు - ఇలాగే మరోసారి దాడిచేసి పోరాడుతూ యుద్ధంలో ఓటమిపాలయ్యే పరిస్థితిని గ్రహించి చాణక్యుడు చంద్రభుక్తుడిని వెళ్ళిపొమ్మని చెప్పాడు. తాను చాలా సేపు యుద్ధం చేసి ఓడిపోయి, యుద్ధరంగం నుండి పారిపోయే అవకాశం లేక దగ్గరలో వున్న ఒక

తామర కొలనులో దాగాడు. సైన్య సమూహమంతా వెళ్ళిపోయే వరకు అక్కడే వుండిపోయాడు. చీకటి పడగానే అక్కడ్నుంచి బయలుదేరాడు. పాటలీపుత్ర నగరంలోకి ప్రవేశించి, ఆకలిగొన్న వాడై బట్టలు నేసే వాడి ఇంట్లోకి వెళ్ళాడు. అక్కడ వున్న ముసలామెను చూచి - 'అమ్మా ఆకలి వేస్తోంది. అన్నం పెట్టు' అని వేడుకున్నాడు. అప్పుడామె - ''నాయనా కూర్చో'' అంటూ పీటవేసి అతన్ని కూర్చోబెట్టింది. ఇత్తడి కంచెం పెట్టి వేడివేడి అంబలి వడ్డించింది. ఆకలిగొన్న చాణక్యుడు సంతోషంతో ఆ వేడి అంబలిని నోట పెట్టగానే చేయి, నోరు కాలిపోయాయి. అప్పుడతను ఒళ్ళు వొణికించటాన్ని, చేతిని విదిలించటాన్ని చూసి ముసలిది ఇలా అంది - ''ఈ లోకంలో ముగ్గురు మూర్ఖుల్ని చూశాను'' అందుకు చాణక్యుడు - ''ఎవరమ్మా వాళ్ళు?'' అని ప్రశ్నించాడు. దానికా ముసలిది - ''నీవు, నందుడు, చాణక్యుడు'' అని ముగ్గురిని సూచించింది. అప్పుడు చాణక్యుడు - ''నేనేలా ముర్ఖుణ్ణి?'' అని అడిగాడు. దానికామె - ''నాయనా! తెలివైనవాడు వేడి అంబలిని కంటెం చివరి అంచు నుంచి కొంచెం కొంచెమే చల్లార్చుకుంటూ తాగుతాడు. నీకు అలా తెలియక పోవటం వల్ల నీవు మూర్ఖుడవు'' అని అంది. ''నందుడు ఎలా మూర్ఖుడు?'' అని అడిగితే, ఆ ముసలిది - ''నందుడన్నా మహాపద్ముడన్నా ఒక్కడిపేరే అవుతుంది. అతను తాను ఇచ్చిన దానాన్ని దత్తాపహారం చేయటం వల్ల పగబట్టి వెళుతున్న వాడ్ని, తాను సమర్థుడై వుండి కూడా చంపలేకపోయాడు. అందువల్ల నందుడు మూర్ఖుడు'' అని అంది. ''చాణక్యుడు ఎలా మూర్ఖుడు'' అని అడగగా ఇలా అంది - ''చాణక్యుడికి తన కోపం మాత్రమే తెలుసు. కార్యసాధన తెలియదు. పెద్ద సైన్యం వున్నప్పటికి అతను క్షత్రియుడు కాదు. అయినా మహారాజుతో యుద్ధం చేయడానికి సిద్ధమవుతాడు. అతనికి తెలివితేటలే వుండి వుంటే తన శత్రువు రాజ్యాన్ని, నాశనం చేసేవాడు. తన శత్రుపక్షం వారిని తనవారిగా మార్చుకునేవాడు. సామంతులు, మహా సామంతులందరికి సొమ్ము యిచ్చి భేదోపాయాన్ని ప్రయోగించేవాడు. వాళ్ళతో సంబంధం వున్న వారిని విరోద పక్షంలో లేకుండా చేసేవాడు. ఇలా చేసివుంటే మహారాజు ఒంటరిగా మిగిలిపోయేవాడు. అప్పుడు చాణక్యుడికి తాను అనుకున్న కార్యము నెరవేరి వుండేది''. ఇలా వృద్ధురాలు చెప్పటం విని చాణక్యుడు - ''అమ్మా, నీవు చెప్పినట్టే చేయొచ్చు'' అని భోజనం ముగించి బయలుదేరాడు.

చాణక్యుడు శ్రీ పర్వతానికి వెళ్ళి పెద్ద సైన్యం సిద్ధం చేశాడు. బట్టలు నేసే వృద్ధురాలు సూచించిన విధంగానే నందుడి రాజ్యాన్ని నాశనం చేశాడు. సామంతులు, మహాసామంతుల్ని సొమ్ము ఇచ్చి విడగొట్టాడు. శత్రుపక్షం వారిని తన వశం చేసుకున్నాడు. వారి సంబంధీకుల్ని శత్రుపక్షం వారి చేతనే నాశనం చేయించాడు. నందుడు ఏకాకి కావటం గమనించి చంద్రభుక్తుడితో పాటు సకల సైన్య సమేతంగా దాడి చేశాడు. యుద్ధరంగంలో ఎదురుగా సైన్యాన్ని నిలిపి పోరాటానికి సిద్ధంగా వున్న మహాపద్మడు, పోరు సల్పటానికి ఆదేశం యిచ్చినా సామంతులు, మహాసామంతులు పోరుకు ఒప్పుకోక మౌనంగా ఉండిపోయారు. తన సైన్యం భేదోపాయానికి లోనయిందని మహాపద్మడు గ్రహించి, బెదరి, ఎవరూ చూడకుండా పారిపోయి నాశనం అయ్యాడు. అటు తరువాత సుబంధువు ఒక్కడే చాలసేపు యుద్ధం చేసి ఓడిపోయాడు. చాణక్యుడు అతన్ని పట్టి బంధించి సంకెళ్ళు వేసి చెరసాలలో పెట్టించాడు.

చాణక్యుడు యుద్ధంలో గెలుపొంది, పాటలీపుత్ర నగరం ప్రవేశించి, మహాపద్మడి రాణులకు, కోశాగారానికి కాపలా పెట్టాడు. పట్టణ ప్రజలను శాంత పరిచాడు. అటు తరువాత మంగళకరమైన తిథి, వార, నక్షత్ర ముహూర్తంలో చంద్రభుక్తునికి రాజ్యాభిషేకం చేసి పట్టం కట్టాడు. మహాపద్మడి రాణి చంద్రమతీదేవిని చంద్రభుక్తుడికి పట్టమహిషిగా చేశాడు. అటు పిమ్మట నందుడి కోశాగారంలోనూ, తన కోశాగారంలోనూ ద్రవ్యం లేకపోవటం తెలుసుకుని, పాటలీపుత్ర ప్రజలను, ప్రాంతీయ ప్రజలను దూతల ద్వారా రప్పించాడు. వాళ్ళందరికి భోజన ఏర్పాట్లు చేసి మత్తు కలిపిన ఆహారం యిచ్చి మీ ధనరాశులు ఎక్కడున్నాయో చూపండని వాళ్ళను అడిగాడు. వాళ్ళు మత్తులో మునిగి, ఒంటిపై స్పృహలేని స్థితిలో తాము సొమ్ము దాచిన స్థలాలను చూపించి, చెప్పి, సొమ్మంతా ఇచ్చేశారు.

ఇలా అనేక వేక కోట్ల ధనాన్ని చాణక్యుడు ప్రజల నుంచే చంద్రభుక్తుడికి చూపించి, కోశాగారాన్ని ధనంతో నింపి, రాజభవన ప్రాంగణంలో చిందులు వేస్తూ ఇలా అన్నాడు - ''పన్నెండేళ్ళలో నందవంశాన్ని సమూలంగా నాశనం చేస్తానని ప్రతిజ్ఞ చేశాను. ఆ ప్రతిజ్ఞ ఇప్పుడు నెరవేరింది. ఇప్పుడు నా దగ్గర కాషాయంలో అద్దిన రెండు వస్త్రాలున్నాయి. బంగారు కమండలం ఉంది. మూడు కర్రలను ఒక్కటిగా కట్టిన త్రిదండం ఉంది. మగధ దేశంలోని

ధనాన్నంతా తెచ్చి రాజాకోశాగారాన్ని నింపాను. విశిష్టగుణాలను గుర్తించే రాజు కూడా నా ఆధీనంలోనే ఉన్నాడు. తప్పెటను మ్రోగించండి' అంటూ తప్పెట కొట్టించాడు. సంతోషంతో ప్రేమగా తన త్రిదండాన్ని ఎత్తి పట్టుకుని విజయోన్మత్తులైన తన ప్రజలతో కలసి రమ్యంగా నృత్యం చేశాడు. అటు పిమ్మట శ్రీ పర్వతంపై ఉన్న తన భార్య యశోమతి దగ్గరికి దూతల్ని పంపి, ఆమెను రప్పించాడు. ఆమెతో అనేక రకాల సుఖభోగాలను అనుభవించసాగాడు. సామంతులకు, మహాసామంతులకు జీవనోపాయ వ్యవస్థనూ కల్పించాడు. నగర రక్షక వర్గాన్ని సమాధానపరిచాడు. మగధ దేశాన్ని పాలిస్తూ ఇష్టమైన, కోరుకున్న, ఐహిక సుఖాలన్నీ అనుభవించసాగాడు.

ఇలా కొంతకాలం గడిచింది.

మహారాణి చంద్రమతి గర్భవతయ్యింది. ఆమె ఒక రోజు రథం ఎక్కి కూర్చోగానే, ఆ రథచక్రపు పదిపండ్లు భూమిలో దిగబడ్డాయి. చాణక్యుడు అది చూసి - ఈ చంద్రభుక్తుడితో మొదలై పదిమంది మౌర్య రాజులు ఈ భూమండలాన్ని ఏకచత్రాధిపత్యంగా పాలిస్తారు'' అని భవిష్యత్తు చెప్పాడు.

అటు తరువాత కొన్నాళ్ళకు మహారాణి చంద్రమతిదేవికి తొమ్మిది నెలలు నిండాయి. ఒకరోజు రాజు విషమిశ్రిత ఆహారాన్ని భుజిస్తూ ఉన్నాడు. ప్రక్కనే వున్న రాణికి రాజుతో కలసి భోజనం చేయాలన్న కోరిక కలిగింది. ఆ సమయంలో చాణక్యుడు కత్తి దూసి పట్టుకుని దగ్గర్లోనే నుంచుని వున్నాడు. రాజు తన చేతిలో ఉన్న ముద్ద విషమిశ్రితమని తెలియక, చాణక్యుడి కళ్ళుగప్పి, చాటుగా రాణికి ఇచ్చాడు. ఆమె దాన్ని నోట పెట్టుకుంది. చాణక్యుడు అది చూసి, ఆమె తల నరికి, పొట్ట చీల్చి, గర్భంలో ఉన్న శిశువును బయటికి తీశాడు. అది చూసిన చంద్రభుక్తుడు - 'అయ్యో! నా చంద్రమతీ! మహారాణీ, నా ప్రియతమా!' అని శోకిస్తూ, చింతాక్రాంతుడై ఆమె వియోగంతో ప్రాణాలు వొదిలాడు. రాణి గర్భంలోంచి తీసిన శిశువు తలమీద విషబిందువులు బొట్లు బొట్లుగా పడివుండటంవల్ల చాణక్యుడు ఆ బిడ్డకు బిందుసాగరుడు అని పేరు పెట్టి, పట్టాభిషేకం చేసి, ఆ శిశువును ముందుంచుకుని రాజ్యపాలన చేయసాగాడు.

ఇలాగే కాలం గడుస్తూ వుంది.

బిందుసాగరుడు నవయవ్వనుడయ్యాడు.

అప్పటికే చాణక్యుడికి సంసారం పట్ల, శారీరక సుఖాల పట్ల మిక్కిలి వైరాగ్యం కలిగి తపస్సు చేసుకోవాలనే కోరిక కలిగింది. సుబంధువును చెర నుంచి విడిపించి, తన దగ్గరికి రప్పించుకుని, అతనికి క్షమాభిక్ష పెట్టి సన్మానాలతో, దానాలతో సత్కరించి, అతన్ని బిందుసాగరుడికి మంత్రిని చేశాడు. రాజును అడిగి, అతడిని ఒప్పించి, అందరిని క్షమించాడు. అటు తర్వాత క్షేత్రము, వస్తువు, హిరణ్యము, సువర్ణం, ధనం, ధాన్యం, దాస్యము, దాసీత్వం, లోహాలు, ఆభరణాలు అనే ఎనిమిది బాహ్య పరిగ్రహాలను, మిథ్యత్వం, మోదం (స్త్రీ, పురుష, నపుంకులతో కామక్రీడ జరపాలనే అభిలాష) రాగం, ద్వేషం, హాస్యం, రతి, అరతి, శోకం, భయం, జుగుప్స, క్రోధం, మానం, మాయ, లోభం - అనే పద్నాలుగు పరిగ్రహాలను త్యజించాడు. మతివరులనే ఆచార్యుల దగ్గర తపస్సుకు ఉపదేశాన్ని పొందారు. శాస్త్రాలన్నీ నేర్చుకుని ఆచార్యుడై ఎందరో శిష్యుల్ని తయారు చేశారు. అటు పిమ్మట గ్రామం, నగరం, దుర్గం, ప్రాకార దుర్గం, సరిహద్దు ఊరు, బళ్ళు నావలపై చేరగల ఊరు, జలస్థల మార్గాలు కల భూభాగాల గుండా సంచారం చేస్తూ చాలాకాలం అత్యంత కఠినమైన తపస్సును ఆచరించాడు. తరువాత పాటలీపుత్రంలోని శోణానదీ తీరాన విహరిస్తూ నదీ తీరంలో ఉన్న గోశాలలో విడిది చేశాడు.

చాచక్యుడి రాకను సుబంధువు విని, చాణక్యుడు మహాపద్ముడి రాజ్యాన్ని కబళించటం, తనను సంకెళ్ళల్లో బంధించి చెరలో పెట్టి చాలాకాలం హింసించిన అతని శత్రుత్వాన్ని గుర్తు తెచ్చుకున్నాడు. సాయంసమయం అవుతూ ఉండగా చాణక్యుణ్ణి దర్శించి, నమస్కారం చేసే నెపంతో పూజాద్రవ్యాలు తీసుకుని వెళ్ళాడు. చాణాక్యాది ఋషులను పూజించి, గురుగౌరవానుక్రమాలతో నమస్కరించి, చాలాసేపు చాణక్యుడితో చర్చించి, వెళ్ళేటప్పుడు తన వారితో ఇలా అన్నాడు - ''శీతాకాలపు రోజుల్లో ఋషులు చలిలో ముడుచుకుపోతారు. ఆయాసంతో జబ్బు పడతారు. అందువల్ల గోశాల చుట్టూ పేడ పిడకల్ని రాశిగా పేర్చండి''. ఇలా చెప్పి, దగ్గరే ఉండి పిడకలు పేర్పించి, చుట్టూ మంట పెట్టమని చెప్పి రాజధానికి వెళ్ళిపోయాడు. ఆ పిడకల మంట చుట్టూ వ్యాపించి ఋషులను దహించసాగింది.

చాణక్య ఋషి, ఇతర ఋషులందరూ అప్పుడు ఈ విధంగా అనుకున్నారు -

''ఈ శరీరం కత్తిరించబడనీ, చీల్చబడనీ, లేదా నాశనం కానీ, ఓ యోగి! సంసార సాగరపు అవతలి తీరాన్ని దేనివల్ల పొందగలమో, ఆ నిర్మలమైన ఆత్మను ధ్యానించుము. నేను జీవరాశులన్నిటిని క్షమిస్తాను. సకల జీవులూ నన్ను క్షమించనీ. సర్వభూతాలతోనూ నాకు స్నేహం వుంది.నాకు ఎవరితోనూ శత్రుత్వం లేదు.''

ఈ విధంగా అనుకుని సహనం వహించి, నాలుగు విధాల ఆహారాలనూ, శరీరాన్ని, త్యజించి, ఇంగిణీ మరణంతో శుభకరమైన పరిమాణంలో శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, .చారిత్రాలనే రత్నత్రయాలను ఆరాధించి 'సనత్కుమార' అనే స్వర్గంలో 'స్వార్థ్వ' మనే ఏడంతస్థుల అంతఃపురంలో చాణక్యఋషి జన్మించారు. అలాగే మిగతా ఋషులందరూ 'సౌధర్మం' మొదలైన స్వర్గాలలో వారి వారి తపోఫలాలకు అనుగుణంగా జన్మించారు.

సన్యాసాన్ని స్వీకరించిన ఇతర జైనయతులు కూడా చాణక్య ఋషిని మనసులో ధ్యానించి, దేవ, మనుష్య, తిర్యక్, నారక అనే నాలుగు వర్గాల వారి వల్ల కలిగే తపోవిఘ్నాలనే ఉపవర్గాలను; ఆకలి దప్పులు మొదలైన ఇరవై రెండు రకాల పరీషహాలను, వ్యాధుల వల్ల కలిగే వేదనలను భరించి, శుభకరమైన పరిణామంతో శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాలనే రత్నత్రయాలను ఆరాధించి స్వర్గమోక్ష సుఖాలను పొందుదురుగాక!

* * *

# 19. వృషభసేనుడను ఋషి కథ

వృషభసేనుడనే ఋషి కథ చెబుతాను:

కుణాలమనే పట్టణంలో విష్ణుమత్స్యుడి వల్ల జైనమఠం తగుల బెట్టబడినప్పుడు, వృషభసేనాచార్యులు తమ శిష్యబృందంతో పాటు శ్రేష్ఠమైన దర్శన, జ్ఞాన, చారిత్రాలను ఆరాధించారు. అదెలాగంటే -

ఈ జంబూ ద్వీపంలోని భరత క్షేత్రపు దక్షిణాపథంలో 'కరహాటం' అనే దేశం వుండేది. అందులో 'కుణాళం' అనే పట్టణం వుండేది. ఆ పట్టణాన్ని ధనదుడనే రాజు పాలించేవాడు. అతని పట్టపురాణి పద్మశ్రీ. అతని మంత్రి విష్ణుమత్స్యుడు. అతను గొప్ప విద్వాంసుడు. వారందరూ కోరుకున్న ఐహిక సుఖభోగాలను అనుభవిస్తూ సుఖంగా ఉండేవారు.

ఇలా కాలం గడుస్తూ, వుండేది.

ఒకరోజు వృషభసేనులనే ఆచార్యులు పెద్ద ఋషుల సమూహంతో గ్రామం, నగరం, దుర్గం, ప్రాకార దుర్గం, సరిహద్దు పట్టణం, బళ్ళు నావలపై చేరగలిగే వూళ్ళు, జలస్థల మార్గాలు కల భూభాగాల గుండా సంచరిస్తూ ఆ కుణాళ పట్టణానికి వచ్చి ఒక జైన మఠంలో విడిది చేశారు.

వృషభసేనాచార్యుల వారి ఆగమనాన్ని రాజు, పట్టణప్రజలూ విని, విశేష పూజా ద్రవ్యాలను తీసుకెళ్లి అర్చించి, పూజించి, సాష్టాంగ ప్రణామాలు చేశారు. అది చూసి విషకమత్స్యుడు భరించలేకపోయాడు. అసూయతో తన పాండిత్య గర్వంతో వృషభసేనాచార్యులతో సభలో వాదించి ఓడిపోయి సిగ్గుతో సభనుండి వెళ్ళిపోయాడు. మళ్ళీ అర్ధరాత్రి వేళ తిరిగొచ్చి జైనమఠానికి నిప్పు పెట్టి వెళ్ళిపోయాడు.

వృషభసేనాచార్యులు మిగతా ఋషులు విష్ణుమత్స్యుడి పట్ల కోపగించక ఓర్పు వహించి, నాలుగు రకాల ఆహారాలను సేవించక, శరీరాన్ని లక్ష్యపెట్టక అన్నిటిని ప్రాణమున్నంత వరకూ త్యజించి, శుభ పరిణామంతో శ్రేష్ఠమైన, మోక్ష సాధనాలైన దర్శన, జ్ఞాన చారిత్రాలనే 'రత్నత్రయాలను' సాధించి మరణించారు.

మరణానంతరం వృషభసేనాచార్యులు పద్నాల్గవ ప్రాణతమనే స్వర్గంలో పుష్పకమనే ఏడంతస్థుల అంతఃపురంలో ఇరవై సాగరాలతో సమానమైన ఆయుష్షు గల దైవంగా జన్మించారు. మిగతా ఋషులూ శమ తమ తపోనుష్ఠానికి తగినట్టు 'సౌధర్మ కల్పం' మొదలైన స్వర్గాలలో జన్మించారు.

అటు తర్వాత సన్యాసం స్వీకరించిన ఇతర జైనయతులూ, వృషభసేనా చార్యులు మొదలైన ఋషులను మనస్సులో ధ్యానించి, దేవ, మనుష్య, తిర్యక్, నారక, అనే నాలుగు వర్గాల వల్ల కలిగే తపో విఘ్నాలనే ఉపసర్గలను, ఆకలిదప్పులు మొదలైన ఇరవై రెండు పరీషహాలను, వ్యాధుల వల్ల కలిగే బాధలను భరించి, సహనం వహించి, శుభకర పరిణామంతో శ్రేష్ఠమూ, నిర్మలమూ, సహజమూ అయిన దర్శన, జ్ఞాన, చారిత్రాలను సాధించి స్వర్గ. మోక్ష సుఖాలను పొందుదురు గాక!

* * *

# పారిభాషిక పదాల వివరణ

అంతర్గత కేవలి : కేవలజ్ఞానాన్ని సంపాదించినవాడు

అఘాతి కర్మలు : నాలుగు. అయు, నామ, గోత్ర, వేదనీయం

అచ్యుతకల్పం : పదహారు స్వర్గాలలో చివరిది.

అణువ్రతం : జైనగృహస్థులు ఆచరించాల్సిన ఐదువ్రతాలు- అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం.

అనంతచతుష్టయం : అనంతజ్ఞానం, అనంత దర్శనం, అనంత వీర్యం, అనంత సుఖం, అనే నాలుగు సిద్ధులు.

అనాయతన సేవ : ఆరు విధాలు : కుదేవ, కుగురు, కుధర్మం మరియు కుదేవ పూజ, కుధర్మ పూజ, కుగురు పూజకుల సహవాసం.

అపవర్గం : మోక్షం.

అభవ్య : సిద్ధ స్థితిని పొందడానికి సాధ్యంలేని చేతనం.

అలాభ : భిక్ష దొరకని స్థితి.

అవధిజ్ఞానం : ఒక మితికి లోనై దూరం, కాలం, దేశ సంగతులను తెలుసుకొనేజ్ఞానం. దీన్ని సాధించినవాడు అవధిజ్ఞాని

అవలోకిని విద్య : బహుదూరంలో ఉన్న సంగతులను తెలుసుకునే విద్య

అవమోదర్యచర్య : పన్నెండురకాల తపస్సులలో రెండవది. ఆహారాన్ని ఒక్కొక్క ముద్ద తక్కువ చేసుకుంటూవచ్చి, చివరికి ఒక ముద్ద మాత్రమేమిగుల్చుకొనే ఆహార వ్రత క్రమం.

అష్టమద : కులం, రూపం, వయస్సు, భుజబలం, తపస్సు, కళ, దేవతాబలం, రాజ్యం- ఈ ఎనిమిది విధాలైన అహంకారాలు.

అష్టమల : శంక, ఆకాంక్ష, విచికిత్స, అన్యదృష్టి, ప్రశంస, సంస్తవం, సమ్యగ్ దృష్టి, అతిచారం.

అష్టవిధకర్మలు : 4 ఘాతి, 4 అఘాతికర్మలు.

ఆచామ్లవర్ధనం : సౌందర్యాన్ని పెంచుకోవడానికి చేసే వ్రతం.

| | | |
|---|---|---|
| ఆతపస్థితి యోగం | : | ఎండలో నిలబడి చేసే తపస్సు. |
| ఆర్తధ్యానం | : | దుఃఖం వల్ల కలిగిన ధ్యానం, ఏదో ఆశని లేదా భోగాన్ని కాంక్షించి దుఃఖించడం. |
| ఆసన్నభవ్యం | : | త్వరలోనే మోక్షగామి అయ్యే చేతనం. |
| ఇంగిణీ మరణం | : | ఏకాంతంలో మరణించడం |
| ఈర్యాపత్తి | : | ప్రాణులు, జీవులు లేని శుద్ధమైన మార్గంలో అన్యమనస్కుడు కాకుండా, నేరుగా సూక్ష్మప్రాణుల్ని తప్పించి నడవడం. |
| ఉపసర్గ | : | తపస్సు చేయడానికి వచ్చే ఆటంకాలు. ఇది యతి యొక్క ధైర్యం, చిత్తం, స్థిరత్వం, ఇంద్రియనిగ్రహాలకు ఒడ్డబడే పరీక్ష, సవాలు. ఇది నాలుగు విధాలు. దేవ, తిర్యక్, మనుష్య, అచేతన ఉపసర్గలు. |
| ఏషణాసమితి | : | రత్న త్రయాలను భావించడం, సమచిత్తంతో రాగద్వేషాలు లేకుండా భోంచేయడం |
| క్షపణకుడు | : | సన్యాసి |
| కాయోత్సర్గ | : | దేహం మీద మోహం వదలడం. |
| ఖర్వడ | : | నగరం మరియు గ్రామం - ఈ రెండింటి మధ్య స్థితిలో ఉండి కొండలతో ఆవరించి ఉన్న ఊరు. |
| ఖేడ | : | ఎత్తయిన కోట కలిగిన ఊరు. |
| గుణవ్రతం | : | సన్యాసి తానైతాను విధించుకునే వ్రతాలు. ఇవి మూడు రకాలు : దిగ్వ్రతం, దేశ వ్రతం, దండవిరతివ్రతం. |
| గోచార నియమం | : | సాధువు యొక్క భిక్షాక్రమం. గోవు దేనినీ లక్ష్యపెట్టక కేవలం గడ్డిని మాత్రమే లక్ష్యపెట్టేటట్టుగా యతి కూడ దాతకు సంబంధించిన దేనిని పరిగణించక కేవలం భిక్షను మాత్రమే గమనించడం. |
| ఘాతికర్మ | : | 4 రకాలు. జ్ఞానావరణీయం, దర్శనావరణీయం, అంతరాయం, మోహనీయం - ఇవి జీవిత అనంత గుణాలకు ఘాతిని కలిగించేవి. |

చరణగ్రంథాలు : జైన శ్రావకుల మరియు, యతుల ఆచారాలను నిరూపించే గ్రంథాలు.

చరిగె : భిక్ష

చారణారిసి : ఆకాశంలో సంచరించే ముని.

త్రిలోక ప్రజ్ఞప్తి : లోకాకారాలను వర్ణించే శాస్త్రగ్రంథం.

ద్వాదశవిధ తపస్సులు : 12 రకాల తపస్సులు. ఇందులో ఆరు బాహ్య తపస్సులు: అనశనం - ఆహారం లేకుండా తపస్సుచేయడం, అవమోదర్య - పొట్టనిండా కాకుండా కాస్త తక్కువ తినడం, వృత్తి సంఖ్యానం - నిర్దిష్టమైన రీతిలో భిక్షచేయడానికి మితిని వేసుకోవడం,

రసత్యాగం- పాలు, పెరుగు మొదలైనవాటిని త్యజించడం, కాయక్లేశం-దేహాన్ని దండించడం, వివిక్త శయనాసన - ఏకాంతంగా కూర్చోవడం, పడుకోవడం; ఆరు అభ్యతర తపస్సులు: ప్రాయశ్చిత్తం, వినయం, వైయాపృత్య-యతులకు సేవచేయడం, స్వాధ్యాయ - ఆగమ గ్రంథాల అభ్యాసం, వ్యుత్సర్గ - శరీరం మీద ఆశనుత్యజించఢం ధ్యానం

ద్వాదశాంగ : 12 అంగాలనే శాస్త్ర కృతులు.

ద్రోణముఖం : నాలుగువందల గ్రామాల మధ్యవున్న గ్రామం.

ధర్మధ్యానం : ధర్మ స్వరూపాన్నే తలచుకుంటూ ఉండడం.

నందీశ్వర : జైనుల ఒక వ్రతం లేదా పండుగ.

నమస్కారాలు : అర్హంత సిద్ధ, ఆచార్య, సాధు, ఉపాధ్యాయ మొదలైనవాళ్ళకు క్రమంగా నమస్కారాలను చెప్పే మంత్రం.

నవపదార్థాలు : జీవ, అజీవ, పుణ్య, పాప, ఆస్రవ, సంవర, నిర్జర, బంధ, మోక్షాలు.

నిర్వాణం : మోక్షం

పంచమహాపాతకం : భ్రూణ, బాల, స్త్రీ, గో, బ్రాహ్మణ హత్యలు.

పంచ మహా శబ్దాలు : శృంగం (కొమ్ము), తమ్మెట, శంఖం, భేరి, జయగంటల ధ్వని.

పంచాస్తి కాయం : జీవ, పుద్గల, ధర్మ, అధర్మ, ఆకాశాలు.

పంథాతిచారనియమం : భిక్షకువెళ్ళి వచ్చేటప్పుడు జరిగిన అతిచారాలను పరిహరించుకోవడానికి చేసే నియమాలు.

పడికమణ : వెనుక చేసిన దోషాలకు పశ్చాత్తాపపడడం.

పరిషహాలు : ఇవి 22. ఆకలి, దాహం, చలి, ఎండ, క్రిమికీటకాల బెడద, దిగంబరంగా ఉండడం వల్ల కలిగే ఇబ్బంది, ఆరతి, స్త్రీలవల్ల కలిగే ఆటంకం, నడిచేటప్పుడు కలిగే బాధ, పడుకునేటప్పుడు కలిగే బాధ, కూర్చున్నప్పుడు కలిగే తొందర, తిట్లు, దెబ్బ, భిక్షకోరేటప్పుడు కలిగే ముళ్ళు - రాళ్ళ వల్ల కలిగే బాధలు, భిక్ష దొరకనప్పుడు కలిగే ఖేదం, తపో మహిమలు కనపడకపోవడం, రోగం అహంకార అజ్ఞానాలకు దుఃఖించడం, స్నానం చేయడం వల్ల కలిగే బాధ, ప్రజలు పురస్కరించకపోవడం వల్ల కలిగే బాధ.

ప్రతిమాయోగం : ప్రతిమలాగ కదలక ఒక భంగిమలో నిలుచుకొని ఉండడం.

పానిగట్టు : జైనయతులకు భోజనం ఇవ్వడం.

భవ్యుడు : మోక్షగామి అయ్యే జీవుడు.

భుక్త ప్రత్యాఖ్యానవిధి : క్రమపూర్వకంగా ఆహార పానీయాలను త్యాగం చేయడం.

మడంబ : ఐదు వందల గ్రామాలకు ప్రధానమైన నగరం.

మాసోపవాసం : ఒక నెల రోజులకాలం ఉపవాసం చేయడం.

మిథ్యాత్వం : జైన ధర్మం మీద నమ్మకం లేకపోవడం.

మూఢ : 3 విధాలు. దేవతా మూఢ - మిథ్యా దేవతల్ని పూజించడం, లోక మూఢ - మిథ్యాక్షేత్రాల మీద

| | | |
|---|---|---|
| | | నమ్మకం, పాషండి మూఢ - మిథ్యా గురువుల్ని నమ్మడం. |
| యావజ్జీవనివృత్తి | : | జీవం ఉన్నంతవరకూ వద్దంటూ ఆహారపానీయాలను త్యజించడం. |
| రత్నత్రయం | : | మోక్షసాధనాలైన సమ్యక్‌దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం అనబడే మూడు తత్త్వాలు. |
| లోగాణి | : | జైన ధర్మం ప్రకారం లోకాకారాన్ని వర్ణించే గ్రంథాలు. |
| లోచు | : | జైన సన్యాసి ఆచరించే క్రియ - తలమీద వెంట్రుకల్ని తీయించడం. లుంఛనక్రియ. |
| వీచీ మరణం | : | మనుష్యుల ఆయుష్షు, తేజస్సు నిరంతరంగా తగ్గుతూ ఉండడం. |
| శుక్లధ్యానం | : | శుద్ధమైన ముక్తి సాధక ధ్యానం. |
| షడ్ద్రవ్యం | : | జీవ, పుద్గల, ధర్మ, అధర్మ, ఆకాశ, కాలాలు. |
| సంగాణి | : | సప్త పదార్థాలను వివరించే ధార్మిక గ్రంథాలు. |
| సప్తవ్యసనం | : | జూదం, వ్యభిచారం, పరస్త్రీ గమనం, మాంసభక్షణం, మద్యపానం, వేట. |
| సమసరణం | : | తీర్థంకరుడు జరిపే ధర్మ సభ. |
| సమాధి మరణం | : | అన్నాహారాలను త్యజించి, రత్నత్రయాలలో స్థిరమైన మనస్సుతో ప్రాణత్యాగం చేయడం. |
| సల్లేఖన వ్రతం | : | మరణవ్రతాన్ని స్వీకరించడం; సంతోషంతో చావుకు సమర్పించుకోవడం. |
| సవణ | : | శ్రవణుడు, జైనయతి. |
| సంన్యసనం | : | వైరాగ్యం. |

–డా. జి. ఎస్. మోహన్.